# శ్రీ వాసుదేవ కథాసుధ

## నాల్గవ భాగము

## ధర్మకాండాది చతుష్టయము



"ఇతఁడు నిందితమైన కర్మను పాపమును ఎప్పుడును చేయఁడు.
పురుషోత్తముఁడైన యచ్యుతుఁడు ధర్మమునుండి తొలఁగఁడు."

శ్లో॥ న త్వయం నిందితం కర్మ కుర్యాత్ పాపం కథంచన 22

శ్లో॥ న చ ధర్మా దపక్రామేత్ అచ్యుతః పురుషోత్తమః ॥ 23

ఉద్యోగపర్వణి - అధ్యాయః - 130


రచయిత :

అభినవ శంభుదాస, బ్రహ్మవిద్యాచార్య పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

నెల్లూరు.



ప్రమాథి నిజ జ్యేష్ఠము
01-07-99

మూల్యము
రూ.75/-లు

[illegible] 0[illegible]-07-1999

[illegible]

ప్రకాశకుడు

[illegible] శెట్టి B.A. (Hons)
[illegible] అగ్రహారము, నెల్లూరు - 524 001.

ప్రతులు దొరుకుచోట్లు

1. శ్రీశ్రీశ్రీ [illegible]తీర్థస్వామి వారు
శ్రీ [illegible] ఆశ్రమము
[illegible] నెల్లూరు జిల్లా - 524 137.

2. శ్రీ [illegible]శెట్టి ఎల్లమందయ్య, B.A
ఎల్లమందయ్య హాస్టల్, ఏ.సి. నగరు,
నెల్లూరు - 524 002.

3. శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్స్
ప్లాట్ నెం. 97 & 98 C
Western Hills Opp KPHB, Kukatpalli (P.O.)
HYDERABAD - 500 072

4. నవోదయ బుక్ హౌస్
ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా, కాచీగూడ,
హైదరాబాదు - 500 027.
ఫోన్ : 4652387.

ముద్రణము

శ్రావణ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్

16/1064, పొగతోట, నెల్లూరు - 524 001. ఫోన్ : 336709



# శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి

దత్తపీఠాధీశ్వరులు

శ్రీ సత్యానందాశ్రమము

ఇనమడుగు, నెల్లూరు జిల్లా - 524 137.

## ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే శ్రీ సత్యానందాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఆత్మీయులు, బ్రహ్మవిద్యాచార్య బ్రహ్మశ్రీ పోలూరి హనుమజ్జానకీరామ శర్మ గారు కృష్ణోవిగ్రహవాన్ ధర్మః అని సప్రామాణికముగ దెల్పుటకొఱకే శ్రీహరివంశము, విష్ణుపురాణము, శ్రీ మహాభారతము, శ్రీమద్భాగవతములలోని శ్రీకృష్ణచరితమును శ్రీ వాసుదేవ కథాసుధ యను పేరిట నాల్గు భాగములుగ రచించినారు. అందులో 1, 2, 3 భాగములు ముద్రింపబడి భక్తుల చేతులలోనికి వెళ్లినవి. ఇప్పుడు చివరి నాల్గవ భాగము సుమారు 380 పుటలు 1/4 డెమ్మి సైజులో ముద్రింపబడుట శ్రీ వాసుదేవుని కరుణ, భక్తుల పుణ్యముల పంటయేయని నా నిశ్చితాభిప్రాయము.

ఈ చతుర్థ సంపుటము, ధర్మకాండము అశ్వమేధ కాండము, తత్త్వకాండము, సాత్త్వతకాండము అను కాండములతో కూడియున్నది. ఇందులో శ్రీకృష్ణపరమాత్మ ధర్మపక్షపాతియై, ధర్మమును, తనను సంపూర్ణముగ నమ్మి శరణాగతులైన పాండవులను, పరమదుర్మార్గులైన దుర్యోధనాదులనుండి, మోహవశులై వారిని యనుసరించుచున్న భీష్మ, ద్రోణ, కర్ణ, శకుని శల్య భూరిశ్రవాది మహావీరులనుండి కురుక్షేత్ర మహారణరంగములో అర్జునునకు తాను సారథియై, పరమాప్తుడై యెటుల రక్షించెనో శ్రీ జానకీరామశర్మ గారు చక్కగ వివరించినారు. సామాన్య పాఠకులనుండి పండితులవరకు మహాభారత యుద్ధము శ్రీకృష్ణపరమాత్మ అధర్మముగ, ఎన్నో కుయుక్తులతో అజేయులైన భీష్మ, ద్రోణ, కర్ణ, భూరిశ్రవ సైంధవాదులను జంపించినాడని నాడునేడు భావము కలవారే. పాఠకులారా ! శ్రీకృష్ణపరమాత్మ నిత్యసత్యవాది యనియు, ధర్మాత్ము డనియు ఎప్పుడును రాగద్వేషరహిత మనస్కుడనియు

నారదాది మహర్షులు, ధర్మనందనుడు, వసుదేవుడు పలికిరి. ఇంతయెందుకు చనిపోయిన, ఉత్తరాగర్భ జనితుడైన పరీక్షిత్తుని బ్రతికించుటలో శ్రీకృష్ణభగవంతుడే "నేనే నిత్య సత్య వ్రతుడనైతే, అర్జునునియందు యెప్పుడును ద్వేషము లేనటులైనచో, నేనే అస్ఖలిత బ్రహ్మచారినైనచో, యీ శిశువు బ్రతుకుగాక !" యని ప్రతిన జేసి వెంటనే మెల్లగ ఆ శిశువు ప్రాణము వచ్చి కదలినాడని శ్రీ వేదవ్యాస మహర్షి వ్రాసినాడు. మరొక్కమాట దుర్యోధనాదులు పంచమహాపాతకులు గదా ! ధృతరాష్ట్రుడు గాని దుర్యోధనుడు గాని కురురాజ్యమునకు రాజులు గారు, మొదట పాండురాజు తదుపరి యువరాజ పట్టాభిషేకము శ్రీధర్మరాజునకు జరిగినది. ధార్తరాష్ట్రులకు వారిననుసరించి, యుద్ధములో వారి పక్షముననున్న వీరులకందరికి మరణదండనయే శిక్ష కావున బలముతో నెదిరించిన వారలనందరిని ఏదియో యొక విధమున క్రూరజంతువులను, విషసర్పముల వలె చంపి ధర్మమును కాపాడవలసిన బాధ్యత ధర్మనందనునిపై, అర్జునునిపై యున్నది. గురువులు, తాతలు, సోదరులు యని ధర్మజుడు, అర్జునుడు మోహముచే క్షత్రియధర్మమునుండి చ్యుతులగుచున్న సమయమున ధర్మమును ప్రబోధించి దుర్మార్గులైన వారలను సంహారింపజేసి, ధర్మము నుద్ధరించినాడు. ఈ విషయము శ్రీశర్మగారీభాగములో వివరించినారు. ఇంకను ధృతరాష్ట్రగాంధారులకు పాండవులు ధర్మాత్ములే యని నిరూపించినాడు, భీష్మునిచే ధర్మరాజుకు రాజధర్మములు, వర్ణాశ్రమధర్మములు నరజాతి సాధారణ విశేష ధర్మములను ప్రబోధింపజేసినాడు. ఉదంకుని కోపమును శమింపజేసి ఆయనకు విశ్వరూపదర్శన మిచ్చినాడు. అర్జునునకు ధర్మజుని రాజ్యపాలన సమయంలో అనుగీత అనుపేరుతో తత్త్వరహస్యముల నుపదేశించెను. మరియు హరిహరాద్వైతమును నిరూపించి, తుదకు మిత్రుడు భక్తుడునునైన ఉద్ధవునకు తత్త్వోపదేశమును యనేక యోగములుగ బోధించెను. అదియే ఉద్ధవగీత. ఇంకను ఎన్నెన్నో రహస్యములు శ్రీ శర్మగారీగ్రంథములో వివరముగ మనకందించినారు. శ్రీ వాసుదేవుడు శ్రీ శర్మగారి దంపతులకు సకల శుభముల ననుగ్రహించును గాక !

# పండితాభిప్రాయము

మహాకవి శతావధాని, వాస్తుజ్యోతిశ్శాస్త్రప్రవీణ

**డా॥ భూతపురి సుబ్రహ్మణ్యశర్మ, డి.లిట్.,**

శ్రీ నలచరిత్రను చదివిన తరువాత శ్రీ భూతపురి సుబ్రహ్మణ్యశర్మగారు తమ అభిప్రాయముగ ఈ క్రింది శ్లోకమును వ్రాసి పంపించినారు.

శ్లో॥ హే రామార్య ! బుధేంద్రవంద్య
సుకవే శ్రీరామపాదార్పితం
భావోదంచిత నైషధీయచరితం
రమ్యం కళామందిరమ్ ।
కృత్వా నిస్తుల సత్కవీశ సువచస్
సంస్తూయమానాత్మ వి
ఖ్యాతిః ఎల్లిన సత్కవిః ఖలు భవాన్
నూనం పురా జన్మని ॥

ఇట్లు
ప్రశంసించు మహాకవి
డా. భూతపురి సుబ్రహ్మణ్యశర్మ

శ్లో|| న త్వయం నిందితం కర్మ కుర్యాత్ పాపం కథంచన || 22

శ్లో|| న చ ధర్మా దపక్రమే దచ్యుతః పురుషోత్తమః || 23

ఉద్యోగపర్వణి - అధ్యాయః - 130

శ్రీకృష్ణునియొక్క పరమధార్మికత్వమును దృఢముగా నమ్మియుండుట చేతనే భీష్ముఁడు రాజసూయసభలో, వ్యాసభగవానుని కూడ గణింపక, సభయందు అగ్రపూజను శ్రీకృష్ణునకే ఇమ్మని ధర్మరాజునకు దృఢముగ బోధించెను. ఆజన్మబ్రహ్మచారి, పరమనైష్ఠికుఁడును అయిన ఆయన, ధర్మరాజుకంటె చిన్నవాఁడైన శ్రీకృష్ణునకు భక్తితో నమస్కరించుట గమనింపఁ దగియున్నది శ్రీకృష్ణునియందు కొంచెమైనను అధర్మ మున్నచో పరమ పౌరుషశాలియైన భీష్ముఁడు ఆయనకు తలవంచునా? కావున శ్రీకృష్ణునియందు దోష మున్నదని యనుకొనుట మనకు దోషమును కలిగించును. ఆయన ధర్మమూర్తి. ఆ విషయమును నిరూపించుటకే ఈ గ్రంధము ఉద్దేశింపఁబడినది.

4. తరువాత అప్పటి యుపన్యాసకులు అనేకులు తమ యుపన్యాస విషయములను పెంపొందించి, ద్రోణుఁడు, కర్ణుఁడు, విజయుఁడు మొదలుగా గ్రంథములను ప్రకటించిరి. నేను శ్రీకృష్ణుని చరిత్రమును భాగవత హరివంశ విష్ణుపురాణములందు కూడ పరిశీలించి సమగ్రమైన గ్రంథమునుగా రూపొందింపవలయు నని ఆలోచించుచు కాలక్షేపము చేయుచుంటిని.

5. లేగుంటపాడులో అఖండానందాశ్రమమున (ప్రస్తుతము శ్రీ రమణాశ్రమము) శ్రీ శివకామేశ్వరీ మహాయజ్ఞము జరిగినప్పుడు నా శిష్యుడు చి|| విరజానందస్వామి అభ్యర్థింపఁగా 7-4-1986 నుండి 14-4-1986 వఱకు శ్రీకృష్ణునిచరిత్రసుధను భాగవతము ననుసరించి ఎనిమిది కలశములుగా ఉపన్యసించితిని. తుది దినమున సత్కారసందర్భమున శ్రీ విద్యాపీఠాధిపతి (హైదరాబాదు) శ్రీ విద్యానందస్వామివారు ఆ ఉపన్యాసములను గ్రంథముగా ప్రకటింపవలయు నని రూ.101/-లు, అధ్యక్షులైన ఓగేటి అచ్యుతరామశాస్త్రి గారి చేత నాకు అందించి విరాళములకు శ్రీకారము చుట్టిరి.

6. ఇనమడుగులోని శ్రీ సత్యానందాశ్రమమునకు అప్పుడు ఉపాధ్యక్షులుగా నుండిన (ఇప్పుడు అధ్యక్షులు) శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద తీర్థస్వామి వారు ప్రతిదినము వచ్చి ఉపన్యాసములను వినుచు, కాసెట్లను (Cassette) కూడ తయారు చేయించి అప్పుడప్పుడు వినుచు ఎంతో సంతోషించుచుండిరి. శ్రీస్వామివారు చిరకాలముగా నా కృషిని అభినందించుచు ప్రోత్సహించుచు

7 పిమ్మట గ్రంథపఠనమును ఆరంభించితిని. అప్పుడు అనుకోనకుండ 1-3-1989 తేదీన A శ్రీనివాసులు (శ్రీరామచంద్ర బుక్ డిపో, కర్నూలు) వచ్చి కాగితముల ఖర్చు కొఱకు ఉంచుఁడని రూ 1,000/-లు ఇచ్చెను. అది భగవత్ప్రేరణకు నిదర్శనముగా తోఁచెను.

8 ఈ గ్రంథమును పండ్రెండు కాండములుగా విభజించితిని. వ్యాస, హస్తిన, అనుగ్రహ, మహాకావ్యము లను నాలుగు కాండములు మొదటిభాగముగా, మధురా ద్వారకా కాండములు రెండవదిగా, ఉద్యోగ విజయ కాండములు మూఁడవదిగా, ధర్మ తత్త్వ అశ్వమేధ సాత్త్వత కాండములు నాల్గవదిగా ఏర్పఱచితిని. మహాభారతాదులయందు శ్రీకృష్ణచరిత్రమును మన కందించినవాఁడు వ్యాసభగవానుఁడు. ఆయన చెప్పకున్నచో మనకు శ్రీకృష్ణుని చరిత్రము ఇంత విపులముగా తెలియుటకు అవకాశము లేదు. కావున ఆ మహర్షి ఋణమును తీర్చుకొనుటకై ఆయన చరిత్రమునే మొదటి కాండమునుగా రచించితిని. కారణాంతరములచే మొదటి భాగమునకు ముందుగా రెండవ భాగమును 9-9-1996 తేది సుగృహీతనామధేయులు వేదమూర్తులు నైన బ్రహ్మశ్రీ A S. విశ్వనాథశ్రౌతి మహోదయుల యధ్యక్షతయందు శ్రీ బ్రహ్మానంద తీర్థస్వామివారు శ్రీ గీతా మందిరమున ఆవిష్కరించిరి. శ్రీ K.S. రామానుజాచార్యుల వారు ఉపన్యసించిరి.

9. 22-5-1997 తేది ఆంధ్రసభలోని శ్రీ దుగ్గిశెట్టి సుబ్రహ్మణ్యముగారి కళ్యాణ మండపమున నేను రచించియుండిన శ్రీ నలచరిత్ర, శ్రీ రామాయణ చంపూ కావ్యములకు రచన సాఫల్యసిద్ధికొఱకు శ్రీ వేదపారాయణ శ్రీ రామాయణ పారాయణ పూర్వకముగ శ్రీ సీతారామకళ్యాణ పట్టాభిషేక మహోత్సవములను జరిపితిమి. అప్పుడు శ్రీ హనుమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నులతో పాటు శ్రీ నలచరిత్ర శ్రీరామాయణ చంపూకావ్య గ్రంథమును, శ్రీ వాసుదేవ కథాసుధ ముద్రిత ప్రతులను ఉంచి పూజించితిమి. పిదప సాయంకాలమున ఆ కళ్యాణ మండపముననే జరిగిన సభయందు అధ్యక్షులుగా ఉన్న శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారే శ్రీ వాసుదేవ కథాసుధ మొదటి భాగమును ఆవిష్కరించిరి. ప్రియశిష్యుఁడు చి॥ రామచంద్ర ప్రసాదు ప్రసంగించెను.

10 ఈ గ్రంథ ప్రతులను పెక్కురకు అందఁజేయుచు అభిమానులు, మిత్రులు, శిష్యులు విరాళములను స్వయముగా ఇచ్చుచు. ఇతరులవలన సేకరించుచు ఈ గ్రంథ ప్రకాశనమునకు అనేక విధముల దోహద మొనర్చిరి. శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద తీర్థస్వామివారి కృషి మిగుల శ్లాఘ్యమైనది. చి॥ బొమ్మిశెట్టి

14 గ్రంథమున విభాగముల విషయమున విశేషవిషయములను సమర్పింపఁగోరుచున్నాను. సుధ అనగా అమృతము. దానిని సేవించుటకు కొన్ని కలశములలో నింపవలె. కొన్ని కలశముల సముదాయము ఒక కాండము కలశమునుండి సుధను కమండలువులోనికి వంచుకొనవలెను. దానినుండి అంతకంటె చిన్నవియైన గ్లాసులవంటి చమసములలో ఆ సుధను పోసికొని కొంచెము కొంచెముగా స్వీకరించవలె. యజ్ఞమునందు సోమభక్షణమునకు ఉపయోగించు చిన్న దారు పాత్రను చమస మందురు. ఇట్టి వైదిక విషయములను వివరించుచుండిన పూజ్యులు, కీర్తిశేషులు బ్రహ్మశ్రీ A.S. విశ్వనాథ శ్రౌతుల వారికి ప్రణామముల నర్పించుచున్నాను.

15. అమోఘాశీస్సులను అనుగ్రహించిన శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద తీర్థస్వామివారికి అనేక ప్రణాముల గావించుచున్నాను.

16 ప్రూఫులను శ్రద్ధతో చూచిన ప్రియశిష్యుఁడు, చి|| రామచంద్రప్రసాదునకు, మొదటి భాగమునందు ద్వితీయ భాగమున నాల్గవ భాగమున, ముఖ చిత్రములను అందముగా రచించిన చి|| చిట్టా వెంకటేశ్వరరావునకు, గ్రంథములను భక్తిశ్రద్ధలతో ముద్రించిన శ్రీవెన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ యజమానులకు, వారి సిబ్బందికి శ్రీ వాసుదేవుఁడు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుఁగాక!

నెల్లూరు బుధవిధేయుఁడు

01-07-1999 పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

నెల్లూరు వర్ధమాన సమాజమువారు 20-1-1958 నుండి 6-2-1958 వఱకు పదునెనిమిది దినములు శ్రీ మహాభారతము పై నుపన్యాసముల కార్యక్రమములు నిర్వహించిరి.

## సభాప్రారంభకులు : శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి గారు

| తేది | ఉపన్యాస విషయము | ఉపన్యాసకులు |
|---|---|---|
| 20-1-58 | కృష్ణద్వైపాయనుఁడు | బ్రహ్మశ్రీ విశ్వనాథ శ్రౌతులుగారు |
| 21-1-58 | ధృతరాష్ట్రుఁడు | శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్యగారు |
| 22-1-58 | ద్రోణుఁడు | శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు |
| 23-1-58 | భీముఁడు | శ్రీ కె. అనంతరామశాస్త్రిగారు |
| 24-1-58 | అశ్వత్థామ | శ్రీ సంగం జానకిరామయ్యగారు |
| 25-1-58 | భీష్ముఁడు | శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు |
| 26-1-58 | కర్ణుఁడు | శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి గారు |
| 27-1-58 | ద్రౌపది | శ్రీ జి.సి.వి. రమణరావు గారు |
| 28-1-58 | ధర్మరాజు | శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్యగారు |
| 29-1-58 | అర్జునుఁడు | శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు |
| 30-1-58 | సుయోధనుఁడు | శ్రీ పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రి గారు |
| 31-1-58 | శల్యుఁడు | శ్రీ అ. అచ్చన్న శాస్త్రి గారు |
| 1-2-58 | అభిమన్యుఁడు | శ్రీ చదలవాడ జయరామశాస్త్రి గారు |
| 2-2-58 | విదురుఁడు | శ్రీ ఓరుగంటి వేంకట కృష్ణయ్యగారు |
| 3-2-58 | సంజయుఁడు | శ్రీ యం. మల్లికార్జునముగారు |
| 4-2-58 | కుంతి, గాంధారి | శ్రీ ఏ. నాగభూషణరావు గారు |
| 5-2-58 | శకుని | శ్రీ బి. మృత్యుంజయముగారు |
| 6-2-58 | శ్రీకృష్ణుఁడు | ప్రో. హనుమజ్జానకీరామశర్మగారు |

గమనిక : పై విషయము మా మిత్రులు బ్రహ్మశ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించి 1966 ఏప్రిల్ నెలలో ప్రకటించిన "విజయుఁడు" అను గ్రంథముయొక్క ఉపోద్ఘాతమునందు పొందుపఱచిన శ్రీ మహాభారతోపన్యాసముల కార్యక్రమముల నుండి గ్రహింపఁబడినది.

# శ్రీ వాసుదేవ కథాసుధ
## నాల్గవ భాగము

# విషయసూచిక

# భగవత్ స్తుతి

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో|| వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ |
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ||

శ్లో|| వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే |
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ||

శ్లో|| అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః |
అఫాలలోచన శ్శంభు ర్భగవాన్ బాదరాయణః ||

శ్లో|| కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్ |
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ ||

శ్లో|| వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ |
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ||

శ్లో|| అతసీపుష్పసంకాశం హారనూపుర శోభితమ్ |
రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుమ్ ||

శ్లో|| మందారగంధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్ |
బర్హిపింఛావచూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్ ||

శ్లో|| శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితమ్ |
శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్ ||

శ్లో|| ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత
మేకో దేవో దేవకీపుత్ర ఏవ |
ఏకో మంత్రో దేవకీపుత్రనామ
కర్మాప్యేకం దేవకీపుత్రసేవా ||

# ధర్మకాండము

## I. అధర్మ నిగ్రహకలశము

### 1. నీతి కమండలువు

#### i. భీష్మనిపాతన చమసము

సంవాదము ముగిసినంతనే శ్రీకృష్ణుఁడు రథమును పాండవుల శ్రేణికి యథాపూర్వముగా చేర్చెను. వీరి రథము ముందునకు పోయి వెనుకకు వచ్చుటను చిత్రముగా ఎల్లరును చూచుచుండిరి. వెంటనే మఱియొక చిత్ర సంచలన మారంభ మయ్యెను. ధర్మరాజు కవచమును ధనుస్సును వీడి రథము నుండి దిగి కాలినడకతో భీష్ముని రథమునకు అభిముఖముగా బయలుదేరెను. ఆయనవెంటనే తమ్ములు కృష్ణుఁడును బయలుదేరిరి. తమ్ములు ఆయనను అనేక విధముల ప్రశ్నించిరి. సమాధానము చెప్పకుండ ఆయన ముందుకు పోఁజొచ్చెను. ఇదేమి అని అందఱు కలవరపడుచుండఁగా శ్రీకృష్ణుఁడు నవ్వుచు వారితో ఇట్లనెను. "ఈయన యభిప్రాయము నాకు తెలియును. భీష్మద్రోణాదులైన పెద్దలకు నమస్కరించి వారి యనుమతితో ఈయన యుద్ధమును ఆరంభింపఁ దలంచుచున్నాఁడు. గురు వృద్ధ బాంధవుల యనుమతితో తనకంటె గొప్ప వారితో యథాశాస్త్రముగా యుద్ధము చేయువానికి జయము ధ్రువముగా కలుగు నని పెద్దలవలన వినుచున్నాము.

శ్లో॥ శ్రూయతే హి పురా కల్పే గురువృద్ధాన్ స్వబాంధవాన్ ।
అనుమాన్య యథాశాస్త్రం యస్తు యుధ్యేత్ మహత్తరైః ॥ 18

శ్లో॥ ధ్రువ స్తస్య జయో యుద్ధే భవే దితి మతి ర్మమ ॥ 18 1/2

భీష్మపర్వ - అధ్యా - 19

శాస్త్రీయమైన ధర్మజుని యభిప్రాయము శ్రీకృష్ణునకు స్ఫురించినది ; కాని తమ్ములకు కూడ స్ఫురింపలేదు.

ధర్మరాజు భయపడి శరణుజొచ్చుటకు వచ్చుచున్నాఁడని కౌరవ సైనికులు గేలిసేయఁజొచ్చిరి. అయినను ధర్మరాజు వారిని లెక్కపెట్టక భీష్మద్రోణ కృపశల్యుల యొద్దకు పోయి నమస్కరించి వారియనుమతిని ఆశీస్సులను పొంది వచ్చెను. శ్రీకృష్ణుఁడు రాయబారమునకు పోయినప్పుడు తన ప్రయత్నమునకు అంతకు ఫలముగా, "దుర్యోధనాదులదే తప్పు ; వారిపై ధర్మరాజు యుద్ధము చేయుట సమంజసమే" అనునభిప్రాయమును భీష్మాదుల కందఱకును కలిగించి వారియనుమతిని పొందివచ్చెను. అయినను ధర్మరాజు కూడ ప్రత్యక్షముగా వారు కన్పించుచున్నప్పుడు వారి యొద్దకు స్వయముగా పోయి నమస్కరించి వారి యనుమతిని ఆశీస్సులను పొందుట ఆవశ్యకమే. అరణ్యాజ్ఞాతవాసములు ముగిసిన తరువాత ధర్మరాజు వారిని చూచుట ఇప్పుడే తటస్థించినది. చిరకాలమునకు గురువులను చూచుట తటస్థించినప్పుడు వారికి అభివందనము కావింపక ఆశీర్వచనమును పొందక ఎంత ముఖ్యకార్యము నైనను ఆరంభింపరాదు.

ధర్మరాజు తమ్ములతో మరలి వచ్చుచున్నప్పుడు శ్రీకృష్ణుఁడు కర్ణుని యొద్దకు పోయి ఇట్లనెను. "భీష్ముని యందలి ద్వేషముచేత నీవు యుద్ధమున పాల్గొనుట లే దని తెలిసినది. భీష్ముని పతనమువఱకు నీవు మా పక్షమున నుండి భీష్మునిపై విజృంభించి పగను తీర్చుకొనుము. తరువాత మరల నీవు వారి పక్షమునకు పోవచ్చును. కర్ణుఁడు, "నేను దుర్యోధనునకు అప్రియముగా వర్తింపను" అని దృఢముగా నిరాకరించెను. ఇది మిత్రభేద మను నీతి పద్ధతి. కర్ణుఁడు భీష్ముని ధిక్కరించినాఁడు. అది యవకాశముగా శ్రీకృష్ణుఁడు కర్ణుని ఆకర్షించి ధర్మపక్షమునకు బలమును చేకూర్చుటకై ప్రయత్నించినాఁడు.

యుద్ధము ఆరంభమయ్యెను. మూఁడవదినమున అపరాహ్ణ మగుచుండఁగా భీష్ముఁడు పాండవసైన్యముపై విక్రమించెను. ఆ విజృంభణమునకు మహావీరులు కూడ వెనుకకు మరలుచుండిరి. అర్జునుఁడు సైతము ఆయనను మార్కొన లేకుండెను. సాత్యకి వెనుకకు మరలుచున్న వీరులను యుద్ధోన్ముఖులను గావించుటకు ప్రయత్నించుచుండెను. శ్రీకృష్ణుఁడు సాత్యకిని చూచి, "పాఱిపోవువారిని పోనిమ్ము; నేను ఒక్కఁడనే భీష్మాది కౌరవవీరుల నందఱను సంహరించి ధర్మజుని రాజుఁ

గావింతును" అని చెప్పుచు చక్రమును గైకొని రథము నుండి దుమికి భీష్మునివైపు పరుగిడఁజొచ్చెను.

భీష్ముఁడు సంభ్రమము నొందక, "కేశవా రమ్ము ; నీవు సంహరించినచో నాకు శ్రేయస్సు కలుగును" అని ప్రార్థింపఁజొచ్చెను. కృష్ణుఁడిట్లనెను. "భూమి యందు ఈ ప్రజాక్షయమున కంతకును నీవు మూలము. ఇప్పుడు నీవు దుర్యోధనుని సముద్ధరించుచున్నావు. దుర్ద్యూతమున క్రీడించుచున్న రాజును ధర్మపథమందున్న మంత్రి నివారింపవలె. అట్లు అతఁడు నివారింపఁబడక విపరీతబుద్ధియై ధర్మమును అతిక్రమించి కులపాంసనుఁడైనచో, అట్టి రాజును పరిత్యజింపవలె". "రాజు పరదైవతము" అని భీష్ముఁడనెను. "హితమును ఎంతగా బోధించినను వినకుండిన కంసుఁడు రాజే అయినను యాదవవృద్ధులు వానిని త్యజించిరి కదా" అని కృష్ణుఁడు ఉద్ఘాటించెను.

ఇట్లు వారు మాటాడుచుండఁగా అర్జునుఁడు రథమునుండి దూఁకి పరువెత్తుకొని వచ్చి కృష్ణుని పాదములను పట్టుకొని, "నేను కౌరవులను జయింతును. నీవు వెనుకకు రమ్ము" అని ప్రార్థించెను. శ్రీకృష్ణుఁడు అతని ప్రార్థనను అంగీకరించి వెనుకకు మరలి వచ్చి సారథ్యమును స్వీకరించెను. తొమ్మిదవదినమున కూడ ఇట్లే ఆయన చక్రమును గైకొని భీష్ముని పైకి పోవుచు అర్జునునిచే మరలింపఁబడెను.

అర్జునుఁడు దుర్యోధనుఁడు సాయమును కోరి వచ్చినప్పుడు కృష్ణుఁడు, "నేను ఆయుధమును ధరింపను" అని ప్రతిజ్ఞచేసి యుండెను. కాని పైరెండు సందర్భములలో ఆయన క్రోధవశుఁడై తన ప్రతిజ్ఞను వీడుటకు సిద్ధపడినట్లు తోఁచును. కాని మహాయోగియైనవాఁడు క్రోధమునకు లోఁబడి సత్యవచనభంగమునకు సిద్ధపడునా ? అట్లయినచో ఆయనకు ఇతరులకు భేద మేమున్నది ? ఆయననుగూర్చి యోగేశ్వరుఁడని ప్రశంసించుట యెందులకు ?

ఈ సందర్భమును పరిశీలించినచో ఆయన క్రోధమునకు లోఁబడ లే దని స్పష్టమగును. భీష్ముఁడు విజృంభించుచుండఁగా అర్జునుఁడు మృదువుగా యుద్ధము చేయుచుండెను. ఆపరిస్థితిని చూచి సహింపలేక కృష్ణుఁడు ఇట్లు చింతించెను.

"యుధిష్ఠిరుని పక్షమున బలము లేదు. ఒక్కదినముననే భీష్ముఁడు దైత్యదానవుల నందఱను సంహరింపఁగలఁడు. ఈ పాండవబలము ఆయనకు లెక్క ఏమున్నది? పాండవవీరులు పాఱిపోవుచున్నారు. కౌరవులు అతిశయించుచున్నారు. కావున భీష్ముని సంహరించి పాండవుల భారమును తొలఁగింతును. అర్జునుఁడు బాణములచే పీడింపఁబడుచుండియు భీష్ముని యందలి గౌరవముచే కర్తవ్యము నెఱుంగకున్నాఁడు".

శ్లో|| అమృష్యమాణో భగవాన్ కేశవః పరవీరహా |
అచింతయ దమేయాత్మా నాస్తి యౌధిష్ఠిరం బలమ్ || 68

శ్లో|| ఏకాహ్నా హి రణే భీష్మో నాశయే ద్దైత్యదానవాన్ |
కిము పాండుసుతాన్ యుద్ధే సబలాన్ సపదానుగాన్ || 69

భీష్మపర్వము - అధ్యా. 59

తాను ఆసందర్భమున చూచుచు ఊరకున్నచో పాండవబలము నశించునేమో అనుతలంపుతో అర్జునునకు రోషమును కలిగించుటకై శ్రీకృష్ణుఁడు ఉపాయమును ఆలోచించెను (అచింతయ దమేయాత్మా). కావున ఆయన క్రోధము నొందుట చక్రమును గైకొనుట మొదలగునది యంతయు ఆలోచన పూర్వకముగా జరిగినదే కాని, ఆవేశముతో కాదు. ఆయన క్రోధమునకు లోఁబడలేదు. క్రోధము ఆయనకు లోఁబడియే ప్రసరించినది. క్రోధమునకు లోఁబడియున్నచో ఆయన భీష్ముని సంహరించుటకు రథమునుండి దుముకుట ఎందులకు ? పరుగెత్తుట యెందులకు? రథముపై నుండియే అప్రయత్నముగా విశ్వరూపమును ప్రదర్శించిన యామహాయోగి అట్లే చక్రమును కూడ ప్రయోగించి యుండవచ్చును. కావున ఆయనకు చక్రప్రయోగమునందు తాత్పర్యము లేదు. అది నటనమాత్రమే. అర్జునునకు రోషమును కలిగించుట, పాండవ పక్షమువారికి యుద్ధమున విశ్రాంతి కలిగించుట అందులకు ప్రయోజనము.

"భీష్ముని సంహరించి పాండవుల భారమును తొలఁగింతును" అని ఆయన అనుకొన్న విషయమును కూడ ఆయనయొక్క ఆలోచనకు అనుగుణముగనే గ్రహింపవలె. భీష్ముఁడు స్వచ్ఛందమరణము కలవాఁడు. ఆయనను సంహరించుట

ఎట్లు సాధ్యము ? ఆయనను సంహరించుట అనగా శిరశ్ఛేదము కావించుట కాదు. దుర్యోధనుని నిగ్రహించుట భీష్మునకు ధర్మము. అది సాధ్యము కానిచో అధర్మపరుఁడైన వానిని పరిత్యజించి రాజర్షిగా ఆయన వనములకు పోయియుండవలె. అధర్మపక్షమున చేరి ధర్మపక్షమును నశింపఁజేయఁ బూనుకొనుట కేవలము అక్రమము. ఆయన దుర్యోధనుని వీడి వనములకు పోయి యుండినచో కృపద్రోణులు కూడ ఆయనను అనుసరించియుందురు. అప్పుడు దుర్యోధనుఁడు యుద్ధమునకు సిద్ధపడడు. కావున భీష్ముఁడు దుర్యోధనుని పక్షమున అండగా నిలిచియుండుట వలననే యుద్ధము సంభవించి ప్రజాక్షయము కలుగుచున్నది. ఈ విధముగా, మహాధార్మికుఁడుగా లోకమున ప్రసిద్ధుఁడై పూజ్యుఁడుగా భావింపఁబడుచున్న భీష్ముని, మహాజను లందఱు వినుచుండఁగా, ప్రజావినాశకారకుఁడైన దోషినిగా నిరూపించుటయే ఆయనను సంహరించుట. మహాపురుషుల విషయమున దోషనిరూపణము సంహారముతో సమానము. ఆయనకు పశ్చాత్తాపమువలన ఉత్సాహభంగము కలిగించుట, అధార్మికులను సంహరించునప్పుడు దాక్షిణ్యము పనికిరాదని అర్జునునకు నిరూపించుట శ్రీకృష్ణుని యీచర్యకు ప్రధానఫలములు.

శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ సంగతి కూడ విచారింపవలసియే యున్నది. శ్రీకృష్ణుఁడు యుద్ధమున పాల్గొన్నచో అర్జునునకు కీర్తిభంగము కలుగును. అందువలన ఈయుద్ధమున ఆయుధమును ధరింప నని శ్రీకృష్ణుఁడు ప్రతిజ్ఞ చేసెను. ఇది సార్వకాలికము కాదు. ఈ యుద్ధములో ఎవరు గెల్చినను యుద్ధము పూర్తి యగును ; దానితో ఆయన ప్రతిజ్ఞ కూడ ముగియును. ఏ కారణముచేత నైనను పాండవులు ఓడుట సంభవించినచో శ్రీకృష్ణుఁడు యుద్ధమునకు పూనుకొని అధర్మపక్షమును నిర్మూలింపక తప్పదు. ఈ విషయమునే ఆయన ఈ సందర్భమున వ్యక్త మొనర్చినాఁడు. భీష్మాదులు ఏకారణముచే నైనను పాండవులను ఓడించుట సంభవించినచో, తాను కౌరవవీరుల నందఱను తప్పక సంహరింతు నని ఆయన ప్రకటించినట్లయ్యెను.

"రాజు పరదైవతము ; కావున దుర్యోధనుని పక్షమున నేను పోరుచున్నా"నని భీష్ముఁ డనుట ఆయనదౌర్బల్యమును స్పష్ట మొనర్చుచున్నది. పట్టాభిషేకము పాండురాజునకు, తరువాత యౌవరాజ్యపట్టాభిషేకము ధర్మరాజునకు జరిగినదే

కాని ధృతరాష్ట్రునకు దుర్యోధనునకు జరుగలేదు. ధర్మజుఁడే రాజు. అతని పక్షమునే భీష్మాదులు అవలంబింపవలె. ప్రస్తుతము ధృతరాష్ట్ర దుర్యోధనులు పాలనాధికారమును వహించియున్నారు. కాబట్టి రాజులే అనుకొన్నను, ధర్మపరాయణులైన రాజులు దైవతముతో సమానులు కాని, అధర్మనిరతులు కాదు. తమయనుశాసనమును ధిక్కరించిన దుర్యోధనుఁడు ధృతరాష్ట్రభీష్మద్రోణాదులకు పరిత్యజింపఁదగినవాఁడు. ఈ ధర్మమును రాయబార సభయందు విదురుఁడు భీష్మునకు నిరూపించి చెప్పెను. అప్పు డాయన విదురునకు సమాధానము చెప్పలేక యూరకుండెను. కావున వధ్యులైన దుర్యోధనాదులను ఉద్ధరింపఁ బూనుకొన్న భీష్ముఁడు కూడ వధ్యుఁడే.

తొమ్మిదవదినమున రాత్రి ధర్మరాజు తనవారినందఱను సమావేశపఱచి చాలసేపు మంత్రణముఁ గావించి తుదకు కృష్ణునితో ఇట్లనెను. "యుద్ధమునందు భీష్ముని జయించుట శక్యము కాదు. ఆయన మమ్ము అందఱను సంహరింపఁగలఁడు. స్వధర్మమునకు అవిరోధముగా మాకు హితమును చెప్పుము. (స్వధర్మస్యావిరోధేన హితం వ్యాహర కేశవ !|| శ్లో.24 - అధ్యాయ. 108) కృష్ణుఁడిట్లనెను. "ధర్మపుత్రా ! విషాదము నొందకుము. నీ సోదరులు శత్రునాశకులు. అర్జునుఁడు తాతను చంపుటకు ఇచ్ఛగింప కున్నచో నన్ను నియోగింపుము. నీచే నియుక్తుఁడనై నేను ఆయనను చంపుదును. కాని ఉపప్లావ్యమునందు, "గాంగేయుని నేను సంహరింతు" నని పార్థుఁడు ప్రతిజ్ఞ చేసియున్నాఁడు. ఆ ప్రతిజ్ఞను రక్షింపవలసియున్నది. అర్జునుఁడు అంగీకరించినచో నేను నిస్సంశయముగా భీష్ముని చంపుదును. ఇంతయేల ? అర్జునునకు ఇది పెద్ద భారము కాదు. అతఁడు పూనుకొన్నచో దైత్యదానవ సహితులైన దేవతలను కూడ అంతమొదింపగలఁడు. అతనికి భీష్ముని చంపుట లెక్క యేమి?

ధర్మజుఁడు ఇట్లనెను. "నీ సాయమున నేను దేవేంద్రుని కూడ జయింపఁ గలను. భీష్ముని సంగతి ఏమున్నది ? కాని ఆత్మగౌరవము ననుసరించి నిన్ను అసత్యవాదిని గావించుటకు నేను ఇష్టపడుట లేదు. నీవు యుద్ధమునందు పాల్గొనక మాకు సాయము చేయుచుండుము. జయోపాయముకొఱకు మరల రమ్మని భీష్ముఁడు చెప్పెను. కావున మీతో కూడ భీష్మునియొద్దకు పోయి వధోపాయమును

ప్రార్థింపఁదలఁచుచున్నాను. ఛీ ! ఈ క్షత్రియజీవిక ఎంత ఘోరమైనదో చూడుము. తండ్రిలేని మమ్ము పెంచి పెద్దచేసిన పితామహుని వధమునే ప్రార్థించుచున్నాము".

కృష్ణుఁడు ఇట్లనెను. "నీవు చెప్పినది నాకు కూడ నచ్చినది. అట్లే పోయి ఆయననే వధోపాయమును ప్రార్థింతము".

అట్లే వారు పోయి భీష్ముని వధోపాయమును అడిగి తెలిసికొని వచ్చిరి. అర్జునుఁడు కృష్ణునితో ఇట్లనెను. "చిన్నప్పుడు నేను మట్టిలో ఆడుకొనుచుండఁగా ఆయన నన్ను సమీపించెను. నేను ఆయనపైకి ప్రాకుచు వస్త్రములను మలినమొనర్చుచు "తండ్రీ" యంటిని. ఆయన నన్ను దగ్గఱకు తీసికొనుచు, "నేను తండ్రిని కాదురా ! మీ తండ్రికి తండ్రిని" అనుచు ఎంతో లాలించెను. అట్టివానిని ఎట్లు వధింపఁగలనో నీవే చెప్పుము".

కృష్ణుఁ డిట్లనెను. "అర్జునా ! యుద్ధమున భీష్ముని సంహరింతు నని ప్రతిజ్ఞచేసి క్షత్రధర్మము నవలంబించుచు ఎట్లు చంపకుందువు ? స్థిరుఁడవై భీష్ముని వధింపుము. ఇంద్రునకు బృహస్పతి చెప్పిన మాటను వినుము. "తనకంటె పెద్దవాని నైనను, వృద్ధునే యైనను, గుణవంతునైనను తన్ను చంపవచ్చిన యాతతాయిని సంహరింపవలసినదే. అసూయారహితులైన వారిని ధర్మమునుగూర్చి ప్రశ్నించి తెలిసికొనుట, దానిని రక్షించుట, అందుకొఱకు యుద్ధము చేయుట క్షత్రియులకు శాశ్వతమైన ధర్మము."

శ్లో|| జహి భీష్మం స్థిరో భూత్వా, శ్రుణు చేదం వచో మమ |
యథోవాచ పురా శక్రం మహాబుద్ధిః బృహస్పతిః || 99

శ్లో|| జ్యాయాంస మపి చేత్ వృద్ధం గుణై రపి సమన్వితమ్ |
ఆతతాయిన మాయాన్తం హన్యా ద్ఘాతక మాత్మనః || 100

శ్లో|| శాశ్వతోఽయం స్థితొ ధర్మః క్షత్రియాణాం ధనంజయ |
యోద్ధవ్యం రక్షితవ్యం చ ప్రష్టవ్య మనసూయిభిః || 101

## భీష్మపర్వ అధ్యాయము - 108

ఆత్మతత్త్వమునుగూర్చి భగవంతుని వలననే ఎంతగా విన్నను అర్జునునకు అహంకారమమకారములయందు మార్పు కలుగ లేదనుట స్పష్టము. అంతమాత్రమున భగవంతునియుపదేశము వ్యర్థమైన దని తలంపరాదు. మందు వాడినవెంటనే వ్యాధి తగ్గక పోవచ్చును. అంతమాత్రమున అది వ్యర్థమైన దని తలంపము. అది నెమ్మదిగా పనిచేయుచు వ్యాధిని క్రమముగా తగ్గించుననియే తలంతుము. కొంతసేపైన తరువాత ఆమందును మరల మరల ఉపయోగింతుము. తత్త్వోపదేశము కూడ ఇట్టిదే. దానిని వ్యక్తి ననుసరించి అనేక పర్యాయములు పెక్కు విధముల బోధించుచున్నచో అది ఒకప్పటికి అజ్ఞానమును నిర్మూలించును.

మఱునాఁడు శిఖండిని పురస్కరించుకొని అర్జునుఁడు తీవ్రబాణములతో భీష్ముని ప్రహరించెను. శిఖండిని చూచుచు ఆయన ప్రతిఘటింపలేదు. ఆయన ఆ బాణముల వేగమునకు రథమునుండి క్రిందికి దొర్లి భూమిని అంటకుండ శరీరమునందు గ్రుచ్చుకొనియున్న బాణములపై పరుండినట్లు ఉండెను.

కృష్ణుఁడు ధర్మజుని అభినందించెను. "మన అదృష్టముచేత భీష్ముఁడు పడిపోయినాఁడు. నీవు జయించితివి. దేవతలకు సైతము అజేయుఁడైన యామహారథుఁడు నీ చూపుచేతనే హతుఁడైనాఁడు. ధర్మజుఁడు ఇట్లనెను. "కృష్ణా! నీ యనుగ్రహమువలన విజయము, నీ యాగ్రహమువలన పరాజయము సంభవించును. భక్తులకు అభయంకరుఁడవైన నీవు మాకు శరణముగా నున్నావు. నీ శరణమును పొందినవారికి జయము కలుగుటలో ఆశ్చర్యమేమున్నది ?"

## 2. ద్రోణసంహార చమనము

పిమ్మట దుర్యోధనుఁడు కర్ణుని సలహాతో ద్రోణాచార్యుని సేనాధిపతిని గావించెను. ఆయన చాల సంతోషించి వరమును కోరుకొనుమనెను. ధర్మజుని సజీవముగ పట్టియిమ్మని దుర్యోధనుఁడు వరమును కోరెను. అర్జునుఁడు సమీపమునందు లేకున్నచో యుధిష్ఠిరుని పట్టి యిత్తునని ఆయన వరము నొసంగెను.

రెండవదినమున సుప్రతీకమను మదగజముతో భగదత్తుఁడు విజృంభించెను. ఆ మత్తేభము దానవసైన్యములను నుఱుమాడుచు ఇంద్రునకు జయమును

కలిగించుచుండెడిది. నరకుఁడు ఇంద్రుని జయించి దానిని హరించెను. అది వాని కుమారుఁడగు భగదత్తునకు సంక్రమించెను.

భగదత్తుఁడు దానిని పాండవసైన్యముపై పురికొల్పెను. అది భీమునిపైకి వచ్చెను. "భీముఁడు చచ్చె" నని హాహాకారములు ప్రబలెను. యుధిష్ఠిరుఁడు భగదత్తుని బాణవర్షమున ముంచెను. వాఁడు ఆ బాణములను తొలఁగఁ ద్రోయుచు భీముని వైపునకే పోఁజొచ్చెను. దశార్ణ భూపతి వాని నెదుర్కొని హతుఁడయ్యెను. సాత్యకి వానిపై కవిసెను. సుప్రతీకము తొండముతో వాని రథమును పైకెత్తి విసరివైచెను. అతఁడెట్లో రథమునుండి దూఁకి తప్పించుకొనెను. అభిమన్యుఁడు మొదలుగా ఎవరు ఎన్ని బాణములను దానిపై కురిపించినను అది లెక్కచేయక వారి రథములను విధ్వంస మొనర్చుచు విహరింపఁజొచ్చెను. భీముఁడు కూడ ఏమియు చేయలేకుండుటను చూచి పాండవసైన్యము పాఱిపోఁజొచ్చెను.

దూరమునుండి సుప్రతీక విజృంభణమును చూచిన యర్జునుఁడు భగదత్తునివైపు రథమును మరలింపుమని కృష్ణునితో అనెను. రథము ప్రక్కకు మరలినంతనే సంశప్తకులు వేలకొలఁదిగా అర్జునుని కదలనీయక చుట్టుముట్టిరి. అర్జునుఁడు క్రుద్ధుఁడై వారిని దివ్యబాణపరంపరలతో చీల్చి చెండాడి వెంటఁబడుచున్న సుశర్మను మూర్ఛితుని గావించి భగదత్తునిపైకి వచ్చి దృఢశరములతో వానిని సుప్రతీకమును బడలుపఱచెను. భగదత్తుఁడు సుప్రతీకమును తీవ్రముగా ఉసికొల్పెను. అది అర్జునుని రథముపైఁ గవిసెను. కృష్ణుఁడు మిగుల నిపుణముగా రథమును ప్రక్కకు తప్పించెను. ఆ యేనుఁగు మహావేగముతో ముందునకు దూఁకి పాండవబలమును నుగ్గొనర్చెను. అట్లు రథమును ప్రతివీరుని సమ్ముఖము నుండి తప్పించినందులకు అర్జునుఁడు కృష్ణుని ఏమియు అనలేక మరల భగదత్తునివైపు తేరును మరలింపు మనెను.

అర్జునుఁడు భగదత్తునకు అభిముఖుఁడై వానిని క్రూరనారాచములతో తాడించెను. వాఁడు ఆ దాడికి తట్టుకొనలేక అంకుశమునందు వైష్ణవాస్త్రము నావహించి పార్థుని వక్షము గుఱిగా ప్రయోగించెను. వెంటనే శ్రీకృష్ణుఁడు లేచి అర్జునునకు అడ్డముగా నిలుచుండెను. ఆ మహాస్త్రము వచ్చి ఆ దేవదేవుని వక్షమున పద్మమాలవలె శోభించెను. అర్జునుఁడు సిగ్గుపడి, "వైరివీరులముందు నన్ను నీవు ఇట్లు చులకన

చేయవచ్చునా ? సారథ్యమును వీడి అస్త్రమును స్వీకరింపఁదగునా'' అని శ్రీకృష్ణునితో కొంచెము కోపముతో అనెను.

శ్రీకృష్ణుఁడు అర్జునుని ఇట్లు అనునయించెను. విష్ణుదేవుని వరమున భూదేవికి నరకుఁడు జన్మించెను. అప్పుడు వైష్ణవాస్త్రము వానికి విధేయమయ్యెను. భగదత్తునకు అది సంక్రమించెను. దానిని విష్ణువు తప్ప మఱియొకండు సహించుట అసంభవము. కావున దానిని తాను స్వీకరించెనని, సారథి రథికుని రక్షించుట అక్రమము కాదని శ్రీకృష్ణుఁడు అతనికి నచ్చఁజెప్పి ఆ యేనుఁగును భగదత్తుని వెంటనే సంహరింపుమని ప్రేరేపించెను. అర్జునుఁడు తేఱుకొని దృఢమైన నారాచముతో సుప్రతీకముయొక్క కుంభస్థలమును చీల్చెను. అది దంతములు ఊఁతగా నేలపైఁ బడెను. ఆక్షణముననే అర్జునుఁడు అర్ధచంద్రబాణమున భగదత్తుని కంఠమును త్రుంచెను.

అట్లు రెండు దినములు యుద్ధము జరిగినను ద్రోణుని ప్రతిజ్ఞ నెరవేరలేదు. పాండవపక్షపాతి వని ద్రోణుని దుర్యోధనుఁడు నిందించెను. ఆయన రోషముతో మూఁడవదినమున పద్మవ్యూహమును నిర్మించెను. దానిని భేదించుట అర్జుననకు తప్ప ఇతరులకు తెలియదు. సంశప్తకులు అర్జునుని యుద్ధమునకు ఆహ్వానించి దూరముగా తీసికొనిపోయిరి. ఆ వ్యూహమును భేదించుచు అభిమన్యుఁడు లోనికి పోయి వధింపఁబడెను.

సాయంకాలమునకు సంశప్తకులను జయించి కృష్ణార్జునులు శిబిరమునకు వచ్చునప్పుడు అర్జుననకు దుర్నిమిత్తములు తోఁచెను. అర్జునుఁడు కృష్ణునితో, "దుర్నిమిత్తములు తోఁచుచున్నవి ; నామనస్సు కీడును శంకించుచున్నది ; మాయన్నకు ఆపద సంభవించియుండదు గదా" అనెను. "మీయన్నకు మంత్రులకు కుశలమే యగును. మఱి ఏదో చిన్నవిపత్తు సంభవించియుండవచ్చును" అని శ్రీకృష్ణుఁడనెను.

శ్లో॥ వ్యక్తం శివం తవ భ్రాతు స్సామాత్యస్య భవిష్యతి ।
కించి దేవహి చాన్యత్రే స్తోకానిష్టం భవిష్యతి ॥ 7

ద్రోణపర్వ - అధ్యాయ - 72

స్తోకానిష్టమనఁగా చిన్నయాపద అని యర్థము. తోకమనఁగా సంతానము. స్తోక శబ్దముచేత శ్రీకృష్ణుఁడు అభిమన్యుని వధమును స్ఫురింపఁజేసెను.

ఆపదను శంకించుచుండియు వారు సంధ్యనుపాసించిన తరువాతనే శిబిరమునకు బయలుదేరిరి.

శ్లో॥ తత స్సంధ్యా ముపాస్యైవ వీరౌ వీరావసాదనౌ ।
కథయంతౌ రణే వృత్తం ప్రయాతౌ రథ మాస్థితౌ ॥ 8

ద్రోణపర్వ - అధ్యాయ. 72

ఇచ్చట వ్యాసభగవానుఁడు సంధ్యోపాసమును ప్రత్యేకముగ చెప్పుట గమనింపఁదగియున్నది. అప్పటివారు అందఱును సకాలముగా సంధ్యావందనముఁ గావింతురనుట సామాన్య విషయము. యుద్ధమునకై దీక్ష వహించినవారికి అది పూర్తి యగునంతవఱకు ఆశౌచము ఉండదు ; మృతి నొందినవారికి దహన సంస్కారము కూడ జరుగదు. అందువలన యథాకాలముగా సంధ్యోపాసనము తప్పదు. యుద్ధమున ఎంత పరిశ్రాంతులైనను యోధులు సంధ్యోపాసనమును అనుష్ఠించియే శిబిరములకు పోయి విశ్రాంతిఁ గైకొనుచుండిరని దీనివలన స్పష్టమగుచున్నది. ఆపదను శంకించుచు అర్జునుఁడు ఎంతో తొందఱపడుచుండియు సంధ్యను ఉపాసించియే శిబిరమునకు వచ్చెను. ఏ పరిస్థితియందైనను, అవకాశమున్నప్పుడు సంధ్యను ఉపేక్షింప రాదని వ్యాసభగవానుఁడు వ్యక్తమొనర్చుచున్నాఁడు.

"ఏ దేవతను చరములు స్థావరములును అయిన సర్వభూతములు సాయంకాలము ప్రాతఃకాలము నమస్కరించుచున్నవో అట్టి సంధ్య నన్ను రక్షించును గాక" అని మనము - "యాగ్ం సదా" ఇత్యాదియైన వేదమంత్రముతో ప్రార్థించుచున్నాము. ఈ వాక్యమునకు ఏమి యర్థము ? బుద్ధిశాలులైన మనుష్యులే అనేకులు, ఇతర దేశములలోనే కాదు మనదేశములో కూడ సంధ్యను ఉపాసించుట లేదు. గుఱ్ఱములు ఏనుగులు మొదలగునవి చరములు. చెట్లు కొండలు మొదలగునవి స్థావరములు. ఇవి కూడ సంధ్యాదేవికి నమస్కరించునా ? అట్లు చేయవలయు

ననుజ్ఞానము వానికున్నదా ? నమస్కరించుట అనఁగా చేతులు జోడించి పేరు చెప్పుకొని వందనము చేయుట అని గ్రహింప నక్కఱలేదు. పెద్ద యధికారి సమీపించినప్పుడు చిన్నయుద్యోగులు ఆయన యెుద్దకుపోయి పాదాభివందనము చేయకున్నను, లేచి నిలుచుండి భయముతోఁగాని భక్తితోఁగాని నమస్కారమునకు తగినయణఁకువతో కూడిన చిత్తవృత్తితో ఆయనవంక చూచుచుందురు. ఇట్లే సంధ్యాకాలము సమీపించినంతనే సకలజీవులకు, వారికి తెలియకయే అప్రయత్నముగా, చిత్తవృత్తి ప్రసన్నతను పొందును. ఇది ప్రకృతి ప్రాణులకు నొసంగిన వరము. సంధ్యాకాలముయొక్క ఈ మహిమను వేదమాత పైమంత్రమున నిరూపించుచు ఇట్లు ప్రబోధించుచున్నది. "మనశ్శక్తులను సమీకరించుకొనుటకు ఏకాగ్ర మొనర్చుకొనుటకు సంధ్యాకాలము మీకు గొప్ప అవకాశము నొసంగుచున్నది. మీ వృత్తులను విరమించి ఆయవకాశమును వినియోగించుకొని సులభముగా ప్రసన్నమగుచున్న చిత్తముతో భగవంతుని ప్రార్థించుచు బుద్ధికి విశ్రాంతిని నిర్మలత్వమును ప్రశాంతిని ఏకాగ్రతను పెంపొందించుకొనుఁడు". బుద్ధియొక్క బలమే సకలాభ్యుదయ నిశ్శ్రేయసములకు సాధనము. కావున భారతీయులేకాదు. సకలమానవులు, సంధ్యాసమయమున సకల వ్యాపారములను విరమించి తమకు అర్థమైన విధానముతో భగవత్ప్రార్థనము కావించుట ఆవశ్యకము. ఇతరదేశీయులకు భారతీయులు ఉపదేశింపఁదగిన విషయములలో ఇది ప్రాథమికము.

అర్జునుఁడు శిబిరమున అభిమన్యుని వధమును తెలిసికొని అమితముగా విలపింపఁజొచ్చెను. కృష్ణుఁడు అతనిని ఇట్లు ఓదార్చెను. "యుద్ధముతో జీవించు క్షత్రియులకు శూరులకు రణరంగమున వెన్నుఁజూపని వారికి ఎల్లరకును ఇదియే కదా పరమగతి. అభిమన్యుఁడు నిస్సంశయముగా పుణ్యలోకములను పొందినాఁడు. యుద్ధమున అభిముఖముగా మరణించుటనే వీరులు కోరుచుందురు. ఇది ధర్మశాస్త్రకర్తలచేత క్షత్రియులకు విహితమై యున్నది. దుఃఖింపకుము. నీ సోదరులు ఎంత దీనులై యున్నారో చూడుము. నీవే ఇట్లు విలపించుచున్నచో వీరి గతి ఏమి ? నిన్ను నీవు నిగ్రహించుకొని వీరిని ఓదార్పుము. తెలిసికొనఁదగిన దానిని తెలిసికొంటివి. నీవు దుఃఖింపరాదు.

శ్లో॥ విదితం వేదితవ్యం తే న శోకం కర్తు మర్హసి ।
ఏవ మాశ్వాసితః పార్థః కృష్ణే నాద్భుత కర్మణా ॥ 75

ద్రోణపర్వ - అధ్యాయ - 72

"తెలిసికొనఁదగిన దానిని తెలిసికొంటివి" (విదితం వేదితవ్యంతే) అని కృష్ణుఁడు అర్జునునకు తాను బోధించిన యాత్మతత్త్వమును స్ఫురింపజేసినాఁడు. ఇట్టి శోకమును పోగొట్టుటకే ఆయన యుద్ధారంభముననే ఆత్మజ్ఞాన విషయములను పెక్కింటిని బోధించినాఁడు. అప్పుడు అర్జునుఁడు, "మోహము నశించినది ; స్మృతి కలిగినది" అని చెప్పెను. మోహము నశించి ఆత్మతత్త్వస్మృతి కలిగినచో శోకము ఉండుటకు వీలు లేదని శ్రీకృష్ణుఁడు మేనల్లుని మరణమునకు తాను శోకమును పొందక, శోకము తగదని అర్జునుని ప్రబోధించుచున్నాఁడు.

ఈ సందర్భమున భగవానుఁడు ఆత్మనిత్యత్వము మొదలైన తత్త్వశాస్త్రవిషయములను ప్రస్తావింపలేదు. అవి బుద్ధి ప్రసన్నముగా ఉన్నప్పుడు గ్రహింపఁదగినవే కాని, తీవ్రముగ దుఃఖము ప్రబలుచున్నప్పుడు గ్రహింపఁదగినవి కావు. యుద్ధారంభమున అర్జునునకు కేవలము కృపయొక్క ఆవేశమువలన కలిగినది సామాన్య దుఃఖము. అది పుత్రదుఃఖము వంటిదికాదు. అందువలన అప్పుడు భగవానుఁడు అతనికి తత్త్వవిషయములను బోధించెను. అక్కఱ కలిగినప్పుడు అప్పటికప్పుడు డబ్బును సంపాదింపలేము. ముందుగా సంపాదించి యుంచిన డబ్బు అక్కఱకు ఉపయోగపడగలదు. అట్లె తత్త్వజ్ఞానమును కూడ ముందుగా సంపాదించుకొనియున్నచో, అది మననముచేత దృఢమై యున్నచో దుఃఖమును త్రోసివేయుటకు సమర్థమగును. పెరిగినచెట్టు నీడ నిచ్చును కాని అప్పుడు అంకురించిన మొలక నీడనీయలేదు. భగవానుఁడు అర్జునునకు ఆత్మతత్త్వమును బోధించియున్నను, దానిని మననము చేసికొని దృఢమొనర్చుకొనుటకు అతనికి అవకాశము కలుగలేదు. ఉపదేశము ముగిసిన వెంటనే యుద్ధమారంభమైనది. పదుమూఁడు దినములకే అర్జునునకు పుత్రశోకము కలిగినది. అల్పవ్యవధిలో ఆత్మతత్త్వబోధ రూఢము కాకపోవుటచే అర్జునుఁడు దుఃఖమును త్రోసివేయలేకపోయెను.

ఈశ్వరవర ప్రభావముచే సైంధవుఁడు అడ్డుపడి తమ్ము ఓడించుటచే తాము ఎంత ప్రయత్నించినను పద్మవ్యూహములోనికి పోయి అభిమన్యుని రక్షింపలేకపోయితి మని ధర్మజుఁడు చెప్పెను. ఆమాట విన్నంతనే అర్జునుఁడు ఉగ్రుఁడై, "అట్లయినచో రేపు సాయంకాలమునకు సైంధవుని శిరస్సును ఖండింతును ; అట్లు చేయలేకపోయినచో అగ్నియందు ప్రవేశింతును" అని వెనుకముందులు ఆలోచింపకుండ భయంకరమైన ప్రతిజ్ఞ గావించెను. అది విని పాండవపక్షములోని వీరులు సింహగర్జనములు శంఖనాదములు గావించిరి. సైంధవుఁడు భయపడి దుర్యోధనుని యొద్దకుపోయి పారిపోవుదు ననెను. దుర్యోధనుఁడు, "నీకేమియు భయము లేదు ; ద్రోణాచార్యుని నాయకత్వమున మేము అందఱము ఎట్లయినను నిన్ను రక్షింతుము ; అర్జునుఁడే అగ్నిలో దూఁకును" అని ధైర్యమును కలిగించి ద్రోణునియొద్దకు తీసికొనిపోయెను. ఆయన కూడ అట్లే వానికి నమ్మికను కలిగించెను.

అప్పటికప్పుడే కృష్ణుఁడు కౌరవశిబిరమునకు చారులను పంపి, ద్రోణుఁడు మహావ్యూహమును నిర్మించి దానిలో సైంధవుని దాఁచునని, ఆ వ్యూహద్వారమును కర్ణుఁడు భూరిశ్రవుఁడు అశ్వత్థామ కృపుఁడు శల్యుఁడు వృషసేనుఁడు అనునార్వురు మహావీరులు రక్షింతురని వార్తను సేకరించెను. పిదప ఆయన అర్జునునితో ఇట్లనెను. "నీవు నాతో విచారింపకయే ఘోరమైన ప్రతిజ్ఞఁజేసితివి. ఇది ఎంత దుర్ఘటమో చూడుము". అర్జునుఁడు ఆ మాటలను లెక్కపెట్టక, "నేను ఎట్లయినను రేపు సైంధవుని సంహరింపఁగలను ; నీవు అండగా నుండఁగా నాకు అసాధ్యమేమున్నది; పోయి సుభద్రను ఉత్తరను ఓదార్చి రమ్ము" అనెను.

శ్రీకృష్ణుఁడు వెంటనే పోయి సుభద్రను ఉత్తరను ఓదార్పఁజొచ్చెను. అక్కడకు ద్రౌపది మొదలగువారు వచ్చి దుఃఖింపఁజొచ్చిరి. శ్రీకృష్ణుని జూచినంతనే వారియందు దుఃఖము వెల్లువయై సుభద్ర ఉత్తర మూర్ఛిల్లిరి. కృష్ణుఁడు వారితోపాటు దుః ఖించుచువారికి శైత్యోపచారములు గావించి వారు తేఱుకొనినతరువాత ఇట్లనెను. "ద్రౌపదీ ! ఉత్తరను ఓదార్పుము. సుభద్రా ! దుఃఖింపకుము. నీకుమారుఁడు క్షత్త్రియపుంగవుఁడై పరమగతిని పొందెను. వానికై విచారించుట తగదు. వాని

మృతికి ముఖ్యకారకుఁడైన సైంధవుని, దేవాసురు లందఱు ఏకమై అడ్డుపడినను, సంహరించి నీ భర్త నీపగ తీర్పఁగలఁడు ; ఊరడిల్లుము."

అర్జునునియొద్ద శ్రీకృష్ణుఁడు ఇంత దుఃఖమును పొందలేదు. చెల్లెలియొక్క దుఃఖమును చూచినప్పుడు ఆయనకు కూడ దుఃఖము వచ్చెను. కరుణాత్మక సన్నివేశములలో జ్ఞానుల హృదయములలో దుఃఖతరంగములు పుట్టకుండనుండవు. తత్త్వజ్ఞానము కలిగినంతనే హృదయము ఱాయిగనో అప్పగనో మాఱదు. వారు కూడ ఇతరులవలె క్షణకాలము కన్నీరు కార్చుచు విలపింపవచ్చును. కాని ఆ దుఃఖమునకు వారు వశులు కారు. వెంటనే వారు స్వస్థితిని పొందుదురు. ఎంత దుఃఖము కలిగినను రాజునకు రాజ్యాధికారము ఎట్లు భంగపడదో అట్లే తాత్కాలికములైన సుఖదుఃఖ విశేషములవలన జ్ఞానియొక్క బ్రహ్మపదమునకు భంగపాటు కలుగదు.

శ్లో|| సోపచార స్తు కృష్ణశ్చ దుఃఖితాం భృశదుఃఖితః |
సిక్త్వాంభసా సమాశ్వాస్య తత్త్ర దుక్త్వా హితం వచః|| 37

ద్రోణపర్వ - అధ్యాయ - 78

శ్రీకృష్ణుఁడు సుభద్రయొద్దనుండి యర్జునునియొద్దకు వచ్చెను. అర్జునుఁడప్పుడు నిత్యము చేయుచుండెడి మహేశ్వరుని పూజకు ఉపక్రమించి, వైదూర్యసన్నిభములైన దర్భలతో శయ్యను ఏర్పఱచి గంధమాల్యలాజములతో దానిని అలంకరించి, దానిచుట్టును శ్రేష్ఠములైన యాయుధములతో ఆవరణమును ఏర్పఱచెను. సమీపమున కూర్చుండియున్న శ్రీకృష్ణుని గంధమాల్యములతో అర్చించి అర్జునుఁడు ఈశ్వరునకు నివేదింపవలసిన పదార్థములను ఆయనకు అర్పించెను. ఆయన ఆ పూజను స్వీకరించి నవ్వుచు, "అర్జునా ! సుఖముగా నిద్రింపుము ; నీకు మేలగును" అని ఆశీర్వదించి వెలుపలికి వచ్చి ద్వారరక్షకులను జాగరూకులై యుండుఁ డని హెచ్చరించి దారుకునితో కూడ తన శిబిరమునకు వచ్చెను. అచ్చట యోగారూఢచిత్తుఁడై ఎల్లరకును శ్రేయస్సును గోరు ఈశ్వరేశ్వరుఁడు శ్రీకృష్ణుఁడు అర్జునునకు శోకమును తొలఁగించునది తేజస్సును కాంతిని పెంపొందించునదియునైన విధానమును ఏర్పఱచెను ; అనఁగా మనస్సునందు ఒక పద్ధతిని ఏర్పఱచుకొనెను.

శ్లో॥ పార్థాయ సర్వం భగవాన్ శోకదుఃఖాపహం విధిమ్ ।
వ్యదధాత్ పుండరీకాక్ష స్తేజోద్యుతి వివర్ధనమ్ ॥ 8

శ్లో॥ యోగ మాస్థాయ యుక్తాత్మా సర్వేషా మీశ్వరేశ్వరః ।
శ్రేయస్కామః పృథుయశా విష్ణు ర్జిష్ణుః ప్రియంకరః ॥ 9

## ద్రోణపర్వ - అధ్యాయ - 79

## బాలప్రియ

అర్జునునకు శోకమును దుఃఖమును తొలఁగించుటకు పూనుకొన్న శ్రీకృష్ణుఁడు ఎల్లరకును శ్రేయస్సును కోరువాఁడు ఎట్లగును ? అర్జునుని ప్రతిజ్ఞ భంగమై అతఁడు అగ్నికి ఆహుతియైనచో పాండవపక్షము భగ్నమై అధర్మము జయించినట్లగును. ధర్మము హతమై అధర్మము విజృంభించుట లోకవినాశకరము. అధార్మికులైన దుర్యోధనాదులు అధర్మపరాయణులై తాము ఇంకను చెడి లోకులు చెడుటకు అవకాశమును కలిగింతురు. అర్జునుని ప్రతిజ్ఞ సఫలమైనచో ధర్మపక్షము నెగ్గి దుర్యోధనాదుల దుర్వర్తనమునకు అంతము ఏర్పడి యుద్ధమరణమున పాపము క్షీణించి వారికి కూడ శ్రేయస్సు కలుగుటకు అవకాశము ఏర్పడును. ధర్మజయమే సర్వజన శ్రేయోదాయకము.

దుర్ఘటమైన యర్జునుని ప్రతిజ్ఞ ఎట్లు పరిణమించునో అని పాండవ శిబిరమున ఎవ్వరికిని నిద్రపట్టలేదు. సాధారణముగ జరుగుచున్న యుద్ధము ఈ ప్రతిజ్ఞవలన ఇంచుమించుగా జూదమువలె నయ్యెను. శ్రీకృష్ణుఁడు అర్ధరాత్రమున మేల్కొని దారుకునితో ఇట్లనెను. "దారుకా ! అర్జునుని ప్రతిజ్ఞ మిగుల భయంకరము. ద్రోణాచార్యునిచే రక్షితుఁడై యుండు సైంధవుని సంహరించుట దేవేంద్రునకు కూడ శక్యము కాదు. అయినను రేపు ఎట్లయినను అర్జునుని ప్రతిజ్ఞ నెఱవేరునట్లు చేయుదును. అర్జునుని కంటె ప్రియతరుఁడు నాకు ఎవ్వఁడును లేఁడు. అర్జునుఁడు లేనిలోకమును నేను చూడఁజాలను. ఆవశ్యకమగుచో అర్జునునికొఱకు సుయోధనాదుల నందఱను సంహరింతును. నాపరాక్రమమును రేపు మూఁడు లోకములు చూచును గాక ! రేపు నీవు నా రథమును సర్వాయుధ సన్నద్ధము గావించి సిద్ధముగా

నుంచుము ; పాంచజన్య ఘోషమును విన్నంతనే దానిని నాయొద్దకు తీసికొని రమ్ము. ఎవరెవరిని అర్జునుఁడు చంపఁబూనునో వారి నందఱను అతఁడు సంహరింపగలఁడనియే తలంతును".

"నీవు తోడుగా నుండగా అర్జునునకు విజయము ఎట్లు లభింపకుండును? నీవు చెప్పినట్లు రథమును సిద్ధమొనరింతును" అని దారుకుఁడనెను.

అర్జునుఁడు ప్రతిజ్ఞను తలంచుచు పుత్రుని స్మరించుచు శోకసంతప్తుఁడై సోలి శయనమున వ్రాలెను. అప్పుడు అతనికి స్వప్నమునందు శ్రీకృష్ణుఁడు కన్పించెను. వెంటనే అర్జునుఁడు లేచి ఎదురుగా వెళ్ళి తీసికొనివచ్చి కూర్చుండఁజేసి ప్రక్కన నిలుచుండెను. శ్రీకృష్ణుఁడు ఇట్లనెను. "అర్జునా విషాదము నొందకుము. కాలము దుర్జయము. అది సర్వభూతములను నియమించుచున్నది. విషాదమెందులకు ? శోకము కార్యవినాశకము. విద్వాంసులు శోకింపరు. చేయఁదగిన దానిని చేయవలసినదే. కర్తవ్యమును నిర్వహింపుము. శోకము చేత ఏదియు నిర్వహింపఁబడదు. చేష్టాహీనతను కలిగించు శోకమే శత్రువు. శోకించువాఁడు శత్రువులకు సంతోషము బంధువులకు కృశత్వమును కలిగించును. ఆ శోకముచేత వాఁడు క్రమముగా క్షీణించును. కావున శోకింపఁదగదు.

శ్లో|| మా విషాదే మనః పార్థ కృథాః కాలో హి దుర్జయః |
కాలస్సర్వాణి భూతాని నియచ్ఛతి పరే విధౌ || 6

శ్లో|| కి మర్థం చ విషాద స్తే తద్బ్రూహి ద్విపదాం వర |
న శోచ్యం విదుషాం శ్రేష్ఠ శోకః కార్యవినాశకః || 7

శ్లో|| య త్తు కార్యం భవేత్ కార్యం కర్మణా తత్సమాచర |
హీనచేష్టస్య య శ్శోక స్స హి శత్రు ర్ధనంజయ || 8

శ్లో|| శోచన్ నందయతే శత్రూన్ కర్శయ త్యపి బాంధవాన్ |
క్షీయతే చ నర స్తస్మాత్, న త్వం శోచితు మర్హసి || 9

ద్రోణపర్వ - అధ్యాయ - 80

అర్జునుఁడు తన ప్రతిజ్ఞయొక్క భారమును వివరించెను. కృష్ణుఁడు ఆచమించి తూర్పుముఖముగా కూర్చుండి ఇట్లనెను. "అర్జునా ! పాశుపతాస్త్రమును స్మరింపుము. దానివలన రేపు నీవు సైంధవుని సంహరింపఁగలవు. అది నీకిప్పుడు స్మృతియందు లేకున్నచో పరమేశ్వరుని ప్రార్థింపుము. ఆయన నీకు ఆ యస్త్రమును మరల నుపదేశింపగలఁడు".

అర్జునుఁడు వెంటనే ఆచమించి తూర్పుగా నేలపై కూర్చుండి పరమేశ్వరుని ధ్యానింపఁజొచ్చెను. బ్రాహ్మముహూర్తమున కృష్ణునితో కూడ తాను ఆకాశమందున్నట్లు అర్జునునకు గోచరించెను. కృష్ణుఁడు అర్జునుని గైకొని కైలాసమునకు పోయెను. అచ్చట వారిరువురు పార్వతీయుతుఁడైన పరమేశ్వరుని చూచి సాష్టాంగముగ నమస్కరించి స్తుతించిరి. "మీకేమి కావలయునో చెప్పుఁ" డని ఈశ్వరుఁడు అడిగెను. అర్జునుఁడు కృష్ణునకు తానొసంగిన పూజాద్రవ్యములను పరమేశ్వరునియొద్ద చూచి శ్రీకృష్ణునకు ఈశ్వరునకు మనస్సునందే నమస్కరించి పరమేశ్వరునితో ఇట్లనెను. "దేవా నేను పాశుపతాస్త్రమును కోరుచున్నాను". పరమేశ్వరుఁడు, "ఈ దాపుననే అమృతమయమైన సరస్సునందు నాధనుర్బాణములనుంచితిని ; వానిని తీసికొని రండు" అనెను. కృష్ణార్జునులు సరస్సునొద్దకు పోగా అందు భయంకరములైన రెండు నాగములు కన్పించెను. వారు ఆచమించి శతరుద్రీయమంత్రముతో పరమేశ్వరుని ప్రార్థించిరి. వెంటనే అవి ధనుర్బాణముల రూపములను పొందెను. వారు వానిని తెచ్చి పరమేశ్వరునకు ఇచ్చిరి. ఆయన ఆ బాణమును వింటియందు సంధించి మంత్రమును ఉచ్చరించెను. అర్జునుఁడు ఆ ధనుస్సు యొక్క అల్లెత్రాటిని పరమేశ్వరుని పిడికిలిని దాని స్థానమును చూచుచు మంత్రమును గ్రహించెను. భవుఁడు ఆబాణమును సరస్సునందు పడునట్లుగా వదలి ధనువును కూడ దానియందే విసరివైచెను. పిమ్మట అర్జునుఁడు తన్ను కృతకృత్యునిగా భావించుచు కృష్ణునితో కూడ శిబిరమునకు తిరిగి వచ్చెను.

తెల్లవారినంతనే శ్రీకృష్ణుఁడు ధర్మజునియొద్దకు వచ్చెను. ఎట్లైనను అర్జునుఁడు నెగ్గునట్లు చేయుమని ధర్మజుఁడు కృష్ణుని ప్రార్థించెను. అట్లే కావింతునని కృష్ణుఁడు వాగ్దానమొనర్చెను. అర్జునుఁడు వచ్చి స్వప్న వృత్తాంతమును చెప్పెను. అందఱును

సంతోషించి పరమేశ్వరునకు నమస్కరించిరి. ధర్మజుని యాశీస్సులను పొంది అర్జునుఁడు రథము నారోహింపగా కృష్ణసాత్యకులు కూడ ఎక్కిరి. రథము బయలుదేరఁగానే శుభశకునములు కన్పించెను. అర్జునుఁడు సంతోషించుచు ధర్మజుని రక్షణభారమును వహింపుమని సాత్యకిని పంపెను.

అర్జునుఁడు యుద్ధరంగమున ప్రవేశించి ద్రోణునకు ప్రదక్షిణము చేసి శకటవ్యూహమునఁ జొచ్చిముందుకు పోవుచుండెను. ఒకచోట అర్జునుఁడు చూచుచుండఁగా భూరిశ్రవుఁడు సాత్యకిని ఓడించి నేలపై వైచి ఎడమచేతితోఁ జుట్టుపట్టుకొని కుడిచేతితో ఖడ్గమున వాని తలను ఖండింపనుండెను. సాత్యకిని రక్షింపుమని కృష్ణుఁడు అర్జునునితో అనెను. వెంటనే అర్జునుఁడు ఒక బాణమున భూరిశ్రవుని కుడిచేతిని ఖండించెను. "పరునితో పోరుచుండగా నాకు అదృశ్యుఁడవై నా భుజమును ఖండించుట మహాపాపము" అని భూరిశ్రవుఁడు ఆక్రోశించెను. అర్జునుఁడు ఇట్లు సమాధానము చెప్పెను. "ఇది సంకులసమరము. ఒకరితో ఒకరే పోరాడవలయును అను నియమము లేదు. మాకు సాయము చేయుటకు వచ్చి మమ్ము ఆశ్రయించి యున్న సాత్యకిని నీవు చంపుచుండఁగా చూచి యూరకున్నచో ఆశ్రితుని రక్షింపని పాపము నాకు సంక్రమించును. ఇప్పుడు నీవు ద్వంద్వయుద్ధ ధర్మమును ఉటంకించుచున్నావు. నిన్న అభిమన్యుని విరథుని గళితకవచుని మీరందఱు చేరి మార్కొనినప్పుడు ఈ ధర్మమేమైనది ? నిన్న జరిగినది సంకులసమరమైనచో ఇదియును సంకుల సమరమే. కావున నీ బాహువును ఖండించుట అధర్మము కాదు". అభిమన్యుని వధమును అర్జునుఁడు ప్రస్తావించినంతనే భూరిశ్రవుఁడు సిగ్గుతో తలవంచుకొని ప్రాయోపవేశమొనరించెను. సాత్యకి పైకి లేచి, అర్జునాదులు వారించుచుండఁగా లెక్కపెట్టక, భూరిశ్రవుని తలను ఖండించెను.

సూర్యాస్తమయము సమీపించుచుండఁగా సైంధవుఁడు ఇంకను అర్జునునకు దూరమందే యుండెను. కృష్ణుఁడు, "అంధకారమును సృష్టించి సూర్యుఁడు అస్తమించినట్లే గోచరింపఁజేయుదును ; అప్పుడు సైంధవుఁడు తలపైకెత్తి సూర్యునివంక చూచుచుండును. వెంటనే వాని తలను ఖండింపుము" అని అర్జునునితో చెప్పెను. (యోగ మత్ర విధాస్యామి సూర్య స్యావరణం ప్రతి - శ్లో.64. అధ్యాయ.146)

అట్లే ఆయన యోగబలమున అంధకారమును సృష్టించి సూర్యబింబమును కానరాకుండునట్లు చేసెను. సైంధవుఁడు తలపైకెత్తఁగా అర్జునుఁడు వాని తలను ఖండించి దానిని వాని తండ్రియొక్క ఒడియందు పడునట్లు చేసెను. వృద్ధక్షత్త్రుని తల నూఱు వ్రక్కలయ్యెను. వెంటనే శ్రీకృష్ణుఁడు చీఁకటిని ఉపసంహరించెను. సూర్యబింబము కన్పించెను. పాండవబలము హర్షనాదములు కావింపఁగా కౌరవసైన్యము విషాదము నొందెను.

సైంధవుని వంచించి చంపుట సమంజసమా అని కొందఱు శంకింపవచ్చును. భీమునిపై విషప్రయోగము చేయుట, ఇంటి కోడలిని నిండుసభలో పరిభవించుట మొదలుగా పెక్కు అభియోగములచేత దుర్యోధనుఁడు వధ్యుఁడు. వధ్యుఁడైనయపరాధిని, పామును వలె, ఎట్లయినను సంహరింపవచ్చును. అట్లే వానిని రక్షించుచున్నవారిని కూడ వధింపవచ్చును. ఇదియొక కారణము.

సైంధవుఁడు వధ్యుఁడనుటకు మఱియొక ప్రబలమైన కారణము కలదు. సైంధవుఁడు దుర్యోధనుని చెల్లెలైన దుస్సలకు భర్త. ఆ సంబంధముచేత అతఁడు పాండవులకు బావయగును. ఆవిధముగా పాండవులభార్య ద్రౌపది వానికి చెల్లెలగును. పాండవులు వనవాసము చేయుచున్నప్పుడు సైంధవుఁడు ఆ మార్గమున ఒకనాఁడు ప్రయాణము చేయుచుండెను. ఆసమయమున పాండవులు వనములోనికి పోయియుండిరి. ద్రౌపది ఒంటరిగా నుండెను. సైంధవుఁడు ఆశ్రమములోనికి పోయెను. ఆమె వానిని ఇంటియల్లునిగా గౌరవించెను. వాఁడు ఆమెను బలవంతముగా పట్టుకొని రథముపై పెట్టుకొని పారిపోఁజొచ్చెను. పాండవులు వానిని పట్టుకొని శిక్షించి వదలిపెట్టిరి. కాని చెల్లెలిని చెఱచుటకు పూనుకొన్నవాఁడు వధ్యుఁడే యగును. వధ్యుని ఎట్లు వధించినను తప్పు లేదు.

తరువాత మరల సంకులయుద్ధము జరిగెను. సాత్యకి విరథుఁడై యుండఁగా కర్ణుఁడు అతనిపైకి వచ్చెను. శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును పూరింపఁగా దారకుఁడు రథమును తెచ్చెను. దానిపై నెక్కి సాత్యకి కర్ణుని పరాజితుని గావించెను. కర్ణుఁడు ఇంద్రదత్తమైన శక్తిచే ఘటోత్కచుని సంహరింపఁగా కృష్ణుఁడు ఆనందించెను.

ఇది యేమని అర్జునుఁ డడుగఁగా కృష్ణుఁ డిట్లనెను. "దీనిచే ఘటోత్కచుఁడు మరణించుటమేలయ్యెను. లేకున్నచో కర్ణుఁడు దానిని నీపై ప్రయోగించి యుండును. ఆయపాయము ఇప్పుడు తప్పినది. ఈ ఘటోత్కచుఁడు బ్రాహ్మణద్వేషి, యజ్ఞద్వేషి, యజ్ఞహంత, పాపాత్ముఁడు. వీనిని కర్ణుఁడు చంపకున్నచో నేనే చంపవలసియుండును. ధర్మలోపకర్త లందఱును నాకు వధ్యులే. మీకు అప్రియము కలుగునని ఇంతవఱకును నేను వీనిని వధింపలేదు. పైగా వీనివలన కర్ణుని శక్త్యాయుధము వ్యర్థము కావలసియున్నది. ధర్మసంస్థాపనముకొఱకు నేను ప్రతిజ్ఞ చేసియుంటిని. బ్రహ్మము (వేదము) సత్యము, దమము, శౌచము, ధర్మము, హ్రీ, శ్రీ, ధృతి క్షమ అనునవి ఎచ్చట నుండునో అచ్చట నే నుందును".

శ్లో॥ ఏష హి బ్రాహ్మణద్వేషీ యజ్ఞద్వేషీ చ రాక్షసః |
యజ్ఞహంతా చ పాపాత్మా తస్మా దేవం నిపాతితః ॥ 27

శ్లో॥ వ్యంసితా హ్యుపాయేన శక్రదత్తా మయానఘ ! |
యే హి ధర్మస్య లోప్తారో వధ్యా స్తే మమ పాండవ ॥ 28

శ్లో॥ ధర్మస్య స్థాపనార్థాయ ప్రతిజ్ఞైషా మయా కృతా
బ్రహ్మ సత్యం దమ శ్శౌచం హ్రీః శ్రీ ర్ధృతిః క్షమా ॥ 29

శ్లో॥ యత్ర యత్ర భవే న్నిత్య మహం తత్రాభవం సదా ॥ 30

ద్రోణపర్వ - అధ్యాయ 183

"ఇంద్రదత్తమైన యాశక్తిని కర్ణుఁడు అంతకుపూర్వమే అర్జునునిపై ఏల ప్రయోగింపలేదు" అని సాత్యకి కృష్ణుని అడిగెను. కృష్ణుఁడిట్లు చెప్పెను. "దుర్యోధనాదులు ప్రతిదినము కర్ణునితో ఆశక్తి విషయమును ప్రస్తావించుచు "అర్జునునిపైననే ప్రయోగింపుము" అని చెప్పుచుండిరి. కర్ణుఁడు కూడ అట్లె చేయుదునని చెప్పుచు నిత్యము అర్జునుని వధమునే భావించుచుండెను. కాని ప్రతిదినము యుద్ధము ఆరంభమైనంతనే ఆశక్తి సంగతి కర్ణునకు జ్ఞప్తికి రాకుండునట్లు నేనే మోహమును కలిగించుచుంటిని. అందువలన అతఁడు దానిని అర్జునునిపై

ప్రయోగింపలేదు. నాకు తల్లితండ్రి సోదరులు మొదలుగా ఎవరును అర్జునునివలె రక్షింపఁదగినవారు కారు. అందువలన నేనే యీ రాత్రియుద్ధమున ఘటోత్కచుని ప్రేరేపించి కర్ణునకు ప్రాణసంకటము కలుగునట్లు చేసి కర్ణుఁడాశక్తితో ఘటోత్కచుని సంహరించునట్లు చేసితిని".

శ్రీకృష్ణుఁడు ఇంతగా అర్జునునియందు ప్రీతిని ప్రకటించుటకు అనేక కారణములు కలవు. అర్జునుఁడు ధార్మికుఁడు సాత్త్వికుఁడై యుండుట మొదటి కారణము. చిన్నపిల్లవాఁడు తండ్రిని విశ్వసించునట్లు, అతఁడు సకల విషయములందు కృష్ణునే శరణముగా భావించుట రెండవ కారణము. అధర్మపక్ష నిర్మూలనమునకు ధర్మపక్షవిజయమునకు అతఁడు ప్రధానసాధనమై యుండుట ముఖ్యకారణము.

ద్రోణుఁడు, మరణింపనున్న దినమున, అతఁడు ఘోరముగ పాండవపక్షమును నాశ మొందింపఁజొచ్చెను. పాండవులందఱును ఆయనచే పీడితులైరి. అప్పుడు కృష్ణుఁడు అర్జునునితో ఇట్లనెను. "చేతియందు ధనువుండఁగా ఈయనను సంహరించుట ఇంద్రాదులకు కూడ సాధ్యము కాదు. ఈయన శస్త్రమును త్యజించిననే తప్ప ఇతనిని మానవులు సంహరింపలేరు. కావున ఇతఁడు మనల నందఱను సంహరింపక ముందే పాండవులు ధర్మమును వదలి జయముకొఱకు ఉపాయమును అవలంబింపవలె. అశ్వత్థామ హతుఁడైనాఁడని విన్నచో ఈయన యుద్ధమును విరమించును. కాబట్టి ఎవరో యొకరు ఆయన యొద్దకు పోయి అశ్వత్థామ హతుఁడయ్యె నని చెప్పవలె".

ఆ మాటకు అర్జునుఁడు ఇష్టపడలేదు. ధర్మరాజు కష్టము మీద అంగీకరించెను. తక్కినవారందఱును సమ్మతించిరి. భీముఁడు తమ సేనయందే అశ్వత్థామ అనుపేరు గల గజమును సంహరించి ద్రోణుని యొద్దకు పోయి, "అశ్వత్థామ హతుఁడయ్యె"నని పెద్దగా అఱచెను. ఆయన వాని మాటను నమ్మక ధర్మరాజును అడిగెను. ఆయన పాండవనాశమునకే పూనుటను చూచి కృష్ణుఁడు వ్యథితుఁడై ధర్మజునితో ఇట్లనెను. "ఈ ద్రోణుఁడింక అర్ధదివసమిట్లు యుద్ధమొనర్చినచో, నిజము చెప్పుచున్నాను, నీ సేన సర్వము నశించును. కావున నీవు మమ్ము కాపాడవలయును. ఇట్టి సందర్భములలో సత్యము కంటె అనృతమే అధికము. ప్రాణరక్షణముకొఱకు

అనృతమును చెప్పువాఁడు అఘమును పొందఁడు. స్త్రీలయందు, వివాహములలో, గోవుల విషయమున, భర్తృరక్షణమున అనృతమును చెప్పినచో పాతకము కలుగదు.

శ్లో|| తతో నిష్పాండవా మూర్వీం కరిష్యన్తం యుధాంపతిమ్ |
ద్రోణం జ్ఞాత్వా ధర్మరాజం గోవిందో వ్యథితోఽబ్రవీత్ || 46

శ్లో|| య ద్యర్ధదివసం ద్రోణో యుధ్యతే మన్యు మాస్థితః |
సత్యం బ్రవీమి తే సేనా వినాశం సముపైష్యతి || 47

శ్లో|| స భవాం స్త్రాతు నో ద్రోణాత్ సత్యాజ్జ్యాయోఽ నృతం వచః |
అనృతం జీవితస్యార్థే వదన్ న స్పృశ్యతే త్వషైః || 48

శ్లో|| కామినీషు వివాహేషు గవాం భక్తే తథైవ చ
బ్రాహ్మణాభ్యుపపత్తౌ చానృతే నాస్తిపాతకమ్ || 49

ద్రోణపర్వ - అధ్యాయ 191

భీముఁడు కూడ ధర్మజుని ప్రోత్సహించెను. అసత్యమునకు భయపడుచుండియు, ధర్మరాజు జయమునందు సక్తుఁడై ద్రోణునితో అశ్వత్థామ హతుఁడయ్యెనని పెద్దగా చెప్పి, కుంజర మని మెల్లఁగా చెప్పెను. అంతకు పూర్వము భూమిని తాఁకకుండ నాలుగంగుళములు ఎత్తుగా నుండిన ధర్మజుని రథము, అయన యీమాట చెప్పినంతనే, నేలను తాఁకెను.

శ్లో|| త మతథ్యభయే మగ్నో జయే సక్తో యుధిష్ఠిరః |
అశ్వత్థామా హత ఇతి శబ్ద ముచ్చైశ్చకార హ
అవ్యక్త మబ్రవీత్ రాజన్ హతః కుంజర ఇత్యుత || 55

శ్లో|| తస్య పూర్వం రథః పృథివ్యా శ్చతురంగుళ ముచ్ఛ్రితమ్ |
బభూ వైవం చ తే నోక్తే తస్య వాహాః స్పృశన్ మహీమ్ || 56

ద్రోణపర్వ - 190 అధ్యాయ.

గోరఖ్‌పూర్ గీతా ప్రెస్ ముద్రణము

ధర్మజుని రథము వెంటనే భూమిని తాఁకెనన్నచో అది యాయనయందు సంభవించిన యధర్మముఁ వలననే సంభవించెనని చెప్పవలసి యున్నది. శ్రీకృష్ణుఁడు "ఆశ్రిత రక్షణముకొఱకు ప్రాణరక్షణముకొఱకు అసత్యమును చెప్పుట సత్యముకంటె అధికము, అట్లు చెప్పినవాఁడు పాపస్పర్శను పొందఁడు" అని ఉద్ఘాటించియున్నాఁడు. అట్టియెడల ధర్మజుని యసత్యవచనము అధర్మ మెట్లైనది ? దానివలన పాపమెట్లు సంభవించినది ? పాపము సంభవింపకున్నచో రథము ఏలభూమిని తాఁకినది ? అసత్యమును చెప్పుట, అందులో కూడ గురువునకు చెప్పుట అధర్మమే. కాని ఆశ్రితరక్షణముకొఱకు, ధర్మపక్షమునకు జయము కలిగించుటకొఱకు ధర్మకర్తవ్యమాత్రముగా అసత్యమును చెప్పినచో అది అధర్మఫలమైన పాపమును కలిగింపదు. ధర్మనిష్ఠయందు ఫలాపేక్ష యుండరాదు. కాని ధర్మజుఁడు ఆ క్షణమున జయమునందు సక్తుఁడై "(జయే సక్తో యుధిష్ఠిరః)" అసత్యమును చెప్పెను. అనఁగా అప్పుడు ధర్మజుని చిత్తవృత్తియందు ఆశ్రితరక్షణమను ధర్మముకంటె, రాజులకు సహజముగా నుండు విజయకాంక్షయే ప్రబలముగా నుండె నన్నమాట. ఈ కారణముచేత ఆయన చెప్పిన యసత్యము అధర్మమై పాపమును కలిగించెను. ఆ పాపము ఆయన రథమును నేలకు అంటుకొనునట్లు చేసెను.

ఈ సందర్భమున యుధిష్ఠిరునివర్తనము గమనింపఁదగియున్నది. ఆయన అతథ్యభయమునందు మగ్నుఁడైయున్నాఁడు. (అతథ్యభయే మగ్నః). తథ్యమనఁగా సత్యము. అతథ్యమనఁగా అసత్యము. తాను చెప్పుచున్నది అసత్యమని దానివలన పాపము కలుగునని ఆయన భయమునందు మునిఁగిపోయినాఁడు. ఆశ్రితరక్షణముకొఱకు అసత్యమును చెప్పినచో అది సత్యముకంటె అధికమైనది (సత్యాత్ జ్యాయాన్) అగునని శ్రీకృష్ణుఁడు చెప్పిన ధర్మసూక్ష్మమునందు ఆయనకు విశ్వాసము కలుగలేదన్నమాట. ఆయనను భగవత్స్వరూపునిగా భావించుచున్నను, ఆ క్లిష్టసమయమున ఆయన గావించిన ధర్మసూక్ష్మ నిర్ణయమునందు ధర్మజునకు నమ్మకము కుదురలేదనుట స్పష్టము. నమ్మకము కలిగినచో భయము కలుగుటకు అవకాశముండదు. శ్రీకృష్ణుని ధర్మనిర్ణయమును విశ్వసింపనప్పుడు, అసత్యమును చెప్పుట పాపమని భయపడుచున్నప్పుడు ఆయన ఆ మాటను చెప్పుటకు నిరాకరించి

యుండవచ్చును. ఆవిధముగానైన ఆయన దృఢముగా నిలువలేదు. ఎందువలన? జయమునందు ఆయనకు ఆసక్తి యున్నది (జయే సక్తః) అందువలన ఆయన అసత్యమును చెప్పియైనను జయమును పొందుటకు పూనుకొన్నాఁడు. ఈ కారణముచేత ఆయన చెప్పిన యసత్యము అధర్మమే అయ్యెను.

అసత్యమును చెప్పుటకు పూనికొనియు యుధిష్ఠిరుఁడు, "కుంజరము హతమయ్యె" నని మెల్లగా చెప్పుట ఎందులకు ? భీముఁడట్లు చెప్పలేదు. అట్లు చెప్పుటవలన అసత్యదోషము కొంతవఱకైనను తగ్గవచ్చునని ధర్మజుఁడు తలంచి కేవలము తన సంతృప్తికొఱకు అట్లు చెప్పియుండును. కాని ఇది ఆత్మవంచనమే. ద్రోణునకు వినపడకుండ అట్లు చెప్పుటవలన ప్రయోజనమేమున్నది ? ద్రోణుఁడు ధర్మజుఁడు చెప్పిన యసత్యమును విని సత్యమునుగా గ్రహించి అమితమైన వ్యథ నొందినాఁడు. కావున "కుంజరము హతమయ్యె" నని మెల్లగా చెప్పుటవలన అసత్యదోషము రవ్వంత కూడ తగ్గలేదు. శ్రీకృష్ణునియొక్క ధర్మనిర్ణయమును ఆయన విశ్వసించి యున్నచో భీమునివలె నిర్భయముగా అసత్యమును చెప్పియుండవచ్చును. కావున ఆయన శ్రీకృష్ణుని ధర్మసూక్ష్మనిర్ణయము ననుసరింపక తన బుద్ధినే అవలంబించి ఎట్లైనను జయమును పొందవలయునని సత్యవచన భంగమునకు పాల్పడుచున్నానని భయపడుచు, దోషమును కొంచెమైనను వారించుకోవచ్చునని మెల్లగా చెప్పెను. కావున అది ధర్మనిర్వహణము కొఱకు చెప్పినయసత్యము కాకపోవుటచే అధర్మమై వెంటనే రథము నేలకంటుకొనుట అను సద్యఃఫలము నొసంగెను. చివరకు ఈయసత్యదోషమువలననే ధర్మరాజు నరకమును కూడ చూడవలసి వచ్చెను.

సాధారణసమయములలో మనమొక మహాపురుషుని సాక్షాత్కరించిన పరమేశ్వరునిగా మహాభక్తితో పూజించుచున్నను క్లిష్టసమయము వచ్చినప్పుడు ఆ వ్యక్తియందు ఆ విశ్వాసము మనకు నిలుచుట ఎంత దుర్ఘటమో ఈ సంఘటనమువలన వ్యక్తమగుచున్నది. శ్రీకృష్ణునియందు ధర్మజునకు భక్తి విశ్వాసము లేవని చెప్పలేము. కాని ఈ ధర్మసంకటమునందు ఆయనకు శ్రీకృష్ణునందు విశ్వాసము నిలువలేదు. "నేను నీకు శిష్యుఁడను" అని ఎంతో భక్తిని ప్రకటించినయర్జునుఁడు కూడ శ్రీకృష్ణుని నిర్ణయమును ఆమోదింపలేకపోయెను. ధార్మికులు భక్తులును

అయినవారి విషయమే, భగవంతునియందే ఇట్లుండగా సామాన్యులు పెద్దలమాటలను పాటింపఁగలుగుట ఎంత దుర్ఘటమో గ్రహింపవచ్చును.

——ద్రోణుఁడు పుత్రవధను విన్నతరువాత కూడ యుద్ధము చేయుచునే యుండెను. పితృదేవతలు ప్రత్యక్షమై "ఆసురమైన యుద్ధకర్మమును ఇంక విరమింపుము" అని ఆయనకు బోధించిరి. అప్పుడాయన అస్త్రశస్త్రసంన్యాసము గావించి సకలభూతములకు అభయమొసంగి రథముయొక్క మధ్యభాగమునకు పోయి కూర్చుండి సాంఖ్యయోగమును అవలంబించెను. మహాతపశ్శాలియైన ఆయాచార్యుఁడు ముఖమును కొంచెము పైకెత్తి వక్షమును ముందునకు వచ్చునట్లు చేసి నిమీలితాక్షుఁడై అక్షరుఁడు దేవదేవేశ్వరుఁడును అయిన విష్ణువుని స్మరించి, "ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" అను భావముయొక్క ధారణమును హృదయమునందు నిలిపి జ్యోతిస్స్వరూపుఁడై దివమునకు బయలుదేరెను. ఆయన జ్యోతిరూపమున పైకి పోవుచుండఁగా ఆకాశము జ్యోతిస్సులతో నిండెను. ఆ భారద్వాజుని తేజస్సు పెద్దదియై రెండవ సూర్యుని వలె కన్పించెను. అట్లు సూర్యబింబసమానమై ఆ జ్యోతి నిమేషమాత్రమున అంతర్ధానము నొందెను. ఆ తేజమునకు ధృష్టద్యుమ్నుఁడు మోహితుఁడగుచుండఁగా ద్రోణుఁడు బ్రహ్మలోకమును పొందెను. అందులకు దేవతలు సంతోషముతో కిలకిలా శబ్దములను గావించిరి. బ్రహ్మలోకమునకు పోవుచున్న యామహాత్ముని మనుష్యులలో అర్జునుఁడు కృపుఁడు, వాసుదేవుఁడు, ధర్మరాజా సంజయుఁడు అనువారు ఐదుగురు మాత్రమే చూడఁగలిగిరి.

శ్లో॥ ఉత్సృజ్య చ రణే శస్త్రం రథోపస్థే నివిశ్య చ
అభయం సర్వభూతానాం ప్రదదౌ యోగ మీయివాన్ ॥ 45

శ్లో॥ నిమీలితాక్షః సత్త్వస్థో నిక్షిప్య హృది ధారణమ్ ।
ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ జ్యోతి ర్భూతో మహాతపాః ॥ 49

శ్లో॥ స్మరిత్వా దేవదేవేశ మక్షరం పరమం ప్రభుమ్ ।
దివ మాక్రామ దాచార్యః సాక్షాత్ సద్భిః దురాక్రమమ్ ॥ 52

శ్లో॥ ద్వౌ సూర్యౌ ఇతి నో బుద్ధిః ఆసీత్ తస్మిన్ తథాగతే ।
ఏకాగ్ర మివ చాసీ చ్చ జ్యోతిర్భిః పూరితం నభః ॥ 53

శ్లో|| సమపద్యత చార్కాభే భారద్వాజదివాకరౌ |
నిమేషమాత్రేణ చ తజ్జ్యోతి రన్తరధీయత || 54

శ్లో|| ఆసీ త్కిలకిలాశబ్దః ప్రహృష్టానాం దివౌకసామ్ |
బ్రహ్మలోకగతే ద్రోణే ధృష్టద్యుమ్నే చ మోహితే || 55

శ్లో|| వయ మేవ తదాద్రాక్ష్మ పంచ మానుషయోనయః |
యోగయుక్తం మహాత్మానం గచ్ఛన్తం పరమాం గతిమ్ || 56

శ్లో|| అహం ధనంజయః పార్థః కృపః శారద్వత స్తథా |
వాసుదేవ శ్చ వార్ష్ణేయో ధర్మపుత్ర శ్చ పాండవః || 57

శ్లో|| బ్రహ్మలోకం మహ ద్దివ్యం దేవగుహ్యం హి తత్పరమ్ |
గతిం పరమికాం ప్రాప్త మజానన్తో నృయోనయః || 59

శ్లో|| నాపశ్యన్ గచ్ఛమానం హి తం సార్థ మృషిపుంగవైః |
ఆచార్యం యోగ మాస్థాయ బ్రహ్మలోక మరిందమమ్ || 60

ద్రోణపర్వము - 192 అధ్యాయము

ఆయనను సంహరించుటకై యజ్ఞకుండమున పుట్టింపఁబడిన ధృష్టద్యుమ్నుఁడు, అర్జునాదులు, ఎంతగా వారించుచున్నను వినక, మహావేశవశుఁడై ఆరథముపైకి పోయి ఆయన శీర్షమును ఖండించి శరీరమును క్రిందికి త్రోసెను.

తండ్రికి సంభవించిన ఘోరమరణమును విన్నంతనే అశ్వత్థామ క్రుద్ధుఁడై సకల పాండవపక్షనిర్మూలనముకొఱకు నారాయణాస్త్రమును ప్రయోగించెను. అది ప్రజ్వలించుచు భయంకరముగా సైన్యధ్వంసము గావించుచు పైకి వచ్చుచుండఁగా శ్రీకృష్ణుఁడు, "మీరు అందఱు అస్త్రశస్త్రములను వీడి వాహనములనుండి దిగుఁడు; ఇది నారాయణాస్త్రము ; దీనిని ప్రతిఘటించినచో ఇది వర్ధిల్లి వినాశమును కలిగించును. నిరాయుధులను ఇది ఏమియు చేయదు" అని పెద్దగా ఉద్ఘోషించి ప్రాణరక్షణమునకు ఉపాయమును చెప్పెను. ఆవిధముగా ఆయన పాండవబలమును రక్షించెను.

# కర్ణవధ చమసము

ద్రోణుని యనంతరము కర్ణుఁడు కౌరవులకు సేనాధిపతి యయ్యెను. అతఁడు ఘోరమైన యుద్ధమొనరించి ధర్మజుని శరములచే పీడించి ఓడించి తఱిమెను. ధర్మజుఁడు యుద్ధరంగమున నిలువలేక శిబిరమునకు వచ్చి పరుండెను.

అర్జునుఁడు అశ్వత్థామను జయించి విజృంభింపఁగా కౌరవసైన్యము పారిపోఁజొచ్చెను. దుర్యోధనుఁడు కర్ణుని యొద్దకు వచ్చి, "కర్ణా ! నీవు నిల్చియుండఁగనే మనసైన్యము ఎట్లు పలాయిత మగుచున్నదో చూడుము" అనెను. కర్ణుఁడు రోషముతో భార్గవాస్త్రమును ప్రయోగించెను. దానినుండి కోట్లకొలది బాణములు బయలుదేరి పాండవబలమును విధ్వంస మొనరింపఁజొచ్చెను. అశ్వత్థామతో పోరాడి అలసియున్న యర్జునుఁడు కృష్ణునితో ఇట్లనెను. "కృష్ణా ! ఈ భార్గవాస్త్రమును హతమొనరించుట శక్యము కాదు. కర్ణుఁడు మహాసంరంభముతో నా వైపే చూచుచున్నాఁడు. యుద్ధమునందు వీనికి ఓడి పారిపోఁజాలను. పారిపోక మృతుఁడనైనచో మేలగును. మృతునకు జయపరాజయము లేమి యున్నవి ?"

కృష్ణుఁడు అర్జునుని యభిప్రాయమును గ్రహించి, "కర్ణునిచే బాగుగ దెబ్బతిన్నవాఁడై ధర్మజుఁడు మరలిపోయినాఁడు, ఆయనను చూచి ఓదార్చి మరల వచ్చి కర్ణుని సంహరింపుము" అనెను. అర్జునుఁడు సరే అని అన్న యొద్దకు బయలుదేరెను. కృష్ణార్జునులు యుధిష్ఠిరుని యొద్దకు వచ్చి ఆయన క్షేమముగా ఉండుటకు సంతోషించి నమస్కరించిరి. వారు కర్ణుని వధించిరనియే తలంచి ఆయన వారిని ఎంతో ప్రశంసించి కర్ణుఁడింకను చావలేదని తెలిసి, అర్జునుని తీవ్రముగ నిందించెను. క్రోధవశమున ఆయన, "నీకు కర్ణుని చంపుట చేతఁ గాకున్నచో ఆ గాండీవమును కృష్ణునకో మఱియొకనికో ఈయరాదా ?" అని యనేకపర్యాయములనెను.

అర్జునుఁడు క్రుద్ధుఁడై యొర నుండి ఖడ్గమును లాగెను. కృష్ణుఁడు, "ఇది యేమి ! ఇక్కడ శత్రువు లెవరున్నారు?" అని యడిగెను. అర్జునుఁడు ఇట్లనెను.

"గాండీవమును ఇతరులకు ఇమ్మని ఎవఁడేని నన్ను ప్రచోదనము గావించినచో వాని శిరస్సును ద్రక్కలింతునని ఉపాంశువ్రతమును గైకొంటిని. ఇప్పుడు నీసమక్షముననే ఈయన ఇట్లు మాటాడినాఁడు. కావున ఈ రాజును వధించి ప్రతిజ్ఞ పాలింతును. లేదా ఈ విషయమున నీవు ఎట్లు చెప్పిన అట్లు చేయుదును. నీకు తెలియని ధర్మము లేదు."

ఉపాంశు వనఁగా ఇతరులకు వినఁబడకుండ తనకు మాత్రము వినఁబడునట్లు ఉచ్చరించుట. అందువలననే ఈ ప్రతిజ్ఞ ధర్మజునకు తెలియలేదు.

కృష్ణుఁడు ఇట్లు చెప్పెను. "ఛీ ! ఛీ ! ఏమి నీవు మాటాడునది ? నీవు వృద్ధులను సేవింపలేదని యిప్పుడు వ్యక్తమగుచున్నది. ధర్మాధర్మ విభాగమును ఎఱింగినవాఁడెవఁడును ఇట్లు చేయఁడు. నీవు ధర్మభీరుఁడవు ; అపండితుఁడవు. ధర్మము ననుసరించి వర్తించు విద్వాంసుల నిశ్చయము నెఱుంగవు. ఏది కార్యమో ఏది అకార్యమో తెలిసికొనుట, సులభము కాదు. పెద్దలవలన ధర్మవిశేషములను వినుట వలననే అది తెలియును. ప్రాణులను వధింపకుండుట అన్నింటికన్నను అధికమని నాతలంపు. అనృతమును చెప్పియైనను ప్రాణి హింసనము తప్పింపవలె. అట్టియెడల ప్రాకృతునివలె పరమధార్మికుఁడైన జ్యేష్ఠ భ్రాతను చంపుటకు ఎట్లు పూనుకొంటివి? శత్రువునైనను యుద్ధము చేయకుండ ఉన్నవానిని, పరాఙ్ముఖుని, పారిపోవుచున్నవానిని, శరణాగతుఁడైన వానిని ప్రమత్తుని వధించుటను పెద్దలు మెచ్చరు. అట్టియెడల పూజ్యుని సంహరించుట ఎంత నికృష్టమో గ్రహింపుము. ధర్మసూక్ష్మము దుర్విజ్ఞేయము.

ఇదిగో ధర్మరహస్యమును చెప్పుచున్నాను. వినుము. సత్యమును చెప్పువాఁడు సత్పురుషుఁడే. సత్యము యొక్క తత్త్వము నెఱింగి దానిని అనుష్ఠించుట దుష్కరము. ఒక్కొక్కప్పుడు అనృతము సత్యఫలమును, సత్యము అనృత ఫలమును కలిగించును. వివాహకాలము, స్త్రీరతి, ప్రాణహాని, సర్వధనాపహరణము విప్రరక్షణము అనునయిదింటియందు అనృతము పాతకము కాదని పెద్దలందురు. సత్యానృతముల నిశ్చయము నెఱింగిన వాఁడే ధర్మవిదుఁడు.

పూర్వము సత్య వ్రతపరాయణుఁడైన కౌశికుఁడు అను ముని ఒక వనమునందు తపస్సు చేసికొనుచుండెను. కొందఱు బాటసారులు దొంగల నుండి తప్పించుకొని వచ్చి ఆ వనమునందు దాఁగుకొనిరి. దొంగలు వచ్చి కౌశికుని చూచి, "ఈవైపుగా కొందఱు బాటసారులు వచ్చిరి ; వారు ఎట్లు పోయిరి" అని అడిగిరి. వారు దొంగలని తెలిసి కౌశికుఁడు వారికి యథార్థమును చెప్పెను. వారు బాటసారులన్ను హింసించిరి. ఆ హింసవలన కౌశికుఁడు నరకమును పొందెను. కావున ధర్మసూక్ష్మము నెఱుంగని మూఢుఁడు పతితుఁడగును.

కేవలము తనబుద్ధితో తర్కించి ధర్మమును నిశ్చయించుట దుష్కరము. పెద్దలవలన ధర్మవిశేషములను గ్రహించుట వలననే ధర్మసూక్ష్మపరిజ్ఞానము కలుగును. నేను నీ విషయమున తప్పుపట్టుటలేదు. శాస్త్రమునందు సర్వము విధింపఁబడి యుండదు. ధర్మసూక్ష్మములు అనేకములు పెద్దలవలన గ్రహింపవలసియుండును. ధర్మప్రవచనమంతయు భూతములయభ్యుదయము కొఱకే యుద్దేశింపఁబడినది. ఏది అహింసాయుతమో అది ధర్మమనుట నిశ్చయము. హింసాస్వభావము గల భూతములకు అన్యభూతములయెడల అహింసను బోధించుటకు ధర్మప్రవచనము చేయఁబడినది. ధారణమువలన ధర్మము ఏర్పడుచున్నది. ధర్మము ప్రజలను ధరించుచున్నది. ఏది ధారణసంయుక్తమో అది ధర్మమనుట నిర్ణయము. దొంగలతో వ్యవహరించునప్పుడు అసత్యముగా ఎన్నిశపథములు చేసియైనను వారి నుండి ముక్తుఁడగుట శ్రేయస్కరము. అప్పుడు వారితో సత్యమును చెప్పుట అయుక్తము. శక్యమైనంతవఱకు వారికి ధనమును అప్పగింపరాదు. పాపులకు ఇచ్చినధనము ఇచ్చినవానిని కూడ పీడించును. కావున ధర్మము కొఱకు అనృతమును చెప్పినవాఁడు అనృతఫలమును పొందడు".

శ్లో॥ అనిశ్చయజ్ఞో హి నరః కార్యాకార్య వినిశ్చయే ।
అవశో ముహ్యతే పార్థ యథా త్వం మూఢ ఏవ తు ॥ 20

శ్లో॥ న హి కార్య మకార్యం వా సుఖం జ్ఞాతుం కథంచన ।
శ్రుతేన జ్ఞాయతే సర్వం తచ్చ త్వం నావబుధ్యసే ॥ 22

శ్లో|| ప్రాణినా మవధ స్తాత సర్వజ్యా యా న్మతో మమ |
అనృతం వా వదే ద్వాచం, న తు హింస్యా త్కథంచన || 24

శ్లో|| సత్యస్య వదితా సాధుః, న సత్యా ద్విద్యతే పరమ్ |
తత్త్వే నైవ సుదుర్ఙేయం, పశ్య సత్య మనుష్ఠితమ్ || 32

శ్లో|| సత్య మేవ తు వక్తవ్యం, వక్తవ్య మనృతం భవేత్ |
యత్రానృతం భవే త్సత్యం సత్యం చాప్యనృతం భవేత్ || 33

శ్లో|| వివాహకాలే రతిసంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే |
విప్రస్య చార్థే హ్యనృతం వదేత పంచానృతా న్యాహు రపాతకాని || 34

శ్లో|| దుష్కరం పరమం జ్ఞానం తర్కే ణానువ్యవస్యతి |
శ్రుతే ధర్మ ఇతి హ్యేకే వదన్తి బహవో జనాః || 55

శ్లో|| య త్స్యా దహింసా సంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయః |
అహింసార్థాయ హింస్రాణాం ధర్మప్రవచనం కృతమ్ || 57

శ్లో|| ధారణా ద్ధర్మ ఇత్యాహు ర్ధర్మో ధారయతే ప్రజాః |
యస్మా ద్ధారణ సంయుక్త స్స ధర్మ ఇతి నిశ్చయః || 58

శ్లో|| అధర్మం నాత్ర పశ్యన్తి ధర్మతత్త్వార్థదర్శినః |
యః స్తైనై స్సహ సంబంధా న్ముచ్యతే శపథై రపి || 63

శ్లో|| శ్రేయ స్త త్రానృతం వక్తుం తత్సత్య మవిచారితమ్ |
న చ తేభ్యో ధనం దేయం శక్యే సతి కథంచన || 64

శ్లో|| పాపేభ్యోఽపి ధనం దత్తం దాతార మపి పీడయేత్ |
తస్మా ద్ధర్మార్థ మనృత ముక్త్వా నానృతవా గ్భవేత్ || 65

కర్ణపర్వ - అధ్యాయ. 70

శ్రీకృష్ణుఁడు ఇట్లు ధర్మసూక్ష్మమును వివరించిన తరువాత అర్జునుఁడు అన్నను చంపుట తగదని గ్రహించి ఇట్లనెను. "కృష్ణా ! నీవు చెప్పినది సమంజసముగానే యున్నది. నీవు మాకు తల్లితో తండ్రితో సమానుఁడవు. నీకు

తెలియని ధర్మసూక్ష్మము లేదు. కాని నా ప్రతిజ్ఞ సత్యమగుటకు ఉపాయమును కూడ నీవే చెప్పుము." శ్రీకృష్ణుఁడు ఇట్లు చెప్పెను. "అర్జునా దుఃఖవశుఁడై నిన్ను నిందించిన యీ ధర్మజుఁడు వధార్హుఁడు కాడనుట నిస్సంశయము. నీ ప్రతిజ్ఞయును పాలింపఁదగినదే. ఈయన బ్రతికి యుండియు నీ ప్రతిజ్ఞకు అనురూపముగా ఎట్లు వధింపఁబడిన వాఁడగునో చెప్పెదను వినుము. జీవలోకమున పూజార్హుఁడైనవాఁడు పూజింపఁబడుచున్నప్పుడు జీవించుచున్నవాఁడగును ; పెద్ద అవమానమును పొందినప్పుడు బ్రతికియుండియు మృతునితో సమానుఁడగును. నీవు ఇప్పుడు ఈయనను, "నీవు అనాఁడు ఆ తప్పుచేసితివి ; ఇప్పుడు ఈ తప్పు చేసితివి" అని ధిక్కరింపుము. అది ఆయనను వధించుటయే యగును. తరువాత పాదములపైఁబడి క్షమను ప్రార్థింపుము. ధర్మమును ఆలోచించి ఈయన కూడ నిన్ను క్షమించును. ఇట్లు నీవు అనృతమునుండి భ్రాతృవధమునుండి కూడ ముక్తుఁడవు కాగలవు.

శ్లో॥ యదా మానం లభతే మాననార్హ స్తదా వై జీవత జీవలోకే ।
యదావమానం లభతే మహాన్తం తదా జీవన్మృత ఇత్యుచ్యతే సః ॥ 82

శ్లో॥ త్వమి త్యత్ర భవన్తం హి బ్రూహి పార్థ యుధిష్ఠిరమ్ ।
త్వమిత్యుక్తో హి నిహతో గురు ర్భవతి భారత ॥ 84

శ్లో॥ అవధేన వధః ప్రోక్తో యద్గురు స్త్వమితి ప్రభుః ।
తద్బ్రూహి త్వం య న్మయోక్తం ధర్మరాజస్య ధర్మవిత్ ॥ 87

కర్ణపర్వ - అధ్యాయ. 70

శ్రీకృష్ణుఁడు చెప్పినట్లుగా అర్జునుఁడు ధర్మజుని అనేక విధముల నిందించి నిట్టూర్చుచు మరల ఒరనుండి ఖడ్గమును గైకొనెను. "ఇది యేమి మరల కత్తిని గైకొనుచున్నావు" అని కృష్ణుఁడడుగగా అర్జునుఁడు, "కృష్ణా ! మహాత్ముఁడగు నగ్రజుని ఇంతగా నిందించిన నాకు వధముకంటె ప్రాయశ్చిత్త మేమున్నది" అనెను. అతనిని ఓదార్చుచు శ్రీకృష్ణుఁడు ఇట్లు చెప్పెను. "అర్జునా ! ధర్మము సూక్ష్మము, దుర్విజ్ఞేయము. కావున నామాట వినుము. నిన్ను నీవు చంపుకొన్నచో సోదరవధముకంటె ఘోరతరమైన

పాపమును పొందినరకమునఁ బడుదువు. వధమే ప్రాయశ్చిత్త మనుకొన్నచో నిన్ను నీవు పొగడుకొనుము. ఆత్మస్తుతి ఆత్మహత్యతో సమానము.

శ్లో॥ పూర్ణాత్మ ధర్మే దుర్విద స్వాపి పార్థ విశేషతో బుద్ధైః ప్రోచ్యమానం నిబోధ|
హత్వాత్మాన మాత్మనా ప్రాప్నుయా స్త్వం వధా ద్భ్రాతు ర్నరకం చాతిఘోరమ్ ॥ 28

శ్లో॥ బ్రవీహి వాచాద్య గుణా నిహాత్మన స్తథా హతాత్మా భవితాసి పార్థ |
తథాస్తు కృష్ణే త్యభినంద్య తద్వచో ధనంజయః ప్రాహ ధనుర్వినామ్య ॥ 29

## కర్ణపర్వ - అధ్యాయ 71

అర్జునుఁడు అట్లే అని యుధిష్ఠిరునితో తన ప్రతాపమును ప్రశంసించి చెప్పుకొని, ధనుర్బాణములను వీడి ఖడ్గమును ఒరయందుంచి నమ్రశీర్షముతో పాదములకు ప్రణమిల్లి క్షమింపుమని ప్రార్థించెను. ధర్మరాజు అర్జునుని ప్రసంగముచేత మిగుల ఖిన్నుఁడై నిర్వేదముతో వనములకు పోవుదునని బయలుదేరెను. శ్రీకృష్ణుఁడు సంభ్రమముతో ఆయన పాదములపైఁ బడి ఇట్లు ప్రార్థించెను. "మహారాజా ! నీకు తెలియని దేమున్నది ? ప్రతిజ్ఞను నిర్వహించుకొనుటకొఱకే అరునుఁడు నాయభిప్రాయము ననుసరించియే అట్లు మాటాడెను. సత్యసంరక్షణకొఱకు మేము ఇద్దరము కావించిన యపక్రమమును మన్నింపుము. నీ పాదములకు ప్రణమిల్లి క్షమను అర్థించుచున్నాను. నన్ను క్షమింపుము. ఎవని వధమును గూరి నీవు ఇంతగా దుఃఖించుచున్నావో ఆ కర్ణుఁడు ఇంక బ్రతుకఁడని శపథము చేయుచున్నాను. మమ్ము క్షమింపుము".

శ్రీకృష్ణుఁడు తనపాదములపై పడినంతనే ధర్మజుఁడు సంభ్రమించుచు ఆయనను పైకి లేవనెత్తి కృతాంజలియై యిట్లనెను. "శ్రీకృష్ణా నేను గావించినది యతిక్రమమే. అజ్ఞాన మోహితులమైన మే మిద్దఱము ఘోరమైన యాపత్సముద్రమును నీ బుద్ధియను పడవచేత తరించితిమి.

అన్నను నిందించినందులకు అర్జునుఁడింకను విమనస్కుఁడై యుండగా కృష్ణుఁడతనిని ప్రోత్సహించుచు, "ఇంకను దిగులు పడెదవేమి ? మీ యన్నను

ఓదార్చి ఆశీర్వచనములను పొంది కర్ణుని వధించుటకు బయలుదేరుము" అనెను. అర్జునుఁడు రోదనము చేయుచు అన్నపాదములపైఁ బడి మాటిమాటికి క్షమింపుమని ప్రార్థింపఁజొచ్చెను. ధర్మజుఁడు కూడ అర్జునునిపైకి లేవనెత్తి కౌఁగిలించుకొని రోదనమును గావించెను. కొంతసేపటికి ఇరువురు స్వస్థచిత్తులై ముఖప్రక్షాళనముఁగావించుకొని ఆచమించి శౌచము నొందిరి. ధర్మజుఁడు ప్రణమిల్లిన యర్జునుని కౌఁగిలించుకొని ఆశీర్వదించి కర్ణుని వధింపుమని పంపెను.

యుద్ధమునకు బయలుదేఱుచుండగా, "కర్ణుని నేను చంపఁగలనా" అను చింతవలన అర్జునునకు చెమట క్రమ్మఁజొచ్చెను. అర్జునుని యుద్వేగమును గమనించి శ్రీకృష్ణుఁడు అతని పరాక్రమమును ప్రశంసించి ధైర్యమును కలిగించి ప్రోత్సహించెను.

ద్రోణసంహారసందర్భమున జయమునందు ఆసక్తి వ్యక్తమైనట్లే ధర్మజుని యందు ఈ సందర్భమున అహంకారమమకారములు క్రోధశోకపరవశత్వము చక్కఁగా వ్యక్తమగుచున్నవి. అర్జునునియందు కూడ ఇవి తగ్గ లేదనుట స్పష్టము. మహాధార్మికులకు కూడ వీనిని అతిక్రమించుట ఎంత కష్టమో దీనివలన వ్యక్త మగుచున్నది. ధర్మమునందు ఎంత శ్రద్ధయున్నను ధర్మసూక్ష్మములు పెద్దలవలన తెలిసికోఁదగినవే కాని మన సొంతబుద్ధితోనే నిశ్చయింపఁదగినవి కావని గ్రహింపవలసియున్నది. ఇట్టి విషమపరిస్థితులయందు శ్రీకృష్ణుఁడు సంభ్రమము నొందక ప్రశాంతచిత్తముతో ఆలోచించి ధర్మసూక్ష్మమును నిర్ణయించి బోధించుట గమనింపఁదగియున్నది.

అర్జునుఁడు కర్ణుని మార్కొని విజృంభించెను. కర్ణుఁడు సర్పముఖాస్త్రమును ప్రయోగించెను. అశ్వసేనుఁ డనునాగుఁడు, ఖాండవదహనసమయమున అర్జునుఁడు తనతల్లిని సంహరించెనను కోపముతో, కర్ణుని ఆశ్రయించియుండెను. కర్ణుఁడు ఆయస్త్రమును సంధించుచుండగా అశ్వసేనుఁడు సూక్ష్మరూపమున దానియందు ప్రవేశించెను. కర్ణుఁడు అర్జునుని కంఠమునకు గుఱిచూచి ఆయస్త్రమును ప్రయోగించెను. కృష్ణుఁడు విలాసమాత్రముగ రథమును పాదముతో క్రిందికి త్రొక్కెను. రథము భూమిలోనికి కొంచెము దిగఁబడి అశ్వములు మోకాళ్ళపై వ్రాలెను. ఆ సర్పముఖాస్త్రము

గుఱితప్పి అర్జునుని కిరీటమును తాఁకి, దివ్యమైన యాకిరీటమును భగ్నమొనర్చుచు తాను కూడ మథితమై నేలఁగూలెను. అర్జునుఁడు తెల్లబోయి వెంటనే తెల్లనియుత్తరీయముతో శిరోజములను ఎత్తి కట్టి తలపాగా నేర్పరచుకొనెను.

అశ్వసేనుఁడు కర్ణునియొద్దకు పోయి, "నీవు మరల నన్ను ప్రయోగింపుము; పోయి అర్జునుని సంహరింతును" అనెను. కర్ణుఁడు, "పరుల పరాక్రమము నవలంబించి నేను శత్రువులను జయింపను ; నేను అర్జునుని సంహరింపఁగలను ; నీవు పొమ్ము" అని వానిని వీడ్కొలిపెను. వాఁడు అంతట పోక స్వయముగా బాణరూపమును వహించి అర్జునుని పైకి బయలుదేఱెను. కృష్ణుఁడు వానిని చూపి, "పూర్వవైరమున అశ్వసేనుఁ డనునాగుఁడు నీపైకి వచ్చుచున్నాఁడు ; వీనిని సంహరింపుము" అని చెప్పెను. అర్జునుఁడు ఆఱుబాణములతో ఆనాగుని సంహరించెను.

శ్రీకృష్ణుఁడు క్రిందికి దిగి రథమును రెండు భుజములతో పట్టి సమతలమునకు లాగెను. కృష్ణార్జునులు మరల విజృంభించిరి. కొంతసేపటికి కర్ణుని రథమున ఎడమచక్రము, బ్రాహ్మణ శాపవశమున, భూమియందు క్రుంగెను. కర్ణుఁడు క్రిందికి దిగి రెండు భుజములతో రథమును పైకెత్తుచు అర్జునునితో, "చక్రమును పైకి లాగువఱకు యుద్ధమును ఆపుము ; నీవు మహావీరుఁడవు, మహాకులప్రసూతుఁడవు; యుద్ధధర్మమును వీడకుము ; పోరు నిల్పుము" అనెను.

కృష్ణుఁడు ఇట్లనెను. "కర్ణా ! ధర్మము ఇప్పుడు నీకు జ్ఞప్తికి వచ్చినదా ! ప్రాయికముగా నీచులు ఆపద వచ్చినప్పుడు దైవమును నిందింతురు ; తాము చేసిన దానిని స్మరింపరు. నీమతము ననుసరించి దుర్యోధనుఁడు భీమునకు విషము పెట్టినప్పుడు, లక్కయింటియందు పాండవులను తగులఁబెట్టుటకు మీరందఱు కుట్ర చేసినప్పుడు, జూదము నందు ధర్మరాజునకు నిపుణత లేదని తెలిసి శకుని మూలమున ఆయనను ఓడించి సర్వస్వమును నీవా దుర్యోధనుఁడు హరించినప్పుడు, ఏకవస్త్రయైన ద్రౌపదిని సభకు తెప్పించినప్పుడు ఈధర్మము ఎక్కడికి పోయినది ? అప్పుడు వారికి నీవు ఈ ధర్మమును బోధింపలేదే ! అది పోనిమ్ము. దుశ్శాసనపరాభూతయై అవశయై దీనయై దయనీయయైయున్న మహారాణిని

కురుకులవధూమహత్తరను, కర్ణా ! నిండుసభలో, "నీ భర్తలు శాశ్వతముగా నశించిరి; మంచి భర్తను మఱియొకనిని వరింపుము" అని పక పక నవ్వితివే ! అప్పుడీధర్మమేమైనది ? మీరందఱు అనేకులు చేరి బాలుఁడైన యభిమన్యుని ఒక్కనిని చుట్టుముట్టి కిరాతులవలె కొట్టి చంపుచున్నప్పుడు ఈ ధర్మమెక్కడికి పోయినది ? ఇన్ని సందర్భములలో నీకు లేని ధర్మము ఇప్పుడు ఎక్కడ నుండి వచ్చి నిన్ను రక్షించును ? ఎందులకీ కంఠశోష ? ఎన్ని ధర్మములు వల్లించినను ఇంక నీవు బ్రతికిపోలేవు" (శ్లో. 1-34, అధ్యాయ. 92)

ఆ మాటలకు సమాధానము చెప్పఁజాలక కర్ణుఁడు తలవంచుకొని క్రోధముతో పెదవు లదరుచుండగా ధనువుపైకెత్తి ప్రాణములకు తెగించి కృష్ణార్జునలను బాణవర్షమున ముంచెను. కృష్ణుఁడు, "ఈతఁడు మరల రథము నెక్కు లోపలనే వానితలను ఖండింపుము" అని అర్జునుని ప్రోత్సహించెను. కృష్ణుని ప్రసంగమున అర్జునుఁడు కర్ణుని పాపకృత్యములను భావించుచు క్రోధమూర్తియై ఒక మహాస్త్రమున వాని శిరమును ఖండించెను.

రథచక్రమును పైకెత్తుకొనుచు, "యుద్ధము నిలుపు" మని కోరుచున్న కర్ణుని సంహరింపు మని కృష్ణుఁడు ప్రోత్సహించుట ధర్మమా ? బలపరీక్షారూపములు అపరాధిదండన రూపములని యుద్ధములు రెండు విధములు. ఇద్దఱు వీరులు తమలో బలాధికులెవరో తేల్చుకొనుటకు చేయు యుద్ధము బలపరీక్షారూపము. జరాసంధుఁడు కర్ణుని యుద్ధమునకు ఆహ్వానించి ఓడిపోయి అతనికి మాలినీ నగరమును బహూకరించెను. ఇది బలపరీక్షా రూపము. సార్వభౌమత్వమును కోరినరాజు తక్కిన రాజులను జయించుటకై చేయు జైత్రయాత్రయందు జరుగుయుద్ధము కూడ బలపరీక్షారూపమే. రఘువు పాండవులు మొదలగువారు చేసిన జైత్రయాత్రలు ఇట్టివే. వీనియందు యుద్ధధర్మములను పాటింపవలసినదే. అపరాధిని దండించుటకై చేయు యుద్ధమునందు సమరమర్యాదలను పాటింపనక్కఱలేదు. అపరాధిని వీరునిగా పరిగణించుట ధర్మము కాదు. ఎంతటి వీరుఁడైనను అపరాధమునకు పాల్పడినంతనే నిందితుఁడై దండనార్హుఁడగును. నిందితుఁడు బలపరాక్రమ సంపన్నుఁడైనప్పుడు ధర్మపాలకుడైన రాజు వానిని సంహరించుటకు సైన్యముతో సన్నద్ధుఁడై యుద్ధము

చేయునప్పుడు ఎప్పుడు ఎట్లు వీలయినచో అట్లు వానిని సంహరింపవలసినదే, కాని ఆ విధానము ధర్మమా అధర్మమా అని విచారించుట తగదు. వాని నెట్లయినను సంహారణరూపమున దండించి ధర్మమును రక్షించుటయే పరిపాలకునకు కర్తవ్యము. శ్రీరాముఁడు ఖరుని సంహరించుచు చెప్పినమాటలు గమనింపఁ దగియున్నవి. "లోక విరుద్ధములైన కార్యములను చేయువానిని భయంకరమైన దుష్టసర్పమునువలె ప్రతివ్యక్తియు చంపును".

శ్లో|| కర్మ లోకవిరుద్ధం తు కుర్వాణం క్షణదాచర |
తీక్ష్ణం సర్వజనో హన్తి సర్పం దుష్ట మివాగతమ్ || 4

అరణ్యకాండ - సర్గ. 29

భయంకరములైన మృగములను, బందిపోటు దొంగలను చాటున నుండియైన వంచించి యైనను సంహరించి ప్రజారక్షణము ఆత్మరక్షణము కావించుకొనుటయే పరిపాలకునకు పరమధర్మము. నిందితులు (criminals) బలాధికులైనప్పుడు వారిని వీరులనుగా భావించి వారికి ఎదురుగా నేగి వారిచే వంచింపఁబడి హతుఁడై ప్రజలను వారికి బలిగావించుట పరిపాలకునకు వానిచే నియోగింపఁబడిన యధికారులకు కూడ పాపిష్ఠమైన వర్తనమే యగును.

ఈ దృష్టితో చూచినప్పుడు పాండవులు కౌరవులతో చేసిన యుద్ధము బలపరీక్షారూపము కాదు. జైత్రయాత్ర కాదు. దుర్యోధనాదుల కంటె తాము బలాధికులమని నిరూపించుకొనుటకొఱకు గాని, సార్వభౌమత్వము కొఱకు గాని పాండవులు యుద్ధమునకు పూనుకొనలేదు. తమ్ము చంపుటకు యత్నించుచు తమధర్మపత్నిని నిండుసభలో పరిభవించి, జూదములోని యొప్పందము ప్రకారము తమ రాజ్యమును తమ కీయక ధిక్కరించుచున్న దుర్యోధనాదులను దండించుటకే యుద్ధమునకు పూనుకొనిరి. కృష్ణుని రాయబారమునందే కాక, యుద్ధారంభమున ప్రత్యక్షముగా కూడ ధర్మరాజు భీష్మాదుల యనుమతిని పొందెను. కావున దుర్యోధనాదులను గాని వారికి సహాయులుగా నున్నవారిని గాని సంహరించునప్పుడు యుద్ధమర్యాదలను పాటింపవలసిన యక్కఱ లేదు. ఈ కారణముచేతనే భీష్మద్రోణులు,

ధర్మవిజయముకొఱకు, తమ వధోపాయములను కూడ ధర్మజానకు తెలిపిరి. ధర్మభంజకులైన వారిని ఎట్లైనను దండించి ధర్మపక్షమును నిలుపుటయే ఈ యుద్ధమునకు ప్రధానలక్ష్యము.

శ్రీకృష్ణుఁడు జరాసంధాదులతో ఈ లక్ష్యముతోనే పోరాడి వారిని సంహరించి ధర్మమును ఉద్ధరించెను. ఈ లక్ష్యముతోనే ఆయన పాఱిపోవుచున్నట్లు నటించి కాలయవనుని వంచించి ముచికుందుని క్రోధాగ్నికి బలిగావించెను. ఆయన దృష్టిలో పాపాత్ములైన కౌరవులు దండ్యులే కాని వీరులు కారు. వారికి సహాయులైన భీష్మాదులు కూడ అట్లే దండ్యులైరి. కావుననే అసత్యమాడియైనను ద్రోణుని సంహరింపవచ్చునని ఆయన ధర్మజాని ప్రోత్సహించెను.

కర్ణుఁడు కూడ ఎట్లు వీలైనచో అట్లు వధింపఁదగినవాఁడే అని లోకమునకు నిరూపించుటకొఱకు అర్జునుని మనస్సునకు ఎక్కునట్లు చేయుటకు కృష్ణుఁడు వాని యపరాధములను అన్నింటిని ఏకరువు పెట్టెను. అవి రెండు కాదు మూఁడు కాదు ; పెక్కులు. అన్నియు వధార్హములైన నేరములే. అయినను అర్జునాదులు మనోదౌర్బల్యవశమున దుర్యోధనాదుల యపరాధిత్వమును విస్మరించి, వారు వీరులని, భ్రాతలని, బంధువులని, ఆచార్యులని మమకారమువలన భ్రమించుచు సంహరించుటకు సంకోచించుచున్నప్పుడు ఆయన వారి భ్రాంతిని తొలగించుచు అపరాధులవధమును ప్రోత్సహించుచుండెను. పతివ్రతయైన తన భార్యను నిండుసభలో పరిహసించి అవమానించిన క్రూరుఁడు ఎదురు పడినప్పుడు, క్రూరసర్పమును వలె, ఆక్షణముననే వధింపవలె. అట్లుకాక, "వీడు రథికుఁడుగా లేఁడు, చక్రము నెత్తుకొనుచున్నాఁడు" అని అర్జునుఁడు సందేహించుచు కర్ణుని వధింపక కాలక్షేపము చేయుట తప్పు. అందువలన వానిని వెంటనే సంహరింపుమని కృష్ణుఁడు అర్జునుని ప్రోత్సహించెను.

## శల్యసంహార చమసము

కర్ణవధానంతరము కృపుఁడు పాండవులతో సంధి చేసికొమ్మని దుర్యోధనునకు బోధించెను. దుర్యోధనుఁడు ఇట్లనెను. "అయ్యా ! సుహృత్తులు చెప్పఁదగిన దంతయు

చెప్పితివి. కాని మరణించువానికి ఔషధమువలె, అది నాకు మనస్సునకు ఎక్కుటలేదు. ఇంత జరిగిన తరువాత నేను సంధి కోరినను పాండవులు నన్ను నమ్ముదురా ; వైరమును విస్మరింతురా ? జూదమునందు మహానంవన్నుఁడైన ధర్మరాజును వంచించి రాజ్యమును గైకొంటిని. రాయబారమునకై వచ్చిన కృష్ణుఁడు కూడ వంచింపఁబడెను. పాండవ రాజ్యాపరహణముకంటె అతఁడు ద్రౌపదీపరిభవమునే సహింపలేకున్నాఁడు. ఏకవస్త్రయు రజస్వలయునై యున్న ద్రౌపదిని సభామధ్యమున ఎల్లరు చూచుచుండగా దుశ్శాసనుఁడు జుట్టుపట్టి లాగుకొని వచ్చునప్పుడు ఆమె వివస్త్రయగుచు చేసిన విలాపమును ఇప్పటికిని పాండవులు స్మరించుచునే యున్నారు. వారితో సంధి ఎట్లు పొసఁగును ? ఆ ద్రౌపది నావినాశముకొఱకు భూమియందు శయనించుచు ఉగ్రవ్రతమును గావించెను. ఇంక సంధి ఎట్లు కుదురును?"

శ్లో॥ యదా చ ద్రౌపదీ క్లిష్టా మద్వినాశాయ దుఃఖితా
ఉగ్రం తేపే తపః కృష్ణా భర్తౄణా మర్థసిద్ధయే ॥ 19

శ్లో॥ స్థండిలే నిత్యదా శేతే యావద్వైరస్య యాతనమ్ ।
నిక్షిప్యమానం దర్పం చ వాసుదేవ సహోదరా ॥ 20

## శల్యపర్వ - అధ్యాయ 5

దుర్యోధనుని యీ మాటలనుబట్టియే అతఁడు ద్రౌపదికి పాండవులకు ఎంత యపకారము చేసెనో స్పష్టమగుచున్నది ఇట్టివానిని ఎట్లు వధించినను ధర్మమే యగునని గ్రహింపవలసియున్నది. దుర్యోధనుఁడు కూడ మంచివాఁడే అని కొందఱు తలంచుట కేవలము కలియొక్క ప్రభావమనియే గ్రహింపవలసియున్నది.

దుర్యోధనుఁడు శల్యుని సేనాపతిని గావించెను. కృష్ణుని ప్రోత్సాహమున ధర్మజుఁడు ఆదినమున మధ్యాహ్నమునకే శల్యుని సంహరించెను. తనసైన్యము క్షీణించుచుండగా దుర్యోధనునకు యుద్ధరంగమున కాలు నిలువలేదు. అతఁడు గుఱ్ఱముపై నెక్కి ద్వైపాయనహ్రదమునొద్దకు పోయి దానియందు జలస్తంభనవిద్యతో దాగుకొనెను. బోయవాండ్రువచ్చి ఆవిషయమును భీమునకు చెప్పిరి. యుధిష్ఠిరుఁడు

సపరివారముగా ఆహ్రదమునొద్దకు పోయి అందు జలము స్తంభించియుండుటను శ్రీకృష్ణునకు చూపి ఇట్లనెను. "కృష్ణా ! అతఁడు నీటిని స్తంభింపజేసి అందు పరుండియున్నాఁడు. దేవీమాయను అవలంబించి నీటిలోపల నుండుటచే వీనికి మానవులవలన భయములేదు. ఇతఁడు ఇట్లు మోసముచేసినను బయటపడి బ్రతుకజాలఁడు. ఇంద్రుఁడు స్వయముగా వీనికి సాయము వచ్చినను ఇతఁడు యుద్ధమున హతుఁడగును.

దుర్యోధనుఁడు యుద్ధమునుండి ఇట్లు తప్పించుకొనుట తప్పు. తనవారి నందఱను యుద్ధరంగమునకు బలిపెట్టి తాను మాత్రము ఎట్లైనను బ్రతుకవలయునని పారిపోవుట నీచమైన స్వార్థము ; అధర్మము. కాని పారిపోవుట కూడ కొన్ని సందర్భములలో ధర్మమే యగును. విజాతీయులు బందిపోటు దొంగలవలె వంచనముతో వచ్చి పైఁబడినప్పుడు పరిపాలకులు ఆత్మరక్షణముకొఱకు పాఱిపోవుట తప్పు కాదు. అప్పుడు ఏ రాజైనను కేవలము శౌర్యముతో క్షత్త్రధర్మమను తలంపుతో వారినిమార్కొని సైన్యముతో కూడ హతుఁడై ప్రజలను దిక్కులేనివారిని గావించుట అధర్మము. అప్పుడు తాత్కాలికముగా తప్పించుకొని పోయి మరల సైన్యమును కూర్చుకొని శత్రువులను జయించి తన ప్రజలకు క్షేమము ధర్మపాలనము కలిగించుట ప్రభువునకు ధర్మము, కర్తవ్యము. దొంగలవలె వచ్చి పైఁబడుచున్న మొగలాయి సైన్యములపై ప్రచ్ఛన్నముగ దాడులు చేసి వారి కోశములను కొల్లగొట్టి ప్రజలకు ధర్మపాలనము నేర్పఱచిన శివాజీ కావించినది యథార్థముగ ధర్మము. దురాక్రమణపరాయణులైన విజాతీయులను వీరులనుగా భావించి వారిని ప్రత్యక్షముగ మార్కొని వారిచే హతులైన రాజపుత్త్రులు కావించినది అధర్మము.

దుర్యోధనుని విషయమున ప్రజాక్షేమపాలనమను ప్రసక్తి లేదు. పాండవులు విజాతీయులు కారు. వారినుండి ప్రజలను రక్షింపవలసిన ధర్మకర్తవ్యము లేదు. అందువలన అతఁడు పారిపోయిన తరువాత రక్షింపవలసిన ధర్మమేదియును లేదు. అతఁడు ఏదేని మోసమును మరల చేసి పాండవులను సంహరింపఁగలిగినను అది స్వార్థమే అగును. కాని ప్రజాక్షేమపాలనమను ధర్మమును సాధింపదు. కావున

తన్ను దండించుటకై సన్నద్ధుఁడై వచ్చిన యన్నను మోసగించి పాఱిపోయి దుర్యోధనుఁడు దాగుకొనుట స్వార్థపూరితమైన ధర్మవ్యతిక్రమము.

దుర్యోధనుఁడు జలస్తంభనము కావించెననఁగా, అతఁడు జలములోనికి మాయాప్రభావమున జలములను అన్నివైపుల వెనుకకు త్రోసి అవకాశమును (space) ఏర్పఱచుకొని, ఆజలము తన పైకి రాకుండునట్లు స్తంభింపజేసి, ఒకగదిలో ఉన్నట్లు విశ్రమించి యున్నాఁడన్నమాట. అందువలన అతనికి చుట్టు ఉండిన జలమంతయు స్తంభించి శిలాతలమువలె నయ్యెను. దానిని భేదించి వానిని చేరుట మానవప్రయత్నమునకు సాధ్యము కాదు. దివ్యాస్త్రములచేత భేదింపవచ్చునని ధర్మరాజు శ్రీకృష్ణునకు సూచించెను.

శ్రీకృష్ణుఁడిట్లనెను. "ఈ మాయావియొక్క మాయను మాయచేతనే భేదింపుము. మాయావిని మాయచేతనే వధింపఁదగును. ఇది సత్యము. క్రియాభ్యుపాయములచేత ఇంద్రుఁడు దైత్యదానవులను నిహతులను గావించెను మహాత్ముఁడైన వామనుఁడు కూడ బలిని అట్లే బంధించెను. అట్లే హిరణ్యాక్షహిరణ్యకశిపు వృత్ర సుందోపసుందరావణాదులు సంహరింపఁబడిరి. కావున నీవును క్రియాభ్యుపాయములతో విక్రమింపుము."

శ్లో॥ మాయావినం ఇమాం మాయాం మాయయా జహి భారత ।
మాయావీ మాయయా వధ్య స్సత్య మేత ద్యుధిష్ఠిర ॥ 7

శ్లో॥ క్రియాభ్యుపాయై ర్బహుభి ర్మాయా మప్సు ప్రయోజ్యచ ।
జహి త్వం భరతశ్రేష్ఠ మాయాత్మానం సుయోధనమ్ ॥ 8

శ్లో॥ క్రియాభ్యుపాయై రింద్రేణ నిహతా దైత్యదానవాః ।
క్రియాభ్యుపాయై ర్బహుభి ర్బలి ర్బద్ధో మహాత్మనా ॥ 9

శ్లో॥ క్రియాభ్యుపాయై ర్బహుభి ర్హిరణ్యాక్షో మహాసురః ।
హిరణ్యకశిపుశ్చైవ క్రియయైవ నిషూదితః ॥ 10

శల్యపర్వము - అధ్యాయ 32

ఒకానొక ఫలమును పొందుటకై చేయు పని క్రియ. ఆ క్రియ సక్రమముగా కొనసాగి ఫలించుటకు అవలంబింపఁదగిన సాధనములు ఉపాయములు. వానిలో క్రియకు నేరుగా ఉపయోగపడునవి అభ్యుపాయములు (Direct Means). బందిపోటు దొంగల ముఠాను పట్టుకొనుటకై ప్రభుత్వము ప్రత్యేకముగా ఒక రక్షకభట దళమును నియోగించినప్పుడు, ఆ దొంగలను సజీవముగా గాని నిర్జీవముగా గాని పట్టుకొనుటయే ఆ దళమునకు లక్ష్యముగా నుండును. ఆ లక్ష్యముతో వారు క్రియను (Police Action) ఆరంభించినప్పుడు ఆయుధములు ఆహారపదార్థములు వాహనములు మార్గోపదేశక వివరములు మొదలగునవి యన్నియు ఉపాయములే. కాని గూఢచారులవలన ఆ దొంగలందఱు ఒక్కచోట సన్నాహరహితులై ఎప్పుడు ఎక్కడ చేరియుందురో తెలిసికొని, తాము దాడి చేసినప్పుడు ఎవ్వరును తప్పించుకొనుటకు వీలు లేకుండునట్లు ఏర్పఱచుకొను వ్యూహము అభ్యుపాయము (Direct Means for the accomplishment of the action). ఈ వ్యూహము సరియైనది కాకున్నచో దొంగలు తప్పించుకొనిపోయి సన్నద్ధులై వచ్చి వంచించి రక్షకభట దళమునే నాశమొందింపవచ్చును. అందువలన వ్యూహరచనము అభ్యుపాయము కాగా, ఆయుధవాహనాదులు ఉపాయములు మాత్రమే అగును.

యుధిష్ఠిరుని యుద్ధమునకు దుర్యోధన సంహారము ముఖ్యఫలము. సైన్యములు ధృష్టద్యుమ్నాది వీరులు సాధనములనుగాఁ గైకొని ఆయన దుర్యోధనుని చుట్టు ఉన్న వారిని సంహరించినను, దర్యోధన సంహారము జరుగలేదు. తప్పించుకొన్న దుర్యోధనుఁడు ఏ కారణముచేతనైనను కృప కృతవర్మాశ్వత్థామలను కూర్చుకొని రాత్రిపూట నిద్రించుచున్న పాండవులను హతమార్చినచో ఉపాయములన్నియు వ్యర్థములే అగును. అందువలన ప్రధానాపరాధియైన దుర్యోధనుఁడు తప్పించుకొని పోకుండ సంహరింపఁబడుటకు ఏది సాధనమో అది అభ్యుపాయమగును. కావున అట్టి యుపాయమును అవలంబించి దుర్యోధనుఁడు బయల్పడునట్లు చేసి వానిని సంహరింపుమని కృష్ణుఁడు ధర్మజునకు బోధించెను.

మాయావిని మాయచేతనే సంహరింపఁదగునని చెప్పుటచే, దుర్యోధనుని మాయమాటలచేత నమ్మించి బయల్పడునట్లు చేసి అందఱు చుట్టుముట్టి, దుష్టసర్పమును వలె, కొట్టి చంపవలె ననుట శ్రీకృష్ణుని యభిప్రాయము.

ధర్మరాజు దుర్యోధనునకు రోషమును ప్రలోభమును కలిగించుచు మాటాడెను. "నీవు నీకు ఇష్టమైన యాయుధముతో మాలో ఎవరితోనైనను ఒక్కనితో పోరాడి గెలిచినచో రాజ్యమంతయు నీదే యగును" అని ధర్మరాజు ప్రలోభమును కలిగించెను. రాజ్యలుబ్ధుఁడైన దుర్యోధనుఁడు ఆప్రలోభమునకు వశుఁడై వెలుపలికి వచ్చెను. అతఁడు వారినందఱను చూచి భయముతో, "విరథుఁడను విక్షతగాత్రుఁడను పరిశ్రాంతుఁడను అయి ఒంటరిగానున్న నన్ను మీరందఱు మార్కొనుట న్యాయము కాదు" అనెను. ధర్మజుఁడు ఇట్లనెను. "మీరు అభిమన్యుని చంపినట్లుగా మేము నిన్ను చంపము. కవచమును ఆయుధములను ధరించి మా యైదుగురిలో ఎవనినైన ఒక్కనిని నీవు హతుని గావింపఁ గలిగినచో నీవే రాజు వగుదువు".

శ్లో॥ ఇమ మేకం చ తే కామం వీర భూయో దదామ్యహమ్ ।
పంచానాం పాండవేయానాం యేన త్వం యోద్ధు మిచ్ఛసి ॥ 60

శ్లో॥ తం హత్వా భవ వై రాజా హతోవా స్వర్గ మాప్ను హి ।
ఋతే చ జీవితా ద్వీర యుద్ధే కిం కుర్మ తే ప్రియమ్ ॥ 61

## శల్యపర్వము - అధ్యాయ 34

ధర్మజుని యీ ప్రసంగమువలన శ్రీకృష్ణునకు కోపము వచ్చెను. ఆయనకు కోపము వచ్చుటకు మూఁడు హేతువులున్నవి. మాయావిని మాయచేతనే వధింపవలయునని తాను చెప్పినయుపాయమును ధర్మజుఁడు గ్రహింపలేదు. దుర్యోధనుఁడు వెలువడినంతనే అందఱను కూడి వానిని సంహరింపక వాఁడు కోరినట్లుగా ఆయుధములను ఒసంగి ఒక్కనితో పోరవచ్చునని అంగీకరించుట మాయోపాయమునకు లక్షణము కాదు. దొంగలనుండి ధనమును రక్షించుకొనునప్పుడు వారితో అసత్యములు చెప్పుట అధర్మము కాదు. వారియెడల సత్యమును పాటించి వారికి లోఁబడి ధనాదికమును అప్పగించుట అధర్మము. ఈ విషయమును కృష్ణుఁడు అర్జున యుధిష్ఠిరుల వివాదసందర్భమునందు ధర్మసూక్ష్మమునుగా స్పష్టముగా నిరూపించెను. ధర్మరాజు దానిని పాటింపక, దుర్యోధనుని హ్రదమునుండి వెలువరించుటకు ఉపాయముగా చెప్పినమాటలనే పరమసత్యములనుగా మరల

ఉద్ఘాటించుట మొదటి కారణము. ఆతతాయిని వీరునిగా సంభావించుట రెండవకారణము. భీమునకు విషము పెట్టించి ద్రౌపదిని నిండుసభలో పరిభవించిన దుర్యోధనుఁడు మహాపరాధి. అట్టి పెద్ద ముద్దాయి ఎట్లు ఎప్పుడు దొరకినచో అట్లు వధింపదగినవాఁడే కాని వీరుఁడుగా సంభావింపఁదగినవాఁడు కాదు. అట్టివానికి ధర్మరాజు తమలో ఏయొక్కనితోనైన యుద్ధము చేయుటకు అవకాశ మొసంగుట అక్రమము. తమలో భీముఁడు తప్ప ఎవరును దుర్యోధనుని గదాయుద్ధమున జయింపలేరని తెలిసియు ఆయన వానికి ఆవరము నొసంగుట ఘోరము. తమలో ఏ యొక్కనిని దుర్యోధనుఁడు హతుని గావించినను రాజ్యము వానిదే యగునని ధర్మరాజు పందెమును పెట్టుట మూఁడవ కారణము. ఇది బలాబలముల పరీక్షకొఱకు ఏర్పడినయుద్ధము కాదు. ఇది అధర్మనిగ్రహమునకు ఆరంభింపఁబడినది. ఇప్పుడు ధర్మరాజు ఈ పందెమును పెట్టుటవలన అపరాధి జూదమునందువలె రాజ్యమును గెల్చుకొనుటకు అవకాశమొసంగినట్లయినది. కావున ఇది కేవలము అధర్మము.

"నీవు జీవింపఁదగవు" అని ధర్మరాజే దుర్యోధనుఁడు గావించినయపరాధముల నన్నింటిని ఏ కరువు పెట్టెను. ఆయపరాధము లన్నియు కృపాచార్యునితో మాటాడునప్పుడు దుర్యోధనుఁడు తాను చేసినట్లు అంగీకరించినవియే. నిశ్చితములైన యపరాధములను పేర్కొని దుర్యోధనునకు వధమే దండనమని ప్రకటించిన ధర్మరాజు, మఱుక్షణముననే శిక్షావిషయమును పందెముగా పరిణమింపఁజేయుట ఆయన ధర్మజ్ఞతకు ధార్మికత్వమునకు లోపముగానయ్యెను. అపరాధిని అట్లు శిక్షింపకుండ వదలిపెట్టునధికారము ప్రభువులకు లేదు. వాలి వధ సందర్భమున, "మేము మావశమునందు లేము" న వయం స్వవశే స్థితాః" అని రాముఁడు చెప్పినట్లు రాజులు ధర్మాధీనులే కాని స్వతంత్రులు కారు. అపరాధియందు తమకు ఎంత దాక్షిణ్యము గౌరవము ఉన్నను ప్రభువు వానిని శిక్షింపకుండ వదలుట ధర్మవ్యతిక్రమమే యగును. "నీవు మా రక్షక భటులతో ఒకనితో మల్లయుద్ధము చేసి గెలిచినచో నిన్ను విడిచిపెట్టెదను" అని రక్షక భటాధికారి ఒక హంతకునితో పందెమును ఏర్పఱచుట ప్రభుత్వదృష్టిలో ఎంత అక్రమమో శిక్షార్హమో ధర్మజుని యీ పందెము కూడ అట్టిదే. కావుననే ధర్మసంస్థాపనకు అధర్మనిగ్రహమునకు అవతరించిన శ్రీకృష్ణభగవానుఁడు కుపితుఁడై ధర్మరాజును మందలించెను.

అపరాధములను నిరూపించి వధమును దండనముగా నిరూపించిన ధర్మరాజు వెంటనే యిట్లేల చేసెను ? ఆయనకు ఇది అధర్మమని తెలియదా ? హృదయదౌర్బల్యము పైకి వచ్చినప్పుడు తెలిసినధర్మము కూడ అడుగున పడిపోవును. తమ్ము మహోదారులనుగా క్షమాగుణసంపన్నులనుగా లోకులు కీర్తింపవలయు నను కాంక్ష మహాపురుషులకు సైతము ప్రబలమగు దౌర్బల్యముగా నుండును (Fame is the last infirmity of a great man). "భార్యను అవమానించిన ద్రోహి విషయమున కూడ ఉదారముగ వర్తించినాఁడు కదా ధర్మరాజు" అని లోకులు తన్ను ప్రశంసింపవలయునను కాంక్ష ధర్మజునియందు ప్రబలమై ధర్మజ్ఞత్వమును ధార్మికత్వమును త్రోసివేసినది.

ఈ కారణముచేత శ్రీకృష్ణుఁడు ధర్మజుని ఇట్లు మందలించెను. "యుధిష్ఠిరా! ఎంత సాహసము చేసితివి ! ఇతఁడు నిన్ను గాని అర్జున నకులసహదేవులను గాని పోరుటకు రమ్మన్నచో ఏమగును ? 'మాలో ఏ యొక్కనినైనను హతుని గావించి నీవు రాజు వగుము" అని యందు వేమి ? ఇతఁడు భీముని జయింపవలయునను తలంపుతో పదుమూఁడు సంవత్సరములుగా గదాయుద్ధకౌశలమును పెంపొందించుకొనుచుండెను. గదాహస్తుఁడైన వీనిని మార్కొనుటకు సమర్థులు మీలో ఎవరును లేరు. శకునివలన అప్పుడు ఏర్పడిన జూదమే ఇప్పుడు మరల నీచేత ఆరంభింపఁబడినది. భీముఁడు బలవంతుఁడు సమర్థుఁడు. సుయోధనుఁడు విద్యాభ్యాసనిపుణుఁడు. బలవంతునికంటె నిపుణుఁడే అధికుఁడు. నీవు శత్రువును సమమార్గమునందుంచి నిన్ను విషమపథమునందు త్రోసికొనుచు మాకు సంకటమును కలిగించితివి. శత్రువుల నందఱను జయించి చేతికి వచ్చిన రాజ్యమును ఇట్లు పోగొట్టుకొనువాఁడు ఎవఁడైన నుండునా ? గదాహస్తుఁడైన వీనిని దేవతలు కూడ జయింపలేరు. భీముఁడు కూడ వీనితో న్యాయ్యముగ పోరాడినచో జయింపఁగలుగుట సంశయాస్పదమే. గదతో యుద్ధము చేయుమని, మాలో ఒకనిని హతుని గావించి రాజువగుమని ఎట్లు మాటాడుచున్నావయ్యా ! ఇంక కౌంతేయులలో ఒక్కఁడు కూడ రాజ్యభాజనుఁడు కాఁడు. మీరందఱు వనవాసముకొఱకో భిక్షావృత్తికొఱకో పుట్టినట్లైనది".

ఇది ధర్మజుని విషయమున పెద్దనిందయే. అయినను ధర్మరాజు తాను చేసినది తప్పు అని గ్రహించుటచే కాఁబోలు కృష్ణునకు సమాధానము చెప్పలేక ఊరకుండెను. అన్న యొక్క వ్యాకులపాటును చూచి భీముఁడిట్లనెను. "కృష్ణా విషాదమునొందకుము. వీనిని సంహరించి తప్పక విజయములను సాధింతును. మీరందఱు ప్రేక్షకులై యుండుఁడు".

శ్రీకృష్ణుఁడు గదాయుద్ధకౌశలమున భీమునికంటె అధికునిగా దుర్యోధనుని ప్రశంసించి, అతని గదాయుద్ధమునందు గల యభిమానమును పదిమందిలో గొప్పగా ప్రకటించి అభిమానశాలియైన యతఁడు భీమునే యుద్ధమునకు ఆహ్వానించునట్లు చేసెననుటయు గమనింపఁదగియే యున్నది.

## దుర్యోధన నిపాతన చమసము

భీమదుర్యోధనులు యుద్ధమునకు సిద్ధపడుచుండఁగా బలరాముఁడు వచ్చెను. ఆయన వారిచే పూజితుఁడై "కురుక్షేత్రము పరమ పుణ్యప్రదమైనది ; అచ్చట దేహత్యాగముఁ గావించువారికి స్వర్గము తప్పక వచ్చును ; కావున శమంత పంచకమున యుద్ధము జరుగుట మేలు" అనెను.

అందఱు సమంతపంచకమునకు వచ్చిరి. భీమదుర్యోధనులు పోరఁజొచ్చిరి. ఇరువురిలో ఎవరు ఏ గుణముచేత అధికులో తెల్పుమని అర్జునుఁడు కృష్ణునడిగెను. ఆయన ఇట్లనెను. "ఇరువురకు ఉపదేశము సమానమే. కాని భీముఁడు బలవత్తరుడు; దుర్యోధనుఁడు నిపుణతరుఁడు ; యత్నవత్తరుఁడు. యుద్ధధర్మమును వీడిననే తప్ప భీముఁడు వీనిని జయింపఁజాలఁడు. దేవతలు మాయచేతనే రాక్షసులను జయించిరి. భీముఁడు కూడ మాయచేతనే వీనిని వధింపవలె.

నేను మరల చెప్పుచున్నాను. ఈ ధర్మరాజు యొక్క అపరాధము చేతనే మరల మనకందఱకును భయము ఏర్పడినది. ఎంతో శ్రమించి మహావీరులైన భీష్మాదులను సంహరించి మనము సంపాదించిన జయము యశస్సు సర్వము ఇప్పుడు సంశయగ్రస్తమైనది. ధర్మజుని యీ బుద్ధిహీనత సామాన్యమైనది కాదు.

పరాజితుఁడై పారిపోయి ప్రాణభయముతో హ్రదమునందు దాగియున్న శత్రువును ప్రాజ్ఞుఁడెవఁడైనను ద్వంద్వయుద్ధమునకు ఆహ్వానించునా ? జూదమునందువలె ఒక్కని జయమునందు రాజ్యమును పణముగావించునా ? అన్యాయముగానైనను భీముఁడు వీనిని వధింపకున్నచో మనము జయించిన రాజ్యము వీని పాలగుట తథ్యము".

శ్లో|| పున రేవ తు వక్ష్యామి పాండవేయ నిబోధ మే |
ధర్మరాజాపరాధేన భయం నః పునరాగతమ్ || 10

శ్లో|| తదేవం విజయః ప్రాప్తః పున స్సంశయితః కృతః |
అబుద్ధి రేషా మహతీ ధర్మరాజస్య పాండవ || 12

శ్లో|| కో న్వేష సంయుగే ప్రాజ్ఞః పున ర్ద్వంద్వం సమాహ్వయేత్ |
అపి నో నిర్జితం రాజ్యం న హరేత సుయోధనః || 18

శ్లో|| ఏవం చే న్న మహాబాహు రన్యాయేన హనిష్యతి |
ఏష వః కౌరవో రాజా ధార్తరాష్ట్రో భవిష్యతి || 20

శల్యపర్వ - అధ్యాయ. 59

ధర్మజాని బుద్ధిహీనతను, మాయావిని మాయచేతనే చంపవలయునను ధర్మమును అర్జునుఁడు అంగీకరించి తన తొడను తట్టుకొనుచు భీమునకు ప్రతిజ్ఞను జ్ఞప్తికి తెచ్చెను. భీముఁడు ఆ సంకేతమును గ్రహించి ప్రతిజ్ఞను తీర్చుకొనుటకు తగిన యవకాశము కొఱకు చూచుచు పోరుచుండెను. దుర్యోధనుఁడు భీముని ప్రహారమును తప్పించుకొని పైకి ఎగిరి పై నుండి భీముని ప్రహరించుటకు వేగముతో వచ్చుచుండెను. అది అవకాశముగా భీముఁడు పైకి దూకుచున్న దుర్యోధనుని యొక్క తొడలపై గదను ప్రహరించెను. దుర్యోధనుఁడు తొడలు విఱిగి నేలపైఁ బడెను.

భీమునియందు పగ ప్రజ్వలించెను. అందువలన అతఁడు క్రుద్ధుడగుచు "ఏకవస్త్రయైన ద్రౌపదిని సభకు ఈడ్చుకొని తెచ్చి గోవు ! గోవు ! అని అప్పుడు

మమ్ము పరిహసించితివి కదా ! ఆఫలమును ఇప్పుడు అనుభవింపుము" అనుచు దుర్యోధనుని శిరస్సును ఎడమకాలితో తన్నెను. మఱియు అతఁడు ఇట్లనెను. "మోసము చేయుట, నిప్పుపెట్టుట, జూదము, మాయందు లేవు. మేము శత్రువులను పరాక్రమముచేతనే బాధించుచున్నాము." పిదపనతఁడు ధర్మరాజుతో ఇట్లనెను. "రజస్వలయైన ద్రౌపదిని సభకు తెచ్చి ఎవరెవరు ఆమెను అవస్త్రను గావింప యత్నించిరో క్రూరులైన యాధార్తరాష్ట్రులందఱును ఆమె యొక్క తపస్సుచేతనే నిహతులైరి".

"గౌః" అనగా ఆవు లేక ఎద్దు. భార్యను పరిభవించుచున్నను ప్రతీకారము చేయక చూచుచు ఊరకుండిన పాండవులు వీరులు కారని జంతువులతో సమానులని దుర్యోధనాదులు పాండవులను పరిహసించి యుండిరి. ఆపగను భీముఁడు ఇప్పటికి తీర్చుకొనినాఁడు.

ధర్మరాజు భీముని వారించి దుర్యోధనుని సమీపించి అతనిని ఓదార్చుచు విలపించెను.

గదాయుద్ధమున ఊరువులపై ప్రహరించుట తప్పని బలరాముఁడు క్రోధముతో నాగలిని గైకొని భీమునిపైకి బయలుదేఱెను. శ్రీకృష్ణుఁడు అన్నను రెండుచేతులతో పట్టి వారించి యిట్లనెను. "అన్నా ! శాంతింపుము. ఆత్మవృద్ధి, మిత్రవృద్ధి, మిత్రమిత్రుని వృద్ధి, శత్రుహాని, శత్రుమిత్రహాని, శత్రుమిత్ర మిత్రహాని, అని ఆత్మవృద్ధి, ఆఱువిధములు. తన విషయమున, మిత్రుల విషయమున హాని సంభవించినప్పుడు దానిని ఆత్మగ్లానినిగా ఎఱింగి వెంటనే దానిని శమింపఁజేయుటకు యత్నింపవలె. పితృసోదరికి పుత్రులైన పాండవులు మనకు సహజమిత్రులు. వీరు కౌరవులచేత అధికముగా వంచింపఁబడినారు. వంచకులను వంచనతో వధించుట ధర్మము.

అదియును గాక ఇందు వంచన ఏమున్నది ? పైకి ఎగిరి వేగముతో తన్ను చంపఁగోరుచున్న వానిని వృకోదరుఁడు గదతో ఊరువులపైకొట్టి భగ్నమొనర్చెను. అతడు నేలపై నిలిచి పోరుచున్నప్పుడు గాని, మండలాకారముగ తిరిగిపోరుచున్నప్పుడు కాని కొట్టలేదు".

శ్లో॥ ఊర్ధ్వ ముత్క్రమ్య వేగేన జిఘాంసంతం వృకోదరః ।
బభంజ గదయా చోరూ న స్థానే న చ మండలే ॥

25, 26 శ్లోకముల మధ్యలోనున్న అధికపాఠశ్లోకములలో ఇది చివరిది.

శల్యపర్వము - గదాపర్వము - బలదేవసాన్త్వనము

అధ్యాయము - 60 - గీతాప్రెస్, గోరఖ్‌పూర్, విక్రమాబ్దము 2014

దీనినిబట్టి గదాయుద్ధమున తొడలపైకొట్టరాదని నియమము నేలపై పోరుచున్నప్పుడు. ఒకస్థానములో నిలిచి కొట్టుచున్నప్పుడు (particular position in the combat) మండలములుగా తిరుగుచున్నప్పుడు మాత్రమే వర్తించును గాని అంతరిక్షమునందున్న వాని విషయమున వర్తింపదని గ్రహింపవలసియున్నది. గదాయుద్ధము నేలపై జరగవలసినది గాని అంతరిక్షమున జరుగునది కాదు. కావున దుర్యోధనుఁడు పైకి ఎగురుటవలన గదాయుద్ధ ధర్మము వాని విషయమున వర్తింపదు.

క్షత్రియునకు ప్రతిజ్ఞాపాలనము కర్తవ్యము. దుర్యోధనుని యూరువులను భగ్నమొనర్తునని పూర్వము సభయందు భీముఁడు ప్రతిజ్ఞచేసియుండెను కదా ! దానిని అతఁడు ఎట్లు తీర్చుకొనకుండును ? మైత్రేయమహర్షి, "నీయూరువులను భీముఁడు గదతో భేదించు" నని దుర్యోధనుని శపించెను. ఆశాపము ఎట్లు వ్యర్థమగును ? కావున. భీముఁడు తన ప్రతిజ్ఞను నిర్వహించుకొనుటలో దోషమేమున్నది ? అన్నా ! శాంతముగ విచారింపుము".

బలరామునకు ఈ మాటలు నచ్చలేదు. తమ్ముని వాదమునకు సమాధానము చెప్పలేక ఆయన, "ఏమైననేమి ! కూటయోధి అని భీముఁడు లోకనిందను పొందుచుండగా ఋజుయోధి యని దుర్యోధనుఁడు కీర్తి నొందగలఁడు" అని రోషముతో వారినందఱను తిరస్కరించి ద్వారకకు వెడలిపోయెను.

అందఱు నిరుత్సాహము నొందిరి. అధోముఖుఁడై చింతాపరుఁడైయున్న ధర్మరాజును చూచి కృష్ణుఁడు, "విచేతనుఁడై పడియున్న యీ దుర్యోధనుని

తలను కాలితో భీముఁడు తన్నుచుండఁగా, అది అధర్మమని తెలిసియు ఏల చూచుచు ఊరకుంటివి ? అని యడిగెను. యుధిష్ఠిరుఁడు ఇట్లనెను. "కృష్ణా ! భీముఁడు చేసినది నాకు ప్రియము కాదు. కాని ధార్తరాష్ట్రులచేత మేము ఎన్నో అవమానములను పొందితిమి. ఆదుఃఖము భీముని యందు తీవ్రముగ నున్నది. అందువలన నేను దీనిని ఉపేక్షించితిని".

తనవారియందు కూడ ధర్మభంగము ఏమాత్రము సంభవించినను శ్రీకృష్ణుఁడు ఉపేక్షింపఁడని దీనివలన వ్యక్తమగుచున్నది.

పాండవులు పాంచాలురు మొదలుగా అందఱు మిగుల సంతోషముతో దుర్యోధనాదులను నిందించుచు భీముని శ్లాఘింపఁజొచ్చిరి. శ్రీకృష్ణుఁడు ఇట్లనెను. "నిహతుఁడైన శత్రువును మరల నిందావాక్యములతో హింసించుట న్యాయము కాదు. ఎప్పుడితఁడు లజ్జాహీనుఁడై లుబ్ధుఁడై సుహృతుల యొక్క హితమును అతిక్రమించెనో అప్పుడే హతుఁడయ్యెను. విదురద్రోణాదులు ఎన్నివిధముల చెప్పుచున్నను ఇతఁడు పాండవులకు వారి తండ్రిభాగము నొసంగలేదు. ఈ పాపాత్ముఁడు ఎట్టకేలకు అనుచరులతో కూడ హతుఁడైనాఁడు. మొద్దువలె పడియున్న వీనినిగూర్చి కంఠశోష కూడ ఎందులకు ? ఇంక రథములనారోహింపుడు పోవుదము".

ఈ తిరస్కారమునకు క్రుద్ధుఁడై దుర్యోధనుఁడు ప్రాణాంతకమైన బాధను సహించుచు, తోక తెగిన పామువలె, నడుమువఱకు లేచి కూర్చుండి బొమలు ముడివైచి కృష్ణునివైపు క్రూరముగ చూచుచు ఇట్లనెను. "కంసదాసపుత్ర ! ఇట్టిపని చేసియును నీకు సిగ్గులేదా ? ఊరువులను భేదింపుమని భీమునకు సన్నచేయుటకు అర్జునుని నీవు కదా ప్రోత్సహించితివి. ప్రతిదినము కుటిలోపాయములచేత భీష్మద్రోణాది మహావీరులను చంపించుచుండిన నీకు దయలేదు, సిగ్గులేదు. మమ్ము ఋజుమార్గమున మార్కొనియున్నచో మీకు విజయము లభించియుండునా ? స్వధర్మానుష్ఠానపరులైన మేము అందఱము కుటిలమార్గముననే మీచే హతులమైతిమి".

శ్రీకృష్ణుఁడిట్లనెను. "పాపమార్గమును అనుష్ఠించుటవల్లనే నీవు సపరివారముగా హతుఁడవైతివి. నీవల్లనే భీష్మద్రోణాదులు నిహతులైరి. నేను వచ్చి ప్రార్థింపఁగా

పాండవులకు వారి భాగము నీయవైతివి. భీమునకు విషము పెట్టించితివి. లక్క యింటియందు వీరిని దహించుటకు యత్నించితివి. మాయజూదమున రాజ్యమును హరించితివి. రజస్వలయైన ద్రౌపదిని సభలో పరిభవించినప్పుడే నిన్ను ఎవఁడైనను వధించియుండవలసినది. నీవల్లనే ఒంటరిగానున్న యభిమన్యుఁడు పలువురిచే వధింపఁబడినాఁడు. మేము ఏయే అకార్యములను చేసితిమని గొంతు చించుకొనుచున్నావో, అవియన్నియు పరమదుష్టుఁడవైన నిన్ను హతుని గావించుటకొఱకే మాచేత అనుష్ఠింపఁబడినవి. బృహస్పతి శుక్రుఁడు మొదలగువారి యుపదేశములను నీవు వినియుండలేదు. వృద్ధులను ఉపాసింపలేదు. హితవాక్యములను వినలేదు. నీవు చేసిన యకార్యములయొక్క విపాకమును అనుభవింపుము".

శ్లో|| సభాయాం యాజ్ఞసేనీ చ క్లిష్టా ద్యూతే రజస్వలా
తదైవ తావ ద్దుష్టాత్మన్ వధ్య స్త్వం నిరపత్రపః || 44

శ్లో|| యా న్యకార్యాణి చాస్మాకం కృతానీతి ప్రభాషసే |
వైగుణ్యేన తవాత్యర్థం సర్వం హి తదనుష్ఠితమ్ || 48

## శల్యపర్వ - అధ్యాయ 63

దుర్యోధనుఁడు శ్రీకృష్ణుని యభియోగములకు సమాధానము చెప్పకుండ తనగుణములను పొగడుకొనెను. "నేను యథావిధిగ అధ్యయనము చేసితిని. అనేకదానములను గావించితిని. సాగరపర్యంతమైన భూమిని పాలించితిని, శత్రువులను జయించితిని. ఇంతకంటెను మేలైన జీవితాంతమును పొందగలవాఁడెవఁడున్నాఁడు? మానుషభోగములను దేవభోగములను ఉత్తమమైన యైశ్వర్యమును పొంది సుహృత్సోదరసమేతముగా స్వర్గమునకు పోవుచున్నాను. ఇంతకంటెను శుభజీవితాంతమును పొందువాఁడెవఁడున్నాఁడు ? కృష్ణా ! మీరందఱు విహతసంకల్పులై శోకించుచుండుఁడు".

అప్పుడు సుగంధపుష్పముల వర్షము కురిసెను. గంధర్వులు మనోహరముగా వాద్యములను ప్రయోగించిరి. అప్సరసలు కురురాజయశమును గానమొనర్చిరి. "బాగు"

"బాగు" అని సిద్ధులు పలికిరి. వాయువు సుగంధముతో మృదువుగా వీచెను. దిక్కులు ప్రకాశించెను. దుర్యోధనునకు కలిగిన పూజను చూచి వారందఱును సిగ్గుపడిరి.

భీష్మాదులు అధర్మముగా చంపఁబడిరన్న విషయమును తలంచుచు పాండవులు దీనులైరి. వారిని చూచి కృష్ణుఁడు ఇట్లనెను. "మహావీరులైన భీష్మాదులను ఋజుయుద్ధమున వధించుట శక్యము కాదు. కావున నేనే మీ యభ్యుదయముకొఱకు అనేకములైన యుపాయములతో మాయాయోగమున వారిని హతులగునట్లు చేసితిని. మాయచేత బలాధికులై వధ్యులైయున్న వారిని మాయోపాయములచేతనే వధింపవలె. అసురులను సంహరించిన దేవతలు కూడ ఈ పద్ధతినే అవలంబించిరి. అధర్మనిగ్రహముకొఱకు సత్పురుషులు అవలంబించుమార్గము ఇదియే. కాబట్టి దేవతలను అనుసరించి మనము కృతకృత్యులమైతిమి. సాయంకాలమగుచున్నది. ఇంక సపరివారముగా నివాసములకు పోయి విశ్రమింతము రండు."

వాసుదేవుఁడు పాంచజన్యమును పూరించెను. పాండవులు పాంచాలురు సింహనాదములు గావించుచు శంఖములను పూరించుచు తమస్కంధావారములకు చేరిరి.

పుష్పవర్షమువలన దేవతల సాధువాదముల వలన, "పాండవులదే అన్యాయము; నిజముగా దుర్యోధనుఁడు ఎంతో గొప్పవాఁడు ; లేకున్నచో దేవతలు ఇట్లు శ్లాఘింతురా?" అని అనేకులు తలంచుటకు అవకాశము కలదు. దుర్యోధనుఁడు తనయందున్న గుణములను పేర్కొనెను. వానిని దేవతలు ఆమోదించుచు ప్రశంసించిరి. అంతమాత్రమున వారు అతనిని నిర్దోషినిగా భావించుచున్నారని చెప్పుటకు వీలు లేదు. ఆ విషయమును వారిని అడిగినచో, వారు కూడ, "అయ్యా! అతఁడు తనగుణములను పేర్కొన్నాఁడు. అవి యథార్థములే కదా ! ఆ గుణములను మాత్రమే ఆమోదించితిమి. అంతమాత్రమున మేము అతఁడు నిర్దోషి అని భావించుచున్నట్లు మీరేల తలంచుచున్నారు?" అని వారు ఎదురు ప్రశ్న వేయుదురు. కావున పుష్పవర్షాదులు దుర్యోధనుని నిర్దోషత్వమును నిరూపింపవు.

ఇందులకు అనేక హేతువులు కలవు. పరమదుర్మార్గుని శత్రువులు వధించునప్పుడు చూచువారికి ఆసమయమున వానియందు జాలి కలుగుట సహజము. అది యొక విధమైన దౌర్బల్యము. భార్యాపరిభవమును నిండుసభలో చూచుచు మరణాధికమైన వ్యథను పొందియుండిన ధర్మరాజే దుర్యోధనుఁడు పడిపోయినంతనే విలపించెనన్నచో తటస్థులైన దేవతలకు వానియందు తాత్కాలికముగా అనివార్యమైన ప్రశంసాభావము జాలికలిగెనన్నచో ఆశ్చర్యపడవలసిన దేమియు లేదు. అయినను ధర్మజుని విలాపమాత్రమున దుర్యోధనుఁడు సజ్జనుఁడని నిశ్చయించుటకు ఎట్లు వీలు లేదో, దేవతల ప్రశంసచేకూడ అట్లు నిశ్చయించుట కుదురదు. ఇది మొదటి కారణము. దేవతల ప్రశంస దుర్యోధనుఁడు పేర్కొన్న గుణములకు మాత్రమే వర్తించును కాని, ఆతని వర్తనమునకు అంతకును వర్తింపదు, అనుట రెండవ హేతువు. అతని గుణములను వారు మెచ్చినారన్నంతమాత్రమున వారు అతనిని నిర్దోషినిగా భావించిరని గ్రహింపనక్కఱలేదు.

గుణప్రసంసామాత్రమున ఉన్న దోషములు లేకుండపోవు. ఒకానొకఁడు హత్యఁగావించి పట్టుబడి న్యాయస్థానమున విచారింపఁబడుచున్నప్పుడు వాని మిత్రులో భక్తులో వాని దానధర్మాదిగుణములను ఎంత ప్రశంసించి వాదించినను, ధర్మాధికారి ఆమాటలను పట్టించుకొనఁడు. నిందితుఁడు నేరమును చేసెనా లేదా అను విషయముపైననే ఆయన దృష్టినుంచును. నిందితుఁడు నేరమొనర్చెనని నిశ్చితమైనంతనే ధర్మాధికారి తగిన దండనమును విధించును. దుర్యోధనుని విషయమున శ్రీకృష్ణుని దృష్టి యిట్టిదే.

ధర్మరాజు శ్రీకృష్ణుఁడు నిరూపించిన పాపకృత్యములలో ఒక్కదానిని కూడ దుర్యోధనుఁడు నిరాకరింపకుండుట మూఁడవ హేతువు. భీష్మాదులను పాండవులు అక్రమముగా చంపినారన్న విషయమునే దుర్యోధనుఁడు ఉద్ఘాటించెను గాని, "మీరు ఆరోపించుచున్న పాపములను నేను చేయలేదు" అని యొక్క పాపకృత్యమును కూడ పేర్కొని నిరాకరింపలేదు. భీష్మాదులను పాండవులు అక్రమముగా సంహరించినారన్నది దుర్యోధనుని నిర్దోషిత్వమును నిరూపింపదు. మఱియును ఈ

పాపకృత్యముల నన్నింటిని దుర్యోధనుఁడు బుద్ధిపూర్వకముగానే చేసినట్లు కృపాచార్యుని సమక్షమున అంగీకరించి యుండుట నాల్గవ హేతువు.

పాండవులు భీష్మాదులను పెక్కు ఉపాయములచేత సంహరించుటలో తప్పు ఏమియును లేదు. బందిపోటు దొంగలను పట్టుకోవలసినప్పుడు వారికి అండగా నున్నవారిని కూడ ఎట్టైనను నిగ్రహింపక తప్పదు. వధ్యుఁడైన దుర్యోధనునకు అండగా నుండుటవలన భీష్మాదులను అక్రమముగానైనను నిగ్రహించుట పాండవులకు కర్తవ్యమేయయ్యెను. బలిష్ఠులైన నిందితులను గాని (convicts), వారి సహాయులను గాని (supporters) నిర్మూలింపవలసి వచ్చినప్పుడు క్రూరమృగములనువలె, ఎప్పుడు ఎట్లు వీలయిన అట్లు సంహరింపవలసినదే కాని, ఆ దండన కార్యమునందు (Police Action or Military Operation) ధర్మాధర్మములను విచారింపవలసిన పనిలేదు.

భీమునకు విషము పెట్టుట, సర్పములచే కఱిపించుట, నిద్రించుచున్న వానిని కట్టి పెద్ద మడుగులో వేయుట, పాండవులను లక్కయింటియందు కాల్పించుటకు పన్నాగము కావించుట మొదలుగా దుర్యోధనుఁడు కావించిన యొక్కొక్కయకృత్యమునకు మరణమే దండమనుట స్పష్టము. ఈ కృత్యములవలన భీముఁడు, అతని సోదరులు చావలేదు కదా అను విషయము ఆకృత్యములయొక్క పాపభారమును తగ్గింపదు. వారు దుర్బలులైనచో మరణించియే యుండెడివారు. అందువలన ఈ మూఁడు హత్యాప్రయత్నములవలన దుర్యోధనునకు మరణశిక్ష తప్పదనుట స్పష్టము.

జూదమునందు ధర్మరాజు తన్ను పణముగా పెట్టుకొని ఓడిపోయినప్పుడు ఆయన దుర్యోధనుని వస్తువులలో చేరిపోయెను. అప్పుడు శకునితో ఆడుటకు ఆటకాఁడు ఏఁడి ? కావున ధర్మరాజు పణమై ఓడినంతనే జూదము ముగిసెను. తరువాత ధర్మరాజు ఆడిన జూదము అక్రమము (Foul Play) కావున అది చెల్లదు. ధర్మరాజు తమ్ములతో ద్రౌపదిని పణముగా పెట్టియున్నచో, అప్పుడామె ధర్మవిజితయై యుండెడిది. అట్లుకాక ఆడుటకు వ్యక్తిత్వము స్వాతంత్ర్యము లేని ధర్మరాజు చేత పందెముగా పెట్టబడి, శకునిచేత గెలుచుకొనఁబడిన ద్రౌపది అధర్మవిజితయయ్యెను.

"ఆట ఆగిపోయినది. ధర్మరాజు ఓడినదంతయు మాదే. ఇంక అతనికి ఆడుటకు అవకాశము లేదు" అని చెప్పి ఆట ముగించవలసినవాఁడు శకుని. శకుని అట్లనక ధర్మరాజునకు ఇంకను ఆడుటకు అనుమతి (permission) నిచ్చుచు ద్రౌపది అను ఒక్క పందెముతో ధర్మరాజు అప్పటికి ఓడినదంతయు గెలుచుకొనవచ్చునని అవకాశమొసంగెను. ఆమాటతో ధర్మరాజునకు ఆశకలిగెను. భీష్మాదులు కూడ అట్లే అనుకొని యుండవచ్చును. ధర్మరాజు గెలిచి ఓడిన దానినంతను మరల పొందగలిగినచో అప్పుడు ద్రౌపదిగాని ధర్మరాజుగాని యితరులు గాని, ఆయాట అక్రమమనిగాని ధర్మరాజు గెలుచుకొన్నదానిని అధర్మవిజిత మని గాని అనియందురా ? అప్పుడు ఆశతో ధర్మరాజు సర్వమును మరల సంపాదించుకొనుటకు ఏకపణముగా ద్రౌపదిని పెట్టి అడినప్పుడు ఓడిపోయినంతనే ఆయాట అక్రమము, ఆమె అధర్మవిజితయు అగునా ?

ద్రౌపది సభకు వచ్చి ఈ ప్రశ్న అడిగినప్పుడు భీష్మాదులు, ధర్మరాజు, "ఆమె అధర్మవిజిత ; ఆమె పాండవులవలె కౌరవులకు దాసికాదు" అని చెప్పలేక పోయిరి. "ఆమె పాండవులకు సాధారణ ధనము, కావున ఆమెను ధర్మజుఁడు పందెమునుగా పెట్టుట చెల్లదు" అని చెప్పిన వికర్ణునివాదము కూడ నిలువదు. సోదరులను వారి ధనములను పణములను పెట్టుట ధర్మమైనప్పుడు అట్లే సాధారణ ధనమైన ద్రౌపదిని పణమునుగా పెట్టుట అధర్మమనుటకు వీలు లేదు. ఈ కారణముచేతనే శ్రీకృష్ణుఁడు కూడ "ద్రౌపది అధర్మవిజిత" అని చెప్పలేదు. కాని ఆమె దుర్యోధనాదులకు దాసియేయైనదనుకొన్నను, దాసియైనను రజస్వలగా నున్నప్పుడు సభకు రమ్మనుట, రాకున్నచో బలవంతముగాఁ జుట్టుపట్టి యీడ్చుకొనివచ్చుట, నిండుసభలో "నీవు మఱియొక భర్తను వరింపుమని పరిహసించుట, తన తొడపై నెక్కుమని దుర్యోధనుఁడు ఆమెకు సైగచేయుట, తుదకు ఆమెను వివస్త్రను గావించుటకు ప్రయత్నించుట పరమఘోరములైన పాపకృత్యములు. వీనినిగూర్చియే శ్రీకృష్ణుఁడు దుర్యోధనాదులను వారి యకృత్యములను ఉపేక్షించిన భీష్మాదులను నిందితులనుగా నిరూపించుచు వధ్యులనుగా భావించెను.

ఇట్టి పాపకృత్యములను ఏ స్త్రీ విషయముననైనను ఎవరును ఎప్పుడును చేయరానియమానుషకృత్యములు. ఆస్త్రీతో ఎట్టి సంబంధములేనివారు కూడ సహింపఁదగినవి కావు. దుర్యోధనాదులు విషయము కాకున్నచో భీష్మాదులు కూడ ఇట్టియపరాధులను చీల్చి చెండాడియుందురు. తమసమక్షమున పాపము జరుగుచుండఁగా సమర్థులైనవారు వారింపక ఉపేక్షించినచో ఆపాపమునవారు భాగస్వాములే అగుదురు. ఈ విషయమును శ్రీకృష్ణుఁడు రాయబారసభలో భీష్మాదుల నుద్దేశించి పాండవుల వాక్యముగా ఉద్ఘాటించెను.

ఉ|| సారపు ధర్మమున్ విమల సత్య మధర్మముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్షసేసి రది వారలచేటగు గాక ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడిన్

ఉద్యోగపర్వ - ఆశ్వాస - 3 - పద్య.273

హత్యాప్రయత్నములవలననే దుర్యోధనాదులు పాండవులకు వధ్యులైరి. పాంచాలీపరిభవసందర్భమున వారు ఎల్లవారికి వధ్యులైరి. భీష్మాదులు యథార్థముగా ధర్మమునే అప్పుడు అవలంబించియున్నచో, దుర్యోధనాదులను ఆక్షణముననే వధించియుండవలసియుండెను. భీష్మాదులు మమకారముచేత అట్లు చేయలేకపోయిరి. వారియీ దౌర్బల్యము నెఱింగియే దుర్యోధనాదులు అట్టి ఘోరకృత్యములను గావింపఁ గలిగిరి. ఆ సభయందు శ్రీకృష్ణుఁడు ఉండినచో వారిని వధించియుండెడివాఁడు. అప్పుడు ఆశిక్ష జరుగలేదు. ఆ శిక్షను ఇప్పుడు ఆయన కురుక్షేత్రమున జరిపినాఁడు. అందువలన కురుక్షేత్ర యుద్ధమంతయు దుర్యోధనాది శిక్షారూపమే. అందువలన దానియందు యుద్ధధర్మముల ప్రసక్తి లేదు. ద్రౌపదినట్లు క్రూరముగ పరిభవించి హింసించిన దుర్యోధనాదులను ఎట్టి చిత్రహింసలతో శిక్షించినను ఆమె పగతీఱునని చెప్పఁజాలము. భాగవతమున ఈ విషయము ముఖ్యముగా నిరూపింపఁబడినది.

శా|| పాంచాలీ కబరీ వికర్షణమహా పాపక్షతా యుష్కులం
చంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి.......

# II. పాండవక్షేమపాలన కమండలువు

## 1. రథప్రదాహ చమసము

ధృష్టద్యుమ్నాదులు శంఖములను పూరించుచు తమశిబిరములకు పోయిరి. పాండవులు శ్రీకృష్ణునితో దుర్యోధనుని శిబిరమునకు పోయిరి. పాండవులు రథములనుండి దిగుచుండఁగా శ్రీకృష్ణుఁడు అర్జునునితో, "గాండీవముతో అమ్ములపొదులతో ముందుగా రథమునుండి దిగుము, పిదప నేను దిగెదను. అట్లయినచో నీకు శ్రేయస్సు కలుగును" అనెను. అర్జునుఁడట్లే చేసెను. పిదప శ్రీకృష్ణుఁడు దిగెను. ఆయన దిగినంతనే ఆ రథమునందు దివ్యధ్వజముగానున్న మారుతి యంతర్ధానము నొందెను. వెంటనే రథము దగ్ధమయ్యెను. పాండవులు విస్మితులైరి.

అర్జునుఁడు శ్రీకృష్ణునకు ప్రణమిల్లి "ప్రభూ! మేము వినఁదగియున్నచో, ఈ రథమెందులకు దగ్ధమైనదో చెప్పుము" అని ప్రార్థించెను. శ్రీకృష్ణుఁడు ఇట్లనెను. "అర్జునా ! ఈరథము ద్రోణకర్ణుల బ్రహ్మాస్త్ర ప్రయోగముచేత ఇదివఱకే దగ్ధమయ్యెను. అయినను నేను దీనిని అధిష్ఠించియుండుటవలన భస్మము కాలేదు. నీవు కృతకృత్యుఁడ వగుటచే బ్రహ్మాస్త్రతేజమును ఇప్పుడు వదలిపెట్టితిని. దానిచే నిది భస్మమైనది".

పిమ్మట శ్రీకృష్ణుఁడు ధర్మరాజును అభినందించుచు ఇట్లనెను. "నేను ఉపప్లావ్యమునకు వచ్చినప్పుడు మధుపర్కము నొసంగి నీవు అర్జునుని నాకప్పగించుచు నా తమ్ముని నీకు సఖుని సోదరునివంటివానిని ధనంజయుని ఆపదలయందెల్లెడల నీవు రక్షింపవలయును అని చెప్పితివి. అట్లే చేయుదును" అని నేను అంగీకరించితిని. ఇతనిని సురక్షితునిగ విజయశాలినిగా నీకు మరల అప్పగించుచున్నాను. నీవు భాగ్యవశమున శత్రువులను జయించి మహారాజువైతివి".

ధర్మరాజు మిగుల సంతోషించి యిట్లనెను. "కృష్ణా ! ద్రోణకర్ణులచేత ప్రయోగింపఁబడిన బ్రహ్మాస్త్రతేజమును నీవు తప్ప మఱియొకఁడు, పురందరుఁడైనను సహింపగలఁడా ? నీయనుగ్రహమున మా శత్రువు లందఱు పరాజితులైరి. అర్జునుఁడు

విజయమునొందెను. నేను నీవు గావించిన మహాకార్యములనుగూర్చి నీతేజోవిశేషమునుగూర్చి వ్యాసభగవానుని అనేక పర్యాయములు అడిగితిని. ఉపప్లావ్యమునందు ఆమహర్షి, "ధర్మము ఏ పక్షమున నుండునో కృష్ణుఁ డాపక్షమున నుండును.. కృష్ణుఁ డేవైపున నుండునో జయము ఆవైపున నుండును".

శ్లో॥ పృష్టో మయా మహాబాహో ! పర్యాయై ర్బహుభి స్తవ
కర్మణా మనుసంతానం తేజస శ్చ గతిం ప్రభామ్ ॥ 31

శ్లో॥ ఉపప్లావ్యే మహర్షి ర్మే కృష్ణద్వైపాయనోఽబ్రవీత్ ।
యతో ధర్మ స్తతః కృష్ణో యతః కృష్ణ స్తతో జయః ॥ 32

శల్యపర్వ - అధ్యాయ 63

యుద్ధమునకు పూర్వమే, వ్యాసభగవానుఁడు ధర్మరాజుతో ఇట్లు చెప్పుటవలన శ్రీకృష్ణుఁడు అవలంబించిన పాండవపక్షము ధర్మయుక్తమైనదని, ధర్మవిజయమును సాధించుటకై అధర్మనిగ్రహముకొఱకు ఆయన పాండవులకు చెప్పినయుపాయము లన్నియు ధర్మసమ్మతములే యని గ్రహింపవలసియున్నది. ధర్మవిషయమున వ్యాసుని వాక్యము వేదవచనమువలెనే ప్రమాణమనుట ప్రసిద్ధము.

## 2. గాంధారీసాంత్వన చమసము

పాండవులు దుర్యోధనుని శిబిరమున ప్రవేశించి వెండి, బంగారు, ముత్యములు మణులు, రత్నములు, కంబళాజినములు రాజ్యోపకరణములు మొదలుగా దాసదాసీజనమును స్వీకరించిరి. శ్రీకృష్ణుఁడు, "మనము మంగళార్థముగ శిబిరమునకు వెలుపల ఈరాత్రి గడుపవలయును" అనెను. అట్లే అని వారు సాత్యకితో కూడ ఓఘవతీనదీ తీరమును చేరిరి.

గదాయుద్ధ ధర్మమునకు విరుద్ధముగా భీముఁడు దుర్యోధనుని తొడలపైఁ గొట్టిన విషయమును విన్నచో గాంధారి శపించునేమోయని ధర్మరాజునకు మహాభయము కలిగెను. ఆమె నెట్లయినను ఉపశమింపఁజేయుట ఆవశ్యకమని ఆయన శ్రీకృష్ణునితో

ఇట్లనెను. "కృష్ణా ! నీయనుగ్రహమున నిష్కంటకమైన రాజ్యము మాకు లభించినది. నీవు సారథ్యమును కూడ చేసి మాకొఱకు వజ్రసన్నిభములగు శస్త్రముల తాడనమును నిందా వాక్యములను కూడ సహించితివి. ఇంత శ్రమపడి నీవు సాధించిన యీ విజయము విఫలము కాకుండునట్లు చూడుము. గాంధారి ఉగ్రతపస్సమన్విత. పుత్రపౌత్త్రాదివధమును విని ఆమె కుపిత యైనచో మమ్ము నిర్దహింపఁగలదు. ఆమెను అనునయించుట మనకు ఇప్పుడు కర్తవ్యము. పరమదుఃఖక్రోధసమన్వితయై యున్నయామెను జూచి మాటాడుటకు నీవు తప్ప మఱియొకఁడు సమర్థుఁడు లేఁడు. నీవు హేతుయుక్తములైన వాక్యములతో ఆమెను శమింపఁజేయఁగలవు. కావున నీవు ఇప్పుడే హస్తినాపురమునకు పోవుట మేలనుకొందును. వ్యాసభగవానుఁడు కూడ అక్కడనే యుండును. పాండవహితార్థివైన నీకు గాంధారీ క్రోధనాశనము అవశ్యకర్తవ్యము."

శ్రీకృష్ణుఁడు వెంటనే హస్తినకు బయలుదేఱెను. అక్కడ వ్యాసమహర్షి ఉండెను. శ్రీకృష్ణుఁడు ఆయనకు ప్రణమిల్లి ధృతరాష్ట్రునకు గాంధారికి నమస్కరించి ధృతరాష్ట్రుని ప్రక్కన కూర్చుండి ఆయనచేతిని గైకొని మాటలాడ లేనంత దుఃఖము కలిగినట్లుగా సుస్వరముతో పెద్దగా రోదనము గావించెను.

కొంతసేపయిన తరువాత నీటితో ముఖప్రక్షాళనము గావించుకొని, ఆచమనమొనర్చి, ధృతరాష్ట్రునితో ఇట్లనెను. "మహారాజా ! జరిగినది జరుగవలసినది; నీకు తెలియని దేమియును లేదు. ద్యూతచ్ఛలమున పాండవులు జయింపఁబడినప్పుడు కులక్షయము జరుగకుండవలయునని నీచిత్తము ననుసరించియే ధర్మరాజా వనవాసమును అజ్ఞాతవాసమును అంగీకరించెను. ఆయొప్పందము పూర్తియైన తరువాత, నీమనస్సునకు కష్టము కలుగకుండ నుండవలయుననియే, అర్ధరాజ్యమునకై పట్టుఁబట్టక ధర్మరాజా నన్ను దూతనుగా పంపి అయిదుగురకు అయిదూళ్ళు ఇచ్చిన చాలునని నిన్ను అభ్యర్థించెను. భీష్మాదులైన పెద్దలందఱు ధర్మజుని యభ్యర్థనమును అంగీకరింపుమని నిన్ను ఎన్నో విధముల ప్రార్థించిరి. ఎవరు ఎన్ని విధముల చెప్పినను నీవు అయిదు గ్రామములనైనను నీ తమ్మునికొడుకులకు ఇచ్చుటకు అంగీకరింపవైతివి. నీయపరాధమువలననే క్షత్త్రియజాతి యంతయు

నాశము నొందినది. నీవంటి ప్రాజ్ఞుడు కూడ ఆసమయమున అంతమోహమును పొందెనన్నచో కాలముయొక్క ప్రభావమే బలిష్ఠమైనదని యనుకోవలసియున్నది. మనము ఎన్ని విధముల ప్రయత్నించినను విధివిధానము ఎట్లు ఉండునో అట్లే జరుగును. నీవు గొప్ప ప్రాజ్ఞుడవు. ధర్మాత్ములైన పాండవులయందు కొంచెమైనను వ్యతిక్రమము లేదని నీవెఱుంగుదువు. ధర్మమును, న్యాయమును, స్నేహమును అవలంబించి ఆవేశరహితముగా నిర్మలబుద్ధితో ఆలోచించి నీ దోషమువలననే ఇది యంతయు జరిగినదని గ్రహించి పాండవులయందు కొంచెమైనను దోషమును భావింపకుము. వారియందు అసూయ నొందకుము. ఇప్పుడు కులము వంశము పిండప్రదానాదికము మొదలుగా నీకు గాంధారికి జరుగవలసిన పుత్త్రకృత్యమంతయు పాండవులయందు ప్రతిష్ఠితమై యున్నది. ఇదియంతయు మీ వ్యతిక్రమమువలననే సంభవించినదని గ్రహించి దుఃఖమును వీడి మీరు పాండవుల విషయమున కోపమును పొందకుఁడు. భరతశ్రేష్ఠా ! నీకు ప్రణమిల్లుచున్నాను. నీయందు ధర్మరాజునకు ఎంత పరమమైన భక్తియున్నదో నివెఱుంగుదువు. తమకు ఎన్నో విధముల అపకారము చేసిన దుర్యోధనాదులను పెద్దయుద్ధమున మహాశ్రమతో సంహరించియు ధర్మరాజు పెద్ద తండ్రిని నిన్ను, మహాభాగయైన గాంధారిని తలంచుచు దివారాత్రములు పరితపించుచు సుఖమును శాంతిని పొందలేకున్నాఁడు. పుత్త్రశోకాభిసంతప్తుఁడవైన నిన్ను చూచుటకు కూడ అతఁడు లజ్జించుచున్నాఁడు".

పిదప శ్రీకృష్ణుఁడు గాంధారివైపు తిరిగి యిట్లనెను. "అమ్మా ! సుబలాత్మజా! నేను చెప్పుదానిని నిర్మలచిత్తముతో గ్రహింపుము. ఈనాఁడు లోకమున నీతో సమానయైన మహానుభావురాలగు మహిళ లేదు. రాజసభయందు నా సమక్షముననే నీవు ధర్మార్థసహితముగా రెండు పక్షములకు హితముగా చెప్పియుంటివి. అయినను నీ కొడుకులు నీమాట వినలేదు. జయమును గోరుచు దుర్యోధనుఁడు నీయొద్దకు వచ్చినప్పుడు, "ఓరి ! మూఢుఁడా ! నామాట వినుము. ధర్మము ఏవైపున నుండునో జయము ఆవైపుననే యుండును" అని నీవు పరుషముగా పలికితివి. అమ్మా ! నీవు అన్నమాటయే జరిగినది. కావున శోకింపకుము. పాండవులపై కోపమును పొందకుము. నీవు తపోబలముచేత సచరాచరమైన పృథివిని దగ్ధమును గావించుటకు సమర్థురాలవు".

గాంధారి యిట్లనెను. "కృష్ణా ! నీవు చెప్పినది నిజమే. దిగుల్లచేత దహింపఁబడుచున్న నాకు మనస్సు చలించినది. నీ మాటలు విన్నతరువాత మరల అది స్వాస్థ్యమును పొందినది. అంధుఁడు హతపుత్త్రుఁడు వృద్ధుఁడును అయిన యీ రాజునకు పాండవులతో కూడ నీవే గతి". అట్లు చెప్పుచు పుత్త్రశోకసంతప్తయై ఆమె పెద్దగా రోదనము గావించెను. శ్రీకృష్ణుఁడు ఆమెను మరల హేతుయుక్తములైన పెక్కువాక్యములతో ఓదార్చెను.

ఆసమయమున శ్రీకృష్ణునకు అశ్వత్థామ సంకల్పించిన యకృత్యము తోఁచెను. వెంటనే త్వరితుఁడై లేచి ఆయన వ్యాసునకు మహారాజునకు పాదప్రమాణము గావించి యిట్లనెను. "మహారాజా ! నేను పోయివత్తును. సెలవిమ్ము. ఈరాత్రి పాండవులను సంహరింపవలె నను పాపబుద్ధి అశ్వత్థామకు కలిగినట్లు తోఁచుచున్నది. అందువలన నేను త్వరగా పోవలసియున్నది." ఆమాట విని గాంధారీ ధృతరాష్ట్రులు, "అట్లయినచో త్వరగా పొమ్ము ; పాండవులను రక్షింపుము. మరల కలిసికొందము" అని చెప్పిరి.

వెంటనే కృతకృత్యుఁడైన శ్రీకృష్ణుఁడు దారుకునితో కూడ పాండవులున్నచోటికి వచ్చెను.

## 3. పాండవ వంశరక్షణ చమసము

దుర్యోధనుని నిపాతనమును విని కృష్ణుఁడు కృతవర్మ అశ్వత్థామ అతనియొద్దకు పోయిరి. దుర్యోధనుఁడు అనేక విధముల విలపించెను. అశ్వత్థామ, "శత్రుసంహారమును ఏయుపాయము చేతనైనను చేయుదును ; నాకు అనుజ్ఞనిమ్ము" అనెను. దుర్యోధనుఁడు కృపునిచే అశ్వత్థామను సేనాధిపతిగా అభిషేకింపఁజేసెను.

కృపకృతవర్మలతో పోయి ఆరాత్రి అశ్వత్థామ పాండవ శిబిరమును ప్రవేశించి పాంచాలు రని ద్రౌపదీపుత్త్రులను సంహరించెను. ధృష్టద్యుమ్నుని సారథి తెల్లవారఁగానే వచ్చి ధర్మజునకు ఆ వృత్తాంతమును చెప్పెను. ధర్మరాజు పెద్దగా విలపించెను. నకులుఁడు ఉపప్లావ్యము నుండి ద్రౌపదిని తీసికొని వచ్చెను. ఎట్లయినను అశ్వత్థామను

నిగ్రహించి ఆతని తలలోని మణిని తెమ్మని తెచ్చువఱకును ప్రాయోపవేశము చేయుదునని ద్రౌపది మహాదుఃఖముతో భీముని తొందఱపెట్టెను. భీముఁడు నకులుని సారథిగా గైకొని వడిగా బయలుదేరి వెళ్ళెను.

శ్రీకృష్ణుఁడు ధర్మజునితో ఇట్లనెను. "నీకు భీముఁడు ప్రియతముఁడు. అతఁడు ఒంటరిగా అశ్వత్థామపైకి పోవుచున్నాఁడు. అట్టివాఁడు ఆపద నొందుచుండగా వెన్నంటి బయలుదేఱవేమి ?

ద్రోణుఁడు బ్రహ్మశిరమను నస్త్రమును ప్రియశిష్యుఁడైన యర్జునునకు ఒసంగినప్పుడు, అశ్వత్థామ మాత్సర్యముతో తనకు కూడ నొసంగు మని తండ్రిని ప్రార్థించెను. కొడుకు దురాత్ముఁడని యెఱింగి ద్రోణుఁడు వానికాయస్త్రము నొసంగుటకు ఇష్టపడక, కుమారుని నిరాకరింపలేక, దాని నెట్లో వానికి ఉపదేశించెను. పిమ్మట ఆయన కుమారుని చూచి, "నీవు సజ్జన మార్గమున వర్తించువాఁడవు కావు ; పరమాపదయందు కూడ నీవు ఈ యస్త్రమును మనుష్యులపై ప్రయోగింపకుము" అని శాసించెను.

అప్రియములైన తండ్రి మాటలకు అశ్వత్థామ సర్వకళ్యాణములయందు నిరాశుఁడై దుఃఖితుఁడై ఇల్లు వదలి భూమియంతయు పర్యటింపఁజొచ్చెను. మీరు వనములయందుండఁగా అతఁడు ద్వారకకు వచ్చి యాదవులచే పూజితుఁడై కొంతకాలముండెను. ఒకనాడు ఏకాంతమందున్న నాయొద్దకు అతఁడు ఒంటరిగా వచ్చి మందహాసముతో, "మా తండ్రి నాకొసంగిన బ్రహ్మశిర మనుమహాస్త్రము కలదు. దానిని గైకొనినాకు చక్రము నొసంగుము" అని యాచించెను. యాచించుచు కృతాంజలియైయున్న యతనిని చూచి ఇట్లంటిని. "నీవు నాకు బ్రహ్మశిరమును ఈయనక్కఱ లేదు. ఇదిగో ధనువు. ఇది శక్తి ; ఇది చక్రము ; గద యిదిగో. వీనిలో నీకు ఏది కావలసినను ఇచ్చెదను. దేనిని నీవు ప్రయోగింపఁగలవో దానిని తీసికొనుము." అతఁడు చక్రమును కోరెను "సరే తీసికొమ్ము" అంటిని. అతఁడు వెంటనే ఎడమచేతితో దానిని పైకి ఎత్తుటకు ప్రయత్నించి సాధ్యముకాక కుడిచేతిని కూడ ఉపయోగించెను. రెండు చేతులతో ఎంతోసేపు ప్రయత్నించి విఫలుఁడై పరిశ్రాంతుఁడై లజ్జించి యూరకుండెను.

నేను అతనిని చూచి, "ఆచార్యపుత్రా ! నాకు అత్యంతము ప్రియతముఁడైన యర్జునుఁడుగాని, నాకుమారుఁడు ప్రద్యుమ్నుఁడు గాని మాయన్న బలదేవుఁడు గాని ఇట్లు అడుగలేదు. నీవు భారతాచార్యపుత్రుఁడవుగా సకలయాదవులకు సమ్మానపాత్రుఁడవైయున్నావు. ఈచక్రముతో నీవు ఎవనితో యుద్ధము చేయఁగోరుచున్నావు ?" అని యడిగితిని. అతఁడు, "కృష్ణా ! ఉన్నసంగతి చెప్పుచున్నాను, ఈ చక్రమును గ్రహించి నీతో పోరాడి అజేయుఁడను కావలయునని తలంచితిని. సరే ! నాయీ కోరిక తీరునది కాదు ; పోయివత్తును ; నాకు మంగళమును ఆశాసింపుము" అనెను. పిమ్మట నతఁడు నావలన అశ్వములను ధనములను రత్నములను గైకొని వెడలిపోయెను.

అతఁడు తొందఱపాటు కలవాఁడు ; చపలుఁడు, క్రూరుఁడు, దురాత్ముఁడు; బ్రహ్మశిరము నెఱింగినవాఁడు. అందువలన భీముని వానినుండి రక్షింపవలె.

పిదప శ్రీకృష్ణుఁడు తనరథమునందు ధర్మజుని అర్జునుని గైకొని సారథియై రథమును వడిగా తోలుచు భీముని అందుకొనెను. మువ్వురును ఎంత చెప్పినను అతడు వెనుకకు మరల లేదు. గంగాతీరమున వ్యాసునియాశ్రమమున అశ్వత్థామ యున్నాఁడని విని భీముఁడు అచ్చటికి చేరెను.

అక్కడ మహర్షి పరివృతుఁడైయున్న వ్యాసభగవానుని యొద్ద అశ్వత్థామ దేహమునకు నేయి పూసికొని కుశచీరములను ధరించి దుమ్ముచే కప్పఁబడినవాఁడై కూర్చుండియుండెను. భీముఁడు వానిపైకి ధనుర్బాణములతో పోవఁజొచ్చెను. అశ్వత్థామ, తన్ను వెదకుచు వచ్చుచున్న భీముని రథమునందున్న శ్రీకృష్ణ ధర్మజార్జునులను చూచి వ్యథనొంది తనయొద్ద ఆయుధమేదియు లేకుండుటచే ఒక యిషీకమును గ్రహించి దానియందు బ్రహ్మశిరమును ఆవహించి "అపాండవ మగును గాక" అని ప్రయోగించెను. దానినుండి ప్రళయమునందువలె, మహాగ్నిజ్వాలలు ప్రభవించెను.

"ద్రోణునిచే నీకు ఉపదేశింపఁబడిన బ్రహ్మశిరమును ఇప్పుడు ప్రయోగింపవలసియున్నది. నీయొక్క నీసోదరులయొక్క రక్షణముకొఱకు దానిని

ప్రయోగింపుము" అని శ్రీకృష్ణుఁ డర్జునుని తొందఱపెట్టెను. అర్జునుఁడు వెంటనే రథమునుండి దిగి ధనువున శరమును సంధించి ముందుగా ఆచార్యపుత్త్రునకు పిదప తనకు తన సోదరులకు ఎల్లరకును స్వస్తి యగునుగాక అని పలికి దేవతలకు గురువులకు నమస్కరించి, అస్త్రము అస్త్రముచేత శమింపవలయు నని బ్రహ్మశిరమును ప్రయోగించెను.

అస్త్రముల తేజస్సులు రెండును భయంకరముగా ప్రజ్వలింపఁజొచ్చెను. వ్యాసనారదులిరువురును వానిమధ్య నిలిచి యస్త్రముల నుపసంహరింపుఁ డని అశ్వత్థామను అర్జునుని ఆదేశించిరి. అర్జునుఁడు వెంటనే అస్త్రమును ఉపసంహరించెను. అశ్వత్థామ దానిని ఊరక ఉపసంహరింపఁజాలక పాండవేయగర్భములను దానికి ఆహుతిగా నొసంగుచు ఉపసంహరింపఁజొచ్చెను. దాని నెఱింగి శ్రీకృష్ణుఁడిట్లనెను. "ఆచార్యపుత్త్రా ! ఒక్క గర్భమును మాత్రము నీవు వదలివేయవలసియున్నది. 'కురువంశములు పరిక్షీణములైనప్పుడు నీగర్భమందున్న శిశువు జన్మించును ; అందువలన అతడు పరిక్షిత్తు అగును. అదియే వాని పరిక్షిత్త్వము.' అని ఉత్తరను చూచి వ్రతశాలియైన యొక బ్రాహ్మణుఁ డనెను. ఆసత్పురుషునివచనము సత్యమే యగును. ఉత్తరకు జన్మించువాఁడు వీరికి వంశకరుఁ డగును".

అశ్వత్థామ అందులకు అంగీకరింపక సంరంభముతో ఇట్లనెను. "కృష్ణా ! నీవు పాండవపక్షపాతమున పలుకుచున్నావు. నీవు అన్నమాట జరుగదు. ఉత్తరాగర్భము కూడ నాయస్త్ర తేజమున నశింపవలసినదే". శ్రీకృష్ణుఁ డిట్లనెను. "నా తపోవీర్యమును చూడుము. పురుషాధమా ! నీయస్త్రతేజమున ఆగర్భము మృతమై జన్మించినను, మరల సప్రాణమగును. ఆ బాలుఁడు చిరకాలము జీవించును. నీవు చూచుచుండఁగనే అతఁడు కృపాచార్యునివలన సకలాస్త్రములను పొంది రాజై అఱువది సంవత్సరములు భూమిని పాలించును. ఇట్లు అనేకపర్యాయములు పాపకృత్యములను గావించుచున్న నిన్ను విద్వాంసులెల్లరును కాపురుషునిగా బాలఘాతకునిగా పాపిష్ఠునిగానే తలంతురు. కావున ఈ పాపకర్మయొక్క ఫలమును పొందుము. ఎక్కడనైనను ఎవరును పలుకరించువారు లేక అసహాయుఁడవై నిర్జనదేశములందు సర్వవ్యాధి సమన్వితుఁడవై

పూయశోణిత గంధముకలవాఁడవై దుర్గమకాంతారములయందు మూఁడు వేల సంవత్సరములు పరిభ్రమించుచుండుము".

వ్యాసభగవానుఁ డిట్లనెను. "ద్రోణపుత్రా ! సద్బ్రాహ్మణుని యాశీర్వచనమును అతిక్రమించుటవలన, క్షత్త్రధర్మము నవలంబించి అందును దారుణములైన పాపకృత్యములను గావించుటవలన నీకు దేవకీనందనుఁడు చెప్పినట్లే జరుగునుగాక!"

అశ్వత్థామ వారివాక్యములను అంగీకరించి నిర్వేదముతో తన శిరస్సునందున్న మణినొసంగి అందఱు చూచుచుండఁగా వనములోనికి వెడలిపోయెను.

గోవిందుని పురస్కరించుకొని పాండవులు ద్రౌపదియొద్దకు వచ్చి ఆమణిని ఆమె కొసంగిరి. ఆమె ప్రాయోపవేశమును వీడి ఆమణిని ధర్మజునకొసంగెను. దానిని ధరించి ఆయన మిగుల శోభించెను.

యుధిష్ఠిరుఁడు కృష్ణుని జూచి, "అశ్వత్థామకు ఒక్కరాత్రిలో ధృష్టద్యుమ్నాది వీరులను ఉపపాండవులను సంహరించుశక్తి ఎట్లు కలిగెను" అని ప్రశ్నించెను. "అశ్వత్థామ పరమేశ్వరుని ప్రార్థించి ఆయనవలన అమోఘమైన పరాక్రమమును పొంది అట్లు విక్రమింపఁగలిగె"నని చెప్పుచు శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుని మహిమను కొనియాడెను.

# 4. ధృతరాష్ట్రక్రోధ చమనము

ధృతరాష్ట్రునియొద్దకు వ్యాసమహర్షి వచ్చి పోయినతరువాత [illegible] విదురుఁడు మృతులకు ప్రేతకార్యములను గావింపు మని ఆయనకుచెప్పిరి. ధృతరాష్ట్రుఁడు గాంధారీకుంత్యాది స్త్రీ జనములతో యుద్ధరంగమునకు బయల్వెడలెను. దారిలో కృపుఁడు, కృతవర్మ, అశ్వత్థామ వారికి ఎదురుగా వచ్చి తాము గావించిన సౌప్తికవధమును చెప్పియుద్ధమును వీడిపోవుచున్నామని వెడలిపోయిరి. కృపుఁడు హస్తినాపురమునకు, కృతవర్మ తన రాష్ట్రమునకు పోయిరి. పాండవులు అశ్వత్థామను నిగ్రహించి శిబిరములకు చేరి, ధృతరాష్ట్రుఁడు స్త్రీలతో యుద్ధరంగమునకు వచ్చెనని వినిరి.

ధృష్టద్యుమ్నాదుల భార్యలతో ద్రౌపదితో పాండవులు బయలుదేరి గంగాతీరమున ఒకచోట స్త్రీపరివృతుఁడై యున్న ధృతరాష్ట్రుని చూచిరి. కౌరవస్త్రీలు పెక్కు విధముల నిందావాక్యములు పలుకుచు రోదనము గావించుచుండఁగా ధర్మరాజు వారిమధ్యనుండి తలవంచుకొని ధృతరాష్ట్రునియొద్దకు పోయి గోత్రనామములను చెప్పుకొని ప్రణమిల్లెను. ఆయన అప్రియముగానే అతనిని కౌఁగిలించుకొని ఆశీర్వదించెను. ఇంక భీముఁడు వచ్చు ననుకొనుచున్నంతనే ధృతరాష్ట్రునియందు క్రోధము ప్రళయాగ్నివలె ప్రజ్వలించెను. శ్రీకృష్ణుఁడు ఈవిషయమును ముందే ఊహించి భీమునియాకృతితో ఇనుపవిగ్రహమును చేయించి అక్కడికి తెప్పించి యుంచెను. భీముఁడు ధృతరాష్ట్రునకు నమస్కరించుటకు ముందుకు వచ్చుచుండఁగా శ్రీకృష్ణుఁడతనిని ప్రక్కకు లాగి ఆవిగ్రహమును ధృతరాష్ట్రుని కౌఁగిటిలోనికి త్రోసెను. ధృతరాష్ట్రుఁడు తన శక్తినంతను ఉపయోగించి ఆ విగ్రహమును భగ్నము గావించెను. ఆప్రయత్నమున వక్షస్థలము మథితమై ధృతరాష్ట్రుఁడు రక్తమును గ్రక్కుచు నేలఁగూలెను. సంజయుఁడు ఆయనను పట్టుకొనెను. అప్పటికి కోపము శమించి ధృతరాష్ట్రుఁడు, "అయ్యో ! భీమా !" అని యంగలార్పఁజొచ్చెను. ఆసన్నివేశమును చూచి అందఱు విస్మితులై విమూఢులై ఏమనుటకు తోఁచక యూరక చూచుచుండిరి.

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో ఇట్లనెను. "మామా ! శోకింపకుము. నీచేత భీముఁడు హతుఁడు కాలేదు. భీమరూపముగల యినుపవిగ్రహము నీచేత భగ్నమైనది. నీవు క్రోధవశుఁడవగుదువని యెఱింగి, మృత్యువు నోటిలోని కోరలవంటి నీ బాహువులనుండి భీముని ప్రక్కకు తొలఁగించితిని. బలమునందు నీతో ఎవ్వఁడును సమానుఁడు కాఁడు. నీ బాహుపీడనము నుండి మానవమాత్రుఁడెవ్వఁడును బ్రతికి బయటపడఁజాలఁడు. అందువలన భీముని యాకృతితో ఇనుపవిగ్రహమును చేయించి తెచ్చి నీకౌఁగిటి యందు ఉంచితిని. పుత్త్రశోకాభితప్తుఁడవైన నీ మనస్సు ధర్మమునుండి తప్పినది. అందువలన నీవు భీముని వధింపఁగోరుచున్నావు. మహారాజా ! ఇది నీకు యుక్తము కాదు. నీవు భీముని సంహరించినంతమాత్రమున నీకుమారులు

బ్రతుకరు. శాంతికొఱకై మేము కావించిన యత్నములన న్నింటిని స్మరింపుము. మాయందు దోషము లేదు. అనివార్యమైన విధికి శోకింపకుము."

పరిచారికలు జలము తీసికొని రాఁగా ధృతరాష్ట్రుఁడు శౌచమును గావించుకొని ఆచమించి స్వస్థచిత్తుఁడై కూర్చుండెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు మరల ఇట్లనెను. "మహారాజా ! నీవు వేదములను వివిధ శాస్త్రములను అధ్యయనముఁ గావించితివి. ఎన్నో పురాణములను రాజధర్మవిశేషములను వింటివి. ఇంతటి విద్వాంసుఁడవు మహాప్రాజ్ఞుఁడవైన నీవు ధర్మాధర్మములయొక్క బలాబలములను ఎఱింగియు స్వయంకృతాపరాధమునకు ఇతరులపై ఎందులకు కోపించుచున్నావు. ఆనాఁడే నేను, భీష్మద్రోణాదులు, విదురసంజయులు నీకు అనేకవిధముల సంధి కంగీకరింపుమని చెప్పియుంటిమి. నీవు అట్లు చేయవైతివి ; మేము వారించుచున్నను, పాండవులు శౌర్యమున బలమునందు అధికులని తెలిసియుండియు యుద్ధమునే అనుమతించితివి; ఇతరులు చెప్పుచున్నప్పుడు ఎవఁడు స్థిరప్రజ్ఞుఁడై తనదోషములను గ్రహించి దేశకాల విభాగము నెఱింగి స్వయముగా కార్యమును నిర్వహించునో అట్టిరాజు పరమమైన శ్రేయమును పొందును. ఇతరులు తనకు శ్రేయమును బోధించుచుండఁగా ఎవఁడు హితాహితములను గ్రహింపఁడో అట్టిరాజు ఆపదలను పొంది శోకించును. నీవు అవిధేయాత్ముఁడవై దుర్యోధనునివశముననుండి అశుభవర్తనుఁడ వైతివి. స్వయంకృతమైన యపరాధమున ఆపదను పొంది ఎందులకు భీముని చంపఁగోరుచున్నావు ? నీవు గావించిన దుష్కృతమును స్మరించి దానికిది ఫలమని గ్రహించి కోపమును నిగ్రహింపుము. క్షుద్రుఁడై పాంచాలిని సభకు తెప్పించిన దుర్యోధనుని దౌష్ట్యమును స్మరింపుము. ఆపగను దీర్చుకొనఁబూనిన భీమునిచే అతఁడు హతుఁడయ్యెను. నీయొక్క నీపుత్త్రునియొక్క ధర్మవ్యతిక్రమమును చూడుము. పాండవులయందు ఏదోషము లేకపోయినను నీవు వారిని పరిత్యజించితివి".

ధృతరాష్ట్రుఁడిట్లనెను. "కృష్ణా ! నీవన్నదియంతయు నిజమే. పుత్త్రప్రేమ నా ధైర్యమును చలింపఁజేసినది. అదృష్టవశమున సత్యవిక్రముఁడైన భీముఁడు నీచేత రక్షితుఁడై నా బాహువులచేత పీడింపఁబడలేదు. ఇప్పుడు నాకోపమంతయు పోయినది;

నిర్మలుఁడనైతిని ; ఇంక భీముని స్పృశింపఁగోరుచున్నాను. బంధువులు పుత్రులు అందఱు గతించిన తరువాత పాండుపుత్రులయందు నాకు ప్రీతి నెలకొనుచున్నది. నాసౌఖ్యము కూడ వారియధీనమైయున్నది."

పిమ్మట భీమార్జున నకులసహదేవులు ధృతరాష్ట్రునకు ప్రణమిల్లిరి. ఆయన వారిని స్పృశించుచు ఆశీస్సుల నొసంగుచు పెద్దగా రోదనము గావించెను.

ధృతరాష్ట్రుఁడు ఇంత క్రౌర్యముతో వర్తించునని అత్యంతము ఆయునకు సన్నిహితులైనవారికి కూడ తోఁచలేదు. శ్రీకృష్ణుఁడు మాత్రమే దీనిని ఊహింపఁగలిగెను. ఆయన దానికి తగినట్లుగా ఇనుపవిగ్రహమును ఉపయోగింపకున్నచో భీముని శరీరము భగ్నమైయుండు ననుటకు సందేహము లేదు. భీముఁడు హతుఁడైనచో పాండవయుద్ధవిజయము ఇంచుమించుగా నిరర్థకమే యగును. దీనినిబట్టి శ్రీకృష్ణుఁడు కార్యనిర్వహణమున ఎంతజాగరూకుఁడో ఎంత కుశలుఁడో స్పష్టమగుచున్నది.

పాపభీతి, లోకనింద, లజ్జమొదలుగా ఎట్టి సంకోచములు లేకుండ ధృతరాష్ట్రుఁడు ఇంత ఘోరమైన క్రౌర్యమునకు బంధుమిత్రజన సమావేశమునందే బాహాటముగా పాల్పడినను పాండవులు గాని, అందులో భీముఁడు కూడ ధృతరాష్ట్రుని ఒక్కమాటయైన అనకుండుట గమనింపఁదగియున్నది. పెద్దలు ఘోరమైన యపరాధమును చేసినను వారిపై వైరమును పూనరాదని, వారిని మందలించునధికారము కూడ పిన్నలకు లేదని దీనివలన వ్యక్తమగుచున్నది.

సాధారణముగా పెద్దలవలన ఏమాత్రము కష్టము కలిగినను, ఆ కష్టమునకు కారణము వారే అని నిశ్చయించి పిన్నలు వారిని నిందించుటకు పూనుకొనుచుందురు. కాని యథార్థమును విచారించి గ్రహించినచో వారట్లు చేయుట అయుక్తమే కాక అసంగతమని కూడ స్పష్టమగును. జీవుల కష్టసుఖములకు వారి ప్రారబ్ధమే కారణము, కాని తల్లి, తండ్రి, గురువు, భర్త మొదలగువారు కారణము కాదు. పెద్దలు సజ్జనులై సుఖమును కలిగించినప్పుడు, దుర్జనులై దుఃఖమును కలిగించినప్పుడు కూడ మన ప్రారబ్ధమే వారి యందు ఏర్పడిన సౌజన్యమునకు గాని దౌర్జన్యమునకు గాని కారణము అని గ్రహింపవలె. మనకు కలుగుచున్న సుఖమునకు వారు ఎట్లు

నిమిత్తమాత్రులో కష్టములకు కూడ అట్లే నిమిత్తమాత్రులే అని గ్రహింపవలె. అట్లు గ్రహించుట వివేకులయొక్క లక్షణము. పెద్దలవలన తమకు కష్టములు కలుగుచున్నప్పుడు వివేకము కలవారు ఆ కష్టములకు కారణము తమపూర్వకర్మయే అని గ్రహించి వారిపై ఆగ్రహమును పూనరు. ఆకస్మికముగా చెట్టుకొమ్మ విఱిగి పైన పడినప్పుడు, ప్రమాదవశమున బండి గోతిలోనికి దొర్లినప్పుడు, అప్పుడు కలుగుచున్న కష్టమునకు చెట్టుకొమ్మను, బండిని కారణముగా భావించి ఎవ్వరును వానిని నిందించుట లేదు. ప్రారబ్ధమువలన అనుభవింపవలసిన యాపదకు అవి నిమిత్తమాత్రములే అని తలంచుచున్నాము. అట్లే పెద్దల విషయమున కలుగు కష్టములకు వారు నిమిత్తమాత్రులే కాని కారణము కాదని గ్రహింపవలసియున్నది. వారివలన కలుగుచున్న యాకష్టములను తప్పించుకొనుటకై వారిని పరిత్యజించినచో ఆ కష్టములు తొలఁగిపోవు. వానిని ఎప్పుడో ఒకప్పుడు ఇతరులవలననైన అనుభవింపవలసియే యుండును. మఱియును పెద్దలను ధిక్కరించి పరిత్యజించుట అనునిప్పటి పాపము ఆప్రారబ్ధమునకు తోడై, అప్పునకు వడ్డీ పెరిగినట్లు ఆ కష్టములను వెనుకటికన్నా తీవ్రతరముగా అనుభవింపవలసియుండును.

మఱి శ్రీకృష్ణుఁడు ఇట్లు మాటాడవచ్చునా ? శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రు[illegible] కుటుంబములోని వాఁడు కాదు. మేనత్తయైన కుంతికి భర్తయైన పాండురాజునకు అన్నయగుటచే ఆయనకు మామ వరుసవాఁడయ్యెను ; పిల్ల నిచ్చిన మామ కాదు. సొంత మేనమామ కాదు. బంధుత్వము దూరమగుటచే శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్ర[illegible] ఇంచుమించుగా తటస్థుఁడే అగును. అయినను శ్రీకృష్ణుఁడు జరిగిన [illegible] గుర్తునకు తెచ్చి ధృతరాష్ట్రుని చర్య ఎంత నింద్యమో, గౌరవమును వీడక, మెత్తని మాటలతో నిరూపించెనేకాని అశ్వత్థామ విషయమునందువలె శపించినట్లు మాటాడలేదు.

క్షత్త్రియుఁడైన శ్రీకృష్ణుఁడు అశ్వత్థామను శపింపవచ్చునా ? అశ్వత్థామను కూడ ఆయన శపింపలేదు. ఆచార్యపుత్త్రుఁడని పాండవులు ఊరకయుండఁగా, ఆయన వాని పాపకృత్యమును వివరించుచు దాని పరిణామమును మాత్రమే నిర్దేశించినాఁడు. అపథ్యాహారమును అమితముగ భుజించిన రోగిని చూచి వైద్యుఁడు,

"నీవు చేసిన యాపనికి ఫలముగా చికిత్సకు సాధ్యము కాని తీవ్రమైన బాధతో అలమటింపవలసినదే" అని చెప్పుట ఎట్టిదో శ్రీకృష్ణుని శిక్షానిరూపణము అట్టిదే. అది న్యాయాధికారి యొసంగు శిక్షా ప్రకటనమువంటిదే కాని శాపము కాదు. ద్రోణుఁడు ఆయనకు గురువు కాఁడు. అందువలన వానివిషయమున కూడ ఆయన తటస్థుఁడే. రెండు పక్షములవారు కలహించుచున్నప్పుడు మధ్యవర్తియైన వాఁడు తీర్పుచెప్పినట్లుగా ఆయన వానిని మందలించెను.

ప్రయాణమై పోవుచున్నప్పుడు, దేశాంతరమునుండి తిరిగివచ్చినప్పుడు, గొప్పకార్యమును ఆరంభించునప్పుడు, అది ముగిసినప్పుడు పెద్దలకు నమస్కరించుట, వారు పిన్నలను కౌఁగిలించుకొని ఆశీర్వదించుట పూర్వము ప్రబలమైన యాచారముగా నుండెనని పై సంఘటనమువలన వ్యక్తమగుచున్నది. అది ప్రబలమైనది కాకున్నచో శ్రీకృష్ణుఁడు అట్లు దృఢముగా ఊహించుటకు ఇనుపవిగ్రహమును తయారు చేయించుటకు అవకాశముండదు. ఈయాచారము దక్షిణదేశమున క్షీణించుచున్నను ఉత్తరదేశమున ఇంకను తఱచుగా కన్పించుచునే యున్నది.

## 5. గాంధారీకోప చమసము

ధృతరాష్ట్రునియనుజ్ఞను పొంది పాండవులు గాంధారియొద్దకు పోయిరి. ఆమె పుత్త్రశత విధ్వంసమును భావించుచు ధర్మరాజును శపింపఁదలఁచుచుండెను. వ్యాసభగవానుఁడు ఆమెయభిప్రాయము నెఱింగి ఆమెయొద్దకు వచ్చి ఇట్లనెను. "గాంధారీ ! పుత్త్రవినాశమునుగూర్చి ఉద్వేగమును పొందకుము. ధర్మము ఏవైపున నుండునో ఆ వైపుననే జయముండునని నీవు యుద్ధము జరుగుచుండిన పదునెనిమిది దినములలో ప్రతిదినము దుర్యోధనుని ఆశీర్వదించునప్పుడు చెప్పితివి. అట్లే ఇప్పుడు పాండవులు జయించిరి. నీమాట ప్రకారము వారియందు ధర్మమున్నదని స్పష్టమగుచుండఁగా వారిపై కోపింతువేమి?"

ఆయన ఇంతగా కోపోపశమనము గావించినను ఆమెకు కోపము పూర్తిగా శమింపలేదు. ధర్మరాజు వచ్చి ఆమెకు నమస్కరించినప్పుడు, ఆయనయొక్క అంగుళ్యగ్రములు నేత్రపటము నుండి ఆమెకు కొంచెముగా కన్పించెను. వెంటనే

ఆయన వ్రేళ్ళగోళ్ళు మాడినట్లయ్యెను. అదిచూచి అర్జునుఁడు భయపడి కృష్ణునివెనుకకు పోయెను. అంతటితో ఆమెయొక్క కోపము శమించెను. అప్పుడు పాండవులు ఆమెకు ప్రణమిల్లి కుంతియొద్దకు పోయిరి.

వ్యాసుని యనుమతితో పాండవులు గాంధారీధృతరాష్ట్రులతో వాసుదేవుని ముందుంచుకొని స్త్రీలతో యుద్ధభూమికి పోయిరి. ఆమహర్షియొక్క ప్రసాదమున దివ్యమైన చక్షుస్సుతో గాంధారి దూరమునందు జరిగిన యుద్ధసన్నివేశములను తనసమీపమున జరుగుచున్నట్లే చూడఁజొచ్చెను. స్త్రీలు యానములనుండి దిగిపరుగున జని తమ భర్తలను సోదరులను తండ్రులను వెదకికొనుచు దొరకిన శవములయొద్ద కూలఁబడి విలపింపఁజొచ్చిరి.

దివ్యచక్షుస్సుచేత ప్రత్యక్షమైన బీభత్సమగు యుద్ధరంగమును, అందు పరిభ్రమించుచు పలువిధముల విలపించుచున్న కోడండ్రను, మనుమలభార్యలను చూచుచు వారి రోదనములను వినుచు గాంధారి కృష్ణుని పిలిచి హతులైన వీరులను వారియొద్ద రోదనముఁ గావించుచున్న స్త్రీలను వర్ణించి చెప్పుచు తానును విలపించుచు సోలుచు తేరుకొనుచుండెను. శ్రీకృష్ణుఁడు ఏమియు మాటాడక ఊరక వినుచుండెను. ఆమె అట్లు విలపించుచు తుదకు వివశయై ధైర్యమును కోల్పోయి క్రోధావిష్టయై యిట్లనెను. "ఓయీ ! కృష్ణా ! నీవు సమర్థుఁడవు ; విపులమైన బలము గలవాఁడవు. రెండు పక్షములలో సమానముగా మాట చెల్లించుకొనుచున్నావు. అట్టి నీవు పాండవులు ధార్తరాష్ట్రులు పరస్పరము క్రుద్ధులై వినాశము నొందుచుండఁగా ఏల ఉపేక్షించితివి? నీవు బుద్ధిపూర్వకముగానే కౌరవుల వినాశమును కోరి వర్తించితివి. దానికి ఫల మనుభవింపుము. పతిశుశ్రూషచే నేను సముపార్జించిన తపోబలముచేత శపించుచున్నాను. జ్ఞాతులు ఒకరినొకరు చంపుకొనుచుండఁగా చూచి యుపేక్షించితివి. కావున నీవు కూడ నీ జ్ఞాతులను వధింతువు. ఇప్పటి నుండి ముప్పదియాఱవ సంవత్సరమున నీవు హతామాత్య పుత్రబాంధవుఁడవై అడవులపాలై కుత్సితముగా వధింపఁబడుదువు. కౌరవస్త్రీలు ఇప్పుడు విలపించుచున్నట్లే యాదవస్త్రీలును విలపింతురు".

ఆ మాటలు విని శ్రీకృష్ణుఁడు మందస్మితముఁ గావించుచు ఇట్లనెను. "అత్తా! నీశాపము పిష్టపేషణము. (పిండిని మఱల నూరుట), యాదవులను సంహరింపఁగలవాఁడు నేను తప్ప మఱియెవ్వఁడును లేఁడు. వారు దేవదానవులకు కూడ అవధ్యులు. అందువలన వారు పరస్పరముగ పోరాడి నశింతురు. లెమ్ము. లెమ్ము. ఇంకను ఏల శోకింతువు ? నీయపరాధము చేతనే అనేకులు నశించిరి. దురాత్ముఁడు, మానీ, ఈర్ష్యాళువు, నిష్ఠురుఁడు, వైరనిలయుఁడు, ధిక్కృతగురుశాసనుఁడు, దుష్కార్యపరాయణుఁడును అయిన నీకొడుకును పురస్కరించుకొని నీవు గావించిన యపరాధమును నాపైన వేసెదవేమి ? మృతుని గూర్చి గాని, కన్పింపకుండ పోయినవానిని గూర్చిగాని, జరిగిపోయిన దానిని గూర్చి గాని శోకించువాఁడు దుఃఖమునుండి మరల దుఃఖమునే పొందును".

ఈమాటలు విని గాంధారి శోకవ్యాకులయై యూరకుండెను. పిమ్మట ధర్మరాజుయొక్క ఆదేశమున విదురాదులు హతులైనవారికి దహనసంస్కారములను గావించిరి. గంగానదియందు ధర్మజధృతరాష్ట్రాదులు స్త్రీలును తమవారికి ఉదకప్రదానము గావించిరి. అప్పుడు కుంతి కర్ణుఁడు తనకు పుత్త్రుఁడని చెప్పెను. ధర్మరాజు దుఃఖించుచు కర్ణునకు కూడ ఉదకప్రదానము గావించెను.

శపించువారు సాధారణముగా, "వారములోపల", "నెల తిరుగకుండ", "సంవత్సరము మారకుండ" ఇట్లు జరుగును అని శపించుచుందురు. కాని గాంధారి ముప్పదియాఱేండ్లకు అని దీర్ఘకాలమైనయవధిని ఏర్పఱచుట వింతగానున్నది. వ్యాసాదిమహర్షుల ప్రసంగములలో ఇట్టి దీర్ఘమైనకాలముయొక్క అవధితో యాదవ వినాశమును గూర్చి వినియుండవచ్చును. అట్లయినచో ఆమె శపించుట ఎందులకు? ఆవినాశసందర్భమున శ్రీకృష్ణుఁడు ఆవిధ్వంసమును చూడకుండ లోకాంతరమునకు యథేచ్ఛగా పోవచ్చును. అట్లు ఆయన ప్రశాంతముగా నిర్యాణమును పొందకుండ, బంధువినాశమును చూచుచు, స్వయముగా స్వజనమును సంహరించుచు యుద్ధమరణమును పొందక, ఆప్తులందఱు నశించినతరువాత నిర్వేదముతో అడవులపాలై ఒక యనామకునిచేత కుత్సితమైన మరణమును పొందవలెనని ఆమె శాపముచేత నియమించుచున్నది. యాదవుల నందఱను విధ్వంసము

నొందించుటకు తపశ్శాలియైన శ్రీకృష్ణుని ఒక్కనినైనను నాశమొందించుటకు ఆమె తపశ్శక్తి చాలదు. అందువలన కాలవశమున సంభవింపఁబోవుచున్న విపత్తులో శ్రీకృష్ణునియొక్క మరణప్రకారమును మాత్రమే ఆమె శాపముచేత నియమించుచున్నది.

"నీయపరాధముచేతనే అనేకులు నశించిరి" అని శ్రీకృష్ణుఁడు అన్నప్పుడు ద్రౌపదీవస్త్రాపహరణసందర్భమును ఆయన స్ఫురింపఁజేయుచున్నాఁడు. అంతఃపురముననుండి అప్పుడు ఆమె దుశ్శాసనుని వారించుటకు ప్రయత్నింపక ఊరకుండెను. ద్రౌపది ఆసమయమున హస్తినాపురమునందు కౌరవుల యంతఃపురములోనున్నది. గాంధారి మహారాజ్ఞి, అంతఃపురేశ్వరి. తనయంతఃపురమునుండి తనయింటికోడలిని తనకొడుకు జుట్టుపట్టుకొని లాగుకొని పోవుచుండగా ఆమె వారింపకుండుట గొప్ప యపరాధము. ఆయపరాధముచేతనే ఆమెకు పుత్త్రవినాశము సంభవించినదని శ్రీకృష్ణుఁడు స్ఫురింపఁజేయుచున్నాఁడు.

## 6. ధర్మజపట్టాభిషేక చమసము

బంధువులకు దహనసంస్కారము ఉదకప్రదానములు గావించినతరువాత పాండవులు ఆశౌచనివృత్తికొఱకు పురమునకు వెలుపల ఒక్క మాసము ఉండిరి. ధర్మరాజు శుద్ధుఁడయ్యెనని యెఱింగి వ్యాసనారదాదిమహర్షులు శిష్యసమేతులై ఆయనను చూచుటకు వచ్చిరి. ఆ భాగీరథీతీరమునందే వా రందఱు ధర్మజుని అర్చితులై సుఖోపవిష్టులై యుండఁగా ఆతని యుద్ధవిజయమును రాజ్యప్రాప్తి నారదుఁడు అభినందించెను. ధర్మరాజు బంధువులమృతికి, ప్రధానముగా కర్ణునిగూర్చి, సంతపించుచు ఆతనికి శాపములు కలిగిన సందర్భములను తెలుపుమని నారదుని కోరెను.

నారదుఁడు కర్ణునివృత్తాంతమును వివరించెను. కుంతియొక్క రహస్యగోపనమువలన భ్రాతృహననరూపమైన దుఃఖము కలిగెనని ధర్మరాజు స్త్రీలకు రహస్యమును కాపాడు సామర్థ్యము లేకుండునట్లుగా శపించెను. ఎంత కోపము వచ్చినను ధర్మరాజు తల్లిని శపింపక పోవుట గమనింపఁదగియున్నది.

తరువాత ధర్మరాజు కర్ణాదులను స్మరించి విలపించుచు తనకు రాజ్యము వలదనెను. అర్జునుఁడు భీముఁడు నకులుఁడు సహదేవుఁడు ద్రౌపది దేవస్థానుఁడనుమహర్షి కృష్ణద్వైపాయనుఁడు అనేక విధముల రాజ్యపాలనము ధర్మరాజునకు కర్తవ్యమని బోధించిరి. ఎంతమంది ఎంత బోధించినను వినక ధర్మరాజు దుఃఖవ్యాకులితచిత్తుఁడై, "నేను పాపనివృత్తికొఱకు ప్రాయోపవేశమును గావించి మరణింతును. మీరందఱు నాకు అనుమతిని ఇచ్చి యథేచ్ఛగా వెడలిపొండు" అనెను. ప్రాయోపవేశమునకు సిద్ధపడుచున్న ధర్మజుని వ్యాసుఁడు నిలిపి మరల అనేక ధర్మములను చెప్పి, "సర్వ ధర్మరహస్యములను తెలిసికొనఁగోరుచున్నచో భీష్మునివలన వినుము" అని చెప్పెను.

అప్పటికిని అతఁడు వ్యాసునివచనమును అంగీకరింపక ఊరకుండెను. ధర్మజునకు నచ్చఁజెప్పుమని అర్జునుఁడు శ్రీకృష్ణుని ప్రార్థించెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు ధర్మజునిచేయి పట్టుకొని నిలిపి, మృతులకొఱకు పరితపించుట వ్యర్థమని నిరూపించుచు, షోడశమహారాజుల కథలను చెప్పెను. అర్జునుఁడు వ్యాసుఁడు మొదలుగా చిన్నలు పెద్దలు ధర్మజునకు బోధించుచుండఁగా శ్రీకృష్ణుఁడు పూనుకొనకుండుట గమనింపఁదగియున్నది. ఒకపనికి తాము సమర్థులమని కొందఱు పూనుకొని పనిచేయుచున్నప్పుడు వారు ప్రార్థింపకుండ ఆపనికి పూనుకొనుట వారిసామర్థ్యమును తక్కువ పఱచినట్లగును. అదియునుగాక వ్యాసభగవానుఁడు కౌరవకుటుంబమునకు పెద్దవాఁడు. తమకందఱకును పూజార్హుఁడు. అట్టివాఁడు బోధించుచుండగా పిన్నలు ఆపనికి పూనుకొనుట ఉచితము కాదు. ఆయన విఫలుఁడై విరమించినతరువాత, అర్జునుని ప్రార్థనమువలననే శ్రీకృష్ణుఁడు బోధింపఁబూనుకొనెను.

శ్రీకృష్ణుఁడు ఇట్లు బోధించెను. "యుధిష్ఠిరా ! ఇంక నీవు ఇంతగా శోకించుట తగదు. వ్యాసభగవానుఁడు చెప్పినట్లు చేయుము. నీ సోదరులు, హతశేషులైన రాజులు, బ్రాహ్మణులు మొదలుగా సకలవర్ణములవారు, నీవు రాజువు కావలయునని కోరుచున్నారు. గురువర్యుఁడైన వ్యాసభట్టారకుఁడు నిన్ను ఆదేశించుచున్నాఁడు. కావున మా యందఱయభ్యర్థనమును వ్యాసభగవానుని నియోగమును పాటించి వెంటనే నగరమున ప్రవేశించి పట్టాభిషిక్తుఁడవు కమ్ము".

యుధిష్ఠిరుఁడు పురమున ప్రవేశించి పట్టాభిషిక్తుఁడై శ్రీకృష్ణుని బహుప్రకారముల స్తుతించెను. మఱునాఁడు ధర్మరాజు శ్రీకృష్ణుని దర్శించుటకు పోయెను. అప్పుడాయన మణివిరాజితమైన పర్యంకమునందు కూర్చుండియుండెను. ధర్మజుఁడు ప్రాంజలియై సమీపించి, "కృష్ణా ! రాత్రి నీకు నిద్ర చక్కఁగా పట్టినదా" అని ప్రశ్నించెను. ధ్యానమునందున్న శ్రీకృష్ణుఁడు ఏమియు మాటాడలేదు. కొంతసేపైన తరువాత ఆయన ధ్యాననిష్ఠను వీడి జాగ్రద్దశను పొంది ధర్మజుని ఆదరించి ఇట్లనెను. "భీష్ముఁడు ఆర్తుఁడై ఏకాగ్రమైన బుద్ధితో నన్ను శరణము పొందుచున్నాఁడు. అందువలన నేను కూడ ధ్యానముచేత ఆయనను చేరియున్నాను. ఆయన అస్తమించినచో సకలధర్మతత్త్వములవిజ్ఞానము అస్తమించినట్లగును. అందువలన నీవు ఆయననుండి సకలధర్మతత్త్వ విజ్ఞానమును సంపాదింపుము". ధర్మజుఁడు, "నిన్ను పురస్కరించుకొని ఆయనయొద్దకు పోఁదలంచుచున్నాను" అనెను.

# II. భీష్మప్రవచన కలశము

## 1. భీష్మభక్తి కమండలువు

### i. భీష్మానుగ్రహ చమసము

శరతల్పగతుఁడై యున్నభీష్ముఁడు వ్యాసనారద వసిష్ఠకౌశికాదిమహర్షులచే పరివృతుఁడై కృష్ణుని ధ్యానించుచు హృష్టపుష్టమైనస్వరమున స్తుతించెను. దానిని విని మహర్షులందఱును శ్రీకృష్ణుని స్తుతించుచు భీష్ముని ప్రశంసించుచుండిరి. భీష్మునిభక్తికి వశుఁడై వాసుదేవుఁడు ధర్మరాజాదులతో ఆకురువృద్ధుని యొద్దకు బయలుదేరెను.

మార్గమునందు శ్రీకృష్ణుఁడు పరశురామహ్రదములను అయిదింటిని ధర్మజునకు చూపి భార్గవునియొక్క చరిత్రమును వివరించెను. ఓఘవతీనదికి సమీపమున శరతల్పమునందున్న భీష్ముని దూరమునుండియేచూచివారు రథములు దిగి నడచిపోయి మహర్షులకు అభివాదనము గావించి భీష్మునకు నమస్కరించి చుట్టును కూర్చుండిరి.

శ్రీకృష్ణుఁడు ఆయనను సంబోధించి యిట్లనెను. "కురుప్రవీర ! జ్ఞానవిషయములన్నియు పూర్వమువలె స్మృతియందున్నవా ? అయ్యా ! నీ బుద్ధి వ్యాకులము కాలేదుగదా ! శరాభిఘాతమువలన శరీరమున వ్యథ కలుగుట లేదా! దేహమునందు చిన్న శల్యము గ్రుచ్చుకొన్నను ఎంతో బాధ కలుగును. ఇంక శరసంఘాతములచేత నిండియున్న నీ శరీరమునకు ఎంత బాధ కలుగుచున్నదో చెప్ప శక్యమగునా ! భూతభవిష్యద్వర్తమాన విజ్ఞానమంతయు నీయందు ప్రతిష్ఠితమై యున్నది. నీవు ధర్మమయనిధివి. పురుష శ్రేష్ఠుఁడవై సంపన్నములైన రాజభోగములనడుమ స్త్రీసహస్రపరివృతుఁడవై ఊర్ధ్వరేతస్కుని వలె ఉంటివి. బ్రహ్మచర్యమున తపస్సున యజ్ఞమున ధనుర్వేదమున వేదమున నీతియందును నీవంటివాఁడు ముల్లోకములలో ఎవఁడును లేఁడు. నీవు ఒక్కఁడవు గంధర్వామరాసురయక్షరాక్షసుల నందఱను జయింపఁగలవు. మనష్యులలో ఇన్నిగుణములు కలవానిని నేను ఎక్కడను చూడలేదు. వినియుండలేదు. ఈ గుణములచేత నీవు దేవతలను కూడ అతిశయించుచున్నావు. కావున బంధువినాశముచేత దుఃఖించుచున్న ధర్మజునకు ధర్మతత్త్వవిశేషములను బోధించి దుఃఖమును తొలఁగింపుము. ఏవిషయమునందైనను సంశయములను ఛేదించి విజ్ఞానమును కలిగించుటకు సమర్థుఁడు నీవు తప్ప మఱియెవ్వఁడును లేఁడు. ఈ మనుమని అనుగ్రహింపుము".

భీష్ముఁడు ముఖమును కొంచెముగా పైకెత్తి ప్రాంజలియై శ్రీకృష్ణుని స్తుతించి, "దేవదేవా ! నీకు భక్తుఁడను, ప్రపన్నుఁడను అయిననాకు ఏది శ్రేయస్కరమో దానిని తలంపుము" అనెను. శ్రీకృష్ణుఁడు భీష్ముని సాదరముగా చూచుచు ఇట్లనెను. "గాంగేయా ! నీకు నాయందు పరమభక్తి యుండుటవలన నేను నీకు నా దివ్యమైన దేహమును చూపితిని. అభక్తునకు అశాంతునకు, అన్బుజావర్తనునకు నా స్వరూపమును చూపను. నీవు భక్తుఁడవు, ఋజువర్తనుఁడవు, తపోదానాదినిరతుఁడవు. నీ తపస్సు చేతనే నీవు నన్ను చూచుటకు అర్హుఁడవు. ఇంక ఏఁబదియాఱు దినములే నీ జీవితమున మిగిలియున్నవి. తరువాత శరీరమును త్యజించి శుభకర్మల ఫలమును పొందుదువు. దేవతలు వసువులు నీకొఱకు ప్రతీక్షించుచు విమానములలో వచ్చి

అంతర్హితులైయున్నారు. సూర్యుఁడు ఉత్తరాయణమును పొందినంతనే విద్యాఫలము పొందఁదగిన పునరావృత్తి రహితములైన లోకములను పొందుదువు.

నీవు పరలోకగతుఁడవైనంతనే ఈ లోకమునే అఖిలజ్ఞానము నశింపఁగలదు. అందువలన ధర్మ వివేచనముకొఱకు వీరందరును నీయొద్దకు వచ్చియున్నారు. ధర్మరాజు బంధుసంక్షయము వలన దుఃఖముచేత పీడితుఁడై సత్యమును తెలిసికోఁగోరుచున్నాఁడు. ఆయనకు కలిగిన సందేహములను ధర్మార్థయుక్తములైన సమాధానములతో పోఁగొట్టి సత్యమును తెలిపి శోకమును పోఁగొట్టుము.

శ్లో|| అర్హ స్త్వం భీష్మ మాం ద్రష్టుం తపసా స్వేన పార్థివ |
తవ హ్యుపస్థితా లోకే యేభ్యో నావర్తతే పునః || 13

శ్లో|| పంచాశతం షట్చ కురుప్రవీర శేషం దినానాం తవ జీవితస్య |
తత శ్శుభైః కర్మఫలోదయై స్త్వం సమేష్యసే భీష్మ విముచ్య దేహమ్ || 14

శ్లో|| ఏతే హి దేవా వసవో విమానా న్యాస్థాయ సర్వే జ్వలితాగ్నికల్పాః |
అంతర్హితా స్త్వామ్ ప్రతిపాలయన్తి కాష్ఠాం ప్రపద్యంత ముదక్పతంగమ్ || 15

శ్లో|| వ్యావర్తమానే భగవత్యుదీచీమ్ సూర్యే జగత్కాలవశం ప్రపన్నే |
గంతాసి లోకాన్ పురుషప్రవీర నావర్తతే యా నుపలభ్య విద్వాన్ || 16

శ్లో|| అముం చ లోకం త్వయి భీష్మ యాతే జ్ఞానాని నక్ష్యం త్యఖిలేన వీర |
అతస్తు సర్వే త్వయి సన్నికర్షం సమాగతా ధర్మవివేచనాయ || 17

శ్లో|| తద్ జ్ఞాతిశోకోపహతశ్రుతాయ సత్యాభిసంధాయ యుధిష్ఠిరాయ |
ప్రబ్రూహి ధర్మార్థసమాధియుక్తం సత్యం వచో౽స్యాపను దాశు శోకమ్ || 18

శాంతిపర్వము - అధ్యాయము 51

భీష్ముని సంహరింతునని శ్రీకృష్ణుఁడు చక్రమును బట్టినసందర్భమున ఆయనను గూర్చి యిట్లనెను. భూమియందు ఈ ప్రజాక్షయమునకంతకును నీవు మూలము. ఇప్పుడు నీవు దుర్యోధనుని సమర్థించుచున్నావు. దుర్ద్యూతమున

క్రీడించుచున్న రాజును ధర్మపథమందున్న మంత్రి నివారింపవలె. అట్లు అతఁడు నివారింపఁబడక విపరీతబుద్ధియై ధర్మమును అతిక్రమించి కులపాంసనుఁడైనచో అట్టిరాజును పరిత్యజింపవలె". ఇట్లు పలుకుచు శ్రీకృష్ణుఁడు అప్పుడు భీష్ముని అపరాధిగా నిరూపించియుండెను. కాని ఇప్పుడు ఆయనయే, "మనుష్యులలో ఇన్ని గుణములు కలవానిని నేను ఎక్కడను చూచియుండలేదు ; వినియుండలేదు. ఈ గుణములచేత నీవు దేవతలనుకూడ అతిశయించుచున్నావు!" అని ప్రశంసించుచున్నాఁడు. శ్రీకృష్ణుఁడు ఇట్లు పూర్వాపరవిరుద్ధముగా మాటాడుట తగునా ? ఇందు వైరుధ్యము ఏమియు లేదు. భీష్మునియందు ఎన్నో గుణములు ఉన్నట్లే కొన్ని దోషములు కూడ ఉన్నవి. మహాపురుషులయందు దోషమే ఉండదని, దుర్జనులయందు ఒక్కగుణము కూడ ఉండదని చెప్పఁజాలము. శిక్షింపవలసినప్పుడు దోషములను పూజింపవలసినప్పుడు గుణములను చెప్పుట న్యాయము. భీష్ముఁడు దుర్యోధనుని ప్రీతికొఱకు ధర్మపక్షమైన పాండవులబలమును నిర్మూలించుచు విక్రమించుచుండఁగా ఆయనయొక్క ఉత్సాహశక్తిని నిగ్రహించుటకై ఆయనయందున్న దోషాచరణమును శ్రీకృష్ణుఁడు నిరూపించెను. ఆ హెచ్చరికను గ్రహించి తాను యుద్ధమును విరమించుటకు ఉపాయమును ధర్మరాజునకు చెప్పి, శరతల్పగతుఁడై అధర్మపక్షమునకు దౌర్బల్యమును ధర్మపక్షమునకు ప్రోత్సాహమును కలిగించి, పశ్చాత్తాపముతో తన్నే శరణమును పొంది అర్హుఁడై పరమభక్తితో స్తుతించుచున్న భీష్మునియందు గుణములనే శ్రీకృష్ణుఁడు ప్రశంసించుట సమంజసమే యగును.

శ్రీకృష్ణుఁడు భీష్మునితో నాఁటినుండి ఏఁబదియాఱు దినములు (పంచాశతం షట్ చ) ఆయన ఉండగలఁడని చెప్పెను. కాని భీష్ముడు శరీరమును త్యజించు దినమున యుధిష్ఠిరునితో "నిశితాగ్రములైన శరములయందు శయనించియున్న నాకు ఇప్పటికి ఏబదియెనిమిది దినములు వర్షశతమువలె గడచినవి" అని చెప్పెను.

శ్లో॥ అష్టపంచాశతం రాత్ర్య శ్శయానస్యాద్య మే గతాః
శరేషు నిశితాగ్రేషు యథావర్షశతం తథా ॥ 27

ఆనుశాసనిక - అధ్యాయ 167

ఇచ్చట నీలకంఠాచార్యుఁడు "పంచాశతం షట్చ" అను పదములకు "పంచ, షట్, చ, ఆశతమ్" అను విభాగమును ఏర్పఱచి "పంచషట్" అనగా అయిదారులు ముప్పది అని, "ఆశతం చ" అనగా "నూటికి లోపల లెక్కించునప్పుడు" అని యర్థమును చెప్పెను. ఇట్లు చెప్పినచో భీష్ముడు చెప్పఁబోవుచున్న యేబది యెనిమిది దినములలో ఇరువదియెనిమిది దినములు గతించి, ఇంకను ముప్పదిదినములు జరుగవలసియున్న దను నర్థమేర్పడును. అనగా శ్రీకృష్ణుఁడు ఈమాట చెప్పునప్పటికి భీష్ముఁడు శరతల్పమున పడిననాఁటినుండి ఇరువదియెనిమిది దినములు గడచిన వన్నమాట. భీష్ముఁడు శరతల్పగతుఁడైన తరువాత యుద్ధము ఎనిమిది దినములు జరిగినది. అప్పటినుండి యుయుత్సునకు దుర్యోధనునకు సంబంధించిన యాశౌచము పదునాఱు దినములు జరిగెను. యుయుత్సుఁడు ధృతరాష్ట్రునకు వైశ్యస్త్రీయందు జన్మించినవాఁడు, దుర్యోధనునకు తమ్ముఁడు. యుద్ధారంభముననే ఇతఁడు వచ్చి పాండపక్షమున చేరెను. వైశ్యునకు ఆశౌచము పదునైదుదినములు. కాఁబట్టి ఇతనికి పదునాఱవ దినమున శుద్ధియైనది. పాండవులకు ముందుగానే శుద్ధి సంభవించినను వారు అతనిని వదలి పురమునందు ప్రవేశించుట కుదురదు. అందువలన వారు యుయుత్సుఁడు శుద్ధినొందువఱకు వేచియుండఁగా ఎనిమిదితో పదునాఱు జరిగి ఇరువదినాలు దినములైనవి. ఇరువదియైదవదినమున ధర్మరాజు ఎల్లరకు శ్రాద్ధదానము గావించి, ఇరువదియాఱవదినమున పురమున ప్రవేశించెను. ఇరువదియేడవ దినమున పట్టాభిషేకము, ఇరువదియెనిమిదవ దినమున ధర్మరాజు పౌరముఖ్యులను మంత్రులను ఓదార్చి అభ్యుదయికములైన దానములను గావించెను. ఇరువది తొమ్మిదవ దినమున ధర్మజవాసుదేవాదులు భీష్మునియొద్దకు పోయిరి. ఆదినముతో కూడ అప్పటినుండి భీష్ముఁడు ముప్పది దినములు జీవించియుండు ననుట కుదురును.

నీలకంఠీయము - శ్లో. 14. పంచాశత మితి, పంచాశత షట్చేతి తవ జీవితసంబంధినాం దినానాం శేషమ్ పంచ షట్చ, పంచవారమావర్తితాః షడితి రీత్యా త్రింశ దితి జ్ఞేయమ్ । తావదేవ శతం శతావధి యద్దినానాం శతేన శక్యం తత్త్రింశతాపి కర్తుం శక్య మిత్యర్థః । శ్లో॥ అష్టపంచాశతం రాత్ర్య శ్శయానస్యాద్య మే గతాః" ఇతి భీష్మో వక్ష్యతి। తత స్త్రింశత్ రాత్రయః పరం శిష్టాః, అష్టావింశతి రితః పూర్వం

వ్యతీతాః ఇతి జ్ఞేయమ్. భీష్మస్య శరతల్పశయనానంతరం అష్టాదినాని యుద్ధమ్, తతో దుర్యోధనాశౌచం యుయుత్సోః షోడశదినాని తేన సహపురం ప్రవిశతాం పాండవానా మపి తావన్తి దినాని | పంచవింశే సర్వేషాం శ్రాద్ధదానమ్, షడ్వింశే పురప్రవేశః, సప్తవింశే రాజ్యాభిషేకః అష్టావింశే ప్రకృతి సాంత్వన మాభ్యుదయికదానం చ. ఏకోనత్రింశే భీష్మం ప్రతి ఆగమనమ్ | తత్ దిన మారభ్య త్రింశ ద్దినాని శిష్టాని ఇతి జ్ఞేయమ్ |

భీష్ముఁడు ప్రాంజలియై శ్రీకృష్ణునితో ఇట్లనెను. "వాసుదేవా ! నీమాటలవలన నాకు సంతోషము కలుగుచున్నది. దేవరాజ సమీపమున దేవలోకమునుగూర్చి చెప్పఁబూనుకొనునట్లు సర్వజ్ఞుఁడవైన నీ సమక్షమున ధర్మతత్త్వములగూర్చి, గురువు సన్నిధిలో శిష్యునివలె, నేనేమి చెప్పఁగలను ? అదియునుగాక శరములవ్యథచేత నా శరీరము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి భ్రాంతము లగుచున్నవి. కృష్ణా ! నేనిప్పు డేమియు చెప్పఁజాలను. యుధిష్ఠిరునకు కావలసిన విషయముల నన్నింటిని నీవే చెప్పుము".

శ్రీకృష్ణుఁడు ఇట్లనెను. "వీరాగ్రేసరా ! నీవిట్లనుట యుక్తముగానే యున్నది. అయినను బాణఘాతములవలన నీకు బాధ శ్రమ లేకుండునట్లు, జ్ఞానములన్నియు నీ బుద్ధియందు ప్రతిభాసించునట్లు, స్వచ్ఛమైన జలమునందు చేప సర్వమును చూడఁగలిగినట్లు, దివ్యమైన చక్షుస్సుతో నీవు సకలభూతముల వ్యవహారములను చూడఁగలుగునట్లు వరమును ఇచ్చుచున్నాను".

ఆమహోదారతను చూచి వ్యాసాదులైన మహర్షు లందఱు శ్రీకృష్ణుని వేదమంత్రాత్మకములైన వాక్కులతో అర్చించిరి. పుష్పవర్షము కురిసెను. దివ్యదుందుభులు మ్రోఁగెను. అప్సరసల నృత్యగానములు విలసిల్లెను. ఇంతలో దివాకరుఁడు పశ్చిమదిశయందు అరుణకాంతులను విరజిమ్మఁజొచ్చెను. సాయంసంధ్య నుపాసించుటకై మహర్షు లందఱు త్వరపడుచు లేచి శ్రీకృష్ణునియొద్ద భీష్మునియొద్ద సెలవు తీసికొని, "రేపు మరల సమావేశమగుదుము" అని చెప్పుచు వెడలిపోయిరి. పాండవులు శ్రీకృష్ణునితో భీష్మునకు ప్రదక్షిణముఁ గావించి సెలవుఁగైకొని హస్తినాపురమునకు వెడలిపోయిరి.

# 2. శ్రీకృష్ణదినచర్యా చమసము

శ్రీకృష్ణుఁడు విడిదియందు నిద్రించి తెల్లవారుటకు అర్ధయామమునకు ముందు మేల్కొని ధ్యానమార్గమున సర్వజ్ఞానములను అవలోకించి పిమ్మట సనాతనమైన బ్రహ్మమును ధ్యానించెను.

శ్లో|| తత శ్శయన మావిశ్య ప్రసుప్తో మధుసూదనః
యామమాత్రార్ధశేషాయాం యామిన్యాం ప్రత్యబుధ్యత ||

శ్లో|| స ధ్యానపథ మావిశ్య సర్వజ్ఞానాని మాధవః |
అవలోక్య తతః పశ్చా ద్దధ్యౌ బ్రహ్మ సనాతనమ్ || 2

శాంతిపర్వము - అధ్యాయ 53

శ్రీకృష్ణుని దినచర్యావిశేషములనుబట్టి జీవన్ముక్తుఁడై లోకమున వ్యవహరించుచుండు మహాపురుషుని దైనందిన కార్యక్రమము ఎట్లుండునో మనము గ్రహింపవచ్చును.

అధర్మనిగ్రహముకొఱకు ధర్మసంస్థాపనము కొఱకు అవతరించుచు క్షత్రియశరీరమును పొందిన శ్రీకృష్ణుఁడు సంన్యసించుటకు వీలులేదు. అందువలన పరమహంస పరివ్రాజకునివలె అవధూతవలె ఆయన లోకవ్యవహారమునకు దూరుడై బ్రహ్మనిష్ఠుఁడై యూరకయుండుటకు వీలులేదు. భూదేవియొక్క ప్రారనమున భూభారమును తొలఁగించుటకై అవతరించిన యాదేవదేవుఁడు ఇంచుమించుగా ప్రతిదినము దుష్టశిక్షణ శిష్టరక్షణము ధర్మసంస్థాపనము మొదలగు[illegible] ఒకకార్యక్రమమునందు పాల్గొనుచుండుట తప్పదు. అందువలన శరీరేంద్రియములకు నిద్ర ఆవశ్యకమైనట్లే, నిద్రనుండి మేల్కొనిన తరువాత దైనందిన కార్యక్రమములను ఆరంభించుటకు ముందు, శరీరమునకు వ్యాయామమువలె, మనస్సునకు ధర్మచింతనము తత్త్వధ్యానము ఆవశ్యకములు. ఒకయంత్రమును ఉత్తమస్థాయిలో పనిచేయించుటకు ప్రతిదినము దానికి కావలసిన తైలము ఇంధనము (oil and fuel) ఎట్లు ఆవశ్యకమో, అట్లే మనస్సునకు కూడ తగిన పుష్టి నొసంగుట ఆవశ్యకము. ఆ పుష్టి బ్రాహ్మముహూర్తమునందు ధ్యానమువలన లభించును.

ఇందు శ్రీకృష్ణుఁడు ధ్యానమున సర్వజ్ఞానములను అవలోకించి అనంతరము బ్రహ్మమును ధ్యానించెనని చెప్పఁబడియున్నది. (శ్లో.2) సర్వజ్ఞానములనఁగా ఏవి? మహాయోగులు ధ్యానింపఁ దలఁచుకొన్నప్పుడు వేదవిహితమైన జ్ఞానములనే ధ్యానింతురు. ధర్మము తత్త్వము అని వేదవిహితమైన జ్ఞానమంతయు ప్రధానముగా రెండు విధములుగానున్నది. ఆయన సర్వజ్ఞానములను అవలోకించి అనంతరము బ్రహ్మమును ధ్యానించెననుటవలన ఆయన అవలోకించిన సర్వజ్ఞానములు బ్రహ్మమున కంటె భిన్నములని స్పష్టమగుచున్నది. దీనినిబట్టి ఆయన ముందుగా వేదవిహితములైన ముఖ్యధర్మ విశేషజ్ఞానములను అన్నింటిని స్మరించి, పిమ్మట స్వరూపమైన బ్రహ్మమును ధ్యానించెనని వ్యక్తమగుచున్నది. ధర్మసంస్థాపనముకొఱకు అవతరించిన మహాత్ములు, జీవన్ముక్తులైనను, లోకులకు ధర్మమును బోధించుచు, వారిని ఆ ధర్మమునందు ప్రవర్తింపఁజేయవలసి యుండుటచే వారు ధర్మవిశేషములను స్మరించుచుండుట ఆవశ్యకమే. వారికి బ్రహ్మధ్యానము మాత్రమే చాలదు. వ్యవహారమునందు ధర్మనిరూపణము కొఱకు వివిధధర్మములజ్ఞానములు బుద్ధియందు నిత్యము భాసించుచుండవలె. బ్రహ్మజ్ఞానము కలిగినంతమాత్రమున వ్యావహారికమైన సర్వధర్మజ్ఞానము కలుగదు. బ్రహ్మవేత్తలందఱు సర్వధర్మవేత్తలై యుండరు. అందువలననే బ్రహ్మవేత్త లందఱును ధర్మస్థాపనమున అధికారము కలవారై యుండరు. అట్టియధికారము కలవారు జీవన్ముక్తులయ్యును బ్రహ్మధ్యానముతోపాటు ధర్మజ్ఞానచింతనము కూడ చేయుచుందు రని శ్రీకృష్ణ భగవానుని దినచర్యాక్రమమును వర్ణించుచు వ్యాసభగవానుఁడు నిరూపించుచున్నాఁడు.

శ్రీకృష్ణుఁడు మంగళగీతవాదిత్రనిస్వనములను వినుచు లేచి స్నానము చేసి ప్రాంజలియై గుహ్యమైన మంత్రమును జపించి, అగ్నులను ఆరాధించి, చతుర్వేదవిదులైన విప్రులకు వేయిమందికి ఒక్కొక్కనికి వేయి గోవుల నొసంగి వారివలన స్వస్తివాచనము చెప్పించుకొనెను. గుహ్యమనఁగా గాయత్రి అనియే గ్రహింపఁదగును.

శ్లో॥ తత ఉత్థాయ దాశార్హః స్నాతః ప్రాంజలి రచ్యుతః ।
జప్త్వా గుహ్యం మహాబాహు రగ్నీ నాశ్రిత్య తస్థివాన్ ॥ 7

శ్లో|| తత స్సహస్రం విప్రాణాం చతుర్వేదవిదాం తథా |
గవాం సహస్రేణై కైకం వాచయామాస మాధవః || 8

శాంతిపర్వ - అధ్యాయ 53

# 3. ధర్మతత్త్వశ్రవణవిధాన చమసము

భీష్మునియొద్దకు పోవుటకు ధర్మజుఁడు సన్నద్ధుఁడై యున్నాఁడో లేదో తెలిసికొని రమ్మని శ్రీకృష్ణుఁడు సాత్యకిని పంపెను. సాత్యకి మాటను విన్నంతనే ధర్మరాజు అర్జునుని పిలిచి తన రథమును సన్నద్ధముఁ గావింపుమని చెప్పుచు ఇట్లనెను. "అర్జునా ! తాతగారియొద్దకు మనమే పోవుదము. జనసమ్మర్దముతో ఆయనకు పీడను కలిగించుట తగదు. కావున మనకు పురస్సరులైన భటులు కూడ రానక్కఱ లేదు. నేఁటినుండి గాంగేయుఁడు పరమగుహ్యములైన విషయములను చెప్పును. అందువలన అచ్చట పృథగ్జనులు సమావేశమగుట నాకు ఇష్టము లేదు".

శ్లో|| న సైనికై శ్చ యాతవ్యం యాస్యామో వయ మేవ హి |
న చ పీడయితవ్యో మే భీష్మో ధర్మభృతాం వరః || 15

శ్లో|| అతః పురస్సరా శ్చాపి నివర్తంతు ధనంజయ |
అద్య ప్రభృతి గాంగేయః పరం గుహ్యం ప్రవక్ష్యతి || 16

శ్లో|| అతో నేచ్ఛామి కౌంతేయ పృథగ్జన సమాగమమ్ || 17

శాంతిపర్వ - అధ్యాయ 53

భీష్మునివలన తాము ధర్మవిశేషములను వినునప్పుడు సైనికులు, పురస్సరులైన భటులు (Advance Guards) మొదలగువారు ఉండరాదని ధర్మరాజు నిర్దేశించుట గమనింపఁదగియున్నది. భీష్ముఁడు పరమగుహ్యములైన, అనఁగా రహస్యములైన, ధర్మవిశేషములను చెప్పఁబోవుచున్నాఁడు కాఁబట్టి అక్కడ పృథగ్జనుల సమావేశము పనికిరాదని ఆయన చెప్పుచున్నాఁడు. పృథగ్జను లనఁగా విడిగానున్నవారు. విద్యా సంస్కారము కలవారికంటె విడిగా నుండువారు పృథగ్జనులు. విజ్ఞానహీనులైనవారు

పరమగుహ్యములైన ధర్మవిశేషములను వినుటకు అర్హులు కారని దీనివలన స్పష్టమగుచున్నది. సరిగా అర్థము చేసికొనలేనివారు ఉత్తమధర్మ విశేషములను వినుట సంభవించినచో వారు వానిని సరిగా గ్రహింపక అపార్థముతో అనర్థములపాలగుదురని ధర్మజుని యభిప్రాయము. అనర్హులకు ఉత్తమవిషయముల నందించుట, బాలునిచేతికి కత్తిని ఇచ్చినట్లుగా, అనర్థమును కలిగించునని ప్రాచీనులయభిప్రాయము. అందువలననే శ్రీకృష్ణుఁడు అర్జునునకు తత్త్వమును బోధించునప్పుడు "గుహ్యములలో గుహ్యతమ మైనదానిని నీకు చెప్పుచున్నాను" (గుహ్యాతిగుహ్యం మయా) అని చెప్పియుండుట గమనింపఁదగియున్నది.

"అహింస పరమధర్మము" అని చెప్పుచున్నప్పుడు అనర్హుఁడైనవాఁడు ఆమాటవిని "మాంసాహారులందఱు అధములు" అని గ్రహించినచో ఆత్మనైచ్యము, పరనింద సంభవించుటకు అవకాశమేర్పడును. వానివలన అనర్థము కలుగును. అట్లే "మోక్షము పరమపురుషార్థము, అది నైష్కర్మ్యరూపము" అని విన్నచో అట్టివాఁడు ధర్మాచరణము వ్యర్థమని తలంచి ధర్మభ్రష్టుఁడు కావచ్చును. కావున అర్హత కలుగువఱకును ఎవనికిని వానియవగాహనమునకు మించిన విషయములను అందింపరాదు.

పిమ్మట ధర్మరాజు తమ్ములతో గోవిందుని మందిరమునకు పోయి ఆయనతో కూడ భీష్మునియొద్దకు పోయెను. అప్పటికే కొందఱు రాజర్షులు మహర్షులు ధృతరాష్ట్రాదులు వచ్చియుండిరి. నారదుఁడు అందఱను చూచి, "ఈ మహాత్ముఁడు శరీరమును వదలుటకు సిద్ధముగానున్నాఁడు. కాఁబట్టి మీరందఱు త్వరపడి మీ సందేహములను అడిగి తీర్చుకొనుఁడు" అనెను. వారందఱు భీష్ముని ప్రశ్నించుటకు చాలక యొకరిమొగము నొకరు చూచుకొనఁజొచ్చిరి. యుధిష్ఠిరుఁడు శ్రీకృష్ణునిచూచి, "యదునందనా ! మా యందఱియందు నీవు ధర్మవిదులలో శ్రేష్ఠుఁడవు ; కావున నీవే ముందుగా ఆయనతో మాటాడుము" అని అభ్యర్థించెను.

శ్రీకృష్ణుఁడు భీష్ముని సమీపించి, "ఆర్యోత్తమా ! నీకు రాత్రి సుఖముగాఁ గడచినదా ! బుద్ధి ప్రసన్నముగానున్నదా ! జ్ఞానము లన్నియు భాసించుచున్నవా! మనస్సు వ్యాకులమగుట లేదు కదా !" అని యడిగెను.

భీష్ముఁడిట్లనెను. "కృష్ణా నీ యనుగ్రహమున తాపము, శ్రమ, గ్లాని, బాధ అంతయు అప్పుడే పోయెను. కరతలామలకముగా భూతభవిష్యద్వర్తమాన విశేషములనన్నింటిని చూచుచున్నాను. నీ వరదానమువలన వేదప్రోక్తములైన విశేషముల నన్నింటిని చక్కఁగా స్మరింపఁగలుగుచున్నాను. శిష్టులచే బోధింపఁబడిన దేశకులజాతి సదాచారములను రాజధర్మములను అన్నింటిని తలంపఁగలుగుచున్నాను. నీ ప్రసాదమున ఏది చెప్పవలయునో దానినంతను చెప్పఁగలను. నీయనుగ్రహముననే నాకీ విజ్ఞానమంతయు భాసించుచుండఁగా నీవే ధర్మరాజునకు శ్రేయస్కరమైన దానిని ఏల చెప్పుటలేదు. నాచేత చెప్పించుటలో నీయభిప్రాయమేమి ? చెప్పుము".

వాసుదేవుఁడిట్లనెను. "కురుశ్రేష్ఠా ! యశస్సునకు శ్రేయస్సునకు నేనే మూలము. చంద్రుఁడు చల్లని కిరణములు కలవాఁడన్నచో, అది ఎట్లు ఆశ్చర్యకరము కాదో నేను కీర్తిశాలినన్నచో ఎవ్వఁడును విస్మయము నొందఁడు. నీవు కూడ కీర్తిశాలివే. అయినను నా భక్తుఁడవైన నీకు అతిశయమైన కీర్తిని కలిగింపవలసియున్నది. ఇందుకొఱకే విపులమైన నా బుద్ధిని నీయందు ప్రవేశపెట్టితిని. ఇప్పుడు నీవు కావింపఁబోవుచున్న ధర్మతత్త్వ ప్రవచనమువలన నీ కీర్తి యక్షయముగా ఈ పృథ్వి యున్నంతవఱకు సకలలోకములయందు ప్రసరించుచుండఁగలదు. నీవు చెప్పునది యంతయు వేదమువలెనే ప్రమాణముగా నిలిచియుండఁగలదు. నీయుపదేశము ననుసరించి వర్తించువాఁడు ఇహపరములయందు సకల పుణ్యఫలములను పొందఁగలడు. కురుక్షేత్రయుద్ధమున హతులు కాఁగా మిగిలిన రాజులందఱును ధర్మములనుగూర్చి నిన్ను అడుగవలయునని నీ చుట్టు చేరియున్నారు. వారికందఱకు అభిలషితములైనవానిని చెప్పుము.

ధర్మతత్త్వ ప్రవచనమునకు నీవలె అర్హుఁడైనవాఁడు మఱియొకఁడు లేఁడు. నీవు వృద్ధుఁడవు, శ్రుతాచారసంపన్నుఁడవు ; సకలరాజధర్మములయందు ఇతర ధర్మములయందును విద్వాంసుఁడవు. జన్మము మొదలుగా నీ జీవితమున ఎప్పుడును ఎట్టిపాపమును నీవు చేయలేదు. మఱియును పార్థివులందఱును నీవు సర్వధర్మజ్ఞుఁడవని నిస్సంశయముగా నెఱుంగుదురు. నీవు దేవతలను ఋషులను చక్కఁగా ఉపాసించితివి. నీకు తెలియని ధర్మము లేదు. కావున కుమారులకు తండ్రివలె వీరికి శ్రేష్ఠమైన

ధర్మమును నీతిని బోధింపుము. ధర్మమును తెలిసికొనఁగోరి సత్పురుషులు ప్రశ్నించునప్పుడు విద్వాంసుఁడు వారికి సమాధానము చెప్పవలయుననుట సనాతన ధర్మము. తెలిసియుండియు సత్పురుషులకు బోధింపని వానికి దోషము కలుగును. కావున పుత్త్రులు పౌత్త్రులు అడుగుచున్న సందేహములకు సమాధానముగా సనాతనములైన ధర్మములను చక్కఁగా వివరింపుము".

భీష్ముఁడిట్లనెను. "కృష్ణా ! నీ యనుగ్రహమున సకల ధర్మములను చెప్పఁగలను. యుధిష్ఠిరుఁడు నన్ను ప్రశ్నించునుగాక ! వానియందు సత్యము దానము తపస్సు శౌర్యము శాంతి దక్షత్వము అసంభ్రమము కలవు. అతఁడు ఆవేశమువలనఁగాని భయముచేతఁగాని, కామమునఁగాని అర్థపర్వతముచే నైనను అధర్మమును ఎప్పుడును ఆచరింపఁడు".

శ్రీకృష్ణుఁడిట్లనెను. "ఆయన లోకనిందకు భయపడి సిగ్గుపడుచు నిన్ను సమీపింపలేకున్నాఁడు. పూజ్యులైన బంధువులను గురువులను వధించితినని యతఁడు నిన్ను చూచుటకు లజ్జించుచున్నాఁడు".

భీష్ముఁడిట్లనెను. "అధ్యయనము దానము తపస్సు బ్రాహ్మణులకు ఎట్లు ధర్మములో, అట్లే సమరమున శత్రుసంహారము క్షత్త్రియులకు ధర్మము. అధర్మపక్షమున వర్తించుచున్న తండ్రులను తాతలను గురువులను బంధువులను భ్రాతలను యుద్ధమున చంపుటయే క్షత్త్రియునకు ధర్మము. ధర్మమర్యాదల నతిక్రమించిన లుబ్ధులను గురువులనైనను నిస్సంకోచముగా ధర్మముకొఱకు వధించువాఁడే ధర్మవిదుఁడు".

ఇట్లు భీష్ముఁడు చెప్పినతరువాత ధర్మరాజు నెమ్మదిగా భీష్మునియొద్దకు పోయి పాదాభివందనముగావించెను. ఆయన అతనిని దగ్గరకు తీసుకొని మూర్ధాఘ్రాణము గావించి వాత్సల్యముతో, "కూర్చుండుము ; నీవు నన్ను నిశ్శంకముగా నిర్భయముగా కావలసిన విషయమేదియైనను అడుగుము" అనెను.

ధర్మరాజు కృష్ణుని చూచి వినమ్రుఁడై, భీష్మునకు అభివాదనము గావించి పెద్దల యనుమతిని పొంది ప్రశ్నించుటకు ఉపక్రమించి, "క్షత్త్రియులకు

ప్రజాపరిపాలనము పరమధర్మమని పెద్దలు చెప్పుదురు. అది మహాభారము. దానిని చక్కఁగా నిర్వహించుటకు కావలసిన రాజధర్మములను చెప్పుము" అని యడిగెను.

భీష్ముఁడు ఇట్లు చెప్పఁదొడంగెను. "మహనీయమైన ధర్మమునకు నమస్కారము. పరమేష్ఠియైన శ్రీకృష్ణునకు ప్రణామము ; బ్రాహ్మణులకు అభివాదనము గావించి శాశ్వతములైన ధర్మములను చెప్పుచున్నాను. ప్రజారంజనమును కోరురాజు అన్నింటికంటెను ముందు దేవతలను బ్రాహ్మణులను యథావిధిగా అర్చింపవలె. దానివలన రాజు ధర్మముయొక్క ఋణము నుండి విముక్తుఁడై లోకముచేత పూజింపఁబడును.

శ్లో|| నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే |
బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్ || 11

శ్లో|| ఆదా వేవ కురుశ్రేష్ఠ రాజ్ఞా రంజనకామ్యయా |
దేవతానాం ద్విజానాం చ వర్తితవ్యం యథావిధి || 12

శ్లో|| దైవతా న్యర్చయిత్వా హి బ్రాహ్మణాం శ్చ కురూద్వహ |
ఆనృణ్యం యాతి ధర్మస్య లోకేన చ సమర్చ్యతే || 13

## శాంతి - అధ్యాయ - 36

ధర్మముయొక్క ఋణము నుండి విముక్తుఁడగుట అనఁగా నేమి ? పరిపాలనము చక్కఁగా నున్నచో ప్రతివ్యక్తి తన వృత్తిని నిరాటంకముగా కొనసాగించుకొనుచు తత్ఫలమును పొందఁగలుగును. అందువలన ప్రజలందఱు పరిపాలకునకు ఋణపడి, ఆ ఋణమును తమయాదాయములోని షష్ఠాంశ రూపమైన పన్నుగా చెల్లించి ఋణవిముక్తు లగుచున్నారు. మహర్షులు సైతము తమ తపస్సులోని షష్ఠాంశమును రాజునకు సమర్పించుచునే యుందురు. పరిపాలనకు మూలము ధర్మపరిజ్ఞానము **(knowledge of Administrative and Constitutional Laws).** దానిని బోధించువారు బ్రాహ్మణులు. వారివలన ధర్మపరిజ్ఞానమును పొందుచున్న

రాజు వారికి ఋణపడుచున్నాఁడు. అట్లే మనుష్యప్రయత్నమున రాజు ధర్మమును అమలు జరుపుచున్నప్పుడు దేవతలు అనుకూలింపవలె. వారు ప్రతికూలించినచో ధర్మప్రవర్తనము జరుగదు. అందువలన రాజు వారికి కూడ ఋణపడును. కావున రాజు ధర్మమునకు ప్రవక్తలైన బ్రాహ్మణులను. ప్రవర్తనకు సహాయులైన దేవతలను పూజించినచో ధర్మ ఋణము తీరును.

ఈ ఘట్టమున శ్రీకృష్ణుని మహనీయత పెక్కువిధముల వ్యక్తమగుచున్నది. భీష్ముఁ డన్నట్లు శ్రీకృష్ణుఁడు సర్వధర్మజ్ఞుఁడే. వరప్రదానరూపమున ఆయనయే భీష్మునిముఖమున సకలధర్మతత్త్వములను చెప్పినట్లయ్యెను. భీష్ముఁడు కూడ సర్వధర్మజ్ఞుఁడే. ఆయనకు తెలిసియుండిన ధర్మములే ఆయన బుద్ధియందు విస్పష్టముగా ప్రకాశించునట్లు శ్రీకృష్ణుఁడు ఆయనశరీరమునకు స్వాస్థ్యము, బుద్ధికి దృఢత్వము కలుగునట్లు యోగబలమున శక్తిని ప్రసాదించెను. ఇట్లు భీష్ముఁడు చెప్పఁగలుగుటవలన ఆయనకు అజరామరమైన కీర్తికలిగెను. దీనివలన శ్రీకృష్ణునకు భక్తులయందు ఎంత వాత్సల్యముండునో వ్యక్తమగుచున్నది. ఇది కాక మఱియొక యౌచిత్యము కూడ ఇందుకలదు. శ్రీకృష్ణుఁడు జ్ఞానముచేత వృద్ధుఁడైనను ధర్మరాజాదులగు అనేకుల కంటె వయస్సు చేత చిన్నవాఁడు. చిన్నవానివలన పెద్దలు ధర్మతత్త్వములను వినుట సహజము కాదు. ఎప్పుడో ఒకప్పుడు పరిస్థితుల ప్రాబల్యమున అట్టిది సంభవించినను అది సాధారణ పద్ధతి కాదు. మఱియును పరమధార్మికుఁడన్న విశ్వాసము శ్రీకృష్ణుని విషయమున అనేకులకు ఆకాలమున లేకపోవుటయు సంభవమే. విశ్వాసములేనివారు విషయమును చక్కఁగా గ్రహింపలేరు. ఇట్టిసంకోచములకు అవకాశము లేకుండ, శ్రీకృష్ణుఁడు తాను చెప్పక భీష్మునిచేత చెప్పించెను.

# II. భీష్మప్రసంగ కమండలువు

## 1. జ్ఞాతివ్యవహార చమసము

యుధిష్ఠిరుఁడు భీష్ముని ఎన్నో విషయములనడిగెను. ఒక సందర్భమున ఆయన జ్ఞాతులను గూర్చి యిట్లు అడిగెను. "మనకు సంబంధులలో కాని మిత్రులలో కాని ఇద్దరు, లేక శత్రువులలో ఇద్దఱు, ఒకరితోనొకరు స్పర్ధకలవారై యున్నచో వారిని ఎట్లు వశీకరించుకోవలె ?"

భీష్ముఁడిట్లనెను. "ఇందులకు వాసుదేవునకు నారదునకు జరిగిన పురాతనమైన యితిహాసము కలదు. చెప్పెదను వినుము. వాసుదేవుఁడు నారదునితో ఇట్లనెను. 'సుహృత్తు కానివాఁడు శ్రేష్ఠమైన కార్యాలోచనమును తెలిసికొనుటకు అర్హుఁడు కాఁడు. సుహృత్తు పండితుఁడైనను అపండితుఁడైనను ధీరుఁడు కానివాఁడు (అనాత్మవాన్) అట్టియాలోచనమును గ్రహింపఁజాలడు. నీవు పండితుఁడవు ధీరుఁడవును అయిన సుహృత్తువగుటచే నీకొక విషయమును చెప్పఁదలచుచున్నాను. ఎవనియందైనను సమగ్రమైన బుద్ధి ఉన్నదని చూచి కదా ప్రశ్నింపవలె.

నేను నా పరాక్రమార్జితములైన భోగ్యపదార్థములలో సగము జ్ఞాతులకు నొసంగి తక్కిన సగము మాత్రమే అనుభవించుచున్నాను. అట్లు వారికి ఇచ్చియు వారి దుర్వచనములను సహించుచున్నాను. ఇట్లు ఐశ్వర్యము పేరిట వారికి నేను దాస్యము చేయుటలేదా ? అగ్నిని కోరినవాఁడు అరణిని మథించునట్లు వారి దుర్వచనములు నా హృదయమును నిత్యము దహించుచున్నవి. సంకర్షణుఁడు తనబలమునుగూర్చి, గదుఁడు సౌకుమార్యమునుగూర్చి, ప్రద్యుమ్నుఁడు తనసౌందర్యమును గూర్చి సతతము భావించుచుందురు. వీరు ఎవరును నాకు కలుగుచున్న సమస్యలలో సాయము చేయరు. అందువలన పెక్కు సమస్యలలో నేను అసహాయుఁడనై ఉన్నాను.

అంధకవృష్ణులలో బలవంతులు మహాభాగులు నిత్యకార్యశీలురు అనేకులున్నారు. వారు ఎవని పక్షమున ఉండరో వాఁడు ఉండఁడు. వారు

ఎవనిపక్షమున నుందురో వాఁడు సకల సంపత్సమృద్ధుఁడగును. అయినను వారివలన కూడ నాకు ఎట్టిసాయమును లభింపదు.

ప్రతిదినము ఆహుకునిచేత అక్రూరునిచేత కార్యములందు ముందుకు సాగుట కష్టముగానున్నది. వారిలో ఏయొక్కనిని ముఖ్యునిగా వరింపలేకున్నాను. పరస్పరము పరమస్పర్థకల వీరిద్దఱు ఎవనిపక్షమున ఉండుట సంభవించునో వానికి అంతకు మించిన కష్టము ఏదియు నుండదు. వారిని దగ్గరకు చేర్చుకొనుటవలన ఎంత కష్టము కలుగునో, వారిని దూరమొనర్చుకొన్నప్పుడు కూడ అంత కష్టము కలుగును. ఇద్దఱు కొడుకులు జూదమాడుచున్నప్పుడు తల్లి ఎట్లు ఇద్దఱకును జయమును పరాజయమును కోరుచుండునో, అట్లే నేనుకూడ వారిద్దరు తగవులాడుకొనుచున్నప్పుడు ఒకప్పుడొకనికి జయము మఱియొకప్పుడింకొకనికి పరాజయమును కోరుచుందును. ఈ విధముగా రెండు వైపులనుండి సదా క్లేశమును పొందుచున్ననాకు, నారదా, నాజ్ఞాతులకును ఏది శ్రేయమో చెప్పుము.

శ్లో॥ నా సుహృ త్పరమం మంత్రం నార దార్హతి వేదితుమ్ ।
అపండితో వాపి సుహృత్ పండితో వా ప్యనాత్మవాన్ ॥ 3

శ్లో॥ స తే సౌహృద మాస్థాయ కించి ద్వక్ష్యామి నారద ।
కృత్స్నం బుద్ధిబలం ప్రేక్ష్య సంపృచ్ఛే త్రిదివంగమ ॥ 4

శ్లో॥ దాస్య మైశ్వర్యవాదేన జ్ఞాతీనాం న కరో మ్యహమ్ ।
అర్ధం భోక్తాస్మి భోగానాం వాగ్దురుక్తాని చ క్షమే ॥ 5

శ్లో॥ అరణీ మగ్నికామో వా మథ్నాతి హృదయం మమ ।
వాచా దురుక్తం దేవర్షే త న్మే దహతి నిత్యదా ॥ 6

శ్లో॥ బలం సంకర్షణే నిత్యం సౌకుమార్యం పున ర్గదే ।
రూపేణ మత్తః ప్రద్యుమ్న స్సోఽసహాయోఽస్మి నారద ॥ 7

శ్లో॥ అన్యే హి సుమహాభాగా బలవంతో దురుత్సహాః ।
నిత్యోత్థానేన సంపన్నా నార దాంధకవృష్ణయః ॥ 8

శ్లో॥ యస్య న స్యు ర్న వై స స్యా ద్యస్య స్యుః కృత్స్న మేవ తత్ ।
ద్వాభ్యాం నివారితో నిత్యం వృణో మ్యేకతరం న చ ॥ 9

శ్లో॥ స్యాతాం య స్యాహుకాక్రూరౌ కింను దుఃఖతరం తతః ।
యస్య చాపి న తౌ స్యాతాం కిన్ను దుఃఖతరం తతః ॥ 10

శ్లో॥ సోఽహం కితవమా తేవ ద్వయో రపి మహామతే
ఏకస్య జయ మాశంసే ద్వితీయస్య పరాజయమ్ ॥ 11

శ్లో॥ మ మైవం క్లిశ్యమానస్య నారదోభయతః ।
వక్తు మర్హసి యచ్ఛ్రేయో జ్ఞాతీనా మాత్మన స్తథా ॥ 12

## శాంతిపర్వ - అధ్యాయ 81

ఆహుకుడు ఉగ్రసేనుని తండ్రి. ఇచ్చట దురుక్తములనఁగా అసంతృప్తులైన బంధువులాడుమాటలు. శ్రీకృష్ణుఁడు శత్రువులను జయించివారి సంపదలను తెచ్చినప్పుడు, వానిలో సగము బంధువుల కందఱకును సమముగానే పంచియిచ్చినను, వారు తమకు వచ్చిన భాగములతో సంతృప్తినొందక, కొందఱు ఆయన తమకన్న గప్పి సన్నిహితులకు అధికముగానే యిచ్చి యుండునని సూటిపోటి మాటలను అనుచుందురు. "నీకు నిజముగా ప్రేమ ఆహుకునియందే యున్న" దని అక్రూరుఁడు, "నీకు అక్రూరునియందు ఉన్న యనురాగము మాయందెక్కడిది" అని ఆహుకుఁడు పలుకుచునుందురు. ఇట్టివియే దురుక్తములు. ఆయన అందఱియందు సమభావము కలిగియుండును ; ఎవరియందు పక్షపాతము చూపఁడు. అయినను అనేకులు ఆయన ఇతరులను ప్రేమించుచున్నట్లు తమ్ము ప్రేమించుచుండుట లేదని భ్రమపడుచు అట్లు మాటాడుచుందురు.

నారదుఁడు శ్రీకృష్ణునితో ఇట్లనెను. "కృష్ణా ! స్వభావమువలన ఇతరకారణములవలన ఆపదలు ఆంతరములు బాహ్యములు అని రెండు విధములుగా ఏర్పడుచున్నవి. ఇప్పుడు నీకు కలిగినది స్వకర్మకృతమే. ఇది యాభ్యంతరమైనయాపద. అక్రూరుఁడు భోజుఁడు మొదలగు వారివలన కలుగుచున్న యాపదలన్నియు దీని

ననుసరించి కలుగుచున్నవే. నీవు ఏదేని ప్రయోజనము నుద్దేశించియో, ఏదేని కామములవలననో లేక బీభత్సములైన వాక్కులకు వెఱచిగాని, నీ శక్తిచే సంపాదింపఁబడిన (కంస సంహారసందర్భమున) ప్రభుత్వమును ఇతరునకు (ఉగ్రసేనునకు) దత్తము గావించితివి. అట్లు చేయుటవలన నీవు జ్ఞాతిబలసహాయుఁడవైతివి. వారు నీకు జ్ఞాతలనుమాట రూఢమైనది. కక్కినయన్నమును మరల స్వీకరించుట ఎట్లు సాధ్యము కాదో అట్లే వెనుక (ఉగ్రసేనునకు) ఇచ్చినదానిని మరల నీవు స్వీకరించుట శక్యము కాదు. జ్ఞాతులకు పరస్పరభేదము కలుగునను భయమువలన ఉగ్రసేనుని నుండి బభ్రువు నుండి మరల రాజ్యమును పొందుట శక్యము కాదు. దుష్కరమైన ప్రయత్నమువలన నీవు ఎట్లైనను దానిని సాధింపఁ గలిగినను, ఆకార్యసిద్ధి వలన మహాక్షయముగాని వ్యయముగాని వినాశముగాని మరల (కంసునికాలము నందు వలె) సంభవించును. కావున పరిమార్జనము చేసి, అనుమార్జనము చేసి హృదయమును ఛేదించునట్టి మృదువైన అనాయసమైన శస్త్రముచేత **(weapon not made of steel)** వారియందఱియొక్క జిహ్వాను (వాక్కును) పెకలింపుము".

శ్లో|| ఆపదో ద్వివిధాః కృష్ణ బాహ్యాశ్చాభ్యంతరా శ్చ హ |
ప్రాదుర్భవన్తి వార్ష్ణేయ, స్వభావా ద్యది వాన్యతః || 13

శ్లో|| నేయ మాభ్యంతరా తుభ్య మాపత్కృచ్ఛ్రా స్వకర్మజా
అక్రూరభోజ ప్రభవా స్సర్వే హ్యేతే తదన్వయాః || 14

శ్లో|| అర్థహేతో ర్హి కామా ద్వా వాచా బీభత్సయాపి వా |
ఆత్మనా ప్రాప్త మైశ్వర్య మన్యత్ర ప్రతిపాదితమ్ || 15

శ్లో|| కృతమూల మిదానీం తు జ్ఞాతిశబ్దం సహాయవన్ |
న శక్యం పున రాదాతుం వాంత మన్న మివ త్వయా || 16

శ్లో|| బభ్రూగ్రసేనయో రాజ్యం నాప్తుం శక్యం కథంచన |
జ్ఞాతిభేదభయా త్కృష్ణ త్వయా చాపి విశేషతః || 17

శ్లో|| తచ్చే త్సిద్ధ్యే త్ప్రయత్నేన కృత్వా కర్మ సుదుష్కరమ్ |
మహాక్షయం వ్యయో వా స్యా ద్వినాశో వా పున ర్భవేత్ || 18

శ్లో|| అనాయాసేన శస్త్రేణ మృదునా హృదయచ్ఛిదా |
జిహ్వా ముద్ధర సర్వేషాం పరిమృజ్యానుమృజ్యచ || 19

శాంతిపర్వము - అధ్యాయ 81

ఇతరుల హృదయములందున్న యపోహలను అసూయాద్వేషములను తొలఁగించుట పరిమార్జనము. వారి హృదయములందు తమవిషయమున ప్రీతి కలుగునట్లు చేయుట అనుమార్జనము.

శ్రీకృష్ణుఁ డిట్లడిగెను. "దేనిచేత నేను వీరి విషయమున పరిమార్జనము అనుమార్జనము చేసి వీరిజిహ్వను పెకలింపనగునో అట్టి మృదువు అనాయసమునైన శస్త్రము ఎట్టిదో నేను ఎట్లు ఎఱుంగనగును?"

శ్లో|| అనాయసం మునే శస్త్రం మృదు విద్యా మహం కథమ్ |
యే నైషా ముద్ధరే జిహ్వాం పరిమృజ్యానుమృజ్య చ || 20

శాంతిపర్వము - అధ్యాయ 81

నారదుఁ డిట్లు చెప్పెను. "శక్తికొలఁదిగా అన్నదానము చేయుచుండుట, కష్టములను సహించుచుండుట, ఆర్జవము, మార్దవము, అర్హత ననుసరించి పూజించుచుండుట, అను నీవర్తనమే అనాయసమైన (ఆయసము కానిది. ఇనుముతో చేయఁబడినది) శస్త్రము కటువులు లఘువులు అయిన నిందావాక్యములను పలుకఁగోరు జ్ఞాతుల వాక్కును హృదయమును మనస్సును నీవాక్యములచేత శమింపఁజేయుము. మహాపురుషుఁడు కానివాఁడు అధీరుఁడు అసహాయుఁడు గొప్పభారమును వహింపలేఁడు. నీవు ఆ భారమును పూనికతో వహింపుము. సమమైన మార్గమున ఏ వృషభమైనను పెద్ద భారమును మోయఁగలదు. కాని దుర్గమమైన మార్గమునందు పెద్దభారమును మందలో శ్రేష్ఠమైన వృషభమే మోయఁగలదు.

సంఘములకు భేదమువలన వినాశము సంభవించును. మఱి నీవు సంఘముఖ్యుఁడవు. నిన్ను నాయకునిగా పొందిన యీసంఘము ఎట్లు వినాశము పొందకుండునో అట్లు చేయుము. బుద్ధి శక్తి క్షాంతి ఇంద్రియనిగ్రహము ధనత్యాగము అనువానివలన, ప్రాజ్ఞురాలైన భార్యవలె, గుణము నిలుకడగా నుండదు. స్వపక్షమును పైకి తెచ్చుకొనునాలోచన ఎప్పుడును యశఃప్రదము ఆయుష్యప్రదమును అగును. కావున జ్ఞాతులకు వినాశము సంభవింపకుండునట్లు చేయుము....

కృష్ణా ! నీయభ్యుదయమును మహర్షులు సైతము ఉపాసించుచున్నారు. నీవు సకలభూతములకు గురుఁడవు. జరుగవలసినదానిని జరిగినదానిని నీ వెఱుంగుదువు. కళ్యాణగుణ సంపూర్ణుఁడవు భక్తాభీష్టప్రదాయకుఁడవు అగు నిన్ను పొందియాదవులు సుఖముగా వృద్ధి పొందుచున్నారు.

శ్లో॥ శక్త్యాన్నదానం సతతం తితిక్షార్జవమార్దవమ్ ।
యథార్హప్రతిపూజా చ శస్త్ర మేత దనాయసమ్ ॥ 21

శ్లో॥ జ్ఞాతీనాం వక్తుకామానాం కటుకాని లఘూని చ ।
గిరా త్వం హృదయం వాచం శమయస్వ మనాంసి చ ॥ 22

శ్లో॥ నా మహాపురుషః కశ్చి న్నానాత్మా నాసహాయవాన్ ।
మహతీం ధుర మాధత్తే తా ముద్య మ్యోరసా వహ ॥ 23

శ్లో॥ సర్వ ఏవ గురుం భార మనడ్వాన్ వహతే సమే ।
దుర్గే ప్రతీక స్సుగవో భారం వహతి దుర్వహమ్ ॥ 24

శ్లో॥ భేదాత్ వినాశ స్సంఘానాం సంఘముఖ్యోఽసి కేశవ ।
యథా త్వాం ప్రాప్య నోత్సీదే దయం సంఘ స్తథా కురు ॥ 25

శ్లో॥ నాన్యత్ర బుద్ధిక్షాంతిభ్యాం నాన్యత్రేం ద్రియనిగ్రహాత్ ।
నాన్యత్ర ధనసంత్యాగా ద్గుణః ప్రాజ్ఞేవ తిష్ఠతి ॥ 26

శ్లో॥ ధన్యం యశస్య మాయుష్యం స్వపక్షోభావనం సదా ।
జ్ఞాతీనా మవినాశ స్స్యా ద్యథా కృష్ణ ! తథా కురు ॥ 27

శ్లో|| ఉపాసంతే హి త్వద్బుద్ధి మృషయ శ్చాపి మాధవ |
త్వం గురు స్సర్వభూతానాం జానీషే త్వం గతాగతమ్ || 30

శ్లో|| త్వా మాసాద్య యదుశ్రేష్ఠ ఏధన్తే యాదవా స్సుఖమ్|
కల్యాణగుణసంపూర్ణం భక్తాభీష్టప్రదాయినమ్ || 31

ఈ సంవాదము విచిత్రముగానున్నది. కృష్ణుఁడు నారదుఁడు తమయెదుటనే యుండఁగా భీష్ముఁడు ఈ సంవాదమును పురాతనమైన యితిహాసమని పేర్కొనుట యేమి ? ఇది అప్పుడు అక్కడ ఉన్న కృష్ణనారదులకు జరిగిన సంవాదము కాక పూర్వకల్పములో జరిగినదై యుండవచ్చును. ప్రతికల్పమునందు ద్వాపరయుగములలో శ్రీకృష్ణునిచరిత్ర కొలది భేదములతో సంభవించుచుండును. అందువలన ఇది పూర్వకల్పమున సంభవించినదై యుండును. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడుగా అవతరించుట యందలి ప్రధానలక్ష్యమునందు మార్పు ఉండదు. కళాశాలలోఁగాని పాఠశాలలోఁగాని దైనందిన కార్యక్రమ పట్టికను (Time Table) పూర్వసంవత్సరములోనిదే కొలఁది మార్పులతో ప్రస్తుత సంవత్సరమునకు రూపొందింపఁబడును. ప్రధానోపాధ్యాయులు, శాఖ్యాధ్యక్షులు (Heads of Departments) ఉపాధ్యాయులు మొదలగు పదవులయందుండు వ్యక్తులలో, వారి కార్యవిధానములలో కొలఁదిమార్పులున్నను, పదవులు, వానికి అర్హతలు, వానికి పరస్పర సంబంధము మొదలగు ప్రధానాంశములలో మార్పు ఉండదు. ఇట్లే విధాత కూడ జగత్సృష్టి పూర్వకల్పము నందు ఎట్లు జరిగినదో ప్రస్తుత కల్పమునందు కూడ అట్లే కొనసాగించును. (ధాతా యథాపూర్వ మకల్పయత్).

ఏ కల్పమునందైనను భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు తన సమస్యలను భక్తుఁడైన నారదునకు చెప్పుకొని వాని పరిష్కారమునకు ఉపాయమును చెప్పుమని కోరుట ఆశ్చర్యకరమే. సమస్యలను ఛేదించుటకు ఆమహర్షి చెప్పిన అనాయససమైన శస్త్రము సంగతి శ్రీకృష్ణునకు తెలియదా? "నీవు సర్వభూతములకు గురుఁడవు. జరిగినది జరుగవలసినది యంతయు నీవెఱుంగుదువు" అని నారదుఁడు అనుటవలన ఇది ఆయనకు తెలియనిది కాదు అని స్పష్టమగుచున్నది. అట్లయినచో ఆయన ఎందులకు

అడిగినాఁడు ? మానవుఁడుగా అవతరించినతరువాత భగవంతునకు కూడ తాను పొందిన శరీరము ననుసరించి తల్లితండ్రి సోదరులు బంధువులు పుత్త్రులు సమాజము మొదలగు వారివలన సమస్యలు బాధ్యతలు కష్టములు సుఖములు తప్పవని, ఆయావ్యక్తుల ప్రారబ్ధముల ననుసరించి యేర్పడు సందర్భములను అన్నింటిని తన సంకల్పముచేత సవరించుట సాధ్యము కాదని, అట్లు చేయఁబూనుటతానే ఏర్పఱచిన సృష్టిక్రమమును పాలనవిధానమును అతిక్రమించుట యగునని, అది యనుచితమని భగవంతుని యభిప్రాయముగా స్పష్టమగుచున్నది. అక్రూరునియిష్టము నెరవేర్చినచో ఆహుకునకు కష్టము కలుగును. ఆహుకుని యిష్టప్రకారము జరిపినచో అక్రూరునకు కష్టము కలుగును. ఇట్టిసందర్భములలో భగవంతుఁడైనను వారి పరుషవాక్యములను నిందలను ఎట్లు సహింపవలసియే యున్నదో దీనివలన స్పష్టమగుచున్నది. మఱియును జ్ఞానులైనను, లేక భగవంతుఁడేయైనను వ్యవహారమునందు "ఇతఁడు శాస్త్రవిధులను ఆచార్యోపదేశములను లెక్కపెట్టకుండ తనకు తోఁచినట్లుగా వ్యవహరించుచున్నాఁడు" అనుతలంపు లోకులకు కలుగకుండుటకొఱకు, తనకు తెలిసియేయున్నను జ్ఞానవృద్ధులవలన శాస్త్రవిషయములను అడిగి తెలిసికొనుచునే యుండవలయునని భగవంతుఁడు ఈసందర్భమున వ్యక్తమొనరించుచున్నాఁడు.

ఎందువలననో తిక్కన్నగారు ఈ సంవాదమును అనువదింపలేదు. ఇది ఆయనకు లభించిన మూలమునలేదని యూహింపవలసియున్నది.

## 2. నారదమహత్త్వ చమసము

సర్వలోకమునకు ప్రియుఁడు సర్వగుణోపేతుఁడు సర్వలోకాభినందితుఁడును అయిన వాఁడెవఁడైన కలఁడా అని యుధిష్ఠిరుఁడు భీష్మునడిగెను. అందులకు సమాధానముగా ఆయన వాసుదేవోగ్రసేనసంవాదమును చెప్పెను.

ఉగ్రసేనుఁడు ఒకప్పుడు కృష్ణునిచూచి, "నారదుని గొప్పవానినిగా ఎల్లరు కొనియాడుచుందురు ; అందువలన అతఁడు గుణసంపన్నుఁడని యనుకొనుచున్నాను; అతని విశేషమేమో నాకు చెప్పుము" అని యడిగెను.

కృష్ణుఁడు ఇట్లు చెప్పెను. "మహారాజా ! నారదుని గుణములను సంక్షేపముగా చెప్పెదను వినుము. నేను గొప్ప చరిత్ర కలవాఁడను అనునహంకారము ఆయనకు లేదు. శాస్త్రములయందు పెద్దలవలననేది సత్పురుషులచరిత్రముగా చెప్పఁబడుచున్నదో అదియే ఆయన వర్తనముగానున్నది. అసంతోషము, క్రోధము, చాపల్యము, భయము నారదునియందు లేవు. ఆయన కర్తవ్యముల యందు శూరుఁడు ; దీర్ఘసూత్రుఁడు కాఁడు. ఆయన కామమువలనఁగాని, లోభమువలనఁగాని ఆడినమాట తప్పఁడు. అధ్యాత్మతత్త్వమును విధితత్త్వమును ఆయన ఎఱింగినవాఁడు. ఆయన సమర్థుఁడయ్యును మిక్కిలి ఓర్పుకలవాఁడు ; జితేంద్రియుఁడు, ఋజువర్తనుఁడు, సత్యవాది. అందువలన ఆయన ఎల్లయెడలను పూజింపఁబడుచున్నాఁడు. తేజస్సు బుద్ధి జ్ఞానము వినయము జన్మము తపస్సు అను గుణములచేత ఆయన వృద్ధుఁడు. అందువలన ఆయనను అందఱు పూజించుచున్నారు.

ఆయన ఎల్లరకును మేలునే చేయును. ఆయనయందు పాపము లేదు. ఇతరులకు కలుగు అనర్థములవలన ఆయన ప్రీతిని పొందఁడు. వేదశ్రుతులతో ఆఖ్యానములతో ఆయన ధర్మతత్త్వార్థములను చెప్పుచుండును. ఆయనకు ప్రియుఁడు అప్రియుఁడును ఎవఁడును లేఁడు. అందఱకు ఆయన సముఁడే... ధనవిషయమునఁగాని కామమునందుఁగాని ఆయన ఎవ్వరితో పోరాడలేదు. ఆయన దీనుఁడు క్రోధనుఁడు లుబ్ధుఁడు కాఁడు. ఆయన యందు ఏదోషము లేదు. ఆయన యితరుల విషయములందు సక్తుఁడైనవాని వలె కన్పించును ; కాని దేనియందును సక్తుఁడు కాఁడు. ఆయన వాగ్మి ; కాని తన్ను తాను పొగడుకొనఁడు. ఆయనకు ఎవనియందును ఈర్ష్యలేదు. ఆయన ఎప్పుడును మృదువుగా మాటాడును. ఆయన లోకులయొక్క వివిధ చిత్త ప్రకారములను పరికించుచు ఎవనిని ఏవగించుకొనఁడు.

ఆయన సంవర్గవిద్యాకుశలుఁడు. ఎవనికి ఏలాభము కలిగినను ఆయన అసూయనొందక తన మార్గమున తాను వర్తించుచుండును. ఆయన కాలము నెప్పుడు వ్యర్థము చేయఁడు. పెక్కు కళలయందు శాస్త్రములయందు ఆయన చక్కఁగా శ్రమించి ప్రజ్ఞాపాటవమును సంపాదించెను. అయినను ఆయనకు వానియందు

కౌల్యము లేదు. ఆయన సమాధియందు ఎంతకాలమున్నను తృప్తి నొందఁడు. ఆయన జ్ఞానమున నిత్యయుక్తుఁడు ; అప్రమత్తుఁడు.

తమశ్రేయస్సుకొఱకు పరులు తన్ను నియోగించినప్పుడు, ఆపనులను నెరవేర్చునపుడు లజ్జింపఁడు. ఇతరుల రహస్యములను ఆయన బయటపెట్టఁడు. పదార్థములు లభించినప్పుడు హర్షమును, లభింపనప్పుడు వ్యథను ఆయన పొందఁడు. ఆయన స్థిరమైన బుద్ధితో దేనియందును సంగము లేక వర్తించుచుండును. ఇట్లు దక్షుఁడు, శుచి, అనామయుఁడు, కాలజ్ఞుఁడు, ప్రియజ్ఞుఁడు సర్వగుణసంపన్నుఁడైన వానిని ఎవఁడు ప్రేమింపకుండును ?"

నారదుని నిమిత్తముగా చేసి భగవంతుఁడు ఎవఁడైనను లోకపూజితుఁడు కావలయునన్నచో ఏగుణములను కలిగియుండవలయునో వాని నన్నింటిని వివరించెననుట స్పష్టము.

## 3. బ్రాహ్మణ ప్రాముఖ్య చమసము

వైశంపాయనుఁడు జనమేజయునితో ఇట్లనెను. "యుద్ధము ముగిసినతరువాత ఒకనాఁడు ఏకాంతమున అర్జునుఁడు శ్రీకృష్ణునితో, "శ్రీకృష్ణా ! నీనామములకు నిర్వచనమును నీవు తప్ప మఱియొకఁడు వర్ణింపలేఁడు. కావున ఆనిర్వచనములను చెప్పుము" అని పలికెను. శ్రీకృష్ణుడు ఆనిర్వచనములతోపాటు ఎన్నో విశేషములను చెప్పెను.

'చతుర్యుగసహస్రాంతమున ఏర్పడిన యొక మహాప్రళయమునందు లోకమంతయు జలార్ణవమై జగత్తు అవ్యక్త స్థితియందుండెను. ఆ మహాతమస్సునుండి హరి ప్రాదుర్భవించెను. ఆయన సృష్టింపఁదలంపఁగా ఆయన నేత్రములనుండి అగ్ని, సోముఁడు ఉద్భవించిరి. పిదప భూతములు సృష్టింపఁబడుచుండఁగా ప్రజలు బ్రహ్మక్షత్త్రము నుపాసింపఁజొచ్చిరి. సోముఁడే బ్రహ్మము. బ్రహ్మమే బ్రాహ్మణులు. అగ్నియే క్షత్త్రము. క్షత్త్రము కంటె బ్రహ్మము బలవత్తరము. ఇంతవఱకు బ్రాహ్మణునికంటె శ్రేష్ఠమైన భూతము ఉత్పన్నము కాలేదు. ఎవఁడు

బ్రాహ్మణముఖమున ఆహుతులు వేయుచున్నాఁడో అతఁడు దీప్యమానమైన యగ్నిహోత్రమునందు హోమము చేసినవాఁడగుచున్నాఁడు. బ్రాహ్మణునకే యాజనము విధింపఁబడియున్నది ; క్షత్త్రియవైశ్యులకు విధింపఁబడలేదు. కావున బ్రాహ్మణులు అగ్నిభూతులై యజ్ఞకార్యభారమును వహించుచున్నారు. ఇట్లు అగ్నిభూతులై విద్వాంసులైన బ్రాహ్మణులు అగ్నిని ఆరాధించుచున్నారు.

బ్రాహ్మణులయొక్క మతి, వాక్యము, కర్మ, శ్రద్ధ, తపస్సు భూమిని ద్యులోకమును ధరించుచున్నవి. వారి వాక్కు చిక్కమునందున్న యమృతమువంటిది. ఈలోకమున పరలోకమునందును సత్యముకంటె పరమమైన ధర్మము, తల్లితో సమానుఁడైన గురువు, బ్రాహ్మణులకంటె మించినవాఁడు లేఁడు. ఎవరి రాష్ట్రమునందు బ్రాహ్మణులు వృత్తిహీనులైయుందురో వారికొఱకు ఎద్దులు ఇతర వాహనములు పదార్థములను వహింపవు ; కవ్వము కూడ పెరుగును చిలుకదు. ప్రభువులు దానరహితులైనచో బ్రాహ్మణులు దొంగలగుదురు. నారాయణుని ముఖమునుండి ప్రథమమున బ్రాహ్మణులు ప్రాదుర్భవించిరి. పిదప తక్కిన వర్ణములవారు ఆవిర్భవించిరి. నేను పూర్వము బ్రహ్మదేవుఁడనై బ్రాహ్మణులకొఱకే సురాసురులను మహర్షులను పాలించుచు నిగ్రహించుచుంటిని. అహల్యావిషయమున గౌతముని అతిక్రమించిన యింద్రునివలె ఎందఱో బ్రాహ్మణుల నతిక్రమింపఁబూని కష్టభాజనులైరి. బ్రాహ్మణులమహత్త్వము ఇట్టిది. అందువలన క్షత్త్రియులు బ్రాహ్మణానుగ్రహముననే భూమిని చక్కఁగా పాలింపఁగలిగిరి.'

వ|| య స్సోమ స్త ద్బ్రహ్మ, య ద్బ్రహ్మ తే బ్రాహ్మణాః, యోఽగ్ని స్తత్క్షత్రం,
క్షత్రాత్ బ్రహ్మ బలవత్తరమ్ | కస్మా దితి ? లోక ప్రత్యక్ష మేతత్ ; త ద్యథా || 7

వ|| బ్రాహ్మణేభ్యః పరం భూతం నోత్పన్నపూర్వం ; దే దీప్యమానే అగ్నౌ జుహోతి యో
బ్రాహ్మణముఖే జుహోతీతి కృత్వా బ్రవీమి ..... 8

శ్లో|| బ్రాహ్మణానాం మతి ర్వాక్యం కర్మ శ్రద్ధా తపాంసి చ |
ధారయన్తి మహీం ద్యాం చ, శైక్యో వా గమృతం తథా || 15

(తథా బ్రాహ్మణానాం వాక్ శైక్యో అమృతమ్ - శిక్య మనగా చిక్కము)

శ్లో॥ నాస్తి సత్యా త్పరో ధర్మో, నాస్తి మాతృసమో గురుః ।
బ్రాహ్మణేభ్యః పరం నాస్తి ప్రేత్య చేహ చ భూతలే ॥ 16

శ్లో॥ నైషా ముక్తా వహతి నోతవాహా న గర్గరో మథ్యతి సంప్రదానే
అపధ్వస్తా దస్యుభూతా భవన్తి యేషాం రాష్ట్రే బ్రాహ్మణా వృత్తిహీనాః ॥ 17

శాంతిపర్వము - అధ్యాయము 343

## 4. హరిహరాద్వైత వచనము

శ్రీకృష్ణుఁడు అర్జునునితో ఇట్లనెను. "స్థావరజంగమాత్మకమైన సకలమునకు ప్రభవకారణమైన నా ప్రకృతి నుండి అనిరుద్ధుఁడు ఉదయించెను. ఆయన లోకములకు ప్రభవస్థానము. ప్రళయాంతమునందు ఆయన యనుగ్రహమున ఒక పద్మము ప్రాదుర్భవించెను. దాని నుండి ఆదేవదేవుని ప్రసాదమువలననే బ్రహ్మ యుదయించెను. కల్పాంతమునందు ఆయనిరుద్ధునకు క్రోధము కలుగగా దాని నుండి రుద్రుఁడు జనించెను. అట్లు ఆయనచేత నియమితులై బ్రహ్మ, రుద్రుఁడు సృష్టిసంహారకారకులైరి.

రుద్రుఁడు ఉగ్రవ్రతధరుఁడు, యోగి, పరమదారుణుఁడు. ఆయనను నారాయణాత్మకునిగా నెఱుంగవలయును. ఏ యుగమునందైనను మహేశ్వరుఁడు పూజింపఁబడినచో నారాయణుఁడు సంపూజితుఁడగును. నేను సకలలోకములకు ఆత్మను. విష్ణుఁడనైన నేను ఏదేవునకు ప్రణమిల్లను. నాకు వరమీయఁగలిగిన దేవుఁడెవఁడును లేఁడు. అందువలన నాకు ఆత్మయైన పరమేశ్వరునే నేను పుత్రార్థినై అర్చించితిని. ఆవిధముగా నేను లోకమునకు ప్రమాణమును ఏర్పఱచితిని. దానిని లోకము అనువర్తించుచున్నది.

శ్లో॥ ఉగ్రవ్రతధరో రుద్రో యోగీ పరమదారుణః ।
దక్షక్రతుహర శ్చైవ భగనేత్రహర స్తథా ॥ 21

శ్లో॥ నారాయణాత్మకో జ్ఞేయః పాండవేయ యుగే యుగే
తస్మిన్ హి పూజ్యమానే వై దేవదేవే మహేశ్వరే ॥ 22

శ్లో|| సంపూజితో భవే త్పార్థ దేవో నారాయణః ప్రభుః |
అహ మాత్మా హి లోకానాం విశ్వేషాం పాండునందన || 23

శ్లో|| న హి మే కేనచి ద్దేయో వరః పాండవనందన |
ఇతి సంచింత్య మనసా పురాణం రుద్ర మీశ్వరమ్ || 25

శ్లో|| పుత్త్రార్థ మారాధితవా నహ మాత్మాన మాత్మనా |
న హి విష్ణుః ప్రణమతి కస్మైచి ద్విబుధాయ చ || 26

## శాంతిపర్వము - అధ్యాయ 342

దక్షయజ్ఞసందర్భమున శివునకు నారాయణునకు యుద్ధము సంభవించెను. అప్పుడు బ్రహ్మదేవుఁడు వచ్చి "మహేశ్వరా ! పూర్వసర్గమున నేను నారాయణుని ప్రసాదమువలన, నీవు ఆయన క్రోధమువలన జన్మించితిమి ; కావున నాతో కూడ నారాయణుని ప్రసన్నుని గావింపుము ; లోకములకు శాంతి కలుగును గాక" అనెను. వెంటనే శివుఁడు నారాయణుని శరణుపొందెను. నారాయణుఁడు ప్రసన్నుఁడై శివునితో ఇట్లనెను. "ఎవఁడు నిన్ను తెలిసికొనుచున్నాఁడో వాఁడు నన్ను తెలిసికొనును. ఎవఁడు నిన్ను అనుసరించునో వాఁడు నన్ను అనుసరించును. మన కిర వురకు భేదము లేదు. నీవు మఱియొకవిధముగా తలంపకుము".

అర్జునా ! గుహ్యములు నిరుక్తములు ఋషిసంకీర్తితములైన నానామములు [illegible] చెప్పితిని. ఈ నామములతో బహువిధరూపముతో భూమియందు [illegible]లోక బ్రహ్మలోకములందును చరించుచుందును. నీవు నాచే రక్షింపఁబ[illegible]మున గొప్ప జయమును పొందితివి. ఈ యుద్ధమునందు నీకు ముందుగా నడుచుచున్నవానిని దేవదేవునిగా ఎఱుంగుము. అతఁడే కాలుఁడు. అతఁడే క్రోధజాఁడైన రుద్రుఁడు".

శ్లో|| ఋషిభి ర్బ్రహ్మణా చైవ విబుధై శ్చ సుపూజితః |
ఉవాచ దేవ మీశాన మీశ స్స జగతో హరిః || 102

శ్లో|| య స్త్వాం వేత్తి స మాం వేత్తి ; య స్త్వా మను స మా మను
నావయో రంతరం కించి న్మా తేஉభూ ద్బుద్ధి రన్యథా || 103

శ్లో॥ నామాని చైవ గుహ్యాని నిరుక్తాని చ భారత ।
ఋషిభిః కథితా నీహ యాని సంకీర్తితాని తే ॥ 107

శ్లో॥ ఏవం బహువిధై రూపై శ్చరా మీహ వసుంధరామ్ ।
బ్రహ్మలోకం చ కౌంతేయ గోలోకం చ సనాతనమ్ ॥ 108

శ్లో॥ మయా త్వం రక్షితో యుద్ధే మహాన్తం ప్రాప్తవాన్ జయమ్ ।
య స్తు తే సోఽగ్రతో యాతి యుద్ధే సంప్రత్యవస్థితే ॥ 109

శ్లో॥ తం విద్ధి రుద్రం కౌంతేయ దేవదేవం కపర్దినమ్ ।
కాల స్స ఏవ కథితః క్రోధజేతి మయా తవ ॥ 110

శాంతిపర్వము - అధ్యాయ 343

"ఈ యుద్ధమునందు" (యుద్ధే సంప్రత్యుపస్థితే) అని కృష్ణుఁ డనుటవలన కురుక్షేత్ర యుద్ధమునందే రుద్రుఁడు అర్జునుని రథమునకు ముందు నడచుచుండె నని స్పష్టమగుచున్నది. అంతకుపూర్వము తరువాత కూడ జరిగిన యుద్ధములలో కృష్ణుఁడే అర్జునుని రథమునకు ముందు నడచుచుండె నని గ్రహింపవలసియున్నది. శ్రీకృష్ణుఁడు సారథిగా రథమునందున్నప్పుడు రుద్రుఁడు రథమునకు ముందు నడచుచుండె నన్నమాట.

## 5. శ్రీకృష్ణతపశ్చర్యా చమసము

పరమేశ్వరుని నామములనుగూర్చి చెప్పు మని యుధిష్ఠిరుఁడడుగగా భీష్ముఁడు వాసుదేవుని వంక చూచి, "కృష్ణా ! బ్రహ్మలోకమున తండు మహర్షికి బ్రహ్మదేవుఁడు ఉపదేశించిన శివనామములను ఆదేవుని మహత్త్వమును విష్ణుఁడవైన నీవే చెప్పఁగలవు; చెప్పుము" అనెను. శ్రీకృష్ణుఁడు ఆచమించి శుచియై ఇట్లు చెప్పెను.

"సాంబునికొఱకు నేను తపస్సు చేసి శివుని సాక్షాత్కరింపఁజేసికొనిన వృత్తాంతమును వినుఁడు. ప్రద్యుమ్నాదులైన రుక్మిణీపుత్రులను చూచి జాంబవతి, "నీతో సమానుఁడైన పుత్త్రుని నాకు కూడ ప్రసాదింపుము" అని నన్ను ప్రార్థించెను.

నేను నేరే యని పెద్దలవలన భార్యాబంధువులవలన సెలవుఁగైకొని గరుత్మంతునిపై హిమవంతమునకు చేరి ఉపమన్యువును సందర్శించితిని.

ఆమహర్షి నాకు స్వాగతమొసంగి, "నీతో సమానుఁడైన పుత్త్రుని నీవు తప్పక పొందఁగలవు" అని పరమేశ్వరుని వలన వరములను పొందిన యనేకుల వృత్తాంతములను చెప్పి, 'నీవు ఉమాసమేతుఁడైన పరమేశ్వరుని వలన ఇరువది నాలుగు వరములను పొందఁగలవు' అని ప్రోత్సహించెను.

పిదప నేను ఆయనవలన తపోదీక్షనొంది అయిదునెలలు ఘోరముగ తపస్సు చేయఁగా ఉమతో మహేశ్వరుఁడు సాక్షాత్కరించెను. నేను ఆయనను స్తుతింపఁగా నాపై పుష్పవర్షము కురిసెను. ఆయన నన్ను ఎనిమిది వరములను కోరుకొమ్మనెను. నేను ధర్మమున దృఢత్వము, యుద్ధమున శత్రుఘాతనము, శ్రేష్ఠమైన యశస్సు, పరమమైన బలము, యోగము, ప్రియత్వము, నీ సన్నికర్షము, పుత్త్రశతములను ప్రసాదింపుము అని ప్రార్థించితిని. ఆయన అట్లే యొసంగెను.

పిమ్మట ఉమాదేవి ఇట్లనెను. "కృష్ణా ! మహేశ్వరుఁడు నీకు సాంబుఁడను పుత్రు నొసంగెను. నావలన కూడ నీవు ఎనిమిది వరములను కోరుకొనుము". నేను ఆమెకు నమస్కరించి, 'అమ్మా ! విప్రులయందు కోపము కలుగకుండుట, పితృప్రసాదము, సుతశతము, పరమభోగము, కులమునందు ప్రీతి, మాతృప్రసాదము, శమము, తక్షత్వమును ప్రసాదింపుము' అని ప్రార్థించితిని. ఆమె నా కోరికలకు చాల సంతుష్టురాలై, 'అవియన్నియు నీకు లభించును ; మఱియు పదునాఱువేల మంది భార్యలు, వారియందు ప్రియత్వము, అది అక్షయమగుట, బాంధవులవలన శ్రేష్ఠమైన ప్రీతి, నీశరీరము ఎల్లప్పుడు కామ్యమై యుండుట, ఇంటియందు నిత్యము ఏడువేలమంది యతిథులు భుజించుచుండుట నీకు వరములుగా ఇచ్చుచున్నాను' అని పలికెను.

వెంటనే ఆయాది దంపతులు అంతర్ధానము నొందిరి. నెను తిరిగి వచ్చి ఉపమన్యువునకు జరిగిన దంతయు చెప్పితిని. ఆయన ఆదేవునకు నమస్కరించి యిట్లనెను. 'అందఱకు సమముగా అనుగ్రహించు దేవుఁడు, ఎల్లరకు సమానమైన

గతి, అందఱకును సమమగు దానము, యుద్ధమున సకలవీరులకు సముఁ డైనవాఁడును ఉండఁడు'.

శ్లో|| నాస్తి సర్వసమో దేవః నాస్తి సర్వసమా గతిః |
నాస్తి సర్వ సమం దానం నాస్తి సర్వసమో రణే || 12

అనుశాసనికపర్వము - అధ్యా. 15

ఉపమన్యువు మరల ఇట్లు చెప్పెను. "పూర్వము తండి అనుమహర్షి పదివేల సంవత్సరములు పరమేశ్వరు నారాధించెను. సాక్షాత్కరించిన యాదేవుని అనేకవిధముల స్తుతించి వరములను పొంది నాయొద్దకు వచ్చి శివుని రహస్యనామములను, మాహాత్మ్యమును నాకు ఉపదేశించెను". పిదప ఉపమన్యువు శుచియై దేవదేవునకు ప్రాంజలియై బ్రహ్మప్రోక్తమై తండిచే ఉపదేశింపఁబడిన యష్టోత్తర సహస్రశివనామములను నాకు ఉపదేశించెను".

ఇట్లు చెప్పి శ్రీకృష్ణుఁడు ఆనామములను మాహాత్మ్యమును యుధిష్ఠిర భీష్మాదులకు వినిపించెను.

ఈ తపోవృత్తాంతము, నరకాసురుని వధించి పదునాఱువేలమంది కన్యలను శ్రీకృష్ణుఁడు వరించుటకు ముందే జరిగెననుట స్పష్టము.

జాంబవంతియందు తనతో సమానుఁడైన పుత్రుని కోరక ఆయన పుత్రశతములను కోరుట గమనింపఁదగియున్నది. జాంబవతి తన్ను ప్రార్థించినను ఆయన ఆమెకు ఆవిధముగా వాగ్దానము చేయలేదు. ప్రద్యుమ్నాదులే శ్రీకృష్ణునకు సమానులు కారు. వారికంటె అధికుఁడై తనతో సమానుఁడగు పుత్త్రుఁడు, జ్యేష్ఠపత్నియైన రుక్మిణికి గాక జాంబవతికి కలుగునట్లు చేయుట ఆయనకు యుక్తము కాదు. అందువలన ఆయన అట్లు సంకల్పింపలేదు. ఈ కారణముచేత జాంబవతికి సంభవించిన సాంబుఁడు సామాన్యుఁడే అయ్యెను. అంతేకాక, వీనివలననే ముసలము పుట్టి యాదవప్రళయము సంభవించెను. కావున సాంబుఁడు శ్రీకృష్ణునితో సమానుఁడు కాదనుట స్పష్టము.

శ్రీకృష్ణుఁడు ఎనిమిది వరములలో దీనిని అడుగకపోయినను మహేశ్వరుఁడు జాంబవతియందు పుత్త్రుని ప్రసాదించెనని ఉమ చెప్పినది. అందువలన మహేశ్వరుఁడిచ్చిన వరములు తొమ్మిద యయ్యెను. అట్లె మఱియొకవరమును కూడ ఈశ్వరుఁడు ఇచ్చి యుండవచ్చును. ఆవిధముగా ఈశ్వరుఁడిచ్చినవి పది కాగా పార్వతి ఇచ్చినది పదునాల్గై మొత్తము వరములు ఇరువది నాల్గు అయ్యెను.

వ్యవహారమునందు సర్వసమత్వము (equality) ఎంత అసంభవమో, ఆభావన ఎంత అసమంజసమో ఉపమన్యువు మాటలలో చక్కఁగా వ్యక్తమగుచున్నది. "సర్వసముఁడైన దేవుఁడు లేఁడు" (నాస్తి సర్వసమోదేవః) అనగా దేవుఁడు అందఱి విషయములలో సమానముగా వర్తింపఁడనియర్థము. దేవుఁడు కూడ వ్యక్తుల యొక్క అర్హతలనుబట్టియే అనుగ్రహించును. తండు మహర్షి పదివేల సంవత్సరములు ఆరాధింపగా మహేశ్వరుఁడు సాక్షాత్కరించి అనుగ్రహించెను. కాని శ్రీకృష్ణుఁడు అయిదునెలలు ఆరాధించినంతనే ఆయన అనుగ్రహించి వరము లిచ్చెను. శ్రీకృష్ణుఁడు పూర్వజన్మమున నారాయణమహర్షిగా లక్షల యేండ్లుగా తపస్సు చేసి సిద్ధిని పొందినవాఁడు. అందువలన ఆయనకు పరమేశ్వరుఁడు అయిదు నెలల తపస్సునకే ప్రసన్నుఁడయ్యెను. తండు మహర్షికి పూర్వజన్మమున అంత తపస్సాధన యుండియుండదు. అందువలన ఆయనవిషయమున ఈశ్వరుఁడు పదివేలయేండ్లకు ప్రసన్నుఁడయ్యెను. భిన్నగుణములు శక్తులు కలవారిని సమానముగా ఆదరించుట తప్పు. ప్రతివ్యక్తిని వానియర్హత ననుసరించియే ఆదరింపవలె.

అట్లే అందఱకును సమానమైన గతియుండదు. గతి అనగా పొందదగిన స్థితి లేక స్థానము. ప్రతివ్యక్తికి వాఁడు చేయు పుణ్యాపాపముల ననుసరించి ఈలోకమునగాని పరలోకమునగాని స్థానము లభ్యమగును. కొందఱు సమానమైన యొకకార్యమునే అనుష్ఠించినను వారికి కూడ ఫలము సమానముగా నుండదు. ఒక్కొక్క వ్యక్తికి ఆకార్యమునందు గల శ్రద్ధావిశేషమును బట్టి అనుష్ఠాన తీవ్రతను బట్టి ఫలములు భిన్నముగానే యుండును. ఒక గురువువలననే ఒక తరగతియందే ఒకవిధమైన విద్యాబోధనమును పొందుచున్న విద్యార్థుల కందఱకు పరీక్షలయందు సమానముగా ఫలము లభించుట లేదు. ఒకఁడు మేధాశక్తి చేత శ్రద్ధాతిశయమువలన

ఉత్తముఁడుగా ఉత్తీర్ణుఁడగుచుండఁగా, మఱియొకఁడు ఆగుణములు లేనివాఁడు ఉత్తీర్ణుఁడు కాలేక పురోగతిని పొందలేక పోవుచున్నాఁడు. కావున అందఱకు సమానమైన గతి కల్గుట అసంభవము.

"సర్వసమానమైన దానము ఉండదు" అనగా అనేకులకు దానములు చేయవలసినప్పుడు ఆయావ్యక్తుల యర్హతలనుబట్టి హెచ్చుతగ్గులుగా ఈయవలసినదే కాని అందఱకు సమానముగా ఈయరాదు. ఒకవేదము మాత్రమే అధ్యయనము చేసినవానికి నాలుగువేదములయందు పారీణతనొందిన వానికి సమానముగా దానము చేయరాదు. అట్లు చేసినచో అది పాపమును కలిగించును. కావున సకలపదార్థములయందు సమముగానున్న బ్రహ్మమును ఏకముగా దర్శించు జ్ఞానయోగమున తప్ప వ్యవహారమునందు సమత్వము సమంజసము కాదు, సంభవము కూడ కాదు.

## 6. బ్రాహ్మణపూజ్యత్వ చమసము

మానవులలో పూజ్యులెవ్వరని యుధిష్ఠిరుఁడు అడుగగా భీష్ముఁడు శ్రీకృష్ణనారద సంవాదమును చెప్పెను. బ్రాహ్మణులను పూజించుచున్న నారదుని చూచి యొకప్పుడు శ్రీకృష్ణుఁడు, "భగవానుఁడా ! నీవు ఎవరిని పూజించుచున్నావు ?" అని యడిగెను. ఆయన ఇట్లు చెప్పెను. "బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలను ఎవరు పూజించుచున్నారో, ఎవరు జితేంద్రియులై అధ్యయనపరాయణులై సత్యమును ధర్మమును ఉపాసించుచున్నారో, ఎవరు లోభరహితులై పుణ్యశీలురై శ్రుతసంపన్నులై వ్రతనిష్ఠులై యున్నారో అట్టి బ్రాహ్మణులకు నేను నిత్యము నమస్కరించుచున్నాను. నీవు కూడ అట్టి బ్రాహ్మణులను పూజింపుము. వారు ఈ లోకమున పరలోకమున కూడ సుఖములను ప్రసాదింపఁగలరు. కృష్ణా ! నీవలె ఎవరు తల్లిదండ్రులయందు గురువులయందు చక్కఁగా వర్తించుచుందురో వారు ఎన్నికష్టములనైన దాటగలరు".

ఈ సంవాదమును చెప్పి భీష్ముఁడు యుధిష్ఠిరునితో, "వత్సా ! నీవు పితృదేవ ద్విజాతిథులను చక్కఁగా పూజించుచున్నావు. కావున నీవు కూడ ఇష్టమైనగతిని పొందగలవు" అనెను.

దీనినిబట్టి బ్రాహ్మణేతరులే కాక బ్రాహ్మణులు కూడ ధర్మకర్మ తపస్సులచేత తమకంటె అధికులైన బ్రాహ్మణులను తప్పక పూజింపవలయుననుట స్పష్టము.

## 7. ఆశ్చర్యసంఘటన చమసము

లోకమున ఆశ్చర్యకరమైన దేదియో చెప్పు మని యుధిష్ఠిరుఁడు భీష్మునడిగెను. భీష్ముఁడిట్లనెను. "అత్యంతము మనోహరమైన యీ శ్రీకృష్ణుని కథను మహేశ్వరుని ప్రభావమును వినుము.

ఇతఁడు పూర్వము ద్వాదశవార్షికమైన వ్రతదీక్షతో హిమవంతమున తపస్సు చేసెను. అప్పుడు పర్వతనారదాది మహర్షులు ఇతనిని దర్శింపవచ్చిరి. వారినందఱను ఇతఁడు యథావిధి నర్చించెను. అందఱు సుఖాసీనులై ధర్మసంహితములైన రాజర్షుల గాథలను దేవతల కథలను ప్రసంగించుచుండిరి. అప్పుడు తటాలున ఇతని వక్త్రము నుండి అగ్నివెలువడి ఆశైలమును దహించి తిరిగి వచ్చి శిష్యునివలె ఇతని పాదములను స్పృశించెను. అప్పుడితఁడు శైలమువంక దయార్ద్రుఁడై చూచెను. వెంటనే శైలము యథాపూర్వముగ సుపుష్పిత లతాద్రుమశోభిత మయ్యెను.

ఋషులందఱు విస్మితులైరి. ఇతడు వారిని చూచి, "మీరేల విస్మితులైతిరో చెప్పు"డని యడిగెను. వారిట్లనిరి. 'కృష్ణా ! ఈ యగ్నినిర్గమనము ఎందులకు కలిగెనో చెప్పుము. మాసంశయము తీరిన తరువాత మేము చూచిన వినిన యిట్టి వృత్తాంతమును చెప్పెదము'.

ఇతఁడిట్లు చెప్పెను. "నాదేహమందున్న వైష్ణవతేజము అగ్నిరూపమున వెలువడి వరదుఁడైన మహేశ్వరుని దర్శింపనేగెను. ఆయన నాతేజమునందలి యర్థభాగముతో నాకు పుత్త్రుఁడు కలుగునని చెప్పెను. అంతట ఈ తేజము మరలివచ్చి శిష్యునివలె పాదమూలమును చేరి శమించెను.

మీరందఱు జ్ఞానవిజ్ఞాన శోభితులు. మీరు చూచినది గాని విన్నదిగాని పరమాద్భుతమైన విషయమును చెప్పుడు. భువియందుగాని దివియందుగాని నేను చూడని యద్భుత మేదియు నుండదు. నా పరాప్రకృతి ఎక్కడను కుంఠితము

కాదు. దానియందు గోచరము కానిది యేదియు నుండదు. ఎవనికైనను తనయీశ్వరత్వము తనకు ఆశ్చర్యముగా తోఁచదు. అయినను మహాత్ములైన మీవాగమృతమును గ్రోలవలయునని కోరుచున్నాను. శ్రద్ధతో గ్రహింపఁదగిన విషయము సజ్జనుల చెవియందు ప్రవేశించి శైలమునందు చెక్కఁబడిన చిత్రమువలె చిరకాలము నిలిచియుండును. సజ్జనుల సమాగమమునందు వారి ముఖమునుండి నిస్సృతమైనది మానవుల బుద్ధికి దీప్తిని కలిగించును. కావున నేను మీవలన విన్నదానిని మరల సజ్జనసమాగమమున చెప్పెదను.

శ్లో॥ య చ్ఛ్రుతం యచ్చ వో దృష్టం దివి వా యది వా భువి ।
ఆశ్చర్యం పరమం కించి త్త ద్భవంతో బ్రువంతు మే ॥ 39

శ్లో॥ తస్యామృతనికాశస్య వాఙ్మధో రస్తి మే స్పృహా ।
భవద్భిః కథిత స్యే హ తపోవననివాసిభిః ॥ 40

శ్లో॥ య ద్యప్యహ మదృష్టం వో దివ్య మద్భుతదర్శనమ్ ।
దివి వా భువి వా కించి త్పశ్యా మ్యమరదర్శనాః ॥ 41

శ్లో॥ ప్రకృతి స్సా మమ పరా న క్వచి త్ప్రతిహన్యతే ।
న చాత్మగత మైశ్వర్య మాశ్చర్యం ప్రతిభాతి మే ॥ 42

శ్లో॥ శ్రద్ధేయః కథితో హ్యర్థః సజ్జనశ్రవణం గతః ।
చిరం తిష్ఠతి మేదిన్యాం శైలే లేఖ్య మి వార్పితమ్ ॥ 43

శ్లో॥ త దహం సజ్జనముఖా న్నిస్సృతం త త్సమాగమే ।
కథయిష్యా మ్యహ మహో బుద్ధిదీపకరం నృణామ్ ॥ 44

అనుశాసనికపర్వము - అధ్యాయ 139

మునులు చెప్పబోవు నద్భుత సంఘటనము సర్వజ్ఞుఁడైన కృష్ణునకు తెలియనది కాదు. మనకు తెలిసిన విషయమే యైనను మహాత్ములు చెప్పునప్పుడు మనకు స్ఫురింపని యనేక విషయములతో రసానందకందములై అద్భుతావహములై యుండును.

అందువలననే తెలిసిన కథలనే మరల మరల జనులు హరికథలలో పురాణములలో వినుచుందురు. కావ్యవిషయమున ఆనందవర్ధనుఁడు చెప్పినది యిచ్చట గమనింపఁదగియున్నది. "ఇంతకుపూర్వము మనము అనేక పర్యాయములు చూచిన పదార్థములే, కావ్యమున రసయుక్తములైనప్పుడు, మధుమాసమున తరువులవలె అన్నియు క్రొత్తవియైనట్లే భాసించును".

శ్లో॥ దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్ ।
సర్వే నవా ఇవాభాన్తి మధుమాస ఇవ ద్రుమాః ॥

ధ్వన్యాలోక - I - శ్లో.

కవులవాక్యములకే ఇంతశక్తియుండగా మహాత్ముల వచనములకు అమోఘమైన శక్తి యుండునని వేఱుగా చెప్పనక్కఱ లేదు. కవుల వాక్యములందు రసము ప్రధానముగా నుండును. మహాత్ముల వచనములందు రసాన్వితమైన ధర్మోపదేశమో తత్త్వబోధయో ప్రధానమై యుండును. వానిని శ్రద్ధతో విన్నచో ఱాతియందు చెక్కఁబడిన శిల్పమువలె ఆయుపదేశము హృదయమున స్థిరముగా నెలకొనియుండును. కావున మహాపురుషులేదేని విషయమును చెప్పుచున్నప్పుడు, "ఇది మనకు తెలిసినదేగదా" అని ఉపేక్షతో ఉండరాదు.

హిమవంతమున జరిగిన యద్భుతమును చెప్పుమని మహర్షులు తమకు ప్రతినిధినిగా నారదుని ప్రార్థించిరి. ఆయన ఇట్లు చెప్పెను. "ఒకప్పుడు పరమేశ్వరుఁడు హిమవంతమున తపస్సు చేయుచుండెను. మహర్షులు ఆయనను దర్శింపవచ్చిరి. అప్పుడు పార్వతీదేవి కుతూహలముతో వెనుకనుండి వచ్చి వినోదము కొఱకు నవ్వుచు రెండు చేతులతో పరమేశ్వరుని నేత్రములను మూసివైచెను. వెంటనే జగత్తు తమోమయమయ్యెను. ఆక్షణముననే పరమేశ్వరుని లలాటమున తృతీయనేత్ర ముదయించి సూర్యబింబ సదృశమైన యగ్నిజ్వాల బయలుదేరి లోకమునకు వెలుగు కలిగించెను. కాని ఆ జ్వాలకు సన్నిహితమైన హిమవంతము దగ్ధమయ్యెను. ఆమె భయపడి ఆయన కనులపై నుండి తన చేతులను తీసివేసెను. వెంటనే లోకము యథాపూర్వమై, ఆజ్వాల ఉపసంహృతమయ్యెను. హిమవంతమునకు కలిగిన

వినాశమును చూచి హైమవతి ఖిన్నురాలై భర్తను ప్రార్థించెను. ఆమె దైన్యమును చూచి శంకరుఁడు ప్రసన్నదృష్టితో హిమవంతమును యథాపూర్వముగా పుష్పితలతా తరుశోభితము గావించెను. తృతీయనేత్రము అగ్నిజ్వాల ఏల ప్రాదుర్భవించెనని ఆమె అడుగఁగా ఆయన ఇట్లు చెప్పెను. "నానేత్రములు సూర్యచంద్రాత్మకములు. నీవు--బాల్యమువలన, అదిఁయెఱుంగక, నానేత్రములను మూసినంతనే లోకము తమోమయమై జగద్వ్యాపారము స్తంభించెను. లోకమునకు వెలుఁగునిచ్చుటకై లలాటమున మూడవకన్నును సృష్టించి దానినుండి ఆదిత్యబింబ సదృశమైన జ్వాలను వెలువరించి లోకమునకు వెలుఁగు కలిగించితిని. అజ్వాలయొక్క వేడిమిచేత శైలము విధ్వస్తమయ్యెను. దానిని మరల నీప్రీతికొఱకు శోభితమొనర్చితిని".

పిమ్మట ఋషులు వాసుదేవుని మహత్త్వమును చెప్పుమని శంకరుని ప్రార్థింపఁగా ఆ మహాదేవుఁడు ఇట్లు చెప్పెను. "వాసుదేవుఁడు సకల జగత్తునకు సృష్టి స్థితిలయకారకుఁడు. ఆయనకు మించినది ఏదియు లేదు. ఆయన లోకహితముకొఱకు పెక్కు పర్యాయములు అవతరించెను. ఇకముందు శూరసేనములలో వాసుదేవుఁడుగా అవతరించి ద్వారకయందుండి జరాసంధాదులను నిగ్రహించును. మీరు ఆయనను బ్రహ్మదేవునివలె అర్చింపుఁడు. నన్ను పరమేష్ఠిని చూడఁగోరువారు ఆయనను దర్శింపవలె. ఆయనను దర్శించినచో మమ్ము ఇద్దఱను చూచినట్లే అని ఎఱుంగుఁడు. ధర్మవేత్తలచేత ఎల్లప్పుడు ఆ దేవేశ్వరుఁడు నమస్కరింపఁదగినవాఁడు. ఆయనను అభ్యర్థించినచో పరమధర్మమును అనుష్ఠించి నట్లగును. మనోవాక్కాయకర్మలచేత ద్విజాలు వాసుదేవుని దర్శించి పూజింపవలె. ఆ మహావరాహుఁడు సర్వలోకపితామహుఁడైన యాజగత్పతికి నేను కూడ నిత్యము నమస్కరించుచున్నాను."

శ్లో|| విక్రమేణ చ సంపన్న స్సర్వపార్థివపార్థివః |
శూరసేనేషు సంవృద్ధో ద్వారకాయాం వసన్ ప్రభుః || 36

శ్లో|| పాలయిష్యతి గాం దేవిం విజిత్య నయవి త్సదా
తం భవన్త స్సమాసాద్య వాఙ్మాల్యై రర్హణై ర్వరైః || 37

శ్లో॥ అర్చయన్తు యథాన్యాయం బ్రహ్మాణ మివ శాశ్వతమ్ ।
యో హి మాం ద్రష్టు మిచ్ఛేత బ్రహ్మాణం చ పితామహమ్ ॥ 38

శ్లో॥ ద్రష్టవ్య స్తేన భగవాన్ వాసుదేవః ప్రతాపవాన్ ।
దృష్టే తస్మి న్నహం దృష్టో న మేఽత్రాస్తి విచారణా ॥ 39

శ్లో॥ పితామహో వా దేవేశ ఇతి విత్త తపోధనాః । 40

శ్లో॥ ధర్మవిద్భి స్సదై వేశో నమస్కార్య స్సదోద్యతైః ।
ధర్మ ఏవ పరో హి స్యాత్ తస్మి న్నభ్యర్చితే విభౌ ॥ 43

శ్లో॥ కర్మణా మనసా వాచా నమస్యో ద్విజై స్సదా ।
యత్నవద్భి రుపస్థాయ ద్రష్టవ్యో దేవకీసుతః ॥ 51

శ్లో॥ మహావరాహం తం దేవం సర్వలోకపితామహమ్ ।
అహం చైవ నమస్యామి నిత్య మేవ జగత్పతిమ్ ॥ 53

ఆనుశాసనిక పర్వము - అధ్యా. 147

మహేశ్వరుఁడు చెప్పినవిషయమును నారదుఁడు వినిపించిన తరువాత ఋషులందఱు ఇతనియొద్ద నుండి వెడలిపోయిరి. ఇతఁడు ద్వాదశవార్షిక వ్రతమును ముగించుకొని ద్వారకకు చేరెను. వ్రతఫలముగా రుక్మిణికి ప్రద్యుమ్నుఁ డుదయించెను.

ఇది మహాత్ముఁడైన నారదుని సందేశము. కావున నీవు ఆ దేవుని పూజింపుము. హిమవంతమునందు ఈ వాసుదేవునివలన పరమేశ్వరునివలన జరిగిన యద్భుతములు వారికి స్వాభావికములు. ఈ మహాపురుషుని యద్భుత కార్యములు అనంతములు".

## 8. బ్రాహ్మణసేవావ్రత చమసము

"బ్రాహ్మణపూజనము వలన ఏమి ఫలమును చూచి వారిని నీవు పూజించుచున్నావు" అని యుధిష్ఠిరుఁడు భీష్మునడిగెను. "దానిని చక్కఁగా నెఱింగినవాఁడు కృష్ణుఁడే. దానిని ఆతఁడే చెప్పును గాక" అని భీష్ముఁ డనెను. అప్పుడు శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెను.

"ద్వారకయం దొకప్పుడు ప్రద్యుమ్నుఁడు బ్రాహ్మణులవలన కుపితుఁడై నాయొద్దకు వచ్చి, "బ్రాహ్మణులను పూజించుటవలన ఏమి ఫలము ? భువియందుఁగాని దివియందుఁగాని వారి యాధిక్యమేమి ? మనతో సమానులైన క్షత్రియద్విజాతులను సంపూజించుటవలనఁనేమి ఫలము కలుగును ? చెప్పుము" అని యడిగెను.

నేనిట్లు చెప్పితిని. "దేవతాపితృపూజలయందు బ్రాహ్మణులు సంతోషపెట్టఁదగినవారు. వారు సోమరాజులు ; మన సుఖదుఃఖములకు ప్రభువులు. ఈ లోకమున పరలోకమున సౌఖ్యము బ్రాహ్మణులవలననే కలుగుచున్నది. ఇందు నాకేమియు సంశయము లేదు. బ్రాహ్మణపూజనమువలన కీర్తి యశస్సు బలము కలుగును. లోకేశ్వరులు కూడ బ్రాహ్మణులను పూజించువారే. కావున "నేను ఈశ్వరుఁడ" నని నేను వారినెట్లు పూజింపకుందును ? నీవు బ్రాహ్మణులవిషయమున కోపమును పొందకుము.

పూర్వము ఒకప్పుడు దుర్వాసోమహర్షి మనయింట నుండెను. ఆయనవర్తనము చాల చిత్రముగ నుండెను. ఒకప్పుడాయన వేలమంది భుజించునాహారమును తినును. మఱియొకప్పుడు కొంచెము తినును ; ఇంకొకప్పుడు అసలే తినఁడు ; ఒకప్పుడు నవ్వును ; వేఱొకప్పుడు ఏడ్చును.

ఒకనాఁడాయన తన వసతియందు ప్రవేశించి శయ్యపై వస్త్రములను, అలంకృతలైన కన్యలను దగ్ధమొనరించి నాయొద్దకు వచ్చి పాయసభోజనమును కోరెను. ఇంటిలో జనులు అనేకపాకములను గావించిరి. నేను ఆయనకు పొగలు [illegible]క్కుచున్న పాయసమును నివేదించితిని. దానిని ఆయన తిని మిగిలిన దానిని నాయొడలికి పూసికొమ్మనెను. ఆయుచ్ఛిష్టమును నేనట్లే పూసికొంటిని. ఆయన నాప్ర[illegible]న నున్న[illegible]యమ్మను చూచి నవ్వుచు ఆమెకు పాయసమును పూసెను. పిమ్మట ఆమెను ర[illegible]కట్టి తాను రథమునెక్కి ఇంటినుండి బయలుదేరి ఆమెను నేను చూచుచుండఁగా [illegible]జొచ్చెను. నాకు కొంచెము కూడ ఈర్ష్యగాని కోపముగాని కలుగలేదు. ఆయన [illegible]డనుండి రాజమార్గమున రథమును తోల[illegible]చ్చెను.

ఆ దృశ్యమును చూచి చాల ఆశ్చర్యమును పొంది యాదవులు కుపితులై ఒకరితోనొకరు ఇట్లనుకొనిరి. "ఎవరైనను ఈలోకమున బ్రాహ్మణులుగానే పుట్టవలె; మఱియొక వర్గమున పుట్టఁగూడదు. ఈ రథమునెక్కి మఱియొకఁడు బ్రతుకునా ? పాముविషము తీక్ష్ణము ; అంతకంటెను తీక్ష్ణమైనవాఁడు ద్విజుఁడు. బ్రాహ్మణులకోరల వలని విషముచేత దగ్ధుఁడైనవానికి చికిత్సకుఁడే లేఁడు".

ఆ మహర్షి అట్లు తోలుచుండఁగా మార్గమునందు మాయమ్మ తొట్రుపాటుపడెను. ఆయన కోపించి ఇంకను వేగముగా పొమ్మని తోలఁజొచ్చెను. పిమ్మట అమిత క్రోధముతో ఆయనరథము నుండి దుమికి దక్షిణదిక్కునకు దారిలేని వైపున అడ్డదిడ్డముగా పరువెత్తఁజొచ్చెను. పాయసమును పూసికొనియున్న నేను అట్లే ఆయనవెంట, "భగవంతుఁడా ! ప్రసన్నుఁడ వగుము" అనుచు పరువెత్తఁజొచ్చితిని.

అప్పు డాయన ప్రసన్నుఁడై వెనుకకు తిరిగి యిట్లనెను. "కృష్ణా ! నీవు క్రోధమును జయించితివి. నీయందు అపరాధ మేదియును లేదు. నీయెడ ప్రీతుఁడనైతిని. నా ప్రసన్నతకు ఫలమును చూడుము. దేవతలకు మనుష్యులకు అన్నమునుగూర్చి ఎట్టి భావము కలదో, అట్టిభావమే వారికి నీయందు కలుగును. లోకములలో పుణ్యావహమైన నీకీర్తి యెట్లు ప్రసరించునో అట్లే మూఁడు లోకములయందు వైశిష్ట్యమును పొందఁగలవు. సర్వలోకములకు మిగుల ప్రియుఁడవగుదువు. నీయింటియందు ఏది ఏది పగులఁగొట్టఁబడినదో, దగ్ధమైనదో వినాశితమైనదో అది యంతయు సుస్థితియందుండును. లేదా ఇంకను విశిష్టముగా ఉండును. నీశరీరాంగములయందు పాయసము పూయుటవలన నీవు కోరునంతవఱకు నిన్ను మృత్యువు సమీపింపదు". ఆయన యిట్లనినంతనే నాశరీరమువంక చూచుకొంటిని అది శోభాయుతమై యుండెను. "నీవు పాదతలమునందు పాయసము పూసికొనలేదు. అదిమాత్రము నాకు ప్రియము కాదు" అని ఆయన సాదరముగా పలికెను.

పిమ్మట ఆయన మాయమ్మను చూచి సంతోషముతో ఇట్లనెను. "అమ్మాయీ! సకలస్త్రీలలో నీకు శ్రేష్ఠమైన యశస్సు పరమమైన కీర్తియు కలుగును. నీకు ముసలితనము

రోగములు వివర్ణత్వము కలుగవు. నీవు పవిత్రమైన సువాసన కలదానివై పదునాఱువేల మంది సపత్నులలో శ్రేష్ఠురాలవై కృష్ణునారాధించుచు ఆయనతో సాలోక్యమును పొందఁగలవు.

తరువాత ఆయన నన్ను చూచి, "బ్రాహ్మణులవిషయమున నీబుద్ధి యిట్లే యుండునుగాక !" అని చెప్పి అంతర్ధానము నొందెను. అప్పుడు నాలోనేను, "బ్రాహ్మణుఁడు ఏది చెప్పినను అది యంతయు తప్పక చేయుదును" అని వ్రతమును గైకొంటిని. మీ యమ్మతో కూడ ఈ వ్రతమును గైకొని యింటియందు ప్రవేశించి భగ్నములై దగ్ధములై వినాశితములైయున్న పదార్థములన్నియు అభినవములై దృఢములై యుండెను. కావున కుమారా ! నీవును బ్రాహ్మణులను పూజింపుము".

ప్రద్యుమ్ననకే బ్రాహ్మణులయందు వైమనస్య మున్నదన్నచో తక్కిన యాదవులకు సామాన్యులైన యితరక్షత్రియులకు వారియందు గౌరవము దృఢముగా లేకుండుట అసంభవము కాదు. ఈ కారణముచేతనే సాంబుఁడు మొదలైనవారు మహర్షులను సైతము పరిహసించి యాదవప్రళయమునకు కారకులైరి.

"అలంకృతలైన కన్యలను దగ్ధమొనరించి" అన్నచోట కన్య లనఁగా మంచపుకోళ్లయందు అలంకారముకొఱకు చెక్కఁబడిన కన్యకల బొమ్మలని గ్రహింపవలసి యున్నది.

## 9. భీష్మనిర్యాణ చమసము

భీష్ముఁడు శరీరమును వీడఁదలంచుచు శ్రీకృష్ణుని చూచి యిట్లు వేడుకొనెను. "పురుషోత్తమా ! ఆలుబిడ్డలు లేనివాఁడను ; నీ భక్తుఁడను ; నీయందే చిత్తము గలవాఁడను ; నన్ను రక్షింపుము. నరునితో కూడ బదరికావనమున చిరకాలమున్న పురాణఋషినిగా నిన్నెఱుంగుదును. నారదుఁడు వ్యాసుఁడు వీరిరువురు కృష్ణార్జునులుగా జన్మించితిరని చెప్పిరి. నాకు అనుజ్ఞనిమ్ము. నీచే అనుజ్ఞాతుఁడనై కళేబరమును వదలి పరమగతిని పొందుదును".

శ్రీకృష్ణుఁడు ఇట్లనెను. "నీకు అనుజ్ఞ ఇచ్చుచున్నాను. నీవు వసువులను పొందుము. మహాతేజా ! నీయందు పాపమేదియును లేదు. నీవు పితృభక్తుఁడవు; మార్కండేయునివంటివాఁడవు. అందువలననే కదా మృత్యువు భృత్యునివలె నీకు లోఁబడియున్నది".

పిదప భీష్ముఁడు మూర్ధమును భేదించుకొని దివమునకు పోయెను. ధృతరాష్ట్ర యుధిష్ఠిరాదులు ఆయనకు దహనసంస్కారమును గావించి భాగీరథికి పోయి ఉదకప్రదానము గావించిరి. అప్పుడు గంగాదేవి స్త్రీరూపమైవచ్చి, "భూలోకమున అసమానబలుఁడైన నా పుత్త్రుని పరశురామునిచే అపరాజితుఁడైన వానిని శిఖండి హతుని గావించెనని వినియు నా హృదయము బ్రద్దలు గాకున్నదే" అని విలపింపఁజొచ్చెను.

శ్రీకృష్ణుఁడు, "అమ్మా నీ కుమారుఁడు ఉత్తమలోకమును పొందినాఁడు. వసువుగదా శాపదోషమున మనుష్యుఁడుగా జన్మించెను. క్షత్త్రధర్మము నవలంబించి అర్జునునిచే నిపాతితుఁ డయ్యెను ; శిఖండిచే కాదు. యుద్ధరంగమున ఆయనను ఇంద్రుఁడు కూడ మార్కొనలేఁడు. ఆయన తన యిచ్ఛననుసరించియే స్వర్గమునకు పోయెను. ఆయననుగూర్చి దుఃఖింపకుము" అని యోదార్చెను.

"నీయందు పాపమేదియు లేదు" అని శ్రీకృష్ణుఁడు అన్నప్పుడు, ద్రౌపదీపరిభవాదులను చూచి యుపేక్షించుట వలన భీష్మునియందు సంభవించిన వృజినములన్నియు, అంపశయ్యపై నుండి ఆ బాధను అనుభవించుటచేత, భగవంతుని స్తుతించుటచేత, ధర్మజునకు సకలధర్మతత్త్వములను ఉపదేశించుట చేత నశించెనని గ్రహింపవలసియున్నది. భీష్ముఁడు అనన్యభక్తితో శ్రీకృష్ణుని పరమాత్మను శరణుపొందెను. "సర్వధర్మములను వదలి నన్ను ఒక్కనినే శరణుపొందుము. నిన్ను సర్వపాపముల నుండి ముక్తునిగా చేయుదును" అని శ్రీకృష్ణుఁడు అర్జునునకు చెప్పియుండెను. భీష్ముఁడు అట్టి భక్తుఁడయ్యెను. అందువలన శ్రీకృష్ణుని యనుగ్రహమున ఆయనయందున్న పాపములన్నియు నశించెనని గ్రహింపవలసియున్నది.

# 10. ధర్మజాశ్వాసన చమసము

గంగాదేవిచే అనుజ్ఞనుపొంది అందఱును ఒడ్డునకు ఎక్కి వచ్చినంతనే ధర్మజుఁడు భీష్ముని స్మరించుచు దుఃఖాతిరేకమున కూలఁబడెను. కృష్ణుని ప్రేరణమున భీముఁడు ఆయనను పట్టుకొనెను. ధృతరాష్ట్రుఁడు, "నీయందు దోషము లేదు. నీవు ధర్మయుక్తముగా రాజ్యమును గెలుచుకొంటివి ; కావున పట్టాభిషిక్తుఁడవై పాలింపుము" అని ధర్మరాజు నోదార్చెను.

ఆ మాటలకు ధర్మరాజు మౌనము వహించెను. శ్రీకృష్ణుఁడు ఇట్లు ఆయనను ఓదార్చెను. "భీష్మునివలన వ్యాస నారదాదులవలన రాజధర్మములను వింటివి. నీవు ఇట్లు మూఢులపద్ధతిని అవలంబించుట తగదు. పితృపైతామహమైన వృత్తిని అవలంబించి పాలింపుము. 'నేను పాపాత్ముఁడనైతి' నను తలంపు నీకు కలిగినచో అశ్వమేధమొనర్చి పాపమును పోగొట్టుకొనుము. నీకు ధనము కావలసినచో హిమవంతమునందు కలదు".

హిమవంతమునందు బంగారము నిక్షిప్తమై యుండుటకు హేతువైన మరుత్తునివృత్తాంతమును చెప్పి శ్రీకృష్ణుఁడు ధర్మజునకు ఇట్లు బోధించెను. "వక్రమైనదంతయు మృత్యువు. ఋజువైనదంతయు బ్రహ్మము. జ్ఞానవిషయము ఇంతే. ప్రలాపములవలన ఏమగును ? నీవు కర్మను పరినిష్ఠితముగా చేయలేదు ; శత్రువులను కూడ జయింపలేదు. నీశరీరమందేయున్న శత్రువునేల తెలిసికొనవు ? శీతోష్ణవాయువులవైషమ్యమువలన శరీరవ్యాధి, సత్త్వరజస్తమస్సుల విషమత్వమువలన మానసికవ్యాధియు కలుగుచున్నది. హర్షమువలన శోకము, శోకమువలన హర్షము బాధితము లగుచున్నవి. ఒకానొకఁడు సుఖముగా ఉండియు దుఃఖమును స్మరించును. అట్లే నీవు కూడ సుఖపడవలసిన సమయమున దుఃఖమును స్మరించుచున్నావు. దైవము బలవత్తరము కదా ! నీస్వభావమే యిది. దానిచేత నీవు ఆకృష్టుఁడ వగుచున్నావు. ద్రౌపదికి సభలోనైన పరిభవమును, అరణ్యవాసమును, అజ్ఞాతవాసమున కీచకునిచే యాజ్ఞసేని పాదతాడిత యగుటను ఏల స్మరింపవు ? అందులకు కారకులై యుద్ధమున చచ్చినవారినే స్మరించుచున్నావు. ఇప్పుడు నీకు నీమనస్సుతోనే

యుద్ధము సంభవించినది. దీనియందు నీకు ఆయుధములతో భృత్యులతో బంధువులతో పనిలేదు. ఇందు నీవు ఆత్మనే అవలంబించి మనస్సుతో పోరాడవలె. ఈ యుద్ధమున నీవు జయింపలేకున్నచో ఏ యవస్థను తెలిసికొన్నచో కృతకృత్యుఁడవు కాఁగలవు ? భూతముల జననమరణములనుగూర్చి బుద్ధి నిశ్చయమును పొంది పితృపైతామహమైన వృత్తి నవలంబించి రాజ్యమును పాలింపుము.

బాహ్యములైన రాజ్యాదిద్రవ్యములను వదిలినంత మాత్రముననే సిద్ధి కలుగదు. "మమ" అను రెండు అక్షరములతో సంసారము, "న మమ" అను మూఁడు అక్షరములతో బ్రహ్మము అంతరంగమునందే కన్పించకుండ ఉండి భూతములతో పోరాడుచున్నవి. స్థావరజంగ మాత్మకమైన సకల పృథివి లభించినను, "ఇది నాది కాదు" అని తలంచువానికి దానితో పని యేమున్నది ? వన్యవృత్తితో అరణ్యమున నివసించువానికైనను, ఆవన్యద్రవ్యములందు మమత్వము కలిగినచో, వాఁడు మృత్యుముఖమునందే యుండును. లోకులు కామాత్ముని ప్రశంసింపరు. కాని కామరహితముగా ప్రవృత్తియుండదు. కామము లన్నియు మనస్సునుండి పుట్టుచున్నవి. పండితులు వానిని ఉపసంహరించుకొనుచుందురు. పుట్టినప్పటి నుండి యోగి అభ్యాసయోగమువలన తత్త్వసాధనమార్గము నెఱింగి దానము వేదాధ్యయనము తపస్సు వైదికములైన కర్మలు వ్రతము యజ్ఞము నియమములను ధ్యానము యోగములను ఆరంభింపఁడో, అట్టివాఁడు దేనిని కోరునో దానికి మూలముగా నయ ధర్మము నియమము ఉండును. కావున నీవు ధర్మమునందు కామమును అవలంబింపుము. యథావిధిగా దక్షిణలతో అశ్వమేథము మొదలుగా పెక్కు యజ్ఞములను చేయుము. యుద్ధహతులైన బంధువులనుగూర్చి వ్యథనొందకుము. ఎంత వ్యథ నొందినను వారిని మరల చూచుట అశక్యము. కావున గొప్ప యజ్ఞములు చేసి పరమకీర్తిని పొందుము ; శ్రేష్ఠమైన యుత్తర గతిని కూడ పొందఁగలవు".

ఎట్టకేలకు ధర్మరాజు ఊరట నొంది భీష్ముని యౌర్ధ్వ దైహికములను నిర్వర్తించి హస్తినాపురమున ప్రవేశించి ప్రజాపాలనముఁ గావింపఁ జొచ్చెను.

పైని పేర్కొనఁబడిన యోగము కర్మయోగమే. "అట్టివాఁడు దేనిని కోరునో దానికి మూలముగా నయము ధర్మము నియమము ఉండును"- కర్మయోగి ఫలాపేక్షతో

ఏకార్యమును ఆరంభింపఁడు. అయినను దైవికముగా సంభవించు సంఘటనములందు శాస్త్రము ననుసరించి ఏది కర్తవ్యమగునో దానిని, ఫలాపేక్ష లేకున్నను, శ్రద్ధతో నిర్వహింపఁగోరును. రామునకు రాజ్యభోగములందు అపేక్ష లేదు. అయినను భరతుని ప్రార్థనమువలన క్షత్త్రియధర్మము ననుసరించి పట్టాభిషిక్తుఁడై ప్రజాపాలనము గావించెను. దానివలన సీతాపరిత్యాగమువంటి కష్టములు కలిగినను ఆయన స్వధర్మమును విడలేదు. అట్లే ఆయన ఎన్నో అశ్వమేధములను చేసెను. అప్పుడు అట్టికర్మయోగి చేయఁగోరునట్టి రాజ్యపాలనమునకు గాని యజ్ఞాదికమునకుఁ గాని నయము ధర్మము నియమము మాత్రమే మూలములై యుండును ; ఫలాపేక్ష మూలమై యుండదు. నయ మనఁగా కార్యనిర్వహణమునకు ఆవశ్యకమైన యుపాయము. ధర్మ మనఁగా వర్ణాశ్రమవిభాగము ననుసరించి శాస్త్రముచే విధింపఁబడు కర్తవ్యము ; అనగా స్వధర్మము. నియమ మనఁగా, కర్తవ్యనిర్వహణమునందలి విధుల నన్నింటె యథాశాస్త్రముగా జరుపుట. కావున కర్మయోగిగా ధర్మరాజు కూడ, రామునివలె, ఫలాపేక్ష లేకపోయినను, స్వధర్మము ననుసరించి ప్రజాపాలనమును నయముతో నియమముతో నిర్వహింపవలయు ననుట శ్రీకృష్ణుని యభిప్రాయము.

# 10. తత్త్వకాండము

## (1) పరిప్రశ్న కమండలువు

### (i) అర్జునశుశ్రూషా చమసము

ధర్మరాజు పట్టాభిషిక్తుఁడై ప్రశాంతముగా పరిపాలించుచుండఁగా శ్రీకృష్ణార్జునులు విచిత్రములైన వననదీగిరి సానువులయందు హాయిగా విహరింపఁజొచ్చిరి. ఒకప్పుడు వారు ఇంద్రప్రస్థమునకు పోయి అక్కడ మయసభయందు యుద్ధకథలను మహర్షుల గాథలను దేవతలచరిత్రములను చెప్పుకొనుచు వినోదించుచుండిరి. అప్పుడప్పుడు అర్జునుఁడు పుత్త్రమరణమును బంధువధమును స్మరించుచు వ్యథ నొందుచుండెను. శ్రీకృష్ణుఁడు ఆసమయములలో ఎన్నో కథలను గాథలను చెప్పి అతనిని ఓదార్చుచుండెను.

ఒకనాఁడు వాసుదేవుఁడు అర్జునునితో ఇట్లనెను. "నీ బాహుబలముయొక్క రక్షణముచేత ధర్మరాజా నిశ్చింతగా చక్కఁగా పృథివినంతయు పాలించుచున్నాఁడు. మన యీ విహారములవలన కాలము మనకు తెలియకుండఁగనే చాల గడచినది. నేను మానాయనగారిని అన్నగారిని చూచి చాల కాలమైనది. వారిని చూచుటకు ఇంక ద్వారకకు పోవలయునని అనుకొనుచున్నాను. నాగమనమును నీవుకూడ అంగీకరింపుము. నాయీ ప్రయాణమునుగూర్చి ధర్మజునితో నీవు ప్రస్తావింపుము. నేను ఇక్కడికి వచ్చిన ప్రయోజనము పూర్తియైనది కదా !"

ఈ మాటలు విన్నంతనే అర్జునుఁడు శ్రీకృష్ణవియోగమును భావించుచు ఖిన్నుఁడై "అట్లే చేయుదు"ననెను. పిదప అర్జునుఁడు ఆయనతో ఇట్లనెను. "కృష్ణా ! యుద్ధారంభమున సౌహార్దముతో నీవు పెక్కు విషయములను చెప్పితివి; ఐశ్వరమైన నీ రూపమును కూడ చూపితివి. కాని నీవు చెప్పినదంతయు నా బుద్ధియందు నష్టమై పోయెను. మరల ఆవిషయములను వినవలయునను కుతూహలము కలదు. మఱి నీవు ద్వారకకు పోవుదు ననుచున్నావు".

శ్రీకృష్ణుఁడు అర్జునుని కౌఁగిలించుకొని ఇట్లనెను. "నీకు సనాతనము రహస్యమునైన ధర్మమును అప్పుడు బోధించితిని. నేను చెప్పినదానిని నీవు చక్కఁగా గ్రహింపవైతివి. అది నాకు చాల అప్రియము. నీకు నిజముగా శ్రద్ధలేదు ; ప్రజ్ఞ కూడ లేదు. అప్పుడు చెప్పినదంతయు ఇప్పుడు చెప్పుట అశక్యము . బ్రహ్మపదమును చేరుటకు ఆ ధర్మము సమర్థమైనది. అప్పుడు యోగయుక్తుఁడనై నీకు పరమ బ్రహ్మమునే చెప్పితిని. దానికి పర్యాయముగా ఇప్పుడు పురాతనమైన యితిహాసమును చెప్పెదను. వినుము. దీనివలన కూడ నీవు శ్రేష్ఠమైన గతిని పొందగలవు.

వాసుదేవ ఉవాచ :

శ్లో|| శ్రావిత స్త్వం మయా గుహ్యం, జ్ఞాపిత శ్చ సనాతనమ్ |
ధర్మం స్వరూపిణం పార్థ సర్వలోకాంశ్చ శాశ్వతాన్ || 9

శ్లో|| అబుద్ధ్వా మా గ్రహీ ర్యత్ త్వం త న్మే సుమహ దప్రియమ్ |
వచ సాద్య పున ర్భూయః స్మృతి స్తే భవిష్యతి || 10

శ్లో|| నూన మశ్రద్ధధానోఽసి దుర్మేధా హ్యసి పాండవ |
న చ శక్యం పున ర్వక్తు మశేషేణ ధనంజయ || 11

శ్లో|| స హి ధర్మః సుపర్యాప్తో బ్రహ్మణః పరివేదనే |
న శక్యం త న్మయా భూయ స్తథా వక్తు మశేషతః || 12

శ్లో|| పరం హి బ్రహ్మ కథితం యోగయుక్తేన త న్మయా |
ఇతిహాసం తు వక్ష్యామి తస్మి న్నర్థే పురాతనమ్ || 13

ఆశ్వమేధికపర్వ - అధ్యా - 16

అర్జునునియందు ఎంత ప్రీతియున్నను శ్రీకృష్ణుఁడు, ఉత్తముఁడైన యాచార్యునివలె, శిష్యుని కఠినముగా మందలించుటకు వెనుకాడలేదు.

మఱియొక విషయముకూడ ఇందు గమనింపఁదగియున్నది. భగవద్గీతయందు "కర్మయోగము" "అనాసక్తియోగము" మొదలుగా అపూర్వవిషయములు ప్రధానముగా ప్రతిపాదింపఁబడినవని, అర్జునునకు కృష్ణుఁడు కర్మయోగమునే బోధించెను గానీ జ్ఞానయోగమును బోధింపలేదని, కావున భగవద్గీతకు కర్మయోగమునందే తాత్పర్యము కలదు కాని జ్ఞానబోధమునందు లేదని అనేకులు అనేకవిధములుగా సిద్ధాంతములు చేయుచున్నారు. కాని యీ సందర్భమున శ్రీకృష్ణుఁడు స్వయముగా యుద్ధారంభమున తానుబోధించినది "పరమ బ్రహ్మమే" (పరం హి బ్రహ్మ) అని, ఆబోధ బ్రహ్మమునుగూర్చి చక్కఁగా తెలిసికొనుటకు బాగుగా చాలియున్నదని (స హి ధర్మః సుపర్యాప్తో బ్రహ్మణః పరివేదనే) చెప్పుచున్నాఁడు. ఆయనగావించిన ఉపదేశముయొక్క తాత్పర్యము ఆయన కంటె మనకు ఎక్కువ తెలియుననుటకు వీలులేదు. కావున భగవద్గీతకు పరమతాత్పర్యము పరమబ్రహ్మబోధమే యనుట నిస్సంశయము.

## (ii) యుగోపాయ చమసము

శ్రీకృష్ణుఁడు ఇట్లు చెప్పెను. ఒక బ్రాహ్మణుఁడు బ్రహ్మలోకమునుండి వచ్చెను. మేము ఆయనను పూజించితిమి ; అనేక విషయములను అడిగితిమి. ఆయన ఇట్లు చెప్పెను.

భూతములను అనుగ్రహించుటకై నన్ను నీవు మోక్షమునుగూర్చి ప్రశ్నించితివి. నేను దానిని చెప్పుదును వినుము. ధర్మవిత్తముఁడైన కాశ్యపుఁడు అనునొక బ్రాహ్మణుఁడు యాదృచ్ఛికముగా ప్రసిద్ధుఁడైన యొక సిద్ధపురుషుని చూచెను. ఆ సిద్ధుఁడు అంతర్ధానాది మహిమలను కలిగియుండుటయే కాక ధర్మతత్త్వార్థ కోవిదుఁడని కాశ్యపుఁడు వినియుండెను. అందువలన అతఁడు ఆ సిద్ధుని గురువునుగా ఆశ్రయించి అనేక విధముల పరిచర్యఁ గావించి, తాను విన్నట్లే, ఆయన శ్రుతము చరిత్రము కలవాఁడని గుర్తించి సేవచే ఆయనను సంతోషపెట్టెను.

ఆయన ప్రసన్నుఁడై కాశ్యపునకు ఇట్లు చెప్పెను. "వత్సా ! వివిధములైన పుణ్యకర్మలచేత మానవులు దేవలోకమునకు వచ్చుచుందురు. అక్కడ కూడ అత్యంతమైన సుఖముగాని, శాశ్వతమైన యునికిగాని యుండదు. కష్టపడి సంపాదించుకొన్న స్వర్గసుఖమునుండి భ్రంశము కలిగినప్పుడు దుఃఖము కలుగుచునే యుండును. నేను అట్లు భ్రంశము నొంది ఎన్నియో అశుభజన్మలను పొందితిని. ఈ లోకమున, నరకమునను ఎన్నో కష్టములను పొందితిని. ఒకప్పటికి నేను నిర్వేదమును పొంది లోకతంత్రమును వీడి యీ యోగమార్గమును అవలంబించితిని. దానివలన ఆత్మప్రసాదమున నాకు ఈ సిద్ధి కలిగెను. ఈ సిద్ధివఱకు ప్రజాసర్గమువఱకు, అనగా బ్రహ్మపదమువఱకు, ఏయే శుభగతులున్నవో వానిని అన్నింటిని పొంది తుదకు ఉత్తమమైన యీ సిద్ధిని పొందితిని. ఇంక పరతరమైన బ్రహ్మత్వమును పొందఁబోవుచున్నాను. ఇప్పుడు లోకముల నన్నింటిని ఆలోకించుచున్నాను. నేను మరల ఈ మర్త్యలోకమునకు రాను. ఇది నిశ్చితము. నేను నీవలన చాల ప్రీతుఁడనైతిని. నీయభిలాష నెఱింగి దానిని తీర్చి వెంటనే వెడలిపోవలెనని తలంచుచున్నాను. కావున నీకు ఏమి కావలయునో అడుగుము".

కాశ్యపుఁడిట్లు అడిగెను. "మహాత్మా ! జీవుఁడు ఎట్లు శరీరమును కోల్పోవుచున్నాఁడు ? ఎట్లు పొందుచున్నాఁడు ? ఎట్లు సంసారమునుండి ముక్తి పొందుచున్నాఁడు ? ఒక శరీరము నుండి వెలువడినవాఁడు మఱియొక శరీరమును ఎట్లు పొందును? దేహరహితుఁడైనప్పుడు తాను చేసిన శుభాశుభకర్మల ఫలమును ఎటు పొందుచున్నాఁడు ? దేహరహితుఁడైనవానికి కర్మ ఎట్లుండును?"

ఆ సిద్ధుఁడు ఇట్లు చెప్పెను. "ఆయుఃక్షయము దాపురించినప్పుడు జీవుని బుద్ధి విపరీతవృత్తి నొందును. అప్పుడతఁడు తనశక్తికి మించినవి విరుద్ధములును అయిన ఆహారవ్యవహారములను గావించును. దానిచేత మరణాంతకమైన రోగము సంభవించును. బాధవలననో మనోవ్యథవలననో ఒక్కొక్కఁడు ఆత్మహత్యకు కూడ పాల్పడును. ఇట్లు ఎన్నో కారణములచేత శరీరము పతనము నొందును. అప్పుడు మరణవేదనతో ఆ శరీరమునుండి జీవుఁడు తాను గావించినపుణ్యా పాపములయొక్క సంస్కారముతో కూడి వెలువడును. అట్లు వెలువడెడు జీవుని సిద్ధపురుషులు దివ్యదృష్టితో చూడఁగలరు. మరల జన్మించిన జీవులు పుణ్యాపాపములను గావించుచు స్వర్గనరకములను పొందుచునే యుందురు. ఈ జన్మకర్మల చక్రము నుండి విముక్తిని పొందుట దుర్ఘటము.

ధార్మికులు, ఆచారపరాయణులు దుర్గతిని పొందరు. కాని వీరికంటె యోగులు అధికులు. ఎప్పటికేది ధర్మమో దానిని వారు ఫలాపేక్ష లేకుండ కర్తవ్యమాత్రముగా నిర్వర్తించుచు చాలకాలమునకు ముక్తిని పొందుదురు.

మొట్టమొదట జీవునకు శరీరము ఎవనిచేత ప్రకల్పింపఁబడిన దను సంశయము లోకమున కలదు. దానికి సమాధానము చెప్పెదను వినుము. లోకపితామహుఁడు తనకు శరీరమును ఏర్పఱచుకొని తరువాత మూఁడులోకములను స్థావరజంగమాత్మకములనుగా సృష్టించెను. సృష్టికి ముందు ఆయన సకలజీవులకు ప్రకృతియైన ప్రధానమును సృష్టించెను. ఆ ప్రకృతిచే జగత్తు సర్వము వ్యాప్తమైయున్నది. ఇది క్షరము. దీనికి పైన అక్షరము అమృతమునైన ప్రకృతియున్నది. ఈ రెండింటియొక్క సంయోగమువలన పితామహుఁడు స్థావరజంగమ భూతములను సృష్టించెను. వీనికి కాలపరిమాణమును పరివర్తనమును పునరావృత్తిని ఆయన ఏర్పఱచెను.

ఇట్టి సృష్టియందు ఒకానొక మేధావి, శరీరము అమేధ్యపదార్థసంఘాత మన్ని, కర్మవశమున దీనికి వినాశము తప్పదని, సుఖదుఃఖములు అనిత్యములని, ఇవి యన్నియు ప్రకృతికి సంబంధించినవే కాని, సకల భూతములయందు సమముగానున్న చైతన్యమునకు వీనితో సంబంధము లేదని, తెలిసికొని యీ లోకవ్యవహారమువలన నిర్వేదమును పొంది పరమపదమును అన్వేషించును.

ఈ యన్వేషణమున కృతార్థతను పొందు విధమును వినుము. జీవిత మరణములను సుఖదుఃఖములను లాభనష్టములను ప్రియులను ద్వేష్యులను సమముగా చూచుచు, ఏ భూతమును తనకంటె తక్కువగాగాని ఎక్కువగాఁగాని తలంపక, బంధుమిత్ర పుత్త్రాది వ్యవహారదూరుఁడై సర్వసంకల్పరహితుఁడై ఆత్మసాక్షాత్కారము నొంది ముక్తుఁడగును. తపస్సుచేత సర్వసంసార నిర్ముక్తుఁడై నిర్ద్వంద్వుఁడు నిష్పరిగ్రహుఁడును అయిన వాని యింద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నను వాఁడు ముక్తుఁడే యగును.

ఎవఁడైనను ముందు యోగము నవలంబించి ఇంద్రియములను మనస్సునందు ఉపసంహరించి తీవ్రముగ తపస్సుచేసి తరువాత మోక్షపథమున ప్రవేశింపవలయును. ఏకాంతశీలుఁడైన మేధావి, మనస్సుచేత భావించుచున్నచో స్వప్నమునందు ఒకానొకపురుషుని చూచునట్లు, ఆత్మను చూడఁగలఁడు. శరీరము ముంజము వంటిది. ఆత్మదానిలోని యిషీకము వంటిది. ఇట్లు శరీరము నుండి ఆత్మను భిన్నముగా చూడగల్గినవాఁడు త్రైలోక్యమునకు ప్రభువై దేవేంద్రుని కూడ లెక్కపెట్టఁడు. అతఁడు తనకు ఇష్టములైన తనువుల నెన్నియేని పొందఁగలఁడు ; వీడఁగలఁడు. అతఁడు జరామృత్యువులనుగూర్చి శోకింపఁడు. అతఁడు దేనిచేతను క్లేశమును పొందఁడు.

ఈ యోగసిద్ధికి ఉపాయమును వినుము. ఏకాంతస్థలమున కూర్చుండి తానున్న పురములో ఒకదిక్కు నందు మనస్సు నిలుపవలెను. అది అట్లు నిలిచినతరువాత మనస్సును తానున్న యింటిని మాత్రమే భావించునట్లు నిలుపవలెను. తరువాత మనస్సును ఇంటిపై నుండి తొలఁగించి తన శరీరములోని దంతములు తాలువు నాలుక కంఠము హృదయమును మాత్రమే భావించుచున్నట్లు నిలుపవలయును. మనస్సునకు ద్వారములై చంచలములైన యింద్రియములను శరీరమునందే నిలిపి, అవి వెలుపలికి పోకుండ జాగరూకుఁడగువాఁడు ప్రీతాత్ముఁడగుచు ప్రకృతిని గుర్తించుచు బ్రహ్మమును పొందుచున్నాఁడు. బ్రహ్మము ఇంద్రియములకు గోచరము కాదు. ప్రదీప్తమైన మనస్సుచేతనే అది గోచరమగును. అతఁడు దేహమును

వీడక, దేహమునందు కేవలమైన తన స్వరూపమైన బ్రహ్మమును చూచుచు ఆనందించుచుండును. ఇట్లు దేహమునే ఆశ్రయముగా చేసికొని ఆత్మసాక్షాత్కారము నొంది అతఁడు మోక్షమును పొందును.

నేను పోవుచున్నాను. ఇంక నీవు సుఖముగా నుండుము" అని యాసిద్ధుఁడు శిష్యుని వీడ్కొని వెడలిపోయెను. ఈ కథను చెప్పి బ్రహ్మలోకమునుండి వచ్చిన యాబ్రాహ్మణుఁడు అంతర్హితుఁడయ్యెను.

అర్జునా ! దీనిని ఏకాగ్రమైన మనస్సుతో వింటివా ? ఆనాఁడు రథస్థుఁడవై విన్నది కూడ ఇదియే. ఇది అందఱకు సులభముగా తెలియునది కాదు. ఇది దేవతలకు సహితము తెలియని రహస్యము. లోకసారమును అసారముగా పరిత్యజించు మర్త్యుఁడు ఈ యుపాయములచేత త్వరగా పరమపదమును పొందును. చెప్పవలసిన దంతయు ఇదియే. ఇంతకుపైన ఏదియు లేదు. నిత్యము ఆఱుమాసములు ఈయోగమును అభ్యసించుచున్నచో ఇది అప్రయత్నముగా ప్రవర్తించుచు సహజమగును".

శ్రీకృష్ణుఁడు మోక్షమునుగూర్చి బ్రాహ్మణుని ప్రశ్నించుట తనకొఱకు కాదు. నిత్యముక్తుఁడైన యాయన మోక్షమునుగూర్చి తెలిసికోవలసినది ఏదియు లేదు. అయినను పెద్దలు వచ్చినప్పుడు వారు దేనియందు పరినిష్ఠితులో దానినిగూర్చి గోష్ఠి గావించినచో వారు సంతోషమును పొందుదురు. అంతకంటె ఆ సంవాదమును వినువారు ఎంతో లాభమును పొందుదురు. అందువలననే ఆ బ్రాహ్మణుఁడు, "భూతముల ననుగ్రహించుటకై నన్ను నీవు అడుగుచున్నావు" అనెను.

అనేక మహిమలు సిద్ధులు కలవాఁడుగా ప్రసిద్ధుఁడైన సిద్ధుని కాశ్యపుఁడు సేవించుచున్నను ఆ సిద్ధుఁడు కాశ్యపునియందు ప్రీతికలవాఁడై, "నీకు సిద్ధులు మహిమలు కలుగునుపాయమును చెప్పుదును" అనలేదు. ఆయన సంసారగతులనుగూర్చి చెప్పి [illegible] ముముక్షువుఁడై లోకతంత్రమును పరిత్యజించితినని [illegible] నీకేమి కావలయునో అడుగుమనెను. కాశ్యపుఁడు కూడ అణిమాది సిద్ధులను

కోరక, జీవుఁడు శరీరములను పొందుట, విడుచుట క్రొత్తశరీరములను పొందుట, సంసారమునుండి విముక్తుఁడగుట అను విషయములను మాత్రమే అడిగెను.

దీనినిబట్టి తత్త్వజ్ఞులు తత్త్వజిజ్ఞాసువులు కూడ సిద్ధులను మహిమలను తృణప్రాయముగా చూతురని స్పష్టమగుచున్నది.

శరీరము నుండి వెలువడిన తరువాత, "దేహరహితుఁడైనవాఁడు తాను చేసిన శుభాశుభకర్మల ఫలమును ఎట్లు పొందుచున్నాఁడు ? దేహరహితుఁడైన వానికి కర్మ ఎట్లుండును?" అని కాశ్యపుఁడు ప్రశ్నించెను. దీనికి సమాధానముగా, "జీవుఁడు తానుగావించిన పుణ్యాపాపముల సంస్కారములతో కూడ వెలువడును; అట్లు వెలువడెడు జీవుని సిద్ధపురుషులు దివ్యదృష్టితో చూడఁగలరు" అని మాత్రమే చెప్పెను ; దీనిని వివరింపలేదు. భౌతికశరీరమునుండి వెలువడుచున్న జీవుని సిద్ధపురుషులు దివ్యదృష్టితో చూడఁగలరనుట వలన జీవునకు అప్పుడు సూక్ష్మశరీరము ఉండునని స్పష్టమగుచున్నది. ఆసూక్ష్మశరీరమునందు కర్మవాసనలు ఉండునే కాని దానితో కర్మలు చేయుటకు వీలుకాదు. ఆ శరీరములోని సంస్కారములవలన నరకమునందు యాతనా శరీరము, స్వర్గమునందు భోగసాధనముగా అమ్మయమైన (నీరు ప్రధానముగా గల) శరీరము ఏర్పడును. ఇవి కూడ పాపఫలముగా దుఃఖమును, పుణ్యఫలమైన సుఖమును అనుభవించుటకు మాత్రమే సాధనములగును. వీనితో కర్మచేయుటకు వీలులేదు. స్వర్గము నుండి గాని నరకమునుండి గాని తిరిగి వచ్చి భూలోకమున జన్మించినప్పుడే కర్మ చేయుటకు వీలగును. ఏమైనను జీవుఁడు ఏ లోకమునందున్నను, ముక్తుఁడగు వఱకు, శరీరరహితుఁడుగా ఉండుట సంభవము కాదు.

# 2. బ్రాహ్మణ బ్రాహ్మణీ సంవాద కమండలువు

## (i) బ్రహ్మజ్ఞ లక్షణ చమసము

బ్రహ్మవేత్తయొక్క లక్షణమును విశదమొనర్చుటకై శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణీ బ్రాహ్మణ సంవాదమును చెప్పెను.

జ్ఞానవిజ్ఞాన పారగుఁడైన యొక బ్రాహ్మణుఁడు ఒక యేకాంతస్థలమున నిశ్చింతుఁడై కూర్చుండి యుండగా, భార్య ఆయన యొద్దకు పోయి ఇట్లు అడిగెను. 'భర్త సంపాదించిన లోకములను భార్యలు పొందుదురని చెప్పుదురు. నీవు విచక్షణత లేకుండ అన్నిపనులు వదలిపెట్టి సోమరివై ఇట్లు కూర్చుండినావు కదా! నిన్ను ఆశ్రయించియున్నచో నాకు ఏ లోకము కలుగునో చెప్పుము".

ఆయన నవ్వుచు ఇట్లనెను. "నీవు ఇట్లు అడుగుచున్నందులకు నీపై నాకేమియు కోపము లేదు. జ్ఞానరహితులు ఇంద్రియగోచరమైన దానినే కర్మయని తలంచుచుందురు. ఈ లోకమున నైష్కర్మ్యము ఒక క్షణము నందు కూడ లభ్యము కాదు. సతతము ఇంద్రియములవలన మనస్సువలన ఏదియో యొకపని జరుగుచునే యుండును. కాలుఁడు వచ్చి దృశ్యపదార్థములైన యజ్ఞపరికరములను యాజ్ఞికుల దేహములను ధ్వంసమొనరించుచున్నప్పుడు, నేను ఆత్మస్వరూపుఁడనై ఆత్మస్వరూపమును గ్రహించు బుద్ధితో ధ్వంసమునొందుచున్న యాదృశ్య పదార్థములకు ఆశ్రయమైన పరమాత్మను చూచుచుంటిని. ఆత్మయే బ్రహ్మము. అది నిర్ద్వంద్వము. బ్రహ్మాదులు సైతము దానిని ఉపాసించుచున్నారు. అది ఏ యింద్రియమునకును గోచరము కాదు. జ్ఞానమునందు నెలకొన్న మనస్సునకే అది యవగతమగును.

ఈ విషయమున పురాతనమైన జ్ఞానయజ్ఞవిధానము కలదు. ఘ్రాణము జిహ్వాచక్షుస్స్పర్శ త్వక్ఛ్రోత్రము మనస్సు బుద్ధి అనునేడును గుణహేతువులు. గంధము రసము రూపము స్పర్శము శబ్దము, మన్తవ్యము (మనస్సుచేత గ్రహింపఁదగినది) బోద్ధవ్యము (బుద్ధిచేత గ్రహింపఁదగినది) అనునేడును కర్మహేతువులు. ఘ్రాత (వాసన చూచువాఁడు), భక్షయిత (భక్షించువాఁడు), ద్రష్ట వక్త (చెప్పువాఁడు), శ్రోత (వినువాఁడు), మంత (మనస్సుచేత గ్రహించువాఁడు), బోద్ధ (బుద్ధిచేత గ్రహించువాఁడు) అను నేడుగురు కర్తృహేతువులు. వీరు గుణహేతువులైన ఘ్రాణాదులవలన కలుగు శుభమును అశుభమును అనుభవించుచుందురు. "నేను ఘ్రాతను, భక్షయితను" అని యీవిధముగా ఎవఁడు భావించుచు గంధరసాది గుణములు కలిగిన ద్రవ్యములను, కర్మలను చేసి సంపాదించుకొనుచు, "ఇవి నావి ; వీనిని నేను అనుభవించుచున్నాను" అని

తలంచునోవాఁడు ఆ మనుష్యునిచేత హతుఁడగుచున్నాఁడు. వాఁడు అన్నమును హతమొనర్చును. తరువాత అన్నము వానిని హత మొనర్చుచున్నది. కాని విద్వాంసుఁడు అన్నమును హతమొనర్చి జీర్ణింపఁజేసికొనుచున్నాఁడు. ఆతనికి అన్నమువలన సూక్ష్మమైన వ్యతిక్రమము కూడ కలుగదు. అతఁడు మనస్సుచేత తాను పొందుచున్న దానిని, స్పృశించుచున్నదానిని, వినుచున్నదానిని, చూచుచున్నదానిని, వాసన చూచుచున్నదానిని జ్ఞానాగ్నికి హవిస్సులనుగా అర్పించుచున్నాఁడు. "నేను ఘ్రాతనుకాదు ; శ్రోతను కాదు, స్పృశించువాఁడను కాదు, భక్షించువాఁడను కాను, చూచువాఁడను కాను, ఆలోచించువాఁడను కాను. ఇంద్రియములు మనస్సు తమ విషయములందు ప్రవర్తించుచున్నవి. ఈ వ్యవహారమున నాకేమియు సంబంధము లేదు. నేను కర్తను కాదు ; భోక్తను కాదు" అను బుద్ధి నిశ్చయమే జ్ఞానాగ్ని. ఇట్లు జ్ఞానాగ్నియందు సకల విషయములను ఆహుతి గావించువాఁడు ముక్తుఁడగును. నాయందు ఈ జ్ఞానయోగరూపమైన యజ్ఞము ప్రవర్తించుచున్నది.

నా హృదయమునందున్న [illegible] నారాయణుఁడు. ఆయనయే నాయందు ఘ్రాత, శ్రోత, ద్రష్ట, స్ప్రష్ట, [illegible] మంత. ఆయనయే నాకు శాసకుఁడు, బంధువు, గురువు. ఆయనయొక్క అనుశాసనము ననుసరించియే వర్తించుచున్నాను.

నేను గంధములను వాసనచూచుట లేదు. రుచులను తెలిసికొనుట లేదు ; రూపములను చూచుట లేదు. దేనిని స్పృశించుట లేదు ; శబ్దమును వినుట లేదు. సంకల్ప వికల్పముల నొనరించుట లేదు. స్వభావమే ఇష్టములైన పదార్థములను కోరుచున్నది ; అనిష్టములను ద్వేషించుచున్నది. ప్రాణాపానయుక్తమైన జంతువుయొక్క దేహమునందు స్వభావమునుండియే కామక్రోధములు పుట్టుచున్నవి. వానికంటె అన్యములై నిత్యములైన భావములను నిత్యమై శరీరమందున్న యాత్మను గుర్తించుచు, ఆయాత్మయందె నిలిచియున్న నేను కామక్రోధములతో ముసలితనముతో మృత్యువుతో ఏ విధముగను సంబద్ధుఁడనగుట లేదు. దేనిని కోరక, ద్వేషింపకయున్న నన్ను, తామరపూవునందు నీటి బిందువులవలె, స్వభావమువలన కలుగువాసనలు ఏవియు స్పృశింపవు.

శ్లో|| గంధా న్న జిఘ్రామి రసా న్న వేద్మి రూపం న పశ్యామి న చ స్పృశామి |
న చాపి శబ్దాన్ వివిధాన్ శృణోమి న చాపి సంకల్ప ముపైమి కంచిత్ || 1

శ్లో|| అర్థా నిష్టాన్ కామయతే స్వభావః సర్వాన్ ద్వేష్యాన్ ప్రద్విషతే స్వభావః |
కామద్వేషా వుద్భవత స్స్వభావాత్ ప్రాణాపానే జంతుదేహా న్నివేశ్య || 2

శ్లో|| తేభ్య శ్చాన్యాం స్తేషు నిత్యాం శ్చ భావాన్ భూతాత్మానం లక్షయేయం శరీరే |
తస్మిం స్తిష్ఠ న్నాస్మి సక్తః కథంచిత్ కామ క్రోధాభ్యాం జరయా మృత్యునా చ ||3

శ్లో|| అకామయానస్య చ సర్వకామాన్ అవిద్విషాణస్య చ సర్వదోషాన్
న మే స్వభావేషు భవన్తి లేపా స్తోయస్య బిందో రివ పుష్కరేషు || 4

ఆశ్వమేధికపర్వము - అధ్యాయము 28

## (ii) అధ్వర్యుయతిసంవాద చమసము

బ్రాహ్మణుఁడు భార్యకు మరల ఇట్లు చెప్పెను. "ఈ విషయమున అధ్వర్యుయతి సంవాదమును పెద్దలు ఉదాహరింతురు. అది వినుము. ఒక యజ్ఞమునందు పశువు ప్రోక్షింపఁబడుచుండఁగా ఒకయతి వచ్చి అక్కడ కూర్చుండియున్న యధ్వర్యువును చూచి "అబ్బ! ఏమి యీ హింస" అని ఏవగించుకొనెను.

అధ్వర్యుఁ డాయనతో ఇట్లనెను. "ఈ మేఁక నశించుటలేదు. శ్రుతిప్రమాణమున ఇది శ్రేయస్సును పొందుచున్నది. దీనియొక్క పార్థివభాగము పృథివిని, జలభాగము నీటిని, చక్షుస్సు సూర్యుని, శ్రోత్రము దిక్కులను, ఘ్రాణము దివమును పొందుచున్నవి. ఆగమము [illegible] వర్తించుచున్న నాయందు దోషము లేదు."

యతి ఇట్లనెను. "ఛాగము యొక్క ప్రాణవియోగమునందు శ్రేయస్సు దానికి కలుగుచున్నదని నీవు తలంచుచున్నచో, ఈ యజ్ఞము ఈ ఛాగముకొఱకే జరుగుచున్న దన్నమాట. దీనివలన నీకేమి ప్రయోజనము ? ఇక్కడ నిన్ను భ్రాతనుగా పితనుగా స్నేహితునిగా తలంచువారు ఉన్నారు గదా ! ఈ మేఁకను తొలగించి దీనిస్థానమున

వారి నెవరినైనను తెచ్చి యిచ్చట కూర్చుండఁబెట్టుము. "నీకు ఈ యజ్ఞమువలన శ్రేయస్సు కావలె అని గాని వలదని గాని చెప్పుటకు చేతగాని నోరు లేని యీమేఁకను బలియొనర్చుట ఎందులకు ? నీవు చెప్పుచున్న శ్రేయస్సునకు మీవారెవరైన అంగీకరింతురేమో చూడుము". వారి యంగీకారమును వినిన తరువాత ఈ యజ్ఞము కార్యమా అకార్యమా అనువిషయమును విచారింపవచ్చును. ఈ ఛాగముయొక్క ప్రాణేంద్రియములు తమ తమమూలస్థానములకు చేరినచో, ఇంక దీని శరీరము వట్టి కట్టెయై యింధనమగును. ఈ యింధనమును మీరు పశువనుచున్నారు. ఎట్లైనను హింస జరుగుచునేయున్నది. సర్వధర్మములలో అహింసపరమమైనదని వృద్ధుల యనుశాసనము. హింసారహితమైన దానినే కార్యమని మేము తలంచుచున్నాము".

అధ్వర్యువు ఇట్లు సమాధానము చెప్పెను. "మేము అహింసను అవలంబించుచున్నాము" అను నీ ప్రతిజ్ఞను గూర్చి చెప్పుదును. అది విన్న తరువాత నీవు మాకార్యమును దూషింపవచ్చును. మాకు కూడ అహింస ఎల్లప్పుడు ఇష్టమే. మేము మాకు ప్రత్యక్షముగా గోచరించినంతవఱకు అహింసను పాటించుచునేయున్నాము. మాకు గోచరింపని విషయములందు అహింసను ఉపాసింపము. నీవు భూమియొక్క గంధగుణము కల ద్రవ్యములను భుజించుచున్నావు; ఆపోమయములైన రసములను త్రావుచున్నావు ; జ్యోతిస్సులయొక్క రూపములను చూచుచున్నావు ; వాయువుయొక్క గుణములను స్పృశించుచున్నావు ; ఆకాశమువలని శబ్దములను వినుచున్నావు ; మనస్సుతో ఆలోచించుచున్నావు. గంధము రసము మొదలగునవి పృథివి, జలము మొదలగు భూతములకు ప్రాణములు. నీవు వాని ప్రాణములను తీసికొని అనుభవించుచునే యున్నావు కదా ! "నేను భూతముల ప్రాణములను తీయుటలేదు" అని ఎట్లు చెప్పగలవు? ఓయీ ! బ్రాహ్మణ ! హింస-లేకుండ చేష్టయే లేదు. దీనికే మందువు?"

యతి ఇట్లు చెప్పెను. "ఆత్మకు అక్షరము క్షరము అను రెండు భావములు కలవు. సద్భావము అక్షరము. స్వభావము క్షరము. ప్రాణములు జిహ్వ మనస్సు సత్త్వము రజస్సు మొదలగు పదార్థసముదాయము స్వభావము. ఈ భావములనుండి

విముక్తమైనది సద్భావము. జితాత్ముఁడనై స్వభావము నుండి విముక్తుఁడనై నిర్మముఁడనై ద్వంద్వరహితుఁడనై సకలభూతసముఁడనైన నాకు ఆహారమును గ్రహించు చేష్టలవలనను పాపము కలుగునను భయము లేదు".

అధ్వర్యుఁడనెను. "అయ్యా ! నీవు మతిమంతులలో శ్రేష్ఠుఁడవు. నీమతమును విన్నతరువాత నాకిట్లుతోఁచుచున్నది. నీవు చెప్పిన యహింస నిలువవలయునన్నచో ఈలోకమున అందఱు నీవలె సద్భావము నొందినవారే యుండవలె. విప్రవర్యా ! నీయందు భగవద్బుద్ధితో చెప్పుచున్నాను. వేదమంత్ర కృతమైన వ్రతమును చేయుచున్న నాయందు అపరాధమేదియును లేదు".

ఈ సమాధానమును విని యతి మౌనముతో వెడలిపోయెను. అధ్వర్యువు మోహరహితుఁడై యజ్ఞమునందు పాల్గొనెను."

బ్రాహ్మణుఁడు చెప్పిన యీ యితిహాసమున గమనింపఁదగినయంశములు అనేకములు కలవు. "దేనిని కోరక ద్వేషింపక యున్నవానికి, తామరపుష్పమునకు నీటిబిందువు యొక్క స్పర్శదోషము లేనట్లు, స్వాభావికములైన చేష్టలవలన కలుగు పుణ్యాపాపముల వాసనలు కలుగవు "- అని ఆయన ఉద్ఘాటించిన యభిప్రాయమునకు పైయితిహాసము వివరణము ఎట్లైనది ? యతి శరీరేంద్రియాదికమైన స్వభావము నుండి విముక్తుఁడయ్యెను. అనగా, "శరీరేంద్రియములు నా స్వరూపము కాదు. విషయములను గ్రహించుచు వానిని అనుభవించుచున్న యింద్రియములు మనస్సు అనునవియె కర్తలు భోక్తలు. వానితో నాకేమియు సంబంధము లేదు" అని ఆ పరివ్రాజకుఁడు సాక్షిమాత్రుఁడై వానిని చూచుచున్నాఁడన్న మాట. మనయెదుట నొకఁడు మంచిపనినో చెడ్డపనినో చేయుచున్నచో, ఆ పనులయొక్క సుఖదుః ఖములతో మనకు ఎట్లు సంబంధముండదో, అట్లే శరీరేంద్రియములను తనకన్న భిన్నముగా చూచుచున్న యతికి, వాని చేష్టలయొక్క పుణ్యాపాపములతో కూడ సంబంధముండదు. కాని అహంకార మమకారములతో శరీరేంద్రియ మనస్సులె తమ స్వరూపముగా తలంచుచు ఐహికాముష్మికసుఖములకొఱకు పనిచేయువారికి వారు చేయుచున్న కర్మలయందు హింసయున్నచో, దానివలని పాపఫలమును వారు అనుభవింపక తప్పదు. ఈ దృష్టితో యతియజ్ఞమున పశుబలి హింసాకృత్యమనెను.

ఛాగమునకు శ్రేయము కలుగును కాబట్టి దానిని యజ్ఞమున బలిచేయవచ్చునని అధ్వరుఁడు చెప్పినమాట సంయైనది కాదు. అట్లయినచో మీ వారినే బలిచేయవచ్చును గదా యని యతి ఆక్షేపించెను. దానికి సమాధానము చెప్పక అధ్వర్యువు అహింసాతత్త్వమును విమర్శించి, ఆహారమును తినుచున్న యతికూడ హింసయే చేయుచున్నాఁడని ఆక్షేపించెను. శరీరేంద్రియములవలన హింస జరుగుచున్నను వాని యందలి మమత్వము నుండి విముక్తుఁడైన తనకు ఆ హింసవలన పాపము అంటదని యతి సమాధానము చెప్పెను. అట్టి జ్ఞానము లేనివారు ఆ జ్ఞానము కలుగువఱకు ఏవో కర్మలను చేయుచుండుట తప్పనప్పుడు, శాస్త్రవిహితమైన యజ్ఞకర్మను చేయువారికి అపరాధము కలుగదని అధ్వర్యువు సమాధానము చెప్పెను. అది సహేతుకముగా నుండుటచే యతి అంగీకరించి వెడలిపోయెను. కాని వేద ప్రామాణ్యమును అంగీకరింపని వారికి ఇది సహేతుకముగా తోఁచదు.

దీనిని మఱియొక విధముగా ఆలోచించి గ్రహింపవచ్చును. శాస్త్రవిహితమైన కర్మ హింసాయుక్తమైనను ఆచరింపవలసినదే యని, దానిని ఆచరించునప్పుడు, దానియందు ఏయేద్రవ్యములను ఎట్లు వినియోగింపవలయునని శాస్త్రము చెప్పెనో అట్లే చేయవలయును కాని మన బుద్ధి ననుసరించి దానియందు మార్పు చేయుటకు వీలు లేదు. ఛాగమును పశువునుగా చేయవలయునని వేదము చెప్పిన యజ్ఞమునందు, "ఛాగమునే ఎందుకు బలిచేయవలె ? అంతకంటె శ్రేష్ఠమైన సింహము నేల బలిచేయరాదు ?" అను ప్రశ్నకు అవకాశము లేదు. స్వర్గాదిలోకములు మనకు అప్రత్యక్షములు. వానిని పొందుటకు సాధనములుగా వేదము నిర్దేశించిన విధానములు కూడ మనకు తెలిసినవి కావు. అవి నిర్వహింపఁబడినచో ఆ లోకములు ఎట్లు ప్రాప్తములగునో మనకు తెలియదు. అందువలన ఆ శాస్త్రమునందలి విశ్వాసముతోనే మనము యజ్ఞాదికర్మలను నిర్వహించుచున్నాము.

ఇది మూఢవిశ్వాసమని కొందఱనవచ్చును. కాని విశ్వాసముయొక్క స్వరూపమే ఇది. వ్యాధిపీడితుఁడు వైద్యునియొద్దకు పోయినప్పుడు ఆయన రోగిని పరీక్షించి ఈ మందులు ఈ మోతాదులో ఈవేళలలో వాడవలయునని చెప్పినప్పుడు, ఆ మందులలో కాని, మోతాదువిషయమున కాని, వేళలలో కాని మనబుద్ధినుపయోగించి

మార్పు చేయుటకు ప్రయత్నింపము. ఎందువలన ? వ్యాధిని, వ్యాధి నివారణోపాయమును తెలిసికొనలేని మనము వైద్యునియందలి విశ్వాసముచేతనే ఆ మందులను అట్లె సేవించుచుందుము. అట్లే మనకు అగోచరములైన ధర్మములయందు కూడ వేదము చెప్పినట్లు వర్తింపవలె.

అట్లయినను స్వర్గాదిలోకములను కోరుచున్న యజమానుఁడు తన స్వార్థము కొఱకు పశువులను బలిచేయవచ్చునా ? నిజమే. చేయరాదు. కాని లోకవ్యవహారమున జనులందఱు స్వార్థరహితముగనే వర్తించుచున్నారా ? ఆకలి తీర్చుకొనుటకై మృగములను వేటాడి భక్షించుట స్వార్థము కాదా ? ప్రపంచమున మాంసాహారులు కాని వారి సంఖ్య అత్యల్పము. ప్రతిదినము ఆకలి అను స్వార్థమునకై లక్షలకొలది పశువులు బలియగుచుండగా, ఒకానొకఁడు స్వర్గముకొఱకు పశువును బలిచేయుచుండగా అది అక్రమమని ఆక్రోశించుటకు అర్థమేమున్నది ? ఆఁకలి తీరుట ప్రత్యక్షప్రయోజనము కాఁబట్టి అందులకై మాంసాహారమును అంగీకరింపవచ్చును, కాని అప్రత్యక్షమైన స్వర్గముకొఱకు పశుబలిని అంగీకరించుట తప్పని కొందఱనవచ్చును. మనుష్యుల వ్యాధులకు మందులను కనుగొనుటకై అనేక పశువులను ఆవ్యాధులకు బలిచేసి శాస్త్రవేత్తలు ఎన్నో ప్రయోగములను చేయుచున్నారు. ఈ ప్రయోగములయందు (experiments) ఆ జంతువులు మరణింపక, ఎన్నో బాధలకు గురియగుచుండును. ఒక్కసారి ఒక్క ప్రయోగమువలననే మందు నిశ్చితముగా గ్రహింపఁబడదు. నూతనప్రయోగఫలము (Result of a new experiment) ఎప్పుడైనను అప్రత్యక్షమే, అనిశ్చితమే. కాని ఎప్పటికైనను ఫలింపవచ్చునను నాశతో బహుహింసాత్మకములైన యీప్రయోగములు జరుగుచునేయున్నవి. క్షేమముకొఱకు, భద్రతకొఱకు ప్రభుత్వములు యోధులను రక్షక భటులను జయమునందలి విశ్వాసముతో ప్రయోగించుచునే యున్నవి. వ్యవహారమున ప్రతిరంగమునందును జనులు తమ తమ విశ్వాసముల ననుసరించి హింసాకృత్యములను అవలంబించుచుండగా వేదశాస్త్రములను నమ్మి యొకఁడు యజ్ఞమునందు పశుబలిని గావించినచో ఆక్షేపించుట అసంగతము.

## (iii) అలర్కాంబరీష గాథా చమసము

బ్రాహ్మణుఁడు పత్నికి మరల ఇట్లు చెప్పెను. క్షత్రియవధమునుండి పరశురాముని నివారించుచు పితరులు ఆయనకు అలర్కుని వృత్తాంతమును చెప్పిరి. అలర్కుఁడు పరాక్రమశాలియై సర్వవసుంధరను జయించి శాంతిని గానక సూక్ష్మముగా విచారింపఁజొచ్చెను. ఇంద్రియమనోబుద్ధుల వ్యాపారములు అశాంతికి కారణమని గ్రహించి అతఁడు వానిని జయింపఁబూని వ్యర్థుఁడై, తుదకు తపస్సుచేసి యోగము అనునొక్క బాణముచేత వానినన్నింటిని జయించి విస్మయముతో ఒక గాథను ఇట్లు చెప్పెను. "అహో ! మాచేత బాహ్యమైన దంతయు అనుష్ఠింపఁబడినది. భోగతృష్ణాసమాసక్తులమై రాజ్యమును ఉపాసించితిమి. యోగముకంటె పరమైన సుఖము లేదని తరువాత తెలిసినది".

శ్లో|| విస్మిత శ్చాపి రాజర్షి రిమాం గాథాం జగాద హ |
అహో ! కష్టం య దస్మాభి స్సర్వం బాహ్య మనుష్ఠితమ్ || 30

శ్లో|| భోగతృష్ణా సమాయుక్తైః పూర్వం రాజ్య ముపాసితమ్ |
ఇతి పశ్చా న్మయా జ్ఞాతం యోగా న్నాస్తి పరం సుఖమ్ || 31

ఆశ్వమేధికము - అధ్యాయ - 30

అంబరీషుఁడు కూడ ఇట్లే కొన్ని గాథలను చెప్పెను. "శత్రువుల నందఱను వధించితిని ; దోషములను చాలవఱకు జయించితిని. అన్నింటిలో బలిష్ఠమైనది వధింపఁదగినదియునైన యొక్క దోషమును నేను హతమొనరింపలేదు. లోభముచేతన ప్రాణులకు తృష్ణ శమించుట లేదు. తృష్ణవలననే, తన్ను తానెఱుంగక మానవుఁడు నీచములైన తలంపులతో అకార్యములను గావించుచున్నాఁడు. ఆ లోభమును తీక్ష్ణ ఖడ్గములతో ఖండింపుఁడు ; ఖండింపుఁడు. లోభమువలన తృష్ణ, దానివలన చింత, దానివలన రాజసగుణములు, వానివలన తామసగుణములు కలుగుచున్నవి. ఆగుణములచేత మనుష్యుఁడు దేహబంధమును పొంది మాటిమాటికి చచ్చుచు పుట్టుచున్నాఁడు. కావున ఈ లోభమును చక్కఁగా గుర్తించి ధైర్యముతో నిగ్రహించి ఆత్మరాజ్యమును కోరుకోవలయును. ఆత్మరాజ్యమే రాజ్యము. మఱియొక రాజ్యమే లేదు. చక్కఁగా తెలిసికొనఁబడిన యాత్మయే రాజు".

శ్లో॥ భూయిష్ఠం విజితా దోషా నిహతా స్సర్వ శత్రవః ।
ఏకో దోషో వరిష్ఠ శ్చ వధ్య స్స న హతో మయా ॥ 7

శ్లో॥ యత్రయుక్తో జంతు రయం వైతృష్ణ్యం నాధిగచ్ఛతి ।
తృష్ణార్త ఇహ నిమ్నాని ధావమానో న బుధ్యతే ॥ 8

శ్లో॥ అకార్య మపి యే నేహ ప్రయుక్త స్సేవతే నరః ।
తం లోభ మసిభిః తీక్ష్ణైః నికృంతత నికృంతత ॥ 9

శ్లో॥ లోభా ద్ధి జాయతే తృష్ణా తత శ్చింతా ప్రవర్తతే ।
స లిప్సమానో లభతే భూయిష్ఠం రాజసాన్ గుణాన్ ।
త దవాప్తౌ తు లభతే భూయిష్ఠం తామసాన్ గుణాన్ ॥ 10

శ్లో॥ స తై ర్గుణై స్సంహత దేహబంధనః పునః పున ర్జాయతి కర్మ చేహతే ।
జన్మక్షయే భిన్నవికీర్ణదేహో మృత్యుం పునర్గచ్ఛతి జన్మ నైవ ॥ 11

శ్లో॥ తస్మా దేతం సమ్య గవేక్ష్య లోభం నిగృహ్య ధృత్యాత్మని రాజ్య మిచ్ఛేత్ ।
ఏత ద్రాజ్యం నాన్య ద స్తీహ రాజ్య మాత్మైవ రాజా విదితో యథావత్ ॥ 12

శ్లో॥ ఇతి రాజ్ఞాంబరీషేణ గాథా గీతా యశస్వినీ ।
ఆధిరాజ్యం పురస్కృత్య లోభ మేకం నికృంతత ॥ 13

## ఆశ్వమేధికము - అధ్యా. 31

బ్రాహ్మణుఁడు మరల భార్యతో ఇట్లనెను. "ఓసి భయశీలా ! నీవు అనుకొనుచున్నట్లు నేను సోమరినై యుండలేదు. నేను ముక్తుఁడను. ఈ జగత్తు అంతయు నాచే వ్యాప్తమై యున్నది. ఈ భావము బుద్ధిచే గమ్యమైనదేకాని శరీరముచేత పొందఁదగినది కాదు. కర్మలన్నియు ఆది అంతము కలవి. శరీరము కర్మబంధనము. కావున పరలోకమునుగూర్చి నీకు భయములేదు. నాయీ భావమునందు ఆసక్తి కలదానవై ఆత్మరూపుఁడనైన నన్నే పొందుచున్నావు".

ఈ దంపతులు ఎక్కడ ఉన్నారని అర్జునుఁడు అడిగెను. "నా మనస్సే బ్రాహ్మణి ; నా బుద్ధియే బ్రాహ్మణుఁడు ; నేనే క్షేత్రజ్ఞుఁడను" అని శ్రీకృష్ణుఁడు చెప్పెను.

ఇందొక విశేషము కలదు. గురువును సేవించి వేదాంతములను శ్రవణమొనర్చి ఆత్మస్వరూపమును నిశ్చితముగా గ్రహించినను, మనస్సునందు సంశయములు విపరీతభావనలు పుట్టుచునే యుండునని, వానిని నిశ్చితమైన బుద్ధియొక్క సాయముతో ఎప్పటికప్పుడు నివారించుచు, మనస్సును బుద్ధియందు లీనము గావింపవలయునని గ్రహింపవలసియున్నది. ఆత్మనుగూర్చి శ్రవణ మొనరించినంతమాత్రమున మనస్సుయొక్క చాంచల్యము వెంటనే శమింపదు.

## 3. మహర్షి బ్రహ్మసంవాద కమండలువు

### (i) ధర్మలక్షణ చమసము

అర్జునుఁడు పరమమైన బ్రహ్మమును గూర్చి వివరింపుము అని శ్రీకృష్ణుని ప్రార్థించెను. శ్రీకృష్ణుఁడు అందులకై గురుశిష్యసంవాదమును చెప్పెను. గురువు శిష్యునకు సంశయచ్ఛేదకముగా మహర్షి బ్రహ్మసంవాదమును బోధించెను.

ఆంగీరసాదులైన మహర్షులు బ్రహ్మయొద్దకు పోయి నిశ్శ్రేయసమును తెలుపుమని ప్రార్థించిరి. ఆయన ఇట్లు చెప్పెను.

"ఒక్క ధర్మమే నాలుగు పాదములతో చతురాశ్రమరూపమున నాలుగు వర్ణములయందు ప్రవర్తించుచున్నది. ఈ ధర్మము నిత్యమని బుద్ధిమంతులు చెప్పుదురు. బ్రహ్మప్రాప్తికై బుద్ధిమంతులైన ద్విజులు పూర్వము నియతముగా అవలంబించిన క్షేమకరము మంగళప్రదమును అయిన మార్గమును మీకు చెప్పెదను వినుఁడు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, అధ్యాత్మము అనునవి నాలుగు పాదములు. మూఁడు వర్ణముల ద్విజులకు ఫలమూలాశనులైన మునులకు వానప్రస్థము ఉపదేశింపఁబడినది. అన్ని వర్ణములవారికి గార్హస్థ్యము విధింపఁబడియున్నది. ధర్మమునకు శ్రద్ధయే లక్షణమని ధీమంతులు చెప్పుదురు. ఇవి ధర్మసేతువులై

దేవయానములని పరికీర్తితములై సత్పురుషులచేత కర్మలచే అవలంబింపబడుచున్నవి. వీనిలో తనకు విహితమైన ధర్మమును వ్రతపరాయణుడై అనుష్ఠించువాడు కొంతకాలమునకు భూతములయొక్క ప్రభవ ప్రళయములను ఎల్లప్పుడు చూచుచుండును.

శ్లో॥ చాతుర్విధ్యం తథా వర్ణం చాతురాశ్రమికాన్ పృథక్ ।
ధర్మ మేకం చతుష్పాదం నిత్య మహు ర్మనీషిణః ॥ 38

శ్లో॥ పంథానం వః ప్రవక్ష్యామి శివం క్షేమకరం ద్విజాః ।
నియతం బ్రహ్మభావాయ గతం పూర్వం మనీషిభిః ॥ 39

శ్లో॥ బ్రహ్మచారిక మేవాహు రాశ్రమం ప్రథమం పదమ్ ।
గార్హస్థ్యం-తు ద్వితీయం స్యాత్ వాన ప్రస్థ మతః పరమ్ ॥ 41

శ్లో॥ తతః పరం తు విజ్ఞేయ మధ్యాత్మం పరమం పదమ్ ॥ 42

శ్లో॥ ఫలమూలానిలభుజాం మునీనాం వసతాం వనే ।
వానప్రస్థం ద్విజాతీనాం త్రయాణా ముపదిశ్యతే ॥ 44

శ్లో॥ సర్వేషా మేవ వర్ణానాం గార్హస్థ్యం త ద్విధీయతే ।
శ్రద్ధా లక్షణ మిత్యేవం ధర్మం ధీరాః ప్రచక్షతే ॥ 45

శ్లో॥ ఇత్యేవం దేవయానా వః పంథానః పరికీర్తితాః ।
సద్భి రధ్యాసితా ధీరైః కర్మభి ర్ధర్మసేతవః ॥ 46

శ్లో॥ ఏతేషాం పృథ గధ్యాస్తే యో ధర్మం శంసితవ్రతః ।
కాలా త్పశ్యతి భూతానాం సదైవ ప్రభవావ్యయౌ ॥ 47

ఆశ్వమేధికము - అధ్యాయ - 36

బ్రహ్మదేవుడు మహర్షులకు ఎన్నో విషయముల నుపదేశించెను. వానిలో ప్రధానాంశములను ఇట్లు గ్రహింపవచ్చును. రాజులు ధర్మకాములు. బ్రాహ్మణులు ధర్మసేతువులు. కావున రాజు బ్రాహ్మణులను రక్షింపవలెె. ఏదేశములలో సాధువులు

నశించుచుందురో అచ్చట పాలకులైన రాజులు ఈలోకమున పరలోకమున కూడ దుర్గతి నొందుదురు. సాధువులను చక్కఁగా రక్షించు ప్రభువులు ఉభయలోకములలో సుఖమును పొందుదురు. అహింసపరమధర్మము. హింస అధర్మలక్షణము. దేవతలకు ప్రకాశము లక్షణము. మనుష్యులకు కర్మ లక్షణము. యోగమునకు ప్రవృత్తి, సంన్యాసమునకు జ్ఞానము లక్షణములు. కావున జ్ఞానమును పురస్కరించుకొని బుద్ధిమంతుఁడు సంన్యసింపవలె. జ్ఞానము కల సంన్యాసి శీతోష్ణాదులను తమస్సును మృత్యువును అతిక్రమించి పరమగతిని పొందుచున్నాఁడు.

శ్లో|| ధర్మకామా శ్చ రాజానః బ్రాహ్మణా ధర్మ సేతవః |
తస్మా ద్రాజా ద్విజాతీనాం ప్రయతేత హి రక్షణే || 17

శ్లో|| రాజ్ఞాం హి విషయే యేషా మవసీదన్తి సాధవః |
హీనా స్తే స్వగుణై స్సర్వైః ప్రేత్య చోన్మార్గగామినః || 18

శ్లో|| రాజ్ఞాం హి విషయే యేషాం సాధవః పరిరక్షితాః |
తేఽస్మిన్ లోకే ప్రమోదన్తే సుఖం ప్రేత్య చ భుంజతే || 19

తే|| అహింసా పరమో ధర్మో హింసా చాధర్మలక్షణా |
ప్రకాశలక్షణా దేవా మనుష్యాః కర్మలక్షణాః || 21

శ్లో|| ప్రవృత్తి లక్షణో యోగో జ్ఞానం సంన్యాసలక్షణమ్ |
తస్మాత్ జ్ఞానం పురస్కృత్య సంన్యసే ది హి బుద్ధిమాన్ || 26

శ్లో|| సంన్యాసీ జ్ఞానసంయుక్తః ప్రాప్నోతి పరమాం గతిమ్ |
అతీతో ద్వంద్వ మభ్యేతి తమో మృత్యుహరాతిగః || 27

ఆశ్వమేధిక - అధ్యాయ - 43

## (ii) జ్ఞానసాధన నిరూపణ చమసము

బ్రహ్మదేవుఁడు జ్ఞానసాధనములను ఇట్లు ప్రశంసించెను - సకల సంపదలు క్షయాంతములు. ఉన్నత పదవులన్నియు పతనాంతములు. సంయోగములు

వియోగాంతములు. జీవితము మరణాంతము. లోకమున స్థావరజంగమాత్మకమైన దంతయు ఎప్పుడును అశాశ్వతమే. కర్మచే సాధింపఁబడు సకలఫలములకు వినాశమే అంతము. పుట్టినవానికి మరణము ధ్రువము. యజ్ఞతపోదానాధ్యయన వ్రతాదుల ఫలములన్నియు వినాశాంతములే. జ్ఞానమునకు అంతము లేదు. కావున శుద్ధమైన జ్ఞానము చేత ప్రశాంతాత్ముఁడు, జితేంద్రియుఁడు నిర్మముఁడు నిరహంకారుఁడును అయినవాఁడు సకలపాపవిముక్తుఁ డగును.

శ్లో॥ సర్వే క్షయాన్తా నిచయాః పతనాంతా సముచ్ఛ్రయాః ।
సంయోగా శ్చ వియోగాంతాః మరణాంతం చ జీవితమ్ ॥ 19

శ్లో॥ సర్వం కృతం వినాశాంతం జాతస్య మరణం ధ్రువమ్ ।
అశాశ్వతం హి లోకేఽస్మిన్ సదా స్థావర జంగమమ్ ॥ 20

శ్లో॥ ఇష్టం దత్తం తపోఽధీతం వ్రతాని నియమా శ్చ యే ।
సర్వ మేత ద్వినాశాంతం జ్ఞాన స్యాంతో న విద్యతే ॥ 21

శ్లో॥ తస్మాత్ జ్ఞానేన శుద్ధేన ప్రశాంతాత్మా జితేంద్రియః ।
నిర్మమో నిరహంకారో ముచ్యతే సర్వపాప్మభిః ॥ 22

## అశ్వమేధిక - అధ్యాయ - 44

గృహస్థుఁడు కాని బ్రహ్మచారి కాని వాన ప్రస్థుఁడైనను మోక్షమును కోరువాఁడు ఉత్తమమైన వృత్తిని ఆశ్రయింపవలె. అతఁడు జితేంద్రియుఁడై సకల భూతములకు అభయము నొసంగి వానికి మిత్రుఁడై సుఖప్రదుఁడై నిష్కర్మత్వమును అవలంబింపవలె. గౌరవపురస్సరమైన వస్తులాభమును అతఁడు ఏవగించుకోవలె. అన్నమును తినునప్పుడు తిక్తము మధురము కటుకము మొదలుగా రుచుల నతఁడు ఆస్వాదింపరాదు. జీవయాత్రా మాత్రమునకు ప్రాణములు నిల్పుటకొఱకే అతఁడు భుజింపవలయును. అతఁడు తనధర్మమును ప్రకాశింపఁజేయరాదు ; విజనప్రదేశమున సంకల్పరహితుఁడై చరించుచుండవలె. నివాసముకొఱకు శూన్యాగారమునో అరణ్యమునో వృక్షమూలమునో నదినో పర్వతగుహనో చేరవలె ; గ్రీష్మమునందు ఒక్కొక్క గ్రామమున

ఒక్కొక్క రాత్రి యుండుచు, వర్షములందు ఒక్కచోట నుండవచ్చును. అతఁడు శిల్పముచెత జీవింపరాదు ; బంగారమును అపేక్షింపరాదు ; ఎవరిని ద్వేషింపరాదు; ఎవరికిని ఉపదేశింపరాదు ; ఉపకారము కూడ చేయరాదు ; పొందరాదు ; హింసాత్మకములైన కృత్యములనుగాని, ఆశీర్యుక్తములైన కార్యములను గాని తాను చేయరాదు ; ఇతరులచేత చేయింపరాదు ; లోకసంగ్రహరూపమైన ధర్మమును కూడ తాను చేయరాదు ; ఇతరులచేత చేయింపరాదు.

గృహస్థ ధర్మమునందున్న విద్వాంసుఁడు అమూఢుఁ డయ్యును, మూఢునివలె కన్పించుచు, ధర్మమున దోషము కలుగకుండ వర్తింపవలె. ఇట్లు వృత్తసంపన్నుఁడైనవాఁడు మునిశ్రేష్ఠుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. అతఁడు శరీరాదులందు అభిమానమును క్షీణింపఁజేసికొనుటకై ఏకాంతమునందు ఆత్మను ధ్యానించుచు సర్వసంగ నిర్ముక్తుఁడై నిరాతంకముగా పరమపదమును పొందును.

శ్లో॥ గృహస్థో బ్రహ్మచారీ చ వానప్రస్థోఽథవా పునః ।
యు ఇచ్ఛే న్మోక్ష మాస్థాతు ముత్తమాం వృత్తి మాశ్రయేత్ ॥ 17

శ్లో॥ అభయం సర్వభూతేభ్యో దత్త్వా నైష్కర్మ్య మాచరేత్ ।
సర్వభూతసుఖో మైత్ర స్సర్వేంద్రియయతో మునిః ॥ 18

శ్లో॥ అభిపూజితలాభా ద్ధి విజుగుప్సేత భిక్షుకః ।
భుక్త్వా న్యన్నాని తిక్తాని కషాయకటుకాని చ ॥ 22

శ్లో॥ నాస్వాదయీత భుంజానో రసాం శ్చ మధురాం స్తథా ।
యాత్రామాత్రం చ భుంజీత కేవలం ప్రాణధారణమ్ ॥ 23

శ్లో॥ న సన్నికాశయే ద్ధర్మం వివిక్తే చారజా శ్చరేత్ ।
శూన్యాగార మరణ్యం వా వృక్షమూలం నదీం తథా ॥ 25

శ్లో॥ ప్రతిశ్రయార్థం సేవేత పార్వతీం వా పున ర్గుహామ్ ।
గ్రామైక రాత్రికో గ్రీష్మే వర్షా స్వేకత్ర వా వసేత్ ॥ 26

శ్లో॥ న శిల్పజీవికాం జీవేత్ హిరణ్యం నోత కామయేత్ ।
న ద్వేష్టా నోపదేష్టా చ భవే చ్చ నిరుపస్కృతః ॥ 37

శ్లో॥ ఆశీర్యుక్తా ని సర్వాణి హింసాయుక్తాని యాని చ ।
లోకసంగ్రహధర్మం చ నైవ కుర్యా న్న కారయేత్ ॥ 39

శ్లో॥ గృహస్థధర్మాశ్రితో విద్వాన్ విజ్ఞానచరితం చరేత్ ।
అమూఢో మూఢరూపేణ చరే ద్ధర్మ మదూషయన్ ॥ 52

శ్లో॥ యథైన మవమన్యేరన్ పరే సతత మేవ హి ।
తథావృత్త శ్చరే ద్ధర్మం సతాం ధర్మ మకుత్సయన్ ॥ 53

శ్లో॥ ధ్యాయే దేకాంత మాస్థాయ ముచ్యతేఽథ నిరాశ్రయః ।
నిర్ముక్త స్సర్వసంగేభ్యో వాయు రాకాశగో యథా ।
క్షీణకోశో నిరాతంక స్తథేదం ప్రాప్నుయా త్పరమ్ ॥ 57

## ఆశ్వమేధిక - అధ్యాయ - 46

నిశ్చితముగా చెప్పునట్టి వృద్ధులు సంన్యాసమును తపస్సుగా చెప్పుదురు. బ్రహ్మనిష్ఠులైన బ్రాహ్మణులు జ్ఞానమునే పరబ్రహ్మముగా తెలిసికొనుచున్నారు. నిర్ద్వంద్వము, నిర్గుణము, నిత్యము, ఉత్తమము అయిన బ్రహ్మము అతిదూరాత్మకము. అది వేద్యవిద్యను ఆశ్రయముగా గలిగియున్నది. జ్ఞానముచేత తపస్సుచేత రజోగుణమును అతిక్రమించి పవిత్రులైన ధీరులు ఆ పరబ్రహ్మమును చూచుచుందురు. బ్రహ్మవేత్తలు నిదిధ్యాసన నిరతులై తపస్సుచేత క్షేమముగా పయనించి పరమేశ్వరుని చేరుచున్నారు. ఆచారమును ధర్మసాధకమని, తపస్సును ప్రదీపమని పెద్దలు చెప్పు[illegible]. దే[illegible] కోరక దేనిని తక్కువగా చూడక సర్వసముఁడై యుండువాఁడు ఈ లోకమున [illegible]్మపి యగుచున్నాఁడు.

శ్లో॥ సంన్యాసం తప [illegible] ర్వృద్ధా నిశ్చితవాదినః ।
బ్రాహ్మణా బ్రహ్మయోనిస్థా జ్ఞానం బ్రహ్మ పరం విదుః ॥ 1

శ్లో|| అతి దూరాత్మకం బ్రహ్మ వేదవిద్యావ్యపాశ్రయమ్ |
నిర్ద్వంద్వం నిర్గుణం నిత్య మచింత్యగుణ ముత్తమమ్ || 2

శ్లో|| జ్ఞానేన తపసా చైవ ధీరాః పశ్యన్తి త త్పరమ్ |
నిర్ణిక్తమనసః పూతా వ్యుత్క్రాంత రజసోఽమలాః || 3

శ్లో|| తపసా క్షేమ మధ్వానం గచ్ఛన్తి పరమేశ్వరమ్ |
సంధ్యాననిరతా నిత్యం యే బ్రహ్మవిదో జనాః || 4

శ్లో|| తపః ప్రదీప ఇత్యాహు రాచారో ధర్మసాధకః |
జ్ఞానం వై పరమం విద్యాత్ సంన్యాసం తప ఉత్తమమ్ || 5

శ్లో|| యో న కామయతే కించిత్ న కించి దవమన్యతే |
ఇహ లోకస్థ ఏవైష బ్రహ్మభూయాయ కల్పతే || 61

ఆశ్వమేధికము - అధ్యా. 47

## (iii) ధర్మనిర్ణయవిధాన చమసము

బ్రహ్మదేవుని ఋషులిట్లడిగిరి. "ధర్మమార్గము వివిధవాదములచేత సంకీర్ణముగా కన్పించుచున్నది. సకలధర్మములలో అనుష్ఠేయ తమ మైనదేది ? దేహము పడిపోయిన తరువాత ధర్మము ఫలించునని కొందఱు, అట్లు కాదని మఱికొందఱు ; ఇదియంతయు సంశయగ్రస్త మని ఇతరులు ఇది నిస్సంశయమని ఇంకను కొందఱు చెప్పుచున్నారు. తత్త్వవాదులు బ్రహ్మజ్ఞులును అయిన బ్రాహ్మణులే ధర్మము అందఱకు ఏకరూపమేయని కొందఱు, విడివిడిగా నుండునని మఱికొందఱు [illegible] అనేకులు తలంచుచున్నారు. దేశకాలములు ప్రధానములని కొందఱు, [illegible]దని కొందఱు చెప్పుదురు. కొందఱు జటాజినధారులై యుండగా, కొందఱు ముండ్లులై అసంవృతులై యుందురు. కొందఱు స్నానము చేయకుండుట మంచి దనఁగా మఱికొందఱు స్నానమును ప్రశంసింతురు. కొందఱు ఆహార మావశ్యక మనుచుండఁగా, మఱికొందఱు అనశనవ్రతులై యున్నారు. కొందఱు కర్మను కొందఱు ప్రశాంతిని ప్రశంసించుచున్నారు. కొందఱు యజ్ఞమును, కొందఱు దానమును, కొందఱు

తపస్సును, కొందఱు స్వాధ్యాయమును పరమసాధనముగా ప్రశంసించుచున్నారు. ఇట్లు ధర్మము బహువిధముల నిరూపింపఁబడుచు ప్రబోధింపఁబడుచుండుటవలన మేము సమ్మూఢులమై నిశ్చయమును పొందలేకున్నాము. ఎవఁడు ఏ ధర్మమునందు నిరతుడైయున్నాఁడో వాఁడు ఆధర్మమును సదాపూజించుచు, 'ఇది శ్రేయము, ఇదియే శ్రేయము' అని పైకి వచ్చుచున్నాఁడు. ఈ కారణముచేత మాకు మనస్సు బహుముఖమై, ప్రజ్ఞ ఒకదానియందు నిలుచుట లేదు. కావున ఏదిశ్రేయమో నీవు చెప్పవలయునని మేము కోరుచున్నాము".

శ్లో॥ కో వా స్వి దిహ ధర్మాణా మనుష్ఠేయతమో మతః ।
వ్యాహతా మివ పశ్యామో ధర్మస్య వివిధాం గతిమ్ ॥ 1

శ్లో॥ ఊర్ధ్వం దేహా ద్వదం త్యేకే నైత దస్తీతి చాపరే ।
కేచి త్సంశయితం సర్వం, నిస్సంశయ మథాపరే ॥ 2

శ్లో॥ మన్యన్తే బ్రాహ్మణా ఏవ బ్రహ్మజ్ఞా స్తత్త్వవాదినః ।
ఏవ మేకే పృథ క్చాన్యే బహుత్వ మపి చాపరే ॥ 4

(పృథక్ బహుత్వ శబ్దాభ్యాం ఏవ మిత్యనేన ధర్మః ।
ఏకః ఏవ ఇతి నిస్సంశయం గృహ్యతే)

శ్లో॥ దేశకాలా వుభౌ కేచిత్ నైత దస్తి చావరే ।
జటాజినధరా శ్చాన్యే ముండాః కేచి దసంవృతాః ॥ 5

శ్లో॥ అస్నానం కేచి దిచ్ఛన్తి స్నాన మవ్యపరే జనాః ।
మన్యన్తే బ్రాహ్మణా ఏవ బ్రహ్మజ్ఞా స్తత్త్వదర్శినః ॥ 6

శ్లో॥ ఆహారం కేచి దిచ్ఛన్తి కేచి చ్చానశనే రతాః ।
కర్మ కేచి త్ప్రశంసన్తి ప్రశాంతం చాపరే జనాః ॥ 7

శ్లో॥ యజ్ఞ ఇత్యపరే విప్రాః ప్రదాన మితి చాపరే ।
తప స్త్వన్యే ప్రశంసన్తి స్వాధ్యాయ మపరే జనాః ॥ 12

శ్లో|| ఏవం వ్యుత్థాపితే ధర్మే బహుధా విప్రబోధితే |
నిశ్చయం నాధిగచ్ఛామ స్సమ్మూఢా స్సురసత్తమ || 14

శ్లో|| ఇదం శ్రేయ ఇదం శ్రేయః ఇత్యేవం వ్యుద్ధితో జనః |
యో హి యస్మిన్ రతో ధర్మే స తం పూజయేత్ సదా || 15

శ్లో|| తేన నో విహితా ప్రజ్ఞా మన శ్చ బహులీకృతమ్ |
ఏత దాఖ్యాతు మిచ్ఛామః శ్రేయః కిమితి సత్తమ || 16

ఆశ్వమేధికము - అధ్యాయ. 49

బ్రహ్మదేవుఁడు ఇట్లనెను. "అంతయు విని చక్కఁగా నిశ్చయించుకొనుఁడు. సకల భూతముల విషయమున అహింసయే శ్రేష్ఠమైన కృత్యము. ఇది ఎవరికిని ఉద్వేగమును కలిగింపని పదవి. ఇది శ్రేష్ఠమైన ధర్మలక్షణము. తత్త్వమును నిశ్చితముగా దర్శించిన వృద్ధులు జ్ఞానమును నిశ్శ్రేయసమునుగా చెప్పుదురు. కావున శుద్ధమైన జ్ఞానముచే ఎవఁడైనను సర్వపాపములనుండి ముక్తుఁడగును. నాస్తికులు హింసాపరులు లోభమోహసంయుక్తులై నిరయమును పొందుదురని అలసత్వము లేకుండ ఆశీర్యుక్తములైన కార్యములను చేయువారు ఈ లోకమున మాటిమాటికి జన్మించుచు ప్రమోదమును పొందుచుందురు. ఎవరు విద్వాంసులై కీర్తిని స్వర్గసుఖాదులను ఆసింపక యోగమును అవలంబించి శ్రద్ధతో కర్మలను చేయుదురో వారు ధీరులు సాధుదర్శనలు....

ఇంకను మీకు ఈవిషయమును చెప్పుదును. వేయిపర్యాయములుపదేశించినను దుష్టమైన యాలోచనాపటిమకలవాఁడు (strength of perverted intelligence) సరియైనబుద్ధిని పొందఁడు. సమ్యగ్బుద్ధిలో నాల్గవవంతు కలవాఁడైనను సుఖముగా వృద్ధి నొందును. ధర్మముయొక్క సాధనత్వమును ఇట్లు ఉపాయమువలన తెలిసికోవలయును. ఉపాయజ్ఞుఁడైన మేధావి కదా అత్యంతమైన సుఖమును పొందును. దారిబత్తెము లేకుండ పయనింప మొదలు పెట్టినవాఁడు చాల కష్టముతో ప్రయాణము కొనసాగించును. లేక ఆ కష్టముచేత మధ్యలో నశింపవచ్చును. కావున మనము

చేయుచున్నపని ఫలించునా లేదా అని చక్కఁగా తెలిసికోవలె. తనకు శ్రేయము కలుగుచున్నదా లేదా అని తెలిసికొనుటకు సంభవించుచున్న శుభాశుభములే నిదర్శనములు. ఇంతకుపూర్వము తానెఱుంగని దీర్ఘమైన మార్గమున తత్త్వదర్శనము లేనివాఁడు కాలినడకనే బయలుదేరును. ఆమార్గముననే మఱియొకఁడు వడిగా పోవునశ్వములతో కూర్పఁబడిన రథమున బయలుదేరును. ఇది బుద్ధిమంతుల పద్ధతి. ఊర్ధ్వముగ పర్వతము నెక్కినవాఁడు భూతలమును గమనింపఁడు. ఆ మార్గమున రథముతో క్లేశము నొందుచున్న రథికుని చూచుచు అతఁడు ఎంతవఱకు రథముతో పోవుటకు వీలగునో అంతవఱకును రథమున పయనించును. రథపథము క్షీణించినంతనే రథమును వదలి అతఁడు పైకిపోవును. తత్త్వయోగ విధానములు నెఱింగినవాఁడు ఇట్లు ముందుకు పోవును. అతఁడు ఒకదాని తరువాత ఒకటిగా ఎదురగుచున్న మార్గభేదములను తెలిసికొని అప్పటికి తగినసాధనములను అవలంబించును. మహాఘోరమైన సముద్రమును పడవ లేకుండ కేవలబాహువులచేతనే తరింపఁబూనుకొనువాఁడు నిస్సంశయముగా మరణమునే వాంఛించినట్లగును. సాధనభేదము నెఱింగిన విద్వాంసుఁడు మంచి చుక్కానితో నావతో శ్రమలేకుండ జలమార్గమును త్వరగా తరించును. తీరమునకు చేరిన తరువాత నావయందు మమకారమును వీడి నావను వదలి గమ్యస్థానమునకు పోవును. అట్లుగాక, నావను వదలలేని బెస్తవానివలె, అతఁడు పథికునియందుఁగాని రథికునియందుఁ గాని నావికునియందుఁ గాని స్నేహము నొంది సమ్మోహితుఁడై వారిని వీడకున్నచో వారు ఎక్కడ ఆగిపోయిరో తాను కూడ అక్కడనే యుండి పరిభ్రమించుచుండును. నావతో స్థలమునందు, రథముతో జలమునందును పయనించుట సంభవము కాదు. కావున ఒక్కొక్క విషయమునందు ఒక్కొక్క విధమున పని జరుగును. ఎవఁడు ఏపనిని ఎట్లు చేయుచున్నాఁడో ఆఫలములను అట్లే పొందుచున్నాఁడు. సుగంధద్రవ్యము నుండి రుచి రూపము స్పర్శము శబ్దము లభింపవు. అట్లే అయుక్తి [illegible] ము లభింపదు".

[illegible] సమస్త మిహ త [illegible] సమ్య గేవావధార్యతామ్ ।
అహింసా సర్వభూ [illegible] మేత త్కృత్యతమం మతమ్ ॥ 2

శ్లో॥ ఏత త్పద మనుద్విగ్నం వరిష్ఠం ధర్మలక్షణమ్ ।
జ్ఞానం నిశ్శ్రేయ ఇత్యాహుః వృద్ధా నిశ్చితదర్శనాః ॥ 3

శ్లో॥ తస్మాత్ జ్ఞానేన శుద్ధేన ముచ్యతే సర్వకిల్బిషైః ।
హింసాపరా శ్చ యే కేచిత్ యే చ నాస్తికవృత్తయః ॥ 4

శ్లో॥ లోభమోహసమాయుక్తా స్తే వై నిరయగామినః ।
ఆశీర్యుక్తాని కర్మాణి కుర్వతే యే త్వతంద్రితాః ॥ 5

శ్లో॥ తేఽస్మిన్ లోకే ప్రమోదన్తే జాయమానాః పునః పునః ।
కుర్వతే యే తు కర్మాణి శ్రద్దధానాః విపశ్చితః ॥ 6

శ్లో॥ అనాశీర్యోగ సంయుక్తా స్తే ధీరా స్సాధుదర్శినః.... 7

శ్లో॥ ఏత ద్విప్రా విజానీత హంత భూయో బ్రవీమి, వః ।
సహస్రే ణాపి దుర్మేధా న బుద్ధి మధిగచ్ఛతి ॥ 18

శ్లో॥ చతుర్థేనా ప్య థాంశేన బుద్ధిమాన్ సుఖ మేధతే ।
ఏవం ధర్మస్య విజ్ఞేయం సంసాధన ముపాయతః ॥ 19

శ్లో॥ ఉపాయజ్ఞో హి మేధావీ సుఖ మత్యంత మశ్నుతే ।
యథాధ్వాన మపాథేయః ప్రపన్నో మనుజః క్వచిత్ ॥ 20

శ్లో॥ క్లేశేన యాతి మహతా వినశ్యే దంతరాపి చ ।
తథా కర్మ సువిజ్ఞేయం ఫలం భవతి వా న వా ॥ 21

శ్లో॥ పురుష స్యాత్మని శ్రేయః శుభాశుభనిదర్శనమ్ ।
యథా చ దీర్ఘ మధ్వానం పద్భ్యా మేవ ప్రపద్యతే ॥ 22

శ్లో॥ అదృష్టపూర్వం సహసా తత్త్వదర్శనవర్జితః ।
త మేవ చ యథాధ్వానం రథే నౌ హాశుగామినా ॥ 23

శ్లో॥ గచ్ఛ త్యశ్వ ప్రయుక్తేన తథా బుద్ధిమతాం గతిః ।
ఊర్ధ్వం పర్వత మారుహ్య నాన్వవేక్షేత భూతలమ్ ॥ 24

శ్లో॥ రథేన రథినం పశ్యన్ క్లిశ్యమాన మచేతనమ్ ।
యావ ద్రథపథ స్తావత్ రథేన స గచ్ఛతి ॥ 25

శ్లో॥ క్షీణే రథపథే విద్వాన్ రథ ముత్సృజ్య గచ్ఛతి ।
ఏవం గచ్ఛతి మేధావీ తత్త్వయోగ విధానవిత్ ॥ 26

శ్లో॥ పరిజ్ఞాయ గుణజ్ఞ శ్చ తూత్తరా దుత్తరోత్తరమ్ ।
యథార్ణవం మహాఘోర మప్లవః సంప్రగాహతే ॥ 27

శ్లో॥ బాహుభ్యా మేవ సమ్మోహాత్ వధం వాంఛత్యసంశయమ్ ।
నావా చాపి తథా ప్రాజ్ఞో విభాగజ్ఞః స్వరిత్రయా ॥ 28

శ్లో॥ అశ్రాంత స్సలిలం గచ్ఛేత్ శీఘ్రం సంతరతే హ్రదమ్ ।
తీర్ణో గచ్ఛేత్ పరం పారం నావ ముత్సృజ్య నిర్మమః ॥ 29

శ్లో॥ వ్యాఖ్యాతం పూర్వకల్పేన యథా రథపదాతినోః ।
స్నేహాత్ సమ్మోహ మాపన్నో నావి దాశో యథా తథా ॥ 30

శ్లో॥ మమత్వే నాభిభూత స్సన్ తత్రైవ పరివర్తతే ।
నావం న శక్య మారుహ్య స్థలే విపరివర్తితుమ్ ॥ 31

శ్లో॥ తథైవ రథ మారుహ్య నాప్సు చర్యా విధీయతే ।
ఏవం కర్మ కృతం చిత్రం విషయస్థం పృథక్పృథక్ ॥ 32

శ్లో॥ యథా కర్మ కృతం లోకే తథైతా నుపపద్యతే ।
య న్నైవ గంధినో రస్యం న రూపస్పర్శ శబ్దతత్ ॥ 33

ఆశ్వమేధికము - అధ్యాయ 50

"ఫలమూలములను భుజించువారు తపస్సుయొక్క క్రమాధిక్యముచేత సిద్ధులై సమాహితచిత్తులై త్రైలోక్యమును చూచుచుందురు. ఔషధములు మందులు మొదలగువానియొక్క వివిధములైన విద్యలు సకలవిధముల తపస్సుచేతనే సిద్ధించుచున్నవి. అన్నింటికి మూలమైన సాధనము తపస్సు. ఏది పొందుటకు

సులభము కాదో, దేనిని అభ్యసించుట కష్టసాధ్యమో, ఏది అతిక్రమించుటకు అసాధ్యమో, దేనిని అనుసరించుట శ్రమావహమో అది యంతయు తపస్సుచేత సాధ్యమగును. తపస్సు దురతిక్రమము....

అవ్యక్తము మొదలుగా పదార్థ విశేషములవఱకు అంతయు అవిద్యాలక్షణముగా స్మరింపఁబడుచున్నది. గుణములచేత ఈ లక్షణమును తెలిసికొనుఁడు. రెండు అక్షరములవలన మృత్యువు, మూఁడక్షరములవలన శాశ్వతమైన బ్రహ్మము ఏర్పడుచున్నవి. "నాది" (మమ) అన్నచో మృత్యువు "నాది కాదు" అన్నచో (న మమ) అమృతత్వము కలుగును. మందబుద్ధులు కొందఱు కర్మను ప్రశంసింతురు. వేదపారమును చూచినవారు కర్మలయందు ప్రీతినొందరు. మహాత్ములు కర్మను ప్రశంసింపరు. పురుషుఁడు విద్యామయుఁడే కాని కర్మమయుఁడు కాఁడు. ఇట్లు అమృతము నిత్యము శాశ్వతమును అయిన యాత్మనెఱింగినవాఁడు మృతుఁడు కాఁడు. సత్త్వముయొక్క ప్రసాదము కలిగినప్పుడు, దేనికంటె అధికమైనదిలేదో అట్టి బ్రహ్మమును తెలిసికొనుచున్నాఁడు. కావున చిత్తప్రసన్నతను పొందవలయును. జాగ్రత్ప్రపంచము స్వప్నమువలె తోచుచుండుటయె ప్రసన్నతకు లక్షణము. జ్ఞానపరినిష్ఠితులైన ముక్తుల లక్షణమిది. ఇది అనిందితమైన వృత్తము. నిస్పృహుఁడై ఆశీర్వాదరహితుఁడై సకలభూతములయందు సముఁడై సమదర్శనుఁడైన వానికి ఇది శక్యమగును. మీకు అంతయు చెప్పితిని సత్వరముగా ఇట్లు చేయుఁడు. మీరు సిద్ధిని పొందఁగలరు".

ఈ బ్రహ్మోపదేశమును గురువువలన గ్రహించి శిష్యుఁడు, ఆయన చెప్పినట్లుచేసి, ముక్తిని పొందెను".

ఇట్లు కృష్ణుఁడు చెప్పఁగా, "ఆ గురువు ఎవరు ; శిష్యుఁడెవరు" అని అర్జునుఁడు అడిగెను. శ్రీకృష్ణుఁడు ఇట్లనెను. "నేనే గురువును. నా మనస్సే శిష్యుఁడు. నీయందలి ప్రీతిచేత రహస్యమైన యధ్యాత్మమును చెప్పితిని. నీవు దీనిని చక్కగా ఆచరించినచో సర్వపాప వినిర్ముక్తుఁడవై మోక్షమును పొందఁగలవు. పూర్వము యుద్ధసమయమునందు కూడ దీనినే నీకు చెప్పితిని. కావున దీనియందు మనస్సును నిలుపుము".

శ్లో॥ తపస శ్చానుపూర్వ్యేణ ఫలమూలాశిన స్తథా ।
త్రైలోక్యం తపసా సిద్ధాః పశ్య న్తీహ సమాహితాః ॥ 16

శ్లో॥ ఔషధా న్యగదాదీని నానావిధా శ్చ సర్వశః ।
తప సైవ ప్రసిధ్యంతి తపో మూలం హి సాధనమ్ ॥ 17

శ్లో॥ య ద్దురాపం దురామ్నాయం దురాధర్షం దురన్వయమ్ ।
త త్సర్వం తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్ ॥ 18

శ్లో॥ అవ్యక్తాది విశేషాంత మవిద్యాలక్షణం స్మృతమ్ ।
నిబోధత తథా హీదం గుణై ర్లక్షణ మిత్యుత ॥ 29

శ్లో॥ ద్వ్యక్షర స్తు భవే న్మృత్యుః త్ర్యక్షరం బ్రహ్మ శాశ్వతమ్ ।
మమేతి చ భవే న్మృత్యుః న మమేతి చ శాశ్వతమ్ ॥ 30

శ్లో॥ కర్మ కేచిత్ ప్రశంసన్తి మందబుద్ధిరతా నరాః ।
యే తు వృద్ధా మహాత్మానో న ప్రశంసన్తి కర్మ తే ॥ 31

శ్లో॥ తస్మాత్ కర్మసు నిస్స్నేహా యే కేచిత్ పారదర్శినః ।
విద్యామయోఽయం పురుషో న తు కర్మమయః స్మృతః ॥ 33

శ్లో॥ య ఏవ మమృతం నిత్య మగ్రాహ్యం శశ్వ దక్షరమ్ ।
వశ్యాత్మాన మనంశ్లిష్టం యో వేద న మృతో భవేత్ ॥ 34

శ్లో॥ స తద్బ్రహ్మ శుభం వేత్తి యస్మా ద్భూయో న విద్యతే ।
ప్రసాదే చైవ సత్త్వస్య ప్రసాదం సమవాప్నుయాత్ ॥ 37

శ్లో॥ లక్షణ[illegible] ప్రసాగస్య యథాస్యాత్ స్వప్నదర్శనమ్ ।
గతి రేషా తు ముక్తానాం యే జ్ఞాన పరినిష్ఠితాః ॥ 38

శ్లో॥ ఏషా జ్ఞానవతాం ప్రాప్తి రేత ద్వృత్త మనిందితమ్ ।
సమేన సర్వభూతేషు నిస్పృహేణ నిరాశిషా ॥ 40

శ్లో॥ శక్యా గతి రియం గన్తుం సర్వత్ర సమదర్శినా ।
ఏత ద్వ స్సమాఖ్యాతం మయా విప్రర్షి సత్తమాః ।
ఏవ మాచరత క్షిప్రం తత స్సిద్ధి మవాప్స్యథ ॥ 41

వాసుదేవ ఉవాచ ;-

శ్లో॥ అహం గురు ర్మహాబాహో ! మన శ్శిష్యం చ విద్ధి మే ।
త్వత్ప్రీత్యా గుహ్య మేత చ్చ కథితం తే ధనంజయ ॥ 47

శ్లో॥ పూర్వ మప్యేత దేవోక్తం యుద్ధకాల ఉపస్థితే ।
మయా తవ మహాబాహో తస్మా దత్ర మనః కురు ॥ 50

అశ్వమేధికము - అధ్యా. 51

# 4. బ్రహ్మోపదేశ కమండలువు

## (i) వేదధర్మ చమసము

మహర్షుల ప్రశ్నలను విమర్శించి గ్రహించిననే తప్ప బ్రహ్మదేవుని సమాధానము బోధపడదు. ధర్మములలో అనుష్ఠేయతమము (అనుష్ఠింపవలసిన వానిలో శ్రేష్ఠము) ఏది యన్నది ప్రధానమైన ప్రశ్న. తరువాత వారు పేర్కొన్న వన్నియు లోకప్రసిద్ధములైన భావభేదములు. ఇవి ప్రధానముగా రెండు పక్షములుగా నున్నవి. దేహము పడిపోయినతరువాత ధర్మాధర్మములయొక్క ఫలానుభవము లేదనుట నాస్తికపక్షము. దేహము పడిపోయిన తరువాత లోకాంతరమునఁ గాని జన్మాంతరమునఁ గాని జీవుఁడు ఆఫలములను తప్పక అనుభవించుననుట ఆస్తిక్యపక్షము. దీనిని సంశయించువాఁడు కూడ నాస్తిక పక్షములోనివాఁడే యగును. కావున నాస్తికత్వము ఆస్తికత్వము అను రెండు పక్షములే ముఖ్యములు.

ఆస్తికత్వమునందు రెండు విభాగములు కలవు. ఎల్లమానవులకు ఒక్కటియే ధర్మము అను విశ్వాసము, లేక ఏకధర్మవాదము మొదటిది. ఈ విశ్వాసమే ఇప్పటి బౌద్ధజైన వీరశైవ వీరవైష్ణవములు, ఇస్లాము క్రైస్తవము మొదలగు మతములలో ప్రధానసూత్రముగా నున్నది. వీరిలో అతివాదులు మితవాదులు కలరు. "మామతమే

సత్యము ; తక్కినవన్నియు అసత్యములు ; వానిని నిర్మూలించి మా సత్యమతమునే ప్రపంచమున ఏకైక మతముగా నిల్పుటయే మాకు పరమలక్ష్యము" అని పరమతముల నిర్మూలింపఁబూనుకొను వారు అతివాదులు. అట్లు ద్వేషమును భయంకరముగా ప్రకటింపకున్నను విద్యాలయములు ఆస్పత్రులు ప్రార్థనమందిరములు మొదలుగా ప్రచారసాధనములైన సంస్థలను నెలకొల్పి వానిమూలమున తమ మతవ్యాపనమునకు ప్రయత్నించువారు మితవాదులు. వైదికులలో కూడ కొందఱు ఉందురు. వీరు యజ్ఞయాగాదికములను ప్రబలఁజేయుచు వానిలో సదస్యవసతులయందు యజ్ఞమే సర్వశ్రేష్ఠమని, తపస్సే మిన్నయని, దానమే వరిష్ఠమని ప్రబోధించుచుందురు. వీరిలో జటాజినధారులు, ముండులు (సంన్యాసులవలె ముండితశిరస్కులు) మొదలగువారు ఉండవచ్చును. వీరిశిష్యులు వీరి మార్గములను ప్రశంసించుచు ప్రబలఁజేయుచుందురు.

దేశకాలవర్ణాశ్రమాది భేదములనుబట్టి ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్కదేశము కాలము ననుసరించి స్వధర్మము ఏర్పడును ; ఒకనికి ఫలప్రదమైనధర్మము అందఱకును అట్లే ఫలప్రదమగునని చెప్పఁజాలము ; ఒకనికే బ్రహ్మచర్యమునందు, గార్హస్థ్యమునందు, వానప్రస్థమునందు సంన్యాసమునందు ధర్మకర్తవ్యములు వేఱు వేఱుగా నున్నవి. ప్రతివ్యక్తి ఆచార్యునివలన శాస్త్రము ననుసరించి తనకు ఏది కర్తవ్యమో నిశ్చయించుకొనవలె ; ఎవ్వఁడైనను స్వధర్మానుష్ఠానమువలననే అభ్యుదయమును నిశ్శ్రేయమును పొందును" అని చెప్పుట, అనగా పృథగ్ధర్మవాదము, ఆస్తికత్వమున రెండవ విభాగము. ఇదియే వేదధర్మము.

"ఒక నగరమునకు అనేకమార్గము లుండునట్లు మానవుల యభ్యుదయ నిశ్శ్రేయసములకు ప్రపంచములోని మతము లన్నియు వివిధములైనమార్గములుగా నున్నవి. కాబట్టి ఎవఁడు ఏ మార్గము నవలంబించినను అందఱు ఒక గమ్యమునకే చేరుదురు ; కావున ఎవఁడైనను తన యిష్టము వచ్చినట్లు ఏ మతమునందైనను చేరవచ్చును" అని తలంచువారు కొందఱుందురు (బహుత్వమపి చాపరే). వీరి ప్రవచనములు ఎట్లున్నను ఆచరణమునందు వీరు కూడ పృథగ్ధర్మమార్గమున తమ కుటుంబమునందు వంశపరంపరా సిద్ధమైన మతమునే అవలంబించుచుందురు. అందువలన ఆస్తికత్వమున ప్రధానవిభాగములు రెండే అని గ్రహింపవచ్చును.

## (ii) పరమార్థనిర్ణయ చమసము

పైవిధముగా వైదికులు అవైదికులు, "ఇదియే శ్రేయస్కరము ; ఇదియే శ్రేయస్కరము" తమ మతములను ప్రబలఁజేయుచుండుట ప్రసిద్ధము. శిష్యులప్రచారములవలన ఈప్రవక్తలు, తత్త్వవాదులుగా బ్రహ్మజ్ఞులుగా ప్రసిద్ధులగుచుందురు. కొందఱు తమ గురువులను భగవంతుని యవతారములనుగా నిరూపించుచుందురు. "మహానుభావులుగా ప్రసిద్ధులైనవారు ఇట్లు భిన్నభిన్నముగా ప్రవచనములు చేయుచుండఁగా జిజ్ఞాసువులమైన మాకు ఏది పరమార్థమో ఎట్లు నిశ్చితముగా తెలియును ; కావున సర్వజ్ఞుఁడవైన నీవే మాకు పరమార్థమును నిర్ణయించి చెప్పుము" అని మహర్షులు బ్రహ్మదేవుని ప్రశ్నించిరి.

దీనికి ఆయన చెప్పిన సమాధానముయొక్క పద్ధతిని గమనింపవలసియున్నది. అహింసయే సకలధర్మములలో శ్రేష్ఠమని ఆయన మొట్టమొదటనే నిశ్చయించి చెప్పెను. సకల భూతములయెడ నిర్వైరస్థితి చిత్తమునందు ఏర్పడిననే తప్ప అహింస సిద్ధింపదు. సమదర్శనము కలవానికే నిర్వైరస్థితి కలుగును. సమమనగా బ్రహ్మము (నిర్దోషం హి సమం బ్రహ్మ). జగత్తు సకలభూతములు దేనియందు భాసించుచున్నవో ఆ సర్వాధిష్ఠానమైన బ్రహ్మమును దర్శించుచుండుటయే సమదర్శనము. అది బ్రహ్మజ్ఞానమువలననే సిద్ధించును. అందువలననే బ్రహ్మదేవుఁడు జ్ఞానమే నిశ్శ్రేయసమని చెప్పెను.

ఇట్లు ఆయన తన నిశ్చయమును చెప్పిన తరువాత, కేవలము తనయందే ప్రామాణ్యమును (Authority) ఉంచుకొనక, శాస్త్రమునకు సంప్రదాయమునకు తోడుగా, వికల్పములను విచారించి సరియైన నిశ్చయమును పొందుటకు ఆలోచనమార్గమును కూడ నిర్దేశించెను. అట్లుగాక, "నేను చెప్పుచున్నాను, నేను భగవంతుని ప్రతినిధిని; నా మాటలను మీరు భగవద్వాక్యములనుగా శాసనములనుగా స్వీకరింపవలె ; లేకున్నచో భగవంతునిచే దండింపఁబడుదురు". అని ఆయన ఆదేశించినచో, "లోకములో ప్రసిద్ధులైన ప్రవక్తలలో ఈయనయు ఒకఁడే ; ఈయన చెప్పినది మాత్రము పరమప్రమాణమెట్లగును ?" అని వారు సంశయము నొందవచ్చును.

అందువలన తాను చెప్పినదానికి ఆయన సహేతుకత్వమును (Rationality) నిరూపించుచు వారే ఆలోచించుకొనుటకు మార్గమును నిర్దేశించెను. తమ యాలోచనకు సమంజసముగా తోఁచని దానిని మేధావులు, ఎవ్వరు చెప్పినను, సత్యమునుగ స్వీకరింపలేరు.

నాస్తికులు తమకు కన్పించని దేవతలు పితరులు ఉన్నారని నమ్మరు ; వారికి హవ్యకవ్యముల నొసంగరు. అందువలన వారికి దేవతలయొక్క పితరులయొక్క అనుగ్రహము ఉండదు. తమకు కన్పింపనంత మాత్రమున దేవతలు పితరులు లేరని చెప్పుట అసంగతము. ప్రతివ్యక్తికి ఇంద్రియముల గ్రహణ శక్తి పరిమితమై యుండును. సూక్ష్మదర్శిని (Microscope) దూరదర్శిని (Telescope) మొదలగు సాధనములు కలవారు చూడఁగలిగిన పదార్థములను ఇతరులు చూడఁజాలరు. అట్లే కొందఱు తపస్సుచేత తమయింద్రియములందు విశేషమైన శక్తిని సంపాదించుకొందురు. వారికి సూక్ష్మములైన పదార్థములు గోచరించును. అట్టివారు సూక్ష్మరూపములతో నుండు దేవతలను పితరులను దర్శింపఁగలుగుదురు. ప్రపంచమున ఎన్నో దేశములలో ఎన్నో మతములలో దేవతలను పితరులను దర్శించి వారితో మాటాడినవారు ఎందఱో ప్రసిద్ధులైయున్నారు. వారందఱు భ్రాంతితో ఆ[illegible]ములు చెప్పిరనుటకు వీలు లేదు. వారిలో అనేకులు మేధావులుగా మహానుభావులుగా ప్రసిద్ధులైయుండిరి. వారికి గోచరించినది ఎల్లరికి గోచరించునని చెప్పుటకు వీలు లేదు. "పితరులు నాకు గోచరించిరి ; వారితో నేను మాటాడితిని. మీరు శ్రాద్ధములు తప్పక జరుపవలె అని వివేకానందుఁడు లాహోరులో ఒక సభలో చెప్పెను. ఒక విద్యార్థిలేచి, "పితరులు మీకు కన్పించినచో మాకు మాత్రము ఏల కన్పింపరాదు?" అని యడిగెను. "నీవు నేను చెప్పినట్లుగా అస్ఖలిత బ్రహ్మ[illegible] పండ్రెండు సంవత్సరములు జరుపుము ; అప్పుడు నీకు కూడ వా[illegible]ంతురు" అని సమాధానము చెప్పెను. "దేవతలు, పితరులు మాకు గోచరించినార[illegible] మహాతపస్సంపన్నులైనవారు ఉద్ఘాటించుచుండగా, అట్టి తపశ్శక్తి లవ్వంత[illegible] లేనివారు, "వారి మాటలను మేము నమ్మము ; మాకు కన్పింపని దేవతలు పితరులు ఉన్నారని మేము అంగీకరింపము" అని ప్రలపించుట మూర్ఖతయే అగునుగాని సహేతుకవాదము కాదు.

అట్టివారు దేహపతనానంతరము తాము గావించిన ధర్మాధర్మములకు ఫలముండునని విశ్వసింపరు. అందువలన ఈ దేహమున్నంతవఱకు సాధ్యమైనంతవఱకు భోగముల ననుభవించుటయే వారికి జీవితలక్ష్యముగా నుండుట సహజము. అధర్మమార్గమునందైనను వారు సంపదలను ఐశ్వర్యమును సంపాదించుటకు, తమ యధర్మవర్తనమునకు శిక్ష కలుగకుండుటకును వారు సర్వధా ప్రయత్నించుచుందురు. వారు ఇతరులను హింసించియైనను తాము సుఖపడుటకు పూనుకొనుచుందురు. అట్టి లోభమోహాత్ములు హింసాపరులు దేహాంతమున నరకమును పొందుట తథ్యమగుటయే కాక, సమాజమునకు తప్పక కంటకప్రాయులగుదురు.

ఆస్తికులలో ఈలోకమున పరలోకమున అభ్యుదయము, గోరువారు శాస్త్రవిహితములైన యజ్ఞదానవ్రతాదులను చేయుచు పెద్దలవలన ఆశీస్సులను దేవతానుగ్రహమును పొందుచు ఈలోకమున పరలోకమున సుఖముల ననుభవించుచు మరల మరల జన్మించుచుందురు. వీరు కర్మఠులు.

లోకములోని కర్మఫలములు ఎట్లు క్షీణించుచున్నవో అట్లే స్వర్గాదిఫలములు క్షీణించునని, ఈ ఫలములను కోరినచో మాటిమాటికి గర్భవాసాది దుఃఖములు తప్పవని గ్రహించినవారు కర్మబంధమును తప్పించుకొనుటకై, స్వధర్మవిహితములైన కర్మలను ఫలాపేక్ష లేకుండ కర్తవ్యమాత్రముగ చేయుచు చిత్తశుద్ధి నొంది క్రమముగా జ్ఞాననిష్ఠులగుదురు. వీరు కర్మయోగులు.

## (iii) సంప్రదాయ చమసము

సంప్రదాయమును గౌరవింపక గురుశుశ్రూష చేయక శాస్త్రమును విచారింపక తమబుద్ధిని తోఁచినదే పరమసత్యమని వాదించుచు ఎదుటివారి యభిప్రాయమును అర్థముచేసికొనుటకు సిద్ధపడనివాఁడు ప్రజ్ఞాశాలియైనవాఁడు దుర్మేధుఁడు ; అనగా దుష్టబుద్ధి. వానికి వేయివిధముల బోధించినను వాడు సరియైన యాలోచనమును పొందఁడు. ఇట్టివారు పెక్కుమందికి యథార్థముగఁ దోఁచుచున్నదానిని కూడ గుర్తింపరు ; ఇతరులు చెప్పినను వినరు. వీరే మూర్ఖులు. ఒక్క ఆంజనేయునిచేత వేలకొలది యోధులు, పెక్కుమంది సేనానులే కాక అక్షయకుమారుఁడు కూడ

హతుఁడై లంక తగులబడిన తరువాత సైతము విభీషణుఁడు మాల్యవంతుఁడు మొదలగువారు ఎంతమంది చెప్పినను వినక రామునితో యుద్ధమునకు సన్నద్ధుఁడైన రావణుఁడు ; తనయెదుటనే అనేకపర్యాయములు యుద్ధమునందోడి కర్ణుఁడు పారిపోవుటను స్వయముగా చూచియు, "వీడు పాండవులను జయింపలేఁడు" అని భీష్మాదులు ఎన్ని పర్యాయములు ఎంత దృఢముగ బోధించినను వినక కర్ణునిపై ఆశను నిలుపుకొని యుద్ధమునకు దిగిన దుర్యోధనుఁడు ఇందులకు ప్రబల నిదర్శనములు.

సామాన్యులు, సరియైన బుద్ధిని సమగ్రముగా కాకపోయినను నాల్గవవంతైనను పొందినచో, దానిచేతనే సుఖముగా వృద్ధినొందఁగలరు. ఇచ్చట బుద్ధిలో నాల్గవంతైనను (చతుర్థే నా ప్యంశేన) అభ్యుదయమును కలిగించునని బ్రహ్మదేవుఁడు చెప్పుటలో అభిప్రాయమేమి ? విషయగ్రహణమునందు నాలుగుదశలు కలవు. ఒక్కొక్కదశలో నాల్గవవంతుగా విషయము బోధపడుచుండును. గంభీరమైన శాస్త్రవిషయమును గురువులవలన విన్నప్పుడు ఒకవంతు తెలియును. దానినిగూర్చి తాను స్వయముగా ఆలోచించుకొన్నప్పుడు రెండువంతులు మనస్సునకు వచ్చును. దానినిగూర్చి తోడి విద్యార్థులతో చర్చించునప్పుడు అది మూఁడువంతులు విశదమగును. తాను ఇతరులకు దానిని బోధించునప్పుడు అది పూర్తిగా బోధపడును. కాఁబట్టి శాస్త్రపరిజ్ఞానము లోకానుభవము కలిగిన పెద్దలు చేయునుపదేశములు వ్యర్థములు కావని, వానిని పరమసత్యములనుగా గ్రహింపకున్నను, ముందు విని తరువాత విచారించుకొనవచ్చును లెమ్మని, వారు చెప్పునదంతయు వినుట మొదటి దశ. సామాన్యమైన లోకజ్ఞానము (common sense) కలవారు ఇట్లు పెద్దలు చెప్పు విషయములను వినుచుందురు. అట్లు విన్నవారు వెంటనే దానినిగూర్చి ఆలోచించి ఇతరులతో చర్చించి ఆచరించుటకు పూనుకొనకపోయినను, విన్న సంస్కారము వ్యర్థముకాదు. మఱియొకప్పు డది పైకి వచ్చును. దానితోవారు మరల విద్వాంసుల సాంగత్యమును పొంద క్రమముగా ఆలోచనమును పెంపొందించుకొనుచు విజ్ఞానవంతులగుదురు. కావున సరియైన బుద్ధిలో నాల్గవవంతు కలవాఁడైనను మేలును పొందునని బ్రహ్మదేవుఁడు చెప్పెను.

# (iv) హేతువిచార చమసము

ఈ విధముననే ధర్మముయొక్క సాధనమును కూడ విచారించి ఉపాయముతో సాధించుకొనవలె. ధర్మమునుగూర్చి పెద్దలవలన తెలిసికొని తాను కూడ స్వయముగా విచారించుకొని ఎవఁడైనను నిశ్చయించుకొనవలె. మేధావియై ఉపాయము నెఱింగినవాఁడు ఎట్టి దుర్ఘటకార్యమునైనను సాధించుకొని అత్యంతము సుఖము నొందును. (ఉపాయజ్ఞో హి మేధావీ సుఖ మత్యంత మశ్నుతే) లోకములోని శుభాశుభములను నిదర్శనములుగా గ్రహించుచు ఎవఁడైనను తనకు శ్రేయమెట్లు కలుగునో గ్రహింపవచ్చును. దారిబత్తెము లేకుండ ప్రయాణము చేయమొదలు పెట్టినవాఁడు దారిలో కష్టములపాలగుటయే కాక ఒకప్పుడు వినాశమును కూడ పొందవచ్చును. ఇట్లే మరణానంతర పరలోకయాత్రను గూర్చి కూడ విచారించుకోవలె.

అసలు మరణించినతరువాత జీవుఁడు జన్మములు లోకములు ఉండినఁగదా ఆయాత్రనుగూర్చి విచారించుకోవలె అని కొందఱు తలంపవచ్చును. కాని లోకములోని శుభాశుభ సంఘటనములే జీవుఁడు, జన్మములు లోకములు కలవనుటకు ప్రబల నిదర్శనములు. (పురుషస్య ఆత్మని శ్రేయః శుభాశుభనిదర్శనమ్). కొంచెము బుద్ధి నుపయోగించినచో ఈ నిదర్శనములను బట్టి మరణించినతరువాత జీవుఁడు లోకాంతరములను జన్మాంతరములను తప్పక పొందునని స్పష్టముగా గ్రహింపవచ్చును. తగిన కారణము లేకుండ కార్యమేదియు సంభవింపదు. దీనిని అందఱు అంగీకరింపవలసినదే. దీనిని అంగీకరింపకున్నచో పొలమును దున్నకుండ పైరు పెట్టకుండ పంట వచ్చునని, చదువకుండ పాండిత్యము లభించునని వారు అంగీకరింపవలసియుండును. అట్లు ఎవరును అంగీకరింపఁజాలరు. కావుననే అందఱు తాము అభిలషించుచున్న ఫలమును పొందుటకు తగిన హేతువుగా సకల ప్రయత్నములను చేయుచున్నారు. కావున తగిన కారణము లేకుండ కార్యము పుట్టదనుట స్పష్టము. అందువలన ఎవనికేని ఏదేని కార్యసిద్ధి కలిగినప్పుడు. అందులకు కారణమైన వాని ప్రయత్నము గోచరము కాకున్నచో, మనకు తెలియకపోయినను, అది తప్పక యుండునని యూహించుచునే యున్నాము. వ్యాధి విజృంభించుచున్నప్పుడు దానికి కారణము మనకు తెలియకపోవచ్చును.

తెలియకపోయినను దానికి ఏదో కారణము ఉండునని ఊహించుచున్నాము. మనకు తెలియనంత మాత్రమున కారణము లేకుండ వ్యాధి విజృంభించుచున్నదని ఎవరును అనరు. అట్లే ఆకస్మికముగా ఏర్పడిన సహాయము సంభవించినప్పుడు, దానికి కారణము తాత్కాలికమైనది ఏదియూ గోచరించకపోవును. ఆకారణము అప్పుడే ఏల సంభవింపవలె అని ప్రశ్నించినచో సమాధానమైన కారణము మనకు గోచరము కాదు. ఒక బస్సు (Bus) వేగముతో పోవుచున్నది. ఆకస్మికముగా చోదకునకు (Driver) ప్రక్కనుండి రోడ్డును దాటుచున్న కుక్క కన్పించినది. దానిని తప్పించుటకై అతడు బస్సును ప్రక్కకు మరలించు ప్రయత్నమున ప్రక్కకు త్రిప్పినప్పుడు అది వేగముతో ప్రక్కనున్న నదిలోనికో జలశయములోనికో పడిపోయినది. ఆ కుక్క అప్పుడే ఏలరావలె ? అంతమంది ఒక్కసారిగా ఏలమరణింపవలె అని ప్రశ్నించినచో సమాధానము ఏదియు లభింపదు. కాని అంతఘోరమైన సంఘటనము నిష్కారణముగా సంభవించిన దనుట సహేతుక ప్రసంగము కానేరదు. మఱియును ఆ సంఘటనము ఆవాహనములోని వారి కందఱకు సమానమైనప్పుడు కొందఱు వెంటనే చనిపోవుట, కొందఱు వికలాంగులగుట, మఱికొందఱు ఆశ్చర్యకరముగా చక్కఁగా బ్రతికియుండుట సంభవించుచున్నది. ఈ భేదమునకు కారణమేమి ? ప్రత్యక్షమైన కారణమేదియు ఇందులకు ఊహకందదు. కాని ఘోరముగ మరణించుట, వికలాంగులగుట, చక్కఁగా బ్రతికి బయటపడుట అను సంఘటనములు కారణములు లేకుండ సంభవించెననుట కుదురదు. కారణము లేకుండ కార్యమెట్లు సంభవించు? (There can be no effect without a cause) కావున ఆయావ్యక్తులు, ఈ జన్మమునఁగాని పూర్వజన్మమునఁగాని గావించిన దుష్కృతములకు ఫలముగా చావు వికలాంగత్వము సంభవించెనని, తమ సుకృతమునకు ఫలముగా కొందఱు చక్కఁగా బ్రతికి బయటపడినారని చెప్పక తప్పదు. కావున ఆకస్మికములైన సం... ...నన్, జన్మసిద్ధములైన అంధత్వము బుద్ధిహీనత, పేదకుటుంబమున జన్మించు... ...లక్షణములవలనను ప్రతివ్యక్తికి పూర్వజన్మ ఉన్నదని గ్రహింపవలసియున్నది.

ఇట్లే భవిష్యజ్జన్మము కూడ ఉన్నదని గ్రహింపవలసియున్నది. కొందఱు గొప్ప త్యాగములు చేసి ఆత్యాగములఫలమును పొందక మరణించుచున్నారు.

త్యాగములకు ఫలము వానికి ఎట్లు కలుగవలె. ఆఫలమువానికి లోకాంతరముననో జన్మాంతరముననో కలుగునని చెప్పవలె. లేకున్నచో వానికృషి యంతయు వానికి ఫలమీయకుండ నశించుచున్నదని చెప్పవలె. అట్లు చెప్పుట యుక్తి యుక్తము కాదు. ఒకానొకఁడు స్వార్థపరుఁడై హత్యలను గావించుచు ప్రజలను దోచుకొనుచు శిక్ష తప్పించుకొనుచు భోగముల ననుభవించినచో మరణించినచో, ఆరాక్షసకృత్యములకు వానికి ఇప్పుడు ఏమియు కష్టనష్టములు కలుగుట లేదు. అందువలన వాఁడు ఆ పాపకృత్యములకు ఫలమును లోకాంతరముననో జన్మాంతరముననో తప్పక ఘోరముగా అనుభవించునని చెప్పక తప్పదు. లేకున్నచో ఆకృత్యము లన్నియు ఊరక నశించెనని చెప్పవలసి వచ్చును. (A cause or any amount of generated energy will not be extinguished without giving corresponding result). ఇదియును యుక్తయుక్తము కాదు. ఇప్పుడు ఫలింపని కృత్యములకు మరణానంతరము ఫలము ఉండదన్నచో "ఇప్పటి మనసుఖమును వదలుకొని కష్టపడి ఇతరులకు ఎందుకు ఉపకారము చేయవలె ; దండనమునుండి తప్పించుకొనఁగలిగినచో ఇతరులను పీడించియైన మనమేల సుఖభోగములను అనుభవింపరాదు?" అని ఎవఁడైన ప్రశ్నించినచో సమాధానము లేదు. కావున ప్రతిపని ఇప్పుడు కాకున్నచో మఱియొకప్పుడు, ఈ జన్మమున కాకున్నచో ఇంకొక జన్మమున తప్పక ఫలించునని చెప్పక తీరదు. ఇట్లు అంగీకరించిననే తప్ప ఒకఁడు సంపన్నుఁడుగా దృఢకాయుఁడుగా జన్మించుచుండగా మఱియొకఁడు దరిద్రుఁడుగా వికలాంగుఁడుగా జన్మించుట మొదలగు వైషమ్యములకు హేతువులను నిరూపింపఁజాలము. ఈ వైషమ్యములన్నియు నిష్కారణముగా కలుగుచున్నవనుట హేతుబద్ధము (logical) కాదు.

ఈ విధముగా విచారించినచో మరణించిన జీవుఁడు కర్మఫలము ననుసరించి మఱియొక జన్మమును ఈలోకముననే పొందుటకో, లేక పరలోకమున సుఖదుఃఖములను పొందుటకో యాత్ర చేయుననుట స్పష్టము. ఈ మరణానంతరయాత్రలో ఎవనికి ఏది గమ్యమో (Destination), ఆ గమ్యమునకు చేర్చు మార్గము ఎంత దీర్ఘమో ఎటువంటిదో సామాన్యులకు తెలియదు. కాని లోకములోని శుభాశుభ

నిదర్శనములనుబట్టి మరణానంతర జీవయాత్ర లోకాంతరమునగాని జన్మాంతరమునగాని సుఖముగా జరుగవలెనన్నచో, ఆయాత్రకు దారిబత్తెము పుణ్యమే యని గ్రహింపవలసియున్నది. పుష్కలముగా ధనమును గైకొని యాత్రకు బయలుదేరిన వానికి మార్గమునందు గమ్యస్థానమునందు కూడ ఎట్లు సుఖము లభించునో అట్లే పుణ్యము అను దారి బత్తెమును సంపాదించుకొన్నవానికి మరణానంతర జీవయాత్రలో మార్గమునందు గమ్యమైన లోకాంతరమునందుఁ గాని జన్మాంతరమునందుఁ గాని సుఖమే లభించును. ఇది యెఱుంగక పుణ్యమను దారిబత్తెమును సంపాదించుకొననివాఁడు ఎల్లయెడల క్లేశమును పొందుచునేయుండును (ఉపాయజ్ఞో హి మేధావీ సుఖమత్యంత మశ్నుతే | యథాధ్వాన మపాథేయః ప్రపన్నో మనుజః క్వచిత్ | క్లేశేన యాతి మహతా వినశ్యే దంతరాపి చ ||)

## V. ఉపాయాలంబన చమసము

ఈ న్యాయమే పరమార్థమైన బ్రహ్మానందమును సాధించుటయందు కూడ వర్తించును. ఈ గమ్యమును గూర్చి పయనించుటకు సొంత బుద్ధితో ఆరంభించువాడు ఊరియొక్క పేరు మాత్రము విని ఉత్తరమనియో దక్షిణమనియో చూచాయగా మార్గము నూహించుకొనుచు కాలి నడకతో బయలుదేరిన వానితో సమానుఁడగును. అట్టివాఁడు త్రోవతప్పి అపాయమునకు గుఱియై నశింపవచ్చును. అట్లుగాక మోక్షమునుగూర్చి, దానికి చేర్పు మార్గములను గూర్చి పెద్దలవలన శాస్త్రము ననుసరించి తెలిసికొని వారు చెప్పిన మార్గమున పురోగమించువాఁడు, మార్గము నెఱిగిన సారథితో మంచిగుఱ్ఱములను పూన్చిన రథముతో బయలుదేరినవానివలె, సుఖముగా మోక్షమును పొందును. మంచి రథము, వడిగల గుఱ్ఱములు, కుశలుఁడైన సారథి, మార్గమున సుఖవసతులు పుణ్యమువలననే లభించును. మోక్షమార్గమున బయలుదేరినవాఁడు కూడ సద్గురువును, శాస్త్రోపదేశమును, సాధనకు అవకాశములను పుణ్యమువలననే పొందఁగలఁడు. అందువలన సాధకుఁడు గమ్యమును చేరువఱకు పుణ్యమును సంపాదించుకొనుచుండవలె.

ఉపాయశాలియైన బాటసారివలె మోక్షసాధకుఁడు కూడ ఏ సాధనము నెంతకాలము అవలంబింపవలయునో అంతకాలమే ఉపయోగించి, దానితో

ప్రయోజనమును పొందిన తరువాత దానిని వదలి నూతనదశలో ఆవశ్యకమైన సాధనాంతరమును అవలంబింపవలె. ఆరంభదశలో వేదవిహితమైన కర్మానుష్ఠానము అవలంబింపవలె. అందులకు అధికారములేనివారు తమకు ఉచితములైన తీర్థయాత్రావ్రత పూజాదులను అనుష్ఠింపవలె. వీనియందు శ్రద్ధ కుదిరిన తరువాత ఫలాపేక్షను వీడి తమ కర్మానుష్ఠానఫలమును పరమేశ్వరునకు అర్పించుచు కర్మయోగమును అవలంబింపవలె. కర్మయోగమున చిత్తశుద్ధిని సంపాదించుకొనుచు చిత్తముయొక్క ఏకాగ్రతకొఱకు ధ్యానయోగమును అవలంబింపవలె. చిత్తశుద్ధి ఏకాగ్రత కలిగిన తరువాత జగత్తు జీవుఁడు ఈశ్వరుఁడు మొదలగు విషయములనుగూర్చి శాస్త్రము ననుసరించి తెలిసికొనుటకు ప్రయత్నింపవలె. అప్పుడు తత్త్వజ్ఞుఁడు శ్రోత్రియుఁడు అయిన సద్గురువు నాశ్రయించి, కామ్యకర్మలను పూర్తిగా వదలి నిత్యనైమిత్తికములైన కర్మలను మాత్రము ఆచరించుచు, వేదాంతవాక్యార్థములను శ్రవణమొనరించి, వానిని మననము చేసికొనుచు, ఆత్మస్వరూపమును ధ్యానించుచు క్రమముగా ఆత్మసాక్షాత్కారమును పొందవలయును. కాబట్టి గురువుయొక్క ఉపదేశము ననుసరించి ఎప్పుడు ఏది తనకు ఉపయోగకరమగు సాధనమో తెలిసికొని, దానినే అవలంబించుచు తక్కిన విషయములను దూరమొనరించుకోవలెను. ఇది ఉపాయశాలులైన మేధావులయొక్క మార్గము. ఇట్లుగాక సొంతబుద్ధితో నాలుగునాళ్ళు కర్మానుష్ఠానమని, కొన్నాళ్ళకు దానిని వదలి భక్తిమార్గము నవలంబించి భజనలు చేయుచు, కొన్నాళ్ళకు దానిని కూడ వదలి మానవసేవయే మాధవ సేవ యనుచు సమాజసేవా కార్యక్రములలో మునిఁగి తేలుచు, అంతకంటె జ్ఞానమార్గమే శ్రేష్ఠమైనదని సభలలో వేదాంతోపన్యాసములవలన గ్రహించి సొంతముగా వేదాంతగ్రంథములను చదువుకొనుచు వేదాంతోపన్యాసములను తఱచుగా వినుచు మోక్షమును పొందఁ దలంచుట కలగాపులగమైన పద్ధతి అగును. దీనివలన నిశ్శ్రేయసమును పొందుట దుర్ఘటము. ఎవఁడు ఏ పనిని ఎట్లు చేయుచున్నాఁడో వాఁడు ఫలమును కూడ అట్లే పొందును. సక్రమముగా పనిని చేయువాఁడు సత్వరముగా సులభముగా సమగ్రమైన ఫలమును పొందును. క్రమహీనముగా తనకు తోఁచినట్లు పనిచేయువాఁడు చాలకాలమునకు ఏదో కొంత ఫలమును మిగుల కష్టముతో పొందును.

బ్రహ్మదేవుఁడు తపస్సును ఉత్తమ సాధనముగా ప్రశంసించి, దేహాదికమును నాది (మమ) అనుకొనుటయే మృత్యువని, "నాది కాదు" (న మమ) అని నిశ్చయించుకొనుటయే అమృతత్వమని, ఆత్మనెఱింగినవాఁడు మృతుఁడు కాడని, జాగ్రత్ప్రపంచము స్వప్నమువలె గోచరించుటయే ప్రసన్నతకు లక్షణమని ఉపదేశించెను.

ఈ మహర్షి బ్రహ్మదేవ సంవాదమును చెప్పి శ్రీకృష్ణుఁడు "నేనే గురువును; నామనస్సే శిష్యుఁడు" అని చెప్పుట గమనింపదగియున్నది. దీనినిబట్టి తత్త్వజ్ఞుఁడై జీవన్ముక్తుఁడైనవాఁడు లోకవ్యవహారమునందు ఉన్నప్పుడు తనమనస్సును శిష్యునివలె జ్ఞానముతో శాసించుచుండునని వ్యక్తమగుచున్నది.

# VI. ప్రయాణ చమసము

అర్జునునకు ఇట్లు తత్త్వమును ఉపదేశించిన తరువాత శ్రీకృష్ణుఁడు, "మానాయనగారిని చూచి చాలకాలమైనది ; ఆయనను చూడఁగోరుచున్నాను". అనెను. "అట్లయినచో హస్తినకు పోవుదము ; అక్కడనుండి ధర్మజుని యనుమతమున నీవు ద్వారకకు పోవచ్చును" అని యర్జునుఁ డనెను.

తత్త్వమును బోధించిన వెంటనే శ్రీకృష్ణుఁడు సామాన్యునివలె తండ్రిని చూడవలె నను కోరికను ప్రకటించుట గమనింపఁదగియున్నది. దీనివలన జీవన్ముక్తులు, ఏ కోరికలు లేనివారయ్యును, లోకమర్యాద ననుసరించి తల్లితండ్రి, అన్న మిత్రులు మొదలగువారియందు ప్రేమను ప్రకటించుచునే యుందురని గ్రహింపవలసియున్నది.

పిమ్మట వారిరువురు హస్తినకు చేరి మొదట ధృతరాష్ట్రుని దర్శించి తరువాత [illegible]జభీమరాదులను చూచిరి. ఆరాత్రికి కృష్ణుఁడు అర్జునునియింట విశ్రమించెను. మర[illegible]ర్జునులు ధర్మజుని యొద్దకు పోయిరి. అర్జునుఁడు శ్రీకృష్ణుని[illegible]ప్రాయమును అన్నకు ని[illegible]ంచెను. ఆయన అంగీకరించెను. శ్రీకృష్ణుఁడు కుంతి మొదలగువారి[illegible]క్షిణనమస్కారములు చేసి వారియనుమతితో సుభద్రను గైకొని సాత్యకితో ఆనర్తనగరమునకు బయలుదేరెను.

# II. ఉదంక కలశము

## 1. అనునయ కమండలువు

### (i) ఉదంకక్రోధ చమసము

శ్రీకృష్ణుఁడు మార్గమునందు ఉదంకాశ్రమమునకు చేరి ఆమహర్షిని దర్శించి పూజించి కుశలమడిగెను. ఆమహర్షి శ్రీకృష్ణుని ఇట్లడిగెను. "కృష్ణా ! కురుపాండవులయింటికి పోయి వారికి అచలమైన సౌభ్రాత్రమును సంధానించి వచ్చుచున్నట్లున్నావు ! ఆప్రకార మంతయు నాకు వివరింపుము. పాండవులు కౌరవులు కలిసి నీతో కూడ విహరించుచున్నారా ? రాజులందఱు తమరాజ్యములలో సుఖముగా నున్నారు కదా ! నేను నిన్నుగూర్చి చాలమహనీయునిగా అనుకొనుచుంటిని. నీమహనీయత వారివిషయమున సఫలమైనదా ?

శ్రీకృష్ణుఁడు ఇట్లనెను. "కౌరవులను శాంతింపఁజేయుటకు ముందుగా నేనెంతయో ప్రయత్నించితిని. వారిని శాంతిమార్గమున నిలుపుట అశక్యమయ్యెను. అందువలన వారందఱు సబాంధవముగా యుద్ధమున మరణించిరి. బుద్ధిచేతఁగాని బలముచేతఁగాని విధి నతిక్రమించుట శక్యము కాదు. నీకు ఇది యంతయు తెలియును. ఆ కౌరవులు భీష్మవిదురులయుపదేశమును నామాటను అతిక్రమించిరి. అందువలన నశించిరి. పాండవులు మాత్రము హతపుత్రులై మిగిలియున్నారు."

ఉదంకుడు కన్నులు పెద్దవిచేసి క్రోధముతో ఇట్లనెను. "నీవు సమర్థుడవై యుండియు బంధువులైన కౌరవులను రక్షింపవైతివి. నిన్ను శపించుచున్నాను. నీవు బలవంతముగానైనను వారిని నిగ్రహించి యుద్ధమునుండి నివారింపవైతివి. అందువలన నామనస్సు క్రోధాగ్నితో ప్రజ్వలించుచున్నది. నీవు శక్తిమంతుఁడ వయ్యును మిథ్యావర్తనుఁడవై కురుశ్రేష్ఠులు నశించుచుండఁగా ఉపేక్షించితివి".

వాసుదేవుఁడు ఇట్లనెను. "భార్గవా ! నీవు తపస్వివి. ఓపికపట్టుము. నేను చెప్పునది పూర్తిగా వినుము. నావలన అధ్యాత్మమును వినుము. పిదప శపింతువు గాక! అల్పమైన తపస్సుతో నన్ను ఎవ్వఁడును పరిభవింపఁజాలఁడు. నీ తపస్సు

చాల గొప్పది. నీవు గురువులను సంతోషపెట్టితివి. నీబ్రహ్మచర్యము నెఱుంగుదును కష్టపడి నీవు సంపాదించుకొన్న తపస్సు అంతయు నాశమగుట నాకు ఇష్టము లేదు".

శ్లో॥ స ప్రయాతో మహాబాహుః సమేషు మరుధన్వసు ।
దదర్శాథ మునిశ్రేష్ఠ ముదంక మమితౌజసమ్ ॥ 7

(మరుధన్వన్ - A Desert - ఎడారి)

శ్లో॥ స తం పూజ్య తేజస్వీ మునిం పృథులలోచనః ।
పూజిత స్తేన చ తదా పర్యపృచ్ఛ దనామయమ్ ॥ 8

శ్లో॥ స పృష్టః కుశలం తేన సంపూజ్య మధుసూదనమ్ ।
ఉదంకో బ్రాహ్మణశ్రేష్ఠ స్తతః పప్రచ్ఛ మాధవమ్ ॥ 9

శ్లో॥ కచ్చిత్ శౌరే త్వయా గత్వా కురుపాండవసద్మ తత్ ।
కృతం సౌభ్రాత్ర మచలం త న్మే వ్యాఖ్యాతు మర్హసి ॥ 10

శ్లో॥ మహర్షే ! విదితం భూయః సర్వ మేత త్త వానఘ ।
తేఽత్యక్రామన్ మతిం మహ్యం భీష్మస్య విదురస్య చ ॥ 17

శ్లో॥ తతో యమక్షయం జగ్ముః సమాసా ద్యేత రేతరమ్ ।
పంచైవ పాండవా శ్శిష్టా హతమిత్రా హతాత్మజాః॥ 18

ఉదంక ఉవాచ :-

శ్లో॥ యస్మా చ్ఛక్తేన తే కృష్ణ న త్రాతాః కురుపుంగవాః ।
సంబంధినః ప్రియాః తస్మాత్ శప్స్యేఽహం త్వా మసంశయమ్ ॥ 20

వాసుదేవ ఉవాచ :-

శ్లో॥ శ్రుత్వా చ మే తదధ్యాత్మం ముంచేథా శాప మద్య వై ।
న చ మాం తపసాల్పేన శక్తోఽభి భవితుం పుమాన్ ॥ 24

శ్లో॥ న చ తే తపసో నాశ మిచ్ఛామి తపతాం వర ।
తప స్తే సుమహద్దీప్తం గురవ శ్చాపి తోషితాః ॥ 25

ఆశ్వమేధికము - అధ్యాయ - 53

## (ii) అధ్యాత్మ చమసము

శ్రీకృష్ణుని మాటలను విని ఉదంకుడు, "ఆయధ్యాత్మ మేదియో చెప్పుము; అది విని నీకు శ్రేయస్సునో శాపమునో ఇత్తును" అనెను.

శ్రీకృష్ణుఁడు ఇట్లు చెప్పెను. "సత్త్వరజస్తమస్సులు నన్ను ఆశ్రయించి యున్నవి. వసురుద్రాదులు దైత్యయక్ష గంధర్వాదులు నానుండి పుట్టిరి. సకలభూతములు నాయందున్నవి. వానియందు నేనున్నాను. వేదములు వేదధర్మములు యజ్ఞములు సత్తు అసత్తు వ్యక్తము అవ్యక్తము అక్షరము క్షరము మొదలుగా సర్వము నాస్వరూపమే. దేవదేవుఁడను సనాతనుఁడనైన నాకంటె అధికమైనది ఏదియు లేదు. ఆయా రూపములతో వేషములతో ధర్మరక్షణము కొఱకు ధర్మసంస్థాపనముకొఱకు బహువిధముల వర్తించుచుందును. నేనే ఇంద్రుడను, విష్ణువును, బ్రహ్మను. ఆయాజాతులలో జన్మించి ప్రతియుగము నందు ధర్మసేతువు చలించినపుడెల్ల ప్రజలహితమును గోరి దానిని బంధించుచుందును. దేవతలయందు దేవునివలె, గంధర్వులయందు గంధర్వునివలె నాగులయందు నాగునివలె, మనుష్యులయందు మనుష్యునివలె, ఏజాతియందు జన్మింతునో ఆజాతి లక్షణములతో వర్తింతును.

ఇప్పుడు మానవుఁడనుగా జన్మించినందువలన, మానవధర్మము ననుసరించి పాండవులకు రాజ్యభాగమిమ్మని కౌరవులను దీనముగా యాచించితిని. క్రోధమును తెచ్చుకొని జరుగఁబోవు పరిణామమును తెలిపి భయపెట్టితిని. అయినను లోభసమ్మోహమువలన వారు వినలేదు. అధర్మపరులైన వారు ధర్మముచేత యుద్ధమునందు నిహతులై స్వర్గమునకేగిరి. పాండవులు లోకమున ఖ్యాతిని పొందిరి. జరిగిన వృత్తాంత మిది".

శ్లో॥ మయి సర్వాణి భూతాని సర్వభూతేషు చాప్యహమ్ ।
స్థిత ఇత్యభిజానీహి మా తేఽభూ దత్ర సంశయః ॥ 3

శ్లో॥ బహ్వీః సంసరమాణో వై యోనీ ర్వర్తామి సత్తమ ।
ధర్మసంరక్షణార్థాయ ధర్మసంస్థాపనాయ చ ॥ 13

శ్లో॥ ధర్మస్య సేతుం బధ్నామి చలితే చలితే యుగే ।
తా స్తా యోనీః ప్రవిశ్యాహం ప్రజానాం హితకామ్యయా ॥ 16

శ్లో॥ మానుష్యే వర్తమానే తు కృపణం యాచితా మయా ।
న చ తే జాతసంమోహా వచోఽగృహ్ణంత మోహితాః ॥ 20

శ్లో॥ భయం చ మహ దుద్దిశ్య త్రాసితాః కురవో మయా ।
క్రుద్ధేన భూత్వా చ పున ర్యథావ దనుదర్శితాః ॥ 21

శ్లో॥ తేఽధర్మే ణేహ సంయుక్తాః పరీతాః కాలధర్మణా ।
ధర్మేణ నిహతా యుద్ధే గతా స్స్వర్గం న సంశయః ॥ 22

ఆశ్వమేధికము - అధ్యా. 54

సేతువనఁగా వంతెన. సంసారమను సాగరమునకు ఒకవైపున కర్మభూమి యున్నది. అవతలి తీరమున దక్షిణముగా స్వర్గాదిలోకములు, ఉత్తరముగా బ్రహ్మలోకమార్గము వీనికి అతీతముగా మోక్షము ఉన్నవి. ఈ సంసారమును దాఁటుటకు భగవంతుఁ డేర్పఱచిన వంతెన ధర్మము. ధర్మమును సంపాదించినవారు ఈవంతెన మీదుగా సంసారమును దాఁటి స్వర్గాదిలోకములకో, బ్రహ్మలోకమునకో చేరుదురు ; కొందఱు మోక్షమును కూడ పొందుదురు. కావున ప్రజలయొక్క అభ్యుదయ నిశ్శ్రేయసములకొఱకు ఈసేతువును భగవంతుఁడు మాటిమాటికి సంరక్షించుచుండును.

# 2. ప్రసాద కమండలువు

## (i) విశ్వరూపదర్శన చమసము

శ్రీకృష్ణుఁడు చెప్పినది విని ఉదంకుఁడు ఇట్లనెను. "జనార్దనా ! నీవు జగత్కర్తవని నాకు తెలిసినది. నిశ్చయముగా నీప్రసాదమువలననే నాకు ఈ జ్ఞానము కలిగినది. నా మనస్సు ప్రసన్నమై శాపమునుండి మరలినది. నీయనుగ్రహమునకు నేను పాత్రుఁడనైనచో నీవు వర్ణించిన నీయైశ్వరమైన రూపమును చూపుము".

శ్రీకృష్ణుఁడు ఆమునియొక్క పశ్చాత్తాపమునకు ప్రీతుఁడై విశ్వరూపమును చూపెను. మహాభుజములతో సహస్రసూర్యసంకాశమై సర్వతోముఖమైన యావిశ్వరూపమును చూచి ఉదంకుఁడు విస్మితుఁడై, "ఓ విశ్వాత్మా ! విశ్వకర్మా ! విశ్వసంభవా ! నీపాదములచే పృథివి వ్యాప్తమైనది ; శిరస్సుచే ఆకాశము నిండిపోయినది ; జఠరమునందు భూమ్యాకాశ మధ్యప్రదేశమంతయు ఇమిడిపోయినది; ఇంక ఈ మహారూపమును ఉపసంహరింపుము. నీస్వరూపమును చూపుము" అని ప్రార్థించెను.

శ్రీకృష్ణుడు "నా దర్శనము అమోఘము : కావున ఏదేని వరము కోరుకొనుము" అనెను. ఉదంకుఁడు ఇట్లనెను". అయ్యా ! ఈ యద్భుతదర్శనమే చాలును. అయినను నేను వరమును కోరుకొనుట తప్పదేని, నేనెక్కడ కోరుదునో అక్కడ తోయము లభించునట్లు వరమిమ్ము. ఈ మరుభూములందు జలము దుర్లభము కదా".

శ్రీకృష్ణుఁడు విశ్వరూపమును ఉపసంహరించి, "నీకు నీరము కావలసినప్పుడు నన్ను చింతింపుము" అని చెప్పి ద్వారకకు వెడలిపోయెను.

## (ii) ఉదంకమేఘ చమసము

ఒకప్పుడు ఉదంకుఁడు దప్పికతో నీటికొఱకు అన్వేషించుచు శ్రీకృష్ణుని స్మరించెను. వెంటనే దిగంబరుఁడు మలినగాత్రుఁడు బాణకార్ముక ఖడ్గధరుఁడును

అయిన యొక పంచముఁడు కుక్కల సముదాయముతో కన్పించెను. అతని క్రిందనుండి నీరు పుష్కలముగా ప్రవహించుచుండెను. ఆమాతంగుఁడు నవ్వుచు, "ఉదంకా ! రమ్ము ; రమ్ము ; నీవు దప్పికతో ఉన్నావు. నీయందు నాకు దయకలుగుచున్నది. నానుండి ఈ జలమును స్వీకరింపుము" అనెను. ఉదంకుఁడు వానిని తీవ్రముగ తిట్టెను. ఆమాతంగుఁడు అనేకపర్యాయములు ఉదంకుని పిలిచి వానిచే తిరస్కృతుఁడై కుక్కలతోకూడ అదృశ్యమయ్యెను.

ఉదంకుఁడు దప్పికతో అలమటించుచు శ్రీకృష్ణునిచేత వంచింపఁబడితిని గదా అని లజ్జనొందెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు ఆయనకు ఎదురుగా వచ్చెను. ఆయనను చూచి ఆమహర్షి, "అయ్యా ! విప్రముఖ్యులకు మాతంగునివలన స్రవించు జలమును నీవొసంగుట తగదు" అనెను.

శ్రీకృష్ణుఁడు ఆయనను ఓదార్చుచు ఇట్లనెను. "ఏ భూమియందు ఏరూపమును ధరించి యిచ్చుటయోగ్యమో ఆరూపముతోనే నీకొసంగఁబడినది. నీవు దానిని తెలిసికొనలేక పోయితివి. నేను నీకొఱకు ఇంద్రునితో "తోయరూపమున ఉదంకునకు అమృతము నొసంగు" మని చెప్పితిని. కాని యింద్రుఁడు, "మర్త్యుఁడు అమర్త్యుఁడగుట సమంజసము కాదు ; అమృతము తప్ప అతనికి ఇంకేదైన నొసఁగుము అని చాలసేపు ప్రతిఘటించెను. నేను నీకు అమృతము నొసంగవలసినదే యని దృఢముగా చెప్పితిని. ఇంద్రుఁడు నన్ను బతిమాలుచు, 'ఆమునికి అమృతము నీయక తప్పదందువేని మాతంగరూపమున పోయి యిప్పుడే ఇచ్చెదను. అతఁడు నన్ను తిరస్కరించినచో ఈయను' అని నాతో ఒప్పందము చేసికొని నీ యొద్దకు ఆ రూపముతో వచ్చెను. చండాలరూపముతో అమృతము నీయవచ్చిన యాభగవంతుని నీవు తిరస్కరించితివి. నీవు చేసినది పెద్ద వ్యతిక్రమము. అయినను దుర్ఘటమైన నీజలకాంక్షను మఱియొక మార్గమున తీర్చెదను. నీకు ఏదినములలో ఈమరుభూములందు జలకాంక్ష కలుగునో ఆదినములలో జలపూర్ణములైన మేఘములు వచ్చి యిచ్చట రసవంతములైన నీరములను వర్షించును. అవి ఉదంకమేఘములని ప్రఖ్యాతి నొందును".

శ్రీకృష్ణుఁడు ఇట్లు ఉదంకునకు ప్రీతిని కలిగించి వెడలిపోయెను.

శ్లో|| మేనే విప్రలబ్ద మాత్మానం కృష్ణే నామిత్రఘాతినా |
అథ తేనైవ మార్గేణ శంఖచక్రగదా ధరః || 23

శ్లో|| ఆజగామ మహాబుద్ధి రుదంక శ్చైన మబ్రవీత్ |
న యుక్తం తాదృశం దాతుం త్వయా పురుషసత్తమ || 24

శ్లో|| సలిలం విప్రముఖ్యేభ్యో మాతంగస్రోతసా విభో |
ఇత్యుక్తవచనం తం తు మహాబుద్ధి ర్జనార్దనః || 25

శ్లో|| ఉదంకం శ్లక్ష్ణయా వాచా సాంత్వయ న్నిదమబ్రవీత్ |
యాదృశే నేహ రూపేణ యోగ్యం దాతుం ధృతేన వై || 26

ఆశ్వమేధికపర్వ - అధ్యా. 55

## (iii) అనుగ్రహ చమసము

ఈవృత్తాంతమున పరమేశ్వరుని యనుగ్రహవిశేషము వ్యక్తమగుచున్నది. ఉదంకాశ్రమము హస్తిననుండి ద్వారకకు పోవుమార్గమున రాజస్థానములోని ఎదారులలో ఉండియుండును. శ్రీకృష్ణుఁడు ఎడారి మార్గమును తప్పించి ప్రయాణము చేసియుండవచ్చును. కాని అట్లు చేయక ఆయన బుద్ధిపూర్వకముగానే ఉదంకునియొద్దకు పోయినట్లు తోఁచుచున్నది. సర్వజ్ఞుఁడైన యాయనకు ఉదంకునిస్వభావము తెలియదా ? ఆమునిచరిత్ర తనకు తెలియునని ఆయనయే చెప్పెను. అట్టియెడల ఆమునిస్వభావము కూడ ఆయనకు తెలిసియే యుండును. తెలిసికూడ ఆయన ఉదంకుని యొద్దకు ఏలపోయెను ?

ఇందులకు అనేకహేతువుల నిరూపింపవచ్చును. శ్రీకృష్ణుఁడు ప్రయోజనము లేకుండ ఒకనియొద్దకు పోయి అతనిచే తర్జింపఁబడి కూడ విశ్వరూపదర్శనమును అనుగ్రహింపఁడు. కావున ఆయన ఉదంకునియొద్దకు పోవుటకు పెక్కు ప్రయోజనములు కలవని యూహింపవలసియున్నది.

ఉదంకుని గురుశుశ్రూష అనుపమానము. ఆతని తపస్సు కూడ అసామాన్యము. కాని ఆమహర్షి స్వభావమున తొందరపాటు కలదు. దానివలన ఆయనసులభముగా క్రోధమును పొందుచుండును. ఈ కారణముచేతనే చక్కఁగా విచారింపక లోకులలో చాలమంది అనుకొనునట్లు ఆయన కూడ శ్రీకృష్ణుఁడు పాండవపక్షపాతియై ధర్మమును నిర్వహింపలేదని తలంచుచుండెను. దానివలన ఆయనకు శ్రీకష్ణుని విషయమున అప్రీతి రోషము కలుగుచుండెను. ఇది తపస్వులకు తగదు. దీనివలన తపోవ్యయము సంభవించును. అందువలన ఆమహర్షికి కలిగిన యీయపోహను తొలఁగించి తొందఱపాటును నిరూపించి ఆయనకు చిత్తశాంతిని కలిగించి ఆయన తపస్సును రక్షించుట శ్రీకృష్ణునకు ప్రథమ ప్రయోజనము. ఆనాఁడు మహర్షులు ఎవరును అట్లు భావించుటలేదు. ప్రసిద్ధులైనవారందఱు భీష్ముని ప్రవచనమును వినుటకై వచ్చియుండిరి. ఉదంకుఁడు మాత్రము రాలేదు. వచ్చియుండినచో ఆయనకు ఈయపోహ తొలగియుండెడిది. ఇతరులెవరైన ఆసమయమున శ్రీకృష్ణుని ప్రశంసించుచు ఆయన ముందు మాటాడుట సంభవించినచో ఆయన వారితో ఘర్షణపడుట, శ్రీకృష్ణుని నిందించుట సంభవింపవచ్చును. ఆయన ఆవేశముతో శ్రీకృష్ణుని శపించుట కూడ సంభవింపవచ్చును. శ్రీకృష్ణునంతటివానిని శపించినచో తపస్సు అధికముగా వ్యయమగును. అందువలననే ఆయన, "నన్ను అల్పమైన తపస్సుచేత ఎవ్వఁడును పరిభవింపఁజాలఁడు ; నీతపస్సు నాశమగుట నాకు ఇష్టము లేదు" అని స్పష్టముగా చెప్పెను. అల్పులను శపించినచో తపస్సు కొంచెముగానే వ్యయమగును. మహాతపస్వులను శపించినచో తపస్సు అధికముగా నశించును. పరమమైన తపస్సుచేత గాని ఎవఁడైనను విష్ణుపదవికి రాలేడు. అట్టి విష్ణుదేవుని యవతారమైన శ్రీకృష్ణుని సామాన్యుఁడైన తాపసుఁడు శపించినచో వాని తపస్సు అంతయు వ్యయమగును. అట్లు జరుగకుండ శ్రీకృష్ణుఁడు ఉదంకుని తపస్సును రక్షించెను. అది ఆమహర్షికి లోకమునకు ఉపకారకము కావలెనని ఆయన తలంపు.

అనుపమానమైన గురుశుశ్రూషకు పరమమైన తపస్సునకు చరమఫలము జ్ఞానము. దానికి ముఖ్యసాధనము భక్తి అందువలన ఆ మహర్షి కోపించినను తానుకోపింపక, ఆయన అడుగక పోయినను శ్రీకృష్ణుఁడు తనస్వరూపమును వర్ణించి

చెప్పి, కురుపాండవ సంధి విషయమున సంశయమును తీర్చుటయే కాక, విశ్వరూపవిషయమున కుతూహలమును కలిగించెను. ఆయన వినయముతో కుతూహలముతో ప్రార్థింపగా విశ్వరూపమును చూపి తన పరమాత్మత్వమును ప్రకటించి ఆయనకు తనయందు భక్తి నెలకొనునట్లు చేసి ఆత్మజ్ఞానము కలుగుటకు మార్గ మేర్పఱచెను. "నేను నీకు శిష్యుఁడను, నన్ను శాసింపుము" అని అర్జునుఁడు ప్రార్థించినప్పుడే ధర్మతత్త్వముల నుపదేశింపఁబూనుకొన్న శ్రీకృష్ణుడు ఉదంకుని క్రోధమును నివారించి అనునయించుటకు అధ్యాత్మమును చెప్పబూనుట ఆశ్చర్యకరమే. ఇది ఆయనకు రెండవ ప్రయోజనము. దీనివలన విష్ణుదేవునకు విప్రపరిరక్షణమున గల శ్రద్ధ వ్యక్తమగుచున్నది.

ఉదంకునకు విశ్వరూపమును శ్రీకృష్ణుఁడు చూపినప్పుడు సుభద్ర కూడ చూచియుండునా ? ఆసమయమున ఆమె మునిపత్నులయొద్ద ఉండియుండవచ్చును. ఆశ్రమమున ఆయన ఒక్కఁడే యుండునని తలంపనక్కఱ లేదు. ఇతరమునులు కూడ కొందఱుండవచ్చును. సాత్యకి కురుసభయందు చూచినట్లే ఇప్పుడును విశ్వరూపమును చూచియుండును.

భక్తి జ్ఞానము ఎంతగా కలిగినను ఎవనికైనను ప్రారబ్ధము ముగిసిననే తప్ప శరీరము పడిపోదు. అప్పటివఱకు వారికి శరీరమునకు కావలసిన యన్నపానములయొక్క ఆవశ్యకత తీరదు. అందువలన భగవానుఁడు ఉదంకునకు ఎడారియందు జీవితము సుఖముగా జరుగుటకు వరమును కోరుమనెను. ఆయన జలమును మాత్రమే కోరెను. శ్రీకృష్ణుఁడు అంతటితో సంతృప్తి నొందక ఉదంకునకు అమృతము నొసంగుమని ఇంద్రునకు చెప్పెను. ఆమహర్షికి శ్రీకృష్ణునియందు పరిపూర్ణమైన విశ్వాసమున్నదో లేదో పరీక్షించి యిచ్చుటకు ఇంద్రుఁడు అంగీకరించెను. ఆపరీక్షలో ఉదంకుఁడు నెగ్గలేదు. ఆయనకు శ్రీకృష్ణునియందు పరిపూర్ణమైన విశ్వాసమున్నచో తాను భగవంతుని స్మరించినంతనే ప్రత్యక్షమైనవాఁడు నిజముగా చండాలుఁడు కాఁడని, ఆరూపమున భగవంతుఁడో లేక ఆయన ప్రతినిధియో వచ్చియుండునని యూహించియుండును. భగవంతునియనుగ్రహము కాకున్నచో ఆకస్మికముగా జలప్రవాహము ఏర్పడదు కదా ! లేదా, "నిన్ను స్మరించినంతనే

ఈ చండాలుఁడేల ప్రత్యక్షమయ్యెను ; నీవేవచ్చి నాయార్తిని హరింపుము" అని ఆయన శ్రీకృష్ణునే ప్రార్థించి యుండవలసినది. అట్లు చేయక ఆయన తొందరపడి ఆచండాలుని తిరస్కరించి అతఁడు అంతర్ధాన మొందినతరువాత, శ్రీకృష్ణునిచేత తాను వంచింపఁబడినట్లుగా (విప్రలబ్ధ మాత్మానం) తలంచెను. పరిపూర్ణమైన విశ్వాసము కలవానికి భగవంతుఁడు తన్ను వంచించుననను తలంపు కలుగదు. విశ్వరూపమును చూచిన తరువాత కూడ ఉదంకునకు శ్రీకృష్ణునియందు పరిపూర్ణమైన విశ్వాసము కలుగకుండుట గమనింపఁదగియున్నది. మనుష్యుడుగా కన్పించుచున్నవానియందు భగవంతుఁడను విశ్వాసము ఎవనికైనను కలుగుట ఎంత దుర్ఘటమో దీనివలన గ్రహింపవలసియున్నది. శ్రీకృష్ణుఁడు మరల శంఖచక్రగదాధరుఁడుగా ప్రత్యక్షమై ఉదంకునకు తనయందు దృఢమైన విశ్వాసమును కలిగించెను. ఇది మూఁడవ ప్రయోజనము.

ఆ మరుభూములలో ఉదంకుని సంకల్పమువలన మేఘములు కలుగునట్లు అనుగ్రహించి శ్రీకృష్ణుఁడు "ఉదంకమేఘములు" అను ప్రశస్తి మూలమున ఉదంకునకు గొప్ప కీర్తి కలిగించెను. ఇది నాల్గవ ప్రయోజనము.

ఈ సందర్భమున, "ఇచ్చట ఏరూపమును ధరించి యిచ్చుట యోగ్యమో ఆరూపముతోనే నీకొసంగఁబడినది ; నీవు దానిని తెలిసికొనకపోయితివి" (యాదృశే నేహ రూపేణ యోగ్యం దాతుం ధృతేన వై ॥ తాదృశం ఖలు తే దత్తం, త చ్చ త్వం నావబుధ్యథాః ॥) అని శ్రీకృష్ణుఁడు చెప్పినమాటను విమర్శించి గ్రహింపవలసియున్నది. "విప్రముఖ్యులకు చండాలునినుండి ప్రవించుజలము నిచ్చుట తగదు" అన్న ఉదంకుని యాక్షేపమునకు సమాధానముగా, ఎడారిభూములలో విప్రముఖ్యులకు కూడ చండాలరూపముతోనే జలము నొసంగుట యోగ్యమని శ్రీకృష్ణుఁడు చెప్పెననుట కుదురదు. వర్ణాశ్రమ ధర్మపరిరక్షకుఁడు సర్వశక్తిమంతుఁడు అయిన శ్రీకృష్ణుఁడు ఎంత క్షామమునందైనను విప్రముఖ్యులకు చండాలరూపమున జలము నిచ్చుట యోగ్యమే అని తలంచె ననుట అసంగతము. ఆయన అనుకొన్నచో విప్రరూపముననే జలమిచ్చి యుండవచ్చును, లేదా మేఘములచేత వర్షము కురిపించి

యుండవచ్చును. కావున "ఇచ్చట" అను శబ్దమునకు (ఇహ) ఈ ప్రదేశమున అని యర్థము. చెప్పకుండ ఈసందర్భమునందు అని గ్రహించుట ఆవశ్యకము. శ్రీకృష్ణుఁడు ఉదంకునకు అమృతము నీయవలయునని పట్టుఁబట్టఁగా ఇంద్రుఁడు వానిని పరీక్షించి యిచ్చుట యోగ్యము అని శ్రీకృష్ణునకు నచ్చఁజెప్పిన సందర్భమునందు, ఉదంకుని భక్తిని పరీక్షించుటకై ఇంద్రుఁడు చండాలరూపమున అమృతమును ఇచ్చుట యోగ్యమే యనుట శ్రీకృష్ణుని యభిప్రాయముగా గ్రహింపవలసియున్నది.

పై సంఘటనమువలన భగవంతునకు ఎంతో వాత్సల్యము ఉదంకుని యందు ఉన్నదని స్పష్టమగుచున్నది. దీనినిబట్టి పరమమైన గురుసేవ, ఫలాపేక్ష లేని వేదాధ్యయనరూపమైన తపస్సు మొదలుగా వేదవిహితములైన ధర్మములను అనుష్ఠించువారు, దానములు వాపీకూపతటాకాది నిర్మాణములు విష్ణుమహేశ్వరాది దేవతాభజనములు చేయకున్నను, భగవంతుఁడే స్వయముగా వారియొద్దకు వచ్చి వారికి కావలసిన భక్తి జ్ఞానము మొదలగునవి కలుగుటకు మార్గమేర్పఱచు నని, కావున వేదానుశాసనమునందలి, తల్లితండ్రి ఆచార్యుఁడు మొదలగువారిని దేవతలనుగా ఆరాధింపవలయును (మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ) అను మొదలైన ధర్మములే అవశ్యము ఆచరణీయములని పరమశ్రద్ధతో అనుష్ఠింపవలసిన వని గ్రహింపవలసియున్నది.

# అశ్వమేధకాండము

## I. కారుణ్యకలశము

## 1. అభిమన్యు కమండలువు

### (i) వృత్తాంతకథన చమసము

ఉదంకుని యొద్దనుండి శ్రీకృష్ణుఁడు సుభద్రతో సాత్యకితో ద్వారకా నగరమునకు పోయెను. అచ్చట ఎదురుగా వచ్చిన బంధువులను కుశలమడిగి ఆయన లోనికిపోయి తల్లిదండ్రులకు నమస్కరించెను. వారు ఆయనను కౌఁగలించుకొని ఆశీర్వదించిరి. బంధువులు పరివేష్టించియుండఁగా వసుదేవుఁడు కృష్ణునితో ఇట్లనెను. "సంగ్రామము మహాద్భుతముగా జరిగెనని జనులు చెప్పుచున్నారు. నీవు ప్రత్యక్షముగా చూచినవాఁడవు కదా ! అదియంతయు ఎట్లు జరిగెనో చెప్పుము".

శ్రీకృష్ణుఁడు, "ఆయుద్ధమునంతయు చెప్పుటకు చాలయేండ్లు పట్టును ; ప్రధానవిషయములను చెప్పెదను వినుము" అని ప్రధానసంఘటనలను చెప్పెను. తండ్రికి అప్రియమని అభిమన్యువధమును శ్రీకృష్ణుఁడు ప్రస్తావింపలేదు. ఆప్రసంగమును వినుచున్న సుభద్ర, "అన్నా ! సౌభద్రుని వధమును కూడ చెప్పుము" అనుచు దుఃఖార్తయై నేలపైఁబడెను. ఆమాట విని వసుదేవుఁడు కూడ దుఃఖముచేత మూర్ఛితుఁడై నేలపైఁబడెను. కొంతసేపటికి తెప్పరిల్లి వసుదేవుఁడు కుమారునితో, "నాయనా ! నీవు సత్యవాక్యుఁడవని లోకమున ప్రసిద్ధుఁడవు ; అట్టి నీవు అభిమన్యువధము నేల చెప్పవైతివి. వాఁడు ముఖవికృతిని పొందికాని, సంగ్రామపరాఙ్ముఖుఁడై కాని వధము నొందలేదు కదా !" అని యడిగెను.

శ్రీకృష్ణుఁడు తండ్రికంటె తానుకూడ అధికముగా దుఃఖించుచు ఇట్లు చెప్పెను. "వాఁడు సంగ్రామమున వెన్నుచూపలేదు ; ముఖవికృతిని పొందలేదు. వేలకొలఁది మహారాజులను సంహరించి ద్రోణకర్ణాదులచేత ఆవరింపఁబడి దుశ్శాసనుని పుత్రునితో తలపడి వీరోచితముగా స్వర్గమును పొందెను. వానిని గూర్చి దుఃఖింపకుము.

అప్పుడు పాండవులు సంశప్తకులతో పోరాడుచుండిరి. ద్రోణాదులైనను ఒక్కొక్కరుగా వచ్చి వానిని జయింపలేక అందఱును కలిసి వానిని విరథుని విగతశస్త్రుని గావించిరి. లేకున్నచో వారికి కూడ వానిని జయించుట శక్యమే కాదు. ధర్మజ్ఞయైన కుంతీదేవి మనుమనికొఱకు మిగుల విలపించి దుఃఖమును నిగ్రహించుకొని సుభద్రను ఉత్తరను ఓదార్చి ధర్మజాదుల యనుమతితో అభిమన్యునకు శ్రాద్ధమును నిర్వర్తించి బ్రాహ్మణులకు పెక్కుగోవులను దానమొసంగెను. పిదప ఆమె ఉత్తరను చూచి, "అమ్మాయీ ! వీరోచితముగా స్వర్గము నొందిన భర్తనుగూర్చి దుఃఖింపకుము ; గర్భమునందున్న శిశువును జాగరూకతతో కాపాడుకొనుము" అని యోదార్చెను. నేను వచ్చునప్పుడు ఆమెయనుమతి నొందియే సుభద్రను తీసికొని వచ్చితిని".

శ్లో॥ కథయ న్నేవ తు తదా వాసుదేవః ప్రతాపవాన్ ।
మహాభారతయుద్ధం తత్కథాంతే పితు రగ్రతః ॥ 1

శ్లో॥ అభిమన్యో ర్వధం వీర స్సోఽత్యక్రామ న్మహామతిః ।
అప్రియం వసుదేవస్య మా భూ దితి మహామతిః ॥ 2

శ్లో॥ సుభద్రా తు త ముత్క్రాంత మాత్మజస్య వధం రణే ।
ఆచక్ష్వ కృష్ణ సౌభద్రవధ మిత్యపత ద్భువి ॥ 3

శ్లో॥ తత స్స దౌహిత్రవధ దుఃఖశోకసమాహతః ।
వసుదేవో మహారాజ కృష్ణం వాక్య మథాబ్రవీత్ ॥ 6

శ్లో॥ నను త్వం పుండరీకాక్ష సత్యవా గ్భువి విశ్రుతః ।
య ద్దౌహిత్రవధం మేఽద్య న ఖ్యాపయసి శత్రుహన్ ॥ 7

శ్లో॥ ఆహవం పృష్ఠతః కృత్వా కచ్చి న్న నిహతః పరైః ।
కచ్చి న్న ముఖం గోవింద తే నాజౌ వికృతం కృతమ్ ॥ 11

శ్లో॥ ఏవం విధం బహు తదా విలపన్తం సుదుఃఖితమ్ ।
పితరం దుఃఖితతరో గోవిందో వాక్య మబ్రవీత్ ॥ 15

శ్లో|| న తేన వికృతం వక్త్రం కృతం సంగ్రామమూర్ధని |
న పృష్ఠతః కృత శ్చాపి సంగ్రామ స్తేన దుస్తరః || 16

శ్లో|| ఏవ మాశ్వాసం త్వేనాం కుంతీ యదుకులోద్వహి |
——విహాయ శోకం దుర్ధర్షం శ్రాద్ధ మస్య హ్యాకల్పయత్ || 36

శ్లో|| సమనుజ్ఞాప్య ధర్మజ్ఞా రాజానం భీమ మేవ చ |
యమౌ యమోపమౌ చైవ దదౌ దానా న్యనేకశః || 37

శ్లో|| తతః ప్రదాయ బహ్వీ ర్గా బ్రాహ్మణాయ యదూద్వహ |
సమాహృష్య తు వార్ష్ణేయీ వైరాటీ మబ్రవీ దిదమ్ || 38

ఆశ్వమేధికము - అధ్యాయ - 61

అభిమన్యువధసందర్భమున అర్జునుఁడు సంశప్తకులతో పోరాడుచుండఁగ ధర్మరాజాదులు పద్మవ్యూహమునొద్ద సైంధవునిచే నిరోధింపఁబడిరి. అప్పుడు పాండవులు సంశప్తకులతో పోరాడుచుండిరని శ్రీకృష్ణుఁడు చెప్పుటవలన సైంధవుఁడు కూడ సంశప్తకులకు సంబంధించినవాఁడే యని గ్రహింపవలసియున్నది.

యుద్ధము మహాద్భుతముగా జరిగినదని ఎంతో కుతూహలముతో వినుచున్న వసుదేవుఁడు అభిమన్యుమరణమును విన్నంతనే పరమదుఃఖమున మూర్ఛిల్లిపడిపోవుట గమనింపఁదగియున్నది. పాండవులు అరణ్యాజ్ఞాతవాసములు చేయుచున్నప్పుడు సుభద్ర అభిమన్యుఁడు దేవకీవసుదేవుల యొద్దనే యుండిరి. అందువలన వసుదేవునకు అభిమన్యునియందు అమితమైన ప్రేమ పెంపొందెను. పరులు హతులగుచు మనవారు గెలుచుచున్నప్పుడు యుద్ధములు మహాద్భుతములుగానే మిగులరసవంతములుగానే యుండును. కాని మనవారు హతులైనారని విన్నంతనే ఆయుద్ధములే పరమఘోరములుగా అమితవిరసములుగా గోచరించును. కావున సన్నివేశములు సంఘటనములు తమస్వరూపముచేత సుఖప్రదములు కావు ; దుఃఖదాయకములు కావు. ఆయావ్యక్తులయందున్న మమకారముచేత ద్వేషముచేత అవి యొకప్పుడు ఉల్లాసదాయకములుగా మఱియొకప్పుడు విషాదజనకములుగా అగుచుండును.

వసుదేవునిమాటలవలననే శ్రీకృష్ణుఁడు సత్యవచనుఁడని వ్యక్తమగుచున్నది. అయినను ఆయన యుద్ధమును వరుసగా చెప్పునప్పుడు అభిమన్యువధమును తప్పించెను. ఉత్సాహముతో వసుదేవుఁడడిగిన తీరునుబట్టి అప్పటికి ఆయన మనుమని వధమును వినలేదని స్పష్టమగుచున్నది. సుభద్రకూడ తల్లిదండ్రులను చూచినంతనే పుత్త్రునిగూర్చి బావురుమని ఏడువలేదు. ఆవిషయమును అన్నగారే చెప్పునని ఆమె దుఃఖమును నిగ్రహించుకొనుచుండెను. కాని ఆయన ఆవిషయమును తప్పించి కథనమును ముగించినంతనే ఆమె తన్నుతాను నిగ్రహించుకొనలేక విలపించెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు దానిని తప్పించుటకు వీలుగాక చెప్పవలసివచ్చెను. "సత్యమును చెప్పవలె ; ప్రియమును చెప్పవలె ; కాని అప్రియమైన సత్యమును చెప్పరాదు ; అట్లే ప్రియముగా అనృతమును చెప్పరాదు" అని మనువు చెప్పియుండెను.

శ్లో|| సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న బ్రూయాత్ సత్య మప్రియమ్ |
ప్రియం చ నానృతం బ్రూయాత్ ఏష ధర్మ స్సనాతనః ||

కావున శ్రీకృష్ణుఁడు తండ్రికి అప్రియమైన విషయమును చెప్పకుండ తప్పించుట దోషము కాదు. ఏజీవికైనను, ముఖ్యముగా పెద్దలకు, అప్రియము కలిగింపకుండుటకు ప్రయత్నించుట ధర్మము.

అభిమన్యువధమును శ్రీకృష్ణుఁడు తప్పించుటకు వసుదేవుఁడు రెండు హేతువుల నూహించెను. యుద్ధమునందు భయదుఃఖాదులచే ముఖవికృతిగాని, వెన్నుచూపుటగాని ఎవనియందైనను సంభవించినచో అట్టివానిని ఉత్తములైన క్షత్త్రియులు పతితునిగా భావించి తమ వానినిగా పేర్కొనుటకు వానినిగూర్చి చెప్పుటకు ఇష్టపడరు. యుద్ధమున పరాజితులై వచ్చిన భర్తలను కూడ లోనికి రానీయక దుర్గద్వారములను మూయించిన మహారాణులు కూడఁ గలరు. ఈ విషయమున మనదేశమున ఖడ్గతిక్కన కథ సుప్రసిద్ధము. ఉన్నత కుటుంబములలో స్త్రీలు గాని పురుషులుగాని పతితులైనచో వారికి ఘటశ్రాద్ధమును గావించి వారు చనిపోయినట్లే వ్యవహరింతురు. అట్లే ఉత్తమక్షత్త్రియులు పిఱికివారిని తమవారినిగా పేర్కొనుటకు ఇష్టపడరు. బాలుఁడగుటచే అభిమన్యుఁడు భయముతో వ్యథతో ఏదేని అక్రమచర్యకు పాల్పడెనేమో అని, అందువలన శ్రీకృష్ణుఁడు వానినిగూర్చి చెప్పక తప్పించెనని వసుదేవుఁడు సందేహించెను.

## (ii) శ్రాద్ధ చమసము

కుంతీదేవి ధర్మరాజాదుల యనుజ్ఞతో అభిమన్యునకు శ్రాద్ధమును కల్పించెను (శ్రాద్ధ మస్య హ్యకల్పయత్) అనువిషయము గమనింపఁదగియున్నది. ఈ శ్రాద్ధమును ఆమె ఎప్పుడు కల్పించినది ? యుద్ధమున మృతినొందినవారికి వెంటనే దహనసంస్కారములు చేయరు. యుద్ధము జరుగుచున్నంత కాలము యుద్ధదీక్షను పొందినవారు, దానిని వదలి మృతుల దహనసంస్కారాదులకు సంకల్పించుటకు వీలు లేదు. అట్లు సంకల్పించినచో వెంటనే ఆశౌచ మారంభమగును. ఆశౌచమునందు అస్త్రమంత్రప్రయోగము కుదురదు. అందువలన యుద్ధము ముగియువఱకు యుద్ధమృతులకు దహనసంస్కారశ్రాద్ధాదులు జరుగవు. యుద్ధము ముగిసిన తరువాత ధర్మరాజు యుద్ధమృతులైన బంధువులకందఱకు దహనసంస్కారములు శ్రాద్ధదానాదికములను చేసెను. అప్పుడు అభిమన్యునకు కూడ ఆయన దహన శ్రాద్ధాదికములు చేసియుండును.

అట్టియెడల కుంతీదేవి ధర్మజాదుల యనుజ్ఞతో శ్రాద్ధమును కల్పించుట యెందులకు ? మృతులయందున్న ప్రేమాతిశయము చేత సాధారణముగా జరిగిన శ్రాద్ధముకాక విశేషముగా కూడ శ్రాద్ధమును జరుపవచ్చును. ధర్మరాజు అందఱతోపాటు అభిమన్యునకు శ్రాద్ధమును జరుపుటతో సంతృప్తినొందక కుంతీదేవి తనమనుమనికొఱకు ప్రత్యేకముగా శ్రాద్ధమును జరుపవలయునని ఆమె తలంచియుండవచ్చును. శ్రీకృష్ణుఁడు సుభద్రనుగైకొని హస్తినమండి బయలుదేరుచున్నప్పుడు వారి యెద్దఱసమక్షమున అభిమన్యునకు విశేషముగా మరల శ్రాద్ధమును జరుపవలయునని ఆమె కోరియుండవచ్చును. అట్టియెడల ఆమె శ్రాద్ధకర్తయైన ధర్మజునోలేక ఆయనయనుమతితో అర్జుననో ఆదేశించి శ్రాద్ధమును చేయించియుండవచ్చును. విశేషశ్రాద్ధములైనను కుమారులకు తండ్రులు చేయుట సహజము. ధృతరాష్ట్రుఁడు ఆశ్రమవాసమునకు బయలుదేరునప్పుడు, వనములందు కుమారులకు వైభవముతో సంతృప్తిగా శ్రాద్ధములు జరుపుటకు వీలుండదని, హస్తినయందే ఆయన తన కుమారులకు భీమునకు ఇష్టము లేకున్నను, ధర్మరాజాదులను యాచించి వారిధనముతో వైభవముగా శ్రాద్ధములను చేసెను. కాబట్టి విశేషశ్రాద్ధమును కూడ అభిమన్యునకు ధర్మరాజుగాని అర్జునుఁడుగాని

చేసి యుండవలె. కాని ఆమె ధర్మరాజును భీముని నకులసహదేవులను అనుమతింపఁజేసి ఆ శ్రాద్ధమునందు అనేకదానములను గావించెనని పేర్కొనఁబడియున్నది. పైవాక్యమును బట్టి ధర్మజాదులు నల్వురలో ఎవరును శ్రాద్ధమును స్వయముగా చేయలేదని స్పష్టమగుచున్నది. అట్లయినచో కుమారునకు అర్జునుఁడు చేసియుండవచ్చును. కాని పైవాక్యములలో శ్రాద్ధమును కల్పించుటకు దానమును చేయుటకు ఆమెయే కర్తగా నిర్దేశింపఁబడియున్నది (శ్రాద్ధ మకల్పయత్; దదౌ దానా న్యనేకశః). అర్జునుఁడే శ్రాద్ధముగా చేసియున్నచో, "ఆమె అర్జునునిచే శ్రాద్ధము చేయించె"నని వ్యాసభగవానుఁడు పేర్కొనియుండవలసినది. అట్లు లేదు. ఆమె దానముల విషయమున అర్జునుని యనుమతిని పొందినట్లు చెప్పఁబడలేదు. ఆమె అభిమన్యునకు శ్రాద్ధమును కల్పించినప్పుడు మిగుల వైభవముతో చేయుటకు అర్జునుని ధనమే కాక తక్కిన నలువురనుండి, అనగా సమష్టి సంపదనుండి ధనమును గైకొని దానములు చేసియుండును. కుమారుని విషయమున అర్జునునియనుమతిని కోరవలసిన యక్కఱలేదు ; పినతండ్రుల యొక్క పెదతండ్రులయొక్క అనుమతిని కోరుట ధర్మము.

వ్యాసభగవానుఁడు అర్జునుని శ్రాద్ధకర్తనుగా పేర్కొనక, కుంతిని పేర్కొనుటయేగాక, శ్రీకృష్ణునిమాటలలో, "కుంతి ఈమెను ఓదార్చి దుర్ధర్షమైన శోకమును వీడి వీనికి శ్రాద్ధమును కల్పించెను.... తరువాత బ్రాహ్మణునకు బహుగోవుల నొసంగి వార్ష్ణేయి (కుంతి) ఉత్తరను సంతోషపఱచి (సమాశ్వాస్య) ఇట్లనెను" అని ఆశ్రాద్ధముయొక్క సందర్భవిశేషమును చెప్పెను. ఆమె దుర్ధర్షమైన శోకమును విడిచిపెట్టి సుభద్రనోదార్చి ఉత్తరను అనునయించెననుటవలన ఈ శ్రాద్ధమును ఆమె అభిమన్యుఁడు మరణించిన రెండు మూఁడు రోజులలోనే కల్పించెనని యూహింపవలసియున్నది. రెండు మూఁడు రోజులయందే శోకము దుర్ధర్షముగా నుండును. అప్పుడే ఆమె ప్రయత్నపూర్వకముగా సుభద్రను ఉత్తరను ఓదార్పవలసియుండును. అందువలన మనుమఁడు చనిపోయినప్పుడు, యుద్ధము ముగిసినతరువాత ఎప్పుడో జరుగు సమష్టి శ్రాద్ధములవఱకు ఆపియుంచక వానికి వెంటనే పరలోక క్రియలు జరుగవలెనని సంకల్పించి యుండును. ఆసమయమున ధర్మజాదులు శ్రాద్ధమును సంకల్పించుటకు వీలులేక పోవుటచే ఆమె కర్తృత్వమును

తానే వహించి ధర్మజునకు ప్రతినిధిగా బ్రాహ్మణుని ఏర్పఱచి శ్రాద్ధమును చేయించి, అనేకదానములు గావించెను. మృతులవిషయమున శరీరము లభింపనప్పుడు దర్భలతో మృతుని శరీరమును ఏర్పఱచి దహనసంస్కారాదులను జరుపుదురు. ఆ పద్ధతిలో ఆమె అభిమన్యునకు కూడ దర్భలతో ఏర్పఱచిన శరీరమునకు దహనసంస్కారాదులను గావించి శ్రాద్ధమును దానములను గావించుచు, ఈ ప్రక్రియకు ఆమె ధర్మజాదుల యనుమతిని సంపాదించెనని గ్రహింపవలసియున్నది.

అభిమన్యునిశరీరము ఉండఁగా, ధర్మరాజాదులు కర్తలుండగా కుంతీదేవి ప్రాతినిధ్యముతో శ్రాద్ధమును ఏల జరిపింపవలె ? అంత తొందర ఎందులకు ? చనిపోయినవారికి పరలోకయాత్రయందు సుఖగమనము సిద్ధింపవలయునన్నచో వెంటనే దహనసంస్కారములు జరిపి శ్రాద్ధదానాదికమును గావించుట అవశ్యకము. అట్లయినచో మరణించినవానికి త్వరగా ప్రేతత్వము తొలఁగిపోవును. అట్లుగాక ఈ కర్మలు ఎంత ఆలస్యమైన మరణించినవానికి ప్రేతత్వము అంతగా వ్యధను కలిగించుచుండును. బ్రహ్మోపాసకులు ప్రేతకర్మలతో నిమిత్తము లేకయే ప్రేతత్వము లేకుండ పరలోకములకు పోఁగలరు. ద్రోణాచార్యుఁడు శరీరమును వీడినంతనే బ్రహ్మలోకమునకు పోయినట్లు వ్యాసభగవానుఁడు నిర్దేశించియున్నాఁడు. సామాన్యజీవులకు ప్రేతకర్మలు జరిగిననే తప్ప ప్రేతత్వ విముక్తి కలుగదు. బంధువులు ఎంత శోకించినను ప్రేతలకు సుఖము కలుగదు. వారికి వెంటనే దహనసంచయన తిలోదక పిండప్రదానాదులను దానములను గావించినచో ప్రేతత్వవిముక్తి సంభవించి శాంతి కలుగును. కావున దీనిని తీవ్రముగా భావించిన కుంతీదేవి తన మనుమనికి వెంటనే ప్రేతత్వ విముక్తి శాంతి కలుగవలయునన్నచో ఇది తప్ప వేఱు మార్గము లేదని నిశ్చయించి ప్రాతినిధ్యముతో శ్రాద్ధదానాదికమును జరిపించెనని గ్రహింపవలసియున్నది. ఈ సందర్భమున ఆమెనుగూర్చి వ్యాసభగవానుఁడు ధర్మజ్ఞ (సమనుజ్ఞాప్య ధర్మజ్ఞా) అని పేర్కొనుట గమనింపఁదగియున్నది.

శ్రీకృష్ణుఁడు చెప్పినది విన్నతరువాత వసుదేవుఁడు శోకమును వీడి అభిమన్యునకు శ్రాద్ధముఁ గావించెను. అట్లే శ్రీకృష్ణుఁడు కూడ మేనల్లునకు శ్రాద్ధమును గావించి అఱువదివేలమంది బ్రాహ్మణులకు మృష్టాన్నములతో సంతర్పణముఁ

గావించెను; లోకము పులకితమగునట్లు అనేక సువర్ణశయనాచ్ఛాదనాదులను దానము. చేసి బ్రాహ్మణులయొక్క ధనతృష్ణను తీర్చెను. బలరాముఁడు సాత్యకియు అభిమన్యునకు శ్రాద్ధమును గావించిరి. మఱియు వాసుదేవుఁడు తండ్రికి ప్రియుఁడైన యభిమన్యునకు నిత్యము ఔర్ధ్వదైహికముఁ గావించెను ; అనఁగా ప్రతిదినము అభిమన్యునుద్దేశించి బ్రాహ్మణులకు భోజనము పెట్టుచుండెనన్నమాట.

శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా తు పుత్త్రస్య వచ శ్శూరాత్మజ స్తదా ।
విహాయ శోకం ధర్మాత్మా దదౌ శ్రాద్ధ మనుత్తమమ్ ॥ 1

శ్లో॥ తథైవ వాసుదేవ శ్చ స్వస్రీయస్య మహాత్మనః ।
దయితస్య పితు ర్నిత్య మకరో దౌర్ధ్వదైహికమ్ ॥ 2

శ్లో॥ షష్టిం శతసహస్రాణి బ్రాహ్మణానాం మహౌజసామ్ ।
విధివ ద్భోజయామాస భోగ్యం సర్వగుణాన్వితమ్ ॥ 3

శ్లో॥ ఆచ్ఛాద్య చ మహాబాహు ర్ధనతృష్ణా మపానుదత్ ।
బ్రాహ్మణానాం తదా కృష్ణ స్త దభూ ల్లోక హర్షణమ్ ॥ 4

శ్లో॥ వాసుదేవో ఽథ దాశార్హో బలదేవ స్ససాత్యకిః ।
అభిమన్యో స్తదా శ్రాద్ధ మకుర్వన్ సత్యత స్తదా ॥ 6

ఆశ్వమేధికపర్వ - అధ్యాయ. 62

ధర్మరాజాదులవలన కుంతివలన శ్రాద్ధములు జరిగి కొన్ని నెలలయ్యెను. అయినను అత్యంత ప్రీతివలన వసుదేవుఁడు మనుమనికి శ్రాద్ధమును గావించెను. ఆయన ప్రీతికొఱకు తక్కినవారు కూడ ఇంకను అధిక వైభవముతో శ్రాద్ధములను గావించిరి. దీనినిబట్టి మృతులయందు ప్రేమకలవారందఱును ఎప్పుడైనను వారికి శ్రాద్ధములు చేయవచ్చునని గ్రహింపవలసియున్నది.

తండ్రియుండఁగా బలరామాదులు శ్రాద్ధములు చేయవచ్చునా ? వీరు కూడ. బ్రాహ్మణ ప్రాతినిధ్యమున చేయించి యుందురని గ్రహింపవలసియున్నది. దీనినిబట్టి పూర్వులు శ్రాద్ధకర్మలకు ఎంత ప్రాముఖ్యము నొసంగిరో వ్యక్తమగుచున్నది.

# 2. పరీక్షిత్కథ మండలువు

## (i) మృతోజ్జీవన చమసము

ద్వారకకు బయలుదేరునప్పుడు శ్రీకృష్ణునితో ధర్మరాజు అశ్వమేధ విషయమును చెప్పియుండెను. ఆవిషయమును స్మరించి శ్రీకృష్ణుఁడు సబాంధవముగా హస్తినకు వచ్చెను. అప్పుడు మరుత్తుని ధనమును గైకొని వచ్చుటకై ధర్మరాజాదులు యుయుత్సునకు రాజ్యపాలనము నప్పగించి హిమవంతమునకు పోయియుండిరి. యుయుత్సుఁడు ధృతరాష్ట్ర విదురులు, శ్రీకృష్ణునకు వృష్ణివీరులకు ఎదురేగి కొనితెచ్చిరి. వారచట సుఖముగా నుండిరి.

ఒకనాఁడు ఉత్తర ప్రసవించెను. ఆమె ప్రసవించినంతనే వాద్యఘోషములు మిన్నుముట్టెను. శిశువు మృతుఁడని తెలిసినంతనే రోదన ధ్వానములు విజృంభించెను. సాత్యకితో కూడ శ్రీకృష్ణుఁడు అంతఃపురమునకు పోయెను. కుంతి, సుభద్ర విలపించుచు ఆయనకు ఎదురుగా వచ్చి బాలుని బ్రతికింపుమని ప్రార్థించిరి. ఆయన అట్లే చేయుదునని వారి నోదార్చి పురిటింటిలోనికి పోయెను. ఉత్తర మృతుఁడైన బాలుని ఒడిలోనుంచుకొని విలపించుచు వానిని బ్రతికింపుమని శ్రీకృష్ణుని ప్రార్థింపఁజొచ్చెను. ఆయన ఆమెను జూచి, "అమ్మాయీ ! నామాట వ్యర్థము కాదు ; ఎల్లరు చూచుచుండఁగా వీనినిప్పుడే బ్రతికింతును : దుఃఖింపకుము" అని ఓదార్చెను.

పిదప ఆయన జలోపస్పర్శనము (ఆచమనము) గావించి అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రమును (బ్రహ్మశిరము) ఉపసంహరించి యిట్లనెను "నేను ఎప్పుడును అసత్యమును చెప్ప లేదు ; యుద్ధమునుండి పారిపోలేదు. ఇది సత్యమగుచో ఈ బాలుఁడు జీవించునుగాక ! నాకు ధర్మము ప్రియమై బ్రాహ్మణులు మిగుల ఇష్టులైనచో ఈ యభిమన్యునిపుత్రుఁడు బ్రతుకును గాక ! నాకు అర్జునునియందు ఎప్పుడును విరోధము లేకుండుట నిజమేని, సత్యధర్మములు నాయందు ఎల్లప్పుడు ప్రతిష్ఠితములై యుండునేని, కంసుఁడు కేశియు ధర్మబద్ధముగనే నాచేత సంహరింపఁబడిరేని ఆ సత్యముచేత ఈ శిశువు మరల జీవించును గాక !"

శ్లో|| నోక్తపూర్వం మయా మిథ్యా స్వైరే ష్వపి కదాచన |
న చ యుద్ధా త్పరావృత్తః తథా సంజీవతా మయమ్ || 19

శ్లో|| యథా మే దయితో ధర్మో బ్రాహ్మణా శ్చ విశేషతః |
అభిమన్యో స్సుతో జాతో మృతో జీవ త్వయం తథా || 20

శ్లో|| యథాహం నాభిజానామి విజయేన కదాచన |
విరోధం తేన సత్యేన మృతో జీవ త్వయం శిశుః || 21

శ్లో|| యథా సత్యం చ ధర్మ శ్చ మయి నిత్యం ప్రతిష్ఠితే |
తథా మృత శ్శిశు రయం జీవతా మభిమన్యుజః || 22

శ్లో|| యథా కంస శ్చ కేశీ చ ధర్మేణ నిహతో మయా |
తేన సత్యేన బాలోఽద్య పున స్సంజీవతా మయమ్ || 23

శ్లో|| ఇత్యుక్తో వాసుదేవేన స బాలో భరతర్షభ |
శనై శ్శనై ర్మహారాజ ప్రాస్పందత సచేతనః || 24

ఆశ్వమేధికము - అధ్యాయ. 69

ఇట్లు కృష్ణుఁడు శపథము చేయుచుండఁగా మృతుఁడైన శిశువు క్రమముగా చలనము నొంది మరల జీవించెను. అందఱు ఆనందముతో శ్రీకృష్ణుని స్తుతించిరి. "కులము పరిక్షీణమైనప్పుడు జన్మించినాఁడు కావున వీఁడు పరీక్షిత్తు అనునామముతో ప్రసిద్ధుఁడగును". అని ఆయనయే ఆ బాలునకు నామము నేర్పఱచెను. అప్పుడు పాండవులు మరుత్తుని ధనములను గైకొని వచ్చి, పరీక్షిజ్జన్మవృత్తాంతమును విని మిగుల సంతోషముతో శ్రీకృష్ణుని పూజించిరి.

## (ii) శపథ చమసము

ఉదంకునికొఱకు అమృతమును ఇంద్రునివలన ఇప్పించుటకు పూనుకొనిన శ్రీకృష్ణుఁడు ఇంద్రునిచేతనే శిశువును జీవింపఁజేసియుండవచ్చును. ఆయన ఇట్లేల శపథమును గావించెను ? అశ్వత్థామయొక్క బ్రహ్మశిరోనామకాస్త్రము శిశువుయొక్క

ప్రాణమును హరించెను. ఉపసంహార మంత్రములచేతనే ఆయన ఆ యస్త్రముయొక్క ప్రభావమును తొలఁగించెను. ఆయస్త్రప్రభావము నుండి విముక్తుఁడైన జీవుఁడు అచ్చటనే పరిభ్రమించుచుండెను. ఆ జీవుని ఆశరీరమున ప్రవేశపెట్టుటకు సంకల్పబలమే ఆవశ్యకము ; అమృతము కాదు. అమృతము మహామాన్వితమైన యౌషధము వంటిది. శరాఘాతము మొదలగువానిచేత శరీరము వికలమైనప్పుడు, లేక, కాలవశమున సహజముగా అంగములు ఇంద్రియములు జీర్ణించి చలనరహితములైనప్పుడు అమృతము వైకల్యమును పోఁగొట్టి సకల శరీరభాగములకు మరల నూతనోత్తేజమును కలిగించును. కాని ఒకసారి శరీరమును వదలిపోయిన జీవుఁడు, పరకాయ ప్రవేశ విద్య తెలిసియుండిననే తప్ప, మరల యథాపూర్వముగ శరీరమునందు ప్రవేశింపలేఁడు. అప్పుడు మహనీయులసంకల్పబలముచేతనే జీవుఁడందు ప్రవేశింపఁగలిగియుండును. అమృతము అచేతనము దాని కాశక్తి యుండదు. రాముని యభ్యర్థనమున ఇంద్రుఁడు అమృతవర్షమును కురియించినప్పుడు కూడ, అమృతముచేత ఋక్షవానరుల శరీరములు అవయవసమగ్రములై పుష్టిని పొందఁగా, ఇంద్రుని సంకల్పబలముచేత, లోకాంతరగతులైన జీవులు కూడ తిరిగి వచ్చి తమతమ శరీరములలో ప్రవేశించిరని గ్రహింపవలసియున్నది.

ఆనాఁడు ఇంద్రునివలె శ్రీకృష్ణుఁడు కూడ సంకల్పమాత్రముననే పరీక్షిత్తును. శరీరమున ప్రవేశపెట్టియుండ వచ్చును కదా ! శపథమెందులకు ? ఈ శపథమునందు అనేక ప్రయోజనములు కలవు. యథార్థముగ సత్యధర్మపరాయణుఁడైన వానికి ఆపరాయణత్వమే తపశ్శక్తి యగునని, అట్టివాఁడు సంకల్పించినచో చచ్చినవాఁడు కూడ బ్రతుకునని సత్యధర్మముల ప్రభావమును ప్రకటించుట మొదటి ప్రయోజనము. తనయందు సత్యధర్మములు సతతము ప్రతిష్ఠితములై యున్నవని ఆయన లోకమునకు తెలియఁజేయుట రెండవ ప్రయోజనము. శత్రువులతో మిత్రులతో బహుభార్యలతో బంధువులతో బహువిధముల వ్యవహరించుచున్న శ్రీకృష్ణుఁడు ఎల్లప్పుడు సత్యధర్మములనే అవలంబించి వాని నుండి రేఖామాత్రముగానైన తొలఁగి వర్తింపలేదని లోకులు గుర్తించుట అత్యంతము దుర్ఘటము. ఆయనయందు భక్తులైనవారు కూడ అప్పుడప్పుడు ఆయనను శంకించుచుండుట జరుగుచునే

యుండినది. శమంతకమణివిషయమున బలరాముఁడు కూడ శ్రీకృష్ణుని నమ్మలేక పోయెను. గాంధారి ఉదంకుఁడు శపించుటకు సైతము పూనుకొనిరి. అందువలన ఆయనయందు అనురాగము కల కుంతి ధర్మజుఁడు మొదలగువారికి పరిపూర్ణమైన భక్తి కలుగుటకు ఈ శపథము ఉపయోగపడుచున్నది.

అర్జునునకు తనకు ఎప్పుడును విరోధము లేదని ఆయన చెప్పుటవలన, అర్జునుఁడు కూడ సత్యధర్మపరాయణుఁడేయని, అతఁడు గావించినవి ధర్మయుద్ధములేయని, పాండవులకు కలిగినది ధర్మజయమే యని స్పష్టమొనరించుట మూఁడవ ప్రయోజనము.

"నాకు ధర్మము ప్రియము ; అంతకంటె విశేషముగా బ్రాహ్మణులు ఇష్టులు" అని శ్రీకృష్ణుఁడు చెప్పుటవలన ధర్మమునందు కంటె బ్రాహ్మణులయందు అధిక శ్రద్ధ కలిగియుండవలయు నని ప్రకటించుట నాల్గవ ప్రయోజనము. సత్యధర్మముల స్వరూపము వేదములపై ఆధారపడియున్నది. వేదమును అనూచానముగా పరిరక్షించుచు అర్థనిర్ణయముఁ గావించి సత్యధర్మములను బోధింపఁగలిగిన వారు బ్రాహ్మణులే. కావున ధర్మసత్యపరాయణత్వమునకు బ్రాహ్మణ సేవయే మూలము.

# II. యజ్ఞకలశము

## 1. అర్జునసందేశ కమండలువు

### (i) ఆరంభ చమసము

వ్యాసభగవానుఁడు వచ్చి మరుత్తునిధనములను తెచ్చిన ధర్మజుని అభినందించి అశ్వమేధమును ఆరంభింపుమనెను. ధర్మజుఁడు వాసుదేవుని చూచి యిట్లనెను. "కృష్ణా ! నీ పరాక్రమముచేత బుద్ధిశక్తిచేత మేము యుద్ధమున జయించితిమి. ఈ రాజభోగము లన్నియు నీప్రసాద లబ్ధములే. నీవు మాకు పరమగురుఁడవు. కావున నీవే అశ్వమేధమున దీక్షవహింపుము. నీవు దీక్షితుఁడవైనచో నేను పాపరహితుఁడ నగుదును".

శ్రీకృష్ణుఁడిట్లనెను. "ఇట్లు ఉదారముగ మాటాడుట నీకే చెల్లినది. కాని ఇప్పుడు నీవు కురువీరుల కెల్లరకు రాజువై ప్రకాశించుచున్నావు. నీవు మాకు గురుఁడవు. నీవేదీక్షితుఁడవై అశ్వమేధము నారంభింపుము. ఇందు నీకు కావలసిన కార్యమంతయు నేను నిర్వహింతును. నీవు ఈ యజ్ఞమును నిర్వహించినచో నీ తమ్ములందఱు దీనిని ఆచరించినట్లే యగును".

పిదప ధర్మరాజు యజ్ఞదీక్షితుఁడై అర్జునుఁడు రక్షకుఁడుగా యజ్ఞాశ్వమును భూసంచారమునకై వదలెను. శ్రీకృష్ణుఁడు సబాంధవముగా ద్వారకకు పోయి సంవత్సరము పూర్తి యగుచుండఁగా తిరిగివచ్చెను. భీముఁడు ఆయనకు ఎదురేగి స్వాగతము పలికి యజ్ఞవాటమునకుఁ గొనిపోయెను.

## (ii) సందేశ చమసము

ధర్మరాజు మిగుల సంతోషముతో శ్రీకృష్ణునాదరించి కుశలప్రశ్నము గావించెను. శ్రీకృష్ణుఁడు కుశలము నెఱింగించి ఇట్లనెను. "మాకు ఆప్తుఁడైన ద్వారకావాసి యొకఁడు అర్జునుని చూచి అతనితో మాటాడివచ్చెను. అర్జునుఁడు నాతో ఇట్లు చెప్పుమనెను. "ఇంక ధర్మరాజును హయమేధకార్యముల నారంభింపుమని చెప్పుము. రాజశ్రేష్ఠులందఱు యజ్ఞమునకు రాఁగలరు. వారి నందఱను తగినట్లు పూజింపుమని నామాటగా మహారాజునకు విన్నవింపుము. అర్ఘ్యాహరణమునందు రాజసూయమునందు సంభవించినట్లుగా ఇప్పుడు కూడ ఆత్యయికము సంభవింపకుండ రాజులనందఱను యథార్థముగ పూజింపుఁడు. రాజద్వేషమున ప్రజలు నశింపకుందురు గాక ! ఇట్లు మహారాజు నీయభిమతమున జరుపునుగాక ! నాకుమారుఁడు మణలూరపతి బభ్రువాహనుఁడు వచ్చుచున్నాఁడు. అతఁడు నాకు ప్రియుఁడు, భక్తుఁడు. వానిని యథావిధి నాదరింపుమని చెప్పుము".

శ్లో|| ఆగమిష్యన్తి రాజానః సర్వే కౌరవర్షభ |
ప్రాప్తానాం మహతాం పూజా కార్యా హ్యేతత్ క్షమం హి నః || 15

శ్లో|| ఇత్యేత ద్వచనా ద్రాజ్ఞో విజ్ఞాప్యో మమ మానద |
యథా చాత్యయికం న స్యాత్ య దర్ఘ్యాహరణేఽభవత్ || 16

శ్లో॥ కర్తు మర్హత తద్రాజా భవాం శ్చానుమన్యతామ్ ।
రాజద్వేషా న్న నశ్యేయు రిమా రాజన్ పునః ప్రజాః ॥

ఆశ్వమేధికము - అధ్యాయ - 86

అర్జునుఁడు శ్రీకృష్ణుని ద్వారమున ధర్మరాజునకు ఈవిధముగా విన్నవించుట గమనింపఁదగియున్నది. అత్యయమనఁగా అతిక్రమణము. దానివలన సంభవించు విపత్కర సన్నివేశము ఆత్యయికము. కృష్ణునకు అర్ఘ్యాహరణము కావించువఱకు రాజసూయము సకలజనులకు సమ్మోదకరముగా జరిగినది. శ్రీకృష్ణునకు అర్ఘ్యము నొసంగి అగ్రపూజ కావించినంతనే మర్యాదాతిక్రమణము జరిగినట్లుగా రాజులనేకులు ఖేదము నొందిరి. శ్రీకృష్ణుఁడు యయాతిశాపమునకు గుఱియైన యదువంశమున జన్మించెను. మఱియు ఏరాజ్యమునకు ఎప్పుడు ఆయన మూర్ధాభిషిక్తుఁడైన రాజు కాలేదు. అట్టివానికి అగ్రపూజ ఇచ్చినప్పుడు రాజులనేకులు, "భీష్ముఁడు ధర్మరాజు శ్రీకృష్ణునియందున్న ప్రేమాతిశయముచేత మూర్ధాభిషిక్తులై వృద్ధులైయున్న మహారాజులెందఱో యుండఁగా వారి నతిక్రమించి యనర్హునకు అగ్రపూజ నొసంగుచున్నా" రనియే తలంచుచుండిరి. కాని వారుపైకి చెప్పి ఆక్షేపించుటకు వెఱచిరి. శిశుపాలుఁడు బయటపడి భీష్మధర్మజ శ్రీకృష్ణులను నిందించి నిహతుఁడయ్యెను. యజ్ఞమునకు ఆహ్వానింపఁబడి ఆదరముతో వచ్చిన పినతల్లి కుమారుడు, దుర్మార్గుఁడేయైనను, సభలో సంహరింపఁబడవలసి వచ్చుట ఆత్యయికమయ్యెను. అది ధర్మజాదులకు మనఃక్లేశమును కలిగించుచునే యుండెను. అప్పుడు శ్రీకృష్ణునకు గాక వ్యాసునివంటి మహర్షికి అగ్రపూజ యొసంగియున్నచో అది మర్యాదాతిక్రమణగా మహారాజులకు తోఁచియుండదు. అప్పుడు శిశుపాలునకు ఆక్షేపించుటకు అవకాశముండెడిది కాదు. ఈయర్ఘ్యాహరణమువలన కూడ చాలమంది రాజులు దుర్యోధనుని పక్షమునందు చేరియుందురు. కురుక్షేత్రయుద్ధమునందు పెక్కుమంది మహారాజులు, వారితోపాటు లక్షలకొలఁదిగా సాధారణ యోధులు, తమచేత సంహరింపఁబడుటకు రాజసూయమునందు జరిగిన యర్ఘ్యాహరణమువలని వైమనస్యమే ఒక ముఖ్యకారణమని, రాజులద్వేషములవలన వైరముల వలన ప్రజలు నశించుట తగదనుట యర్జునుని యభిప్రాయమని వ్యక్తమగుచున్నది.

ఈపర్యటనలో అర్జునుఁడు కురుక్షేత్ర యుద్ధానంతరమున ప్రతిదేశమునందు పెక్కుకుటుంబములలో తాండవించుచున్న విషాదమును దీనతను గమనించుచు మిగుల సంక్షుభితుఁ డయ్యెనని స్పష్టమగుచున్నది.

"నీవు కూడ దీనికి అనుమతింపవలయు" నని యర్జునుఁడు శ్రీకృష్ణునకు చెప్పిపంపుట కూడ సాభిప్రాయమే. రాజసూయమునందు భీష్మునిచేత సర్వశ్రేష్ఠుఁడుగా నిర్ణయింపఁబడి అగ్రపూజ నొందిన శ్రీకృష్ణుఁడే ఇప్పుడు కూడ అశ్వమేధమునందు అగ్రపూజనందుకొనుట న్యాయయుక్తము. అది న్యాయ్యమే అయినను రజోగుణప్రధానులైన మహారాజులకు మరల అసూయాద్వేషములను కలిగింపవచ్చును. "అట్టి పరిస్థితిని తప్పించుటకై సాధ్యమైనంతవఱకు ప్రయత్నించుట సమంజసము; అందువలన నీవు కూడ దీనికి అంగీకరింపు"మని యర్జునుఁడు శ్రీకృష్ణుని ప్రార్థించుచున్నాఁడు.

శ్రీకృష్ణుఁడు అర్జునుని సందేశమును మాత్రమే చెప్పియూరకుండెను. ధర్మరాజు ఆసందేశమును విని ఆవిషయమునుగూర్చి ప్రస్తావింపక అర్జునుని శ్రమనుగూర్చి ప్రసంగించెను. భంగ్యంతరమున ఆయన అర్జునుని మాటను మన్నించినట్లే యయ్యెను.

## (iii) సాముద్రిక చమసము

యుధిష్ఠిరుఁడు అర్జునునిగూర్చి యనుతాపముతో శ్రీకృష్ణునితో ఇట్లనెను. "ఇప్పుడు కూడ అర్జునునకు రాజులతో అనేక యుద్ధములు సంభవించెనని వినుచున్నాను. ధీశాలియైన విజయుఁడు నిత్యము సుఖవివర్జితుఁడై దుఃఖభాగి ఎందుల కగుచున్నాఁడని నేను ఏకాంతమునందు చింతించుచుందును. సర్వశుభలక్షణాఢ్యమైన వాని శరీరమునందు ఈ దుఃఖానుభవమునకు మూలమైన యనిష్ట చిహ్న మేదేని ఉన్నదా ? నాకు అట్టి లక్షణమేదియు వానియందు కన్పింపలేదు. ఇది నేను వినఁదగిన దైనచో చెప్పుము".

శ్రీకృష్ణుఁడు ఆలోచించి యిట్లనెను. "ఆ పురుషసింహునకు పిక్కలు అధికముగానున్నవి. అది తప్ప అతనిశరీరమునందు ఏ దుర్లక్షణము లేదు. అధికములైన

పిక్కలవలననే అతఁడు ఎల్లప్పుడు వివిధపథములలో తిరుగుచు దుఃఖభాజనుఁ డగుచున్నాఁడు".

ధర్మజుఁడు నిజమే అనెను. ద్రౌపది అసూయతో ప్రక్క చూపులతో కృష్ణుని చూచెను. అయిదుగురియందును ప్రేమ సమానముగా ఉండవలసియున్నను ఆమెకు అర్జునునియందు ప్రణయము అధికముగా నుండుటచే ఆ దుర్లక్షణ ప్రస్తావమును ఆమె సహింపలేక తనవంక అట్లు చూచుచున్నదని శ్రీకృష్ణుఁడు గ్రహించెను.

శ్లో|| కి న్ను తస్య శరీరేఽస్తి సర్వలక్షణ పూజితే |
అనిష్టం లక్షణం కృష్ణ యేన దుఃఖా న్యుపాశ్నుతే || 5

శ్లో|| రాజానం భోజరాజస్య వర్ధనో విష్ణు రబ్రవీత్ |
నహ్యస్య నృపతే కించిత్ సంశ్లిష్ట ముపలక్షయే || 8

శ్లో|| ఋతే పురుషసింహస్య పిండికేఽస్యాధికే యతః |
తాభ్యాం పురుషవ్యాఘ్రో నిత్య మధ్వసు వర్తతే || 9

(పిండికా - A leg of a calf ; పిక్క, జంఘ)

శ్లో|| న చాన్య దనుపశ్యామి యే నాసౌ దుఃఖభాజనమ్ |
ఇత్యుక్తః పురుషశ్రేష్ఠః తదా కృష్ణేన ధీమతా || 10

శ్లో|| ప్రోవాచ వృష్ణిశార్దూల మేవ మేత దితి ప్రభో |
కృష్ణా తు ద్రౌపదీ కృష్ణం తిర్య క్సాసూయ మైక్షత || 11

ఆశ్వమేధికము - అధ్యాయ. 87

ధర్మజునకు అర్జునునివిషయమున అనుతాపము కలుగుట సహజమే. అతఁడు చేసినన్నియుద్ధములు సోదరులెవ్వరును చేయలేదు. అతఁడు పొందినన్ని కష్టములు కూడ వారికి కలుగలేదు. ఖాండవమున అతఁడు తండ్రియైన యింద్రునితోనే పోరాడవలసివచ్చెను. పాశుపతాస్త్రమునకై తపస్సు చేయుచు కష్టపడుటయేకాక ఈశ్వరునితో పోరాడి, మరల ఇంద్రునియభ్యర్థనమున కాలకేయనివాత కవచాదులను

సంహరించెను. ఇప్పుడు కూడ సోదరులందఱు ఇంటి యొద్దనే యుండఁగా అతఁడు అశ్వమువెంట పోయి ఎన్నో యుద్ధములు చేయవలసి వచ్చెను. అతని విషయమున ధర్మజుఁడు ఎంత ఖేదమును పొందుచున్నాఁడో ద్రౌపది అంతకంటె అధికముగనే చింతించుచుండును. ఆమెకూడ అర్జునునియందు పక్కలు అధికముగా నుండుటను గమనించియే యుండును. అయినను అంతమందిలో తనకు ప్రియతముఁడైన యర్జునుని శరీరమునందు నిగూఢముగ నున్న దుర్లక్షణమును శ్రీకృష్ణుఁడు నిస్సంకోచముగ చెప్పుట ఆమెకు నచ్చలేదు. అయినను ఆమాట నామెపైకి అనుటకు వీలులేదు. గుణవర్తనము నందు కూడ దోషమును భావించుట అసూయ. పెద్దవాఁడు అడిగినప్పుడు తనకు తెలిసినవిషయమును చెప్పకుండుట శ్రీకృష్ణునకు తగదు. అందువలన ఆయన ధర్మజునకు అట్లు చెప్పుట గుణమే. అట్లు ఆయన చెప్పరాదని ఆమె యనుకొనుట అసూయ.

దీనినిబట్టి శరీరలక్షణములు జీవితములోని సుఖదుఃఖానుభవములను సూచించునని, సాముద్రిక శాస్త్రము మిగుల ప్రాచీనమైనదని, దానిని ప్రామాణికముగా గ్రహింపవలయునని విశదమగుచున్నది.

# 2. కర్మఫల కమండలువు

## (i) స్వర్గచమసము

అశ్వమేధము పూర్తియైన తరువాత కొంతకాలమునకు బ్రాహ్మణశాపముచేత యాదవులు ముసలము నిమిత్తముగా పరస్పరముగా పోరాడి నశించిరి. శ్రీకృష్ణుఁడు దివంగతుఁడగుట ఎఱింగి ధర్మరాజు తమ్ములతో ద్రౌపదితో మహాప్రస్థానముఁ గావించి స్వర్గమునకు చేరెను. ఆయన ఋషులచే మరుద్గణములచే స్తుతింపఁబడుచు కురుపుంగవులు ఎచ్చట నుండిరో అచ్చటికి పోయెను. అచ్చట అర్జునునిచే ఉపాసింపఁబడుచు, పురుషవిగ్రహములను ధరించిన చక్రాద్యాయుధములచే సేవింపఁబడుచు బ్రాహ్మమైన శరీరముతో ప్రకాశించుచున్న శ్రీకృష్ణుని చూచి ధర్మరాజు, భూలోకములోని శరీరముయొక్క సాదృశ్యముచేత గుర్తించెను. యుధిష్ఠిరుని చూచి వారు ఇద్దరు ఆయనను యథాపూర్వముగా పూజించిరి.

శ్లో॥ తతో యుధిష్ఠిరో రాజా దేవైః సర్షిమరుద్గణైః |
స్తూయమానో యయౌ తత్ర యత్ర తే కురుపుంగవాః || 1

శ్లో॥ దదర్శ తత్ర గోవిందం బ్రాహ్మేణ వపుషాన్వితమ్ |
తేనైవ దృష్టపూర్వేణ సాదృశ్యే నేవ సూచితమ్ || 2

శ్లో॥ దీప్యమానం స్వవపుషా దివ్యై రస్త్రై రుపస్థితమ్ |
చక్రప్రభృతిభి ర్ఘోరై ర్దివ్యైః పురుషవిగ్రహైః || 3

శ్లో॥ ఉపాస్యమానం వీరేణ ఫాల్గునేన సువర్చసా |
తథా స్వరూపం కౌంతేయో దదర్శ మధుసూదనమ్ || 4

శ్లో॥ తా వుభౌ పురుషవ్యాఘ్రౌ సముద్వీక్ష్య యుధిష్ఠిరమ్ |
యథావత్ ప్రతిపేదాతే పూజయా దేవపూజితే || 5

## స్వర్గారోహణపర్వ - అధ్యాయ. 4

దీనినిబట్టి యుద్ధనిహతులై వీరస్వర్గము నొందిన వారికందఱకు ఆలోకమున ప్రత్యేకమైన వసతి (separate colony) ఉండునని వ్యక్తమగుచున్నది (యయౌ తత్ర యత్ర తే కురుపుంగవాః). అచ్చట కూడ భూలోకమున ఏయే ఆకృతులతో నుండిరో ఆయాకృతులతో సాదృశ్యము కలిగిన శరీరములనే వారు పొందుదురని విశదమగుచున్నది. సాదృశ్యముచేతనే ధర్మరాజు శ్రీకృష్ణుని గుర్తింపఁగలిగెను. కాని శ్రీకృష్ణుఁడు బ్రాహ్మమైన శరీరముతో దీప్యమానుఁడై చక్రాద్యాయుధములచే సేవింపఁబడుచుండెను. బ్రాహ్మమైన శరీరమనఁగా బ్రహ్మలోకమునకు తగిన శరీరమని గ్రహింపవలసియున్నది. దీనినిబట్టి ఆయన అచ్చటనుండి బ్రహ్మలోకమునకు పోవుటకు సిద్ధముగా నున్నాఁడని యనుకొనవలసియున్నది. ఆయన వైకుంఠము నుండి యవతరించినవాఁడు కావున మరల అక్కడికే పోవుట సహజము. ఉపనిషత్ప్రమాణము ననుసరించి బ్రహ్మలోకమే సర్వోన్నతము. అదియే సత్యలోకము. దానికి పైన ఏలోకము లేదు. నిర్గుణోపాసకులైన పరివ్రాజకులు ఆలోకమునకు చేరి ఆలోకాధిపతియైన బ్రహ్మదేవునితో చిరకాలముండి, ప్రళయము నందు ఆయనతో

కూడ ముక్తి నొందుదురు. కావున వైకుంఠము, కైలాసము, గోలోకము మొదలుగా పేర్కొనఁబడుచున్న యున్నతలోకము లన్నియు బ్రహ్మలోకములోని విశేషవిభాగము లనియే గ్రహింపవలసియున్నది.

## (ii) జీవగతి చమసము

ధర్మరాజు స్వర్గమున శ్రీకృష్ణార్జునాదులతో సాహచర్యమును పొందెనని వైశంపాయనుఁడు చెప్పినంతనే జనమేజయుఁడు వైశంపాయనునితో ఇట్లనెను. "వీరస్వర్గము నొందిన భీష్మద్రోణాదులు ఎంతకాలము స్వర్గమునందుండిరి ? లేక వారచ్చట శాశ్వతముగానే యుండిరా ? చెప్పుము. ప్రదీప్తమైన తపస్సుచేత నీవు సర్వమును చూడఁగలవు".

ఈ పంచమాధ్యాయారంభమున శ్రీనీలకంఠాచార్యుఁడు ఇట్లు అవతారికను రచించెను. "పూర్వాధ్యాయమున, ఏయే యోధుఁడు ఏయే దేవునియొక్క అంశమో అతఁడు స్వర్గమున తన తన యంశి (దేవుని) యొక్క సాన్నిధ్యమును పొందెనని చెప్పఁబడియున్నది. అచ్చట సంశయము (కలుగుచున్నది). కాండరుహము లైనవృక్షములయొక్క (కాండము నుండి అంటు త్రొక్కుటవలన ఉద్భవించు చెట్లయొక్క) అంశములవలె, ఈ యంశములు (అంశములవలన పుట్టినవారు) విడిగా సంసారిత్వమును పొందినారా ? లేక ఆయంశములకు మూలములైన దేవతలయందు లీనమగుచున్నారా ? మొదటి పక్షమునందు కర్మజమైన దేహపరంపరకు, తత్త్వజ్ఞానము లేకుండ విచ్ఛేదము సంభవింపదు. కావున, వారికి మనకువలె నిత్యసంసారిత్వము కలుగును. రెండవపక్షమున మనుష్యభావము నందు చేయఁబడిన కర్మలకు నాశము కలుగవలసియుండును. ఈ కారణమున జనమేజయుఁడు భీష్మద్రోణాదులనుగూర్చి అడుగుచున్నాఁడు".

పంచమాధ్యాయావతారిక : పూర్వస్మి న్నధ్యాయే యో యో యోధో యస్య యస్య దేవ స్యాంశః సః స్వర్గం గత్వా స్వస్య స్వస్యాంశినః సాన్నిధ్యం ప్రాపేత్యుక్తమ్ | తత్ర సంశయః | కి మేతే అంశాః కాండరుహాణాం వృక్షాణా మంశా ఇవ పృథక్ సంసారిత్వం ప్రాప్తాః, ఉత తే ష్వేవ అంశిషు లీయన్తే ? ఆద్యే కర్మజ

దేహపరంపరాయాః తత్త్వజ్ఞాన మంతరేణ ఉచ్ఛేదాయోగాత్, తేషాం నిత్యసంసారిత్వ మస్మదాదివత్ స్యాత్ । ద్వితీయే మానుష్యభావే తైః కృతానాం కర్మణాం నా శాపత్తి రితి సందిహానః జనమేజయః పృచ్ఛతి భీష్మద్రోణా వితి ।

అంశములు కలది అంశి. కొమ్మలు రెమ్మలు పూలు పండ్లు అంశములైనచో వానిని కలిగినచెట్టు అంశి. చెట్టుయొక్క బోదెనుండి ఒక కొమ్మతో అంటు త్రొక్కినప్పుడు, ఆకొమ్మ నుండి మఱియొక చెట్టు జన్మించును. అది కూడ తనకు మూలమైన చెట్టు యొక్క అంశమే అగును. అంశముగా పుట్టినచెట్టు మూలమునకు సంబంధము లేకుండ విడిగా స్వతంత్రముగా పెరిగి పెద్దదియై కొమ్మలు రెమ్మలు పూలు పండ్లు కలిగియుండును. వసువుయొక్క అంశమున జన్మించిన భీష్ముఁడు ఆ వసువుకంటె భిన్నముగా మనుష్యజన్మమునందు ఎన్నో ధర్మాధర్మములను గావించుచు భిన్నమైన సంసారమును పొందెను. ఆయన మరణించిన తరువాత ఈ ధర్మాధర్మవ్యవహారమునకు ఫలము ననుభవించుచు పరలోకమున విడిగా నుండునా లేక తనకు జన్మనొసంగిన వసువునందు లీనమగునా అన్నది సంశయము. ఆయన ఆధర్మాధర్మములకు ఫలము ననుభవించుచు వసువుకంటె భిన్నుఁడైన జీవుఁడుగా ఉండు నన్నచో, ఆకర్మఫలములను కొంత పరలోకమున అనుభవించినను, సాధారణజీవులవలె మరల జన్మింపక తప్పదు. తత్త్వజ్ఞానములేకుండ జన్మమృత్యుపరంపర ఆగిపోవుటకు వీలులేదు. అట్లుకాక ఆయన తనకు జన్మకారకుఁడైన వసువునందు లీనమగునని చెప్పినచో మనుష్య జన్మమునందు చేసిన ధర్మాధర్మకర్మలకు ఫలము పుట్టలేదని అవి యూరక నశించినవని అంగీకరింపవలె. అట్లు అంగీకరించుట శాస్త్రవిరుద్ధము. అందువలన భీష్మద్రోణాదులు తమకు జన్మకారకులైన దేవతలను చేరిరి అన్నమాటకు ఏమి యర్థమని జనమేజయుఁడు వైశంపాయనుని ప్రశ్నించెను.

శ్లో॥ భీష్మద్రోణౌ మహాత్మానౌ ధృతరాష్ట్ర శ్చ పార్థివః ।
విరాటద్రుపదౌ చోభౌ శంఖ శ్చై వోత్తర స్తథా ॥ 1

శ్లో॥ యే చాన్యే కీర్తితా వీరా రాజానో దీప్తమూర్తయః ।
స్వర్గే కాలం కియన్తం తే తస్థు స్త దపి శంస మే ॥ 2

శ్లో|| ఆహోస్విత్ శాశ్వతం స్థానం తేషాం తత్ర ద్విజోత్తమ |
అంతే వా కర్మణాం కాం తే గతిం ప్రాప్తా నరర్షభాః || 5

నీలకంఠీయమ్ :- తే అంతే కాం గతిం, పుణ్యభోగాంతే అంశినా సహ ఐక్యం వా, సాలోక్యం వా, శాశ్వతం ప్రాప్నువన్తి ఉత భూమా వవతరంతి ఇతి ప్రశ్నః||

శ్లో|| ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం ప్రోచ్యమానం ద్విజోత్తమ |
తపసా హి ప్రదీప్తేన సర్వం త్వ మనుపశ్యసి || 6

స్వర్గారోహణే - అధ్యా. 5

ఆ సమయమున జనమేజయుని సభయందు వ్యాసభగవానుఁడు కూడ ఉండెను. అందువలన వైశంపాయనుఁడు గురుదేవుని యనుమతిని గైకొని ఇట్లు చెప్పెను. "కర్మలయొక్క అంతమునందు ప్రతివ్యక్తికి తన ప్రకృతినిపొందుట శక్యము కాదు. ఈ ప్రశ్న చక్కఁగానే అడుగఁబడినది. దేవతలయొక్క యీ రహస్యమునుగూర్చి దివ్యదృష్టి కలిగిన యీ పారాశర్యమహర్షి చెప్పినదానిని వినుము. ఈ మహాత్ముఁడు అగాధమైన బుద్ధి కలవాఁడు, సర్వకర్మలయొక్క గతిని ఎఱింగినవాఁడు ; సర్వజ్ఞుఁడు. కర్మలయొక్క అంతమునందు (దేవతలయొక్క అంశములవలన జన్మించినవారు) తమకు సొంతములైన శరీరములను పొందుదురు. భీష్ముఁడు వసువులను పొందెను. ద్రోణుఁడు బృహస్పతి యందు ప్రవేశించెను.... బ్రహ్మనియోగమున భూమిని ధరించిన యనంతుఁడు రసాతలమున ప్రవేశించెను. దేవదేవుఁడు సనాతనుఁడైన నారాయణుని యంశమున వాసుదేవుఁడుగా అవతరించెను. ఆయన తనపని ముగిసినంతనే నారాయణునియందే ప్రవేశించెను. వాసుదేవుఁడు సంగ్రహించిన పదునాఱువేల మంది స్త్రీలు కాలక్రమమున సరస్వతియందు మునిఁగి శరీరములను వీడి దివము నారోహించిరి. వారు అప్సరసలై వాసుదేవుని యొద్దనుండిరి".

శ్లో|| న శక్యం కర్మణా మంతే సర్వేణ మనుజాధిప |
ప్రకృతిం కిం ను సమ్యక్తే పృచ్ఛైషా సంప్రయోజితా || 8

నీలకంఠీయమ్ : అత్రోత్తర మాహ న శక్య మితి । కర్మణా మంతే సర్వేణ ప్రకృతిం, "ప్రతిగన్తుం" ఇత్యధ్యాహార్య యోజ్యమ్ । యది సర్వోఽపి జంతుః ప్రారబ్ధకర్మాంతే స్వాం ప్రకృతిం గచ్ఛేత్ తర్హి సర్వేఽపి ముక్తాః స్యుః, సంసార శ్చ ఆదిమాన్ భవేత్, తత శ్చ కృతహానాకృతాభ్యాగమ ప్రసంగో విధి ప్రతిషేధ శాస్త్రానర్థక్యం చ తస్మాత్ కేచి దేవ కర్మణా మంతే స్వాం ప్రకృతిం భజన్తే వ సర్వే ఇతి । కిం తర్హి, యే ప్రకృతిం న ప్రాప్తాః తా నుద్దిశ్య, తే త్వయా, ఏషా పృచ్ఛా సమ్యక్ ప్రయోజితా।

శ్లో॥ శృణు గుహ్య మిదం రాజన్ దేవానాం భరతర్షభ ।
యదువాచ మహాతేజాః దివ్యచక్షుః ప్రతాపవాన్ ॥ 9

నీలకంఠీయమ్ : తత్ర కాంశ్చిత్ స్వర్గ ప్రాపక కర్మణాం అంతే స్వైః స్వైః అంశిభిః తాదాత్మ్యం ప్రాప్తుం యోగ్యాన్ యోగజదృష్ట్యా పశ్యన్ పరిగణయతి శృణు ఇత్యాదినా । అర్థా దితరే స్వర్గం గతా అపి పున శ్చ్యవన్తే । ఏతే తు ఉత్తరా ముత్తరా మూర్ధ్వోర్ధ్వక్రమేణ గతిం ప్రాప్య అంతే బ్రహ్మణా సహ ముచ్యన్తే । తేన దేవత్వప్రాప్తయే కర్మాణి యజ్ఞదానతప ఆదీని కర్తవ్యా న్యేవ, న చ ఉక్త దోష ఇతి సర్వ మనవద్యమ్ ॥

శ్లో॥ మునిః పురాణః కౌరవ్య పారాశర్యో మహావ్రతః ।
అగాధబుద్ధి స్సర్వజ్ఞో గతిజ్ఞ స్సర్వ కర్మణామ్ ॥ 10

శ్లో॥ తే నోక్తం కర్మణా మన్తే ప్రవిశన్తి స్వకాం తనుమ్ ।
వసూనేవ మహాతేజాః భీష్మః ప్రాప మహాద్యుతిః ॥ 11

శ్లో॥ అనన్తో భగవాన్ దేవః ప్రవివేశ రసాతలమ్ ।
పితామహనియోగాత్ వై యో యోగా ద్గా మధారయత్ ॥ 23

శ్లో॥ య స్స నారాయణో నామ దేవదేవ స్సనాతనః ।
తస్యాంశో వాసుదేవ స్తు కర్మణోఽంతే వివేశ హ ॥ 24

శ్లో॥ షోడశస్త్రీ సహస్రాణి వాసుదేవపరిగ్రహాః ।
అమజ్జం స్తాః సరస్వత్యాం కాలేన జనమేజయ ॥ 25

శ్లో॥ తత్ర త్యక్త్వా శరీరాణి దివ మారురుహుః పునః |
తా శ్చే వాప్సరసో భూత్వా వాసుదేవ ముపావిశన్ || 26

స్వర్గారోహణే - అధ్యాయ - 5

ఇచ్చట అయిదు, ఎనిమిది, తొమ్మిది శ్లోకములకు నీలకంఠాచార్యుఁడు వ్యాఖ్య రచించుచు ఈ విషయమును ఇట్లు వివరించెను.

అయిదవ శ్లోకమునకు వ్యాఖ్య : వారు పుణ్యభోగాంతమున అంశితో కూడ ఐక్యమునా, సాలోక్యమునా లేక శాశ్వత స్థానముగా (దేనిని) పొందుచున్నారు ? లేక భూమియందు అవతరించుచున్నారా అనునది (జనమేజయుని) ప్రశ్న.

ఎనిమిదవ శ్లోకమునకు వ్యాఖ్య : ఇక్కడ "సాధ్యము కాదు" అని (వైశంపాయనుఁడు) ఉత్తరము చెప్పుచున్నాఁడు. కర్మలయొక్క అంతమునందు ప్రతివ్యక్తికి ప్రకృతిని పొందుట అశక్యము అని అధ్యాహార్యమొనర్చి కూర్చుకొనవలయును. ప్రతిజంతువు ప్రారబ్ధాంతమున తనప్రకృతిని పొందునేని, అప్పుడు ఎల్లరును ముక్తులగుదురు; సంసారము ఆది కలదియగును. అట్లయినచో కృతహానము అకృతాభ్యాగమము, విధి నిషేధశాస్త్రానర్థక్యము (కలుగును). కావున కొంతమంది మాత్రమే కర్మలయొక్క అంతమునందు తమ ప్రకృతిని పొందుచున్నారు ; అందఱును కాదు. (అందువలన) ఎవరు తమ ప్రకృతిని పొందుట లేదో వారినిగూర్చి నీచేత ఈ ప్రశ్న చక్కఁగా వేయఁబడినది.

తొమ్మిదవ శ్లోకమునకు వ్యాఖ్య : వారిలో కొందఱు స్వర్గప్రాపకమైన కర్మలయొక్క అంతమునందు తమ తమ అంశిదేవతలతో తాదాత్మ్యమును పొందుటకు యోగ్యులైనవారిని, యోగజమైన దృష్టితో చూచుచు "వినుము" అని మొదలుపెట్టి, పరిగణించుచున్నాఁడు. ఇట్లనుటవలన స్వర్గమును పొందినవారు కూడ ఇతరులు కొందఱు మరల (అక్కడ నుండి) జారుచున్నారు (అని వ్యక్తమగుచున్నది). వీరు మాత్రము ఉత్తరోత్తరముగా ఊర్ధ్వమూర్ధ్వముగా క్రమముగా గమనమును పొంది తుదకు బ్రహ్మదేవునితో కూడ ముక్తులగుచున్నారు. కావున దేవత్వము పొందుట

కొఱకు యజ్ఞదానతపస్సులు మొదలైనవి కర్తవ్యములే. పైనఁపేర్కొనఁబడిన దోషము కూడ లేదనుట వలన సర్వము నిర్దోషము (అగుచున్నది).

నీలకంఠాచార్యుని వివరణమును పరిశీలించుట అవశ్యకము. "ప్రతివ్యక్తికి కర్మాంతమున ప్రకృతిని పొందుట శక్యము కాదు" అనుచోట ఆయన ప్రకృతి శబ్దమును నిత్యాత్మస్వరూపముగా గ్రహించి, "ప్రతిజంతువు ప్రారబ్ధాంతమున తన ప్రకృతిని పొందునేని అప్పుడు ఎల్లరును ముక్తులగుదురు" అని చెప్పెను. ఇచ్చట ప్రకృతి శబ్దమునకు నిత్యమైన యాత్మస్వరూపము అర్థము కాదు. సందర్భమునుబట్టి ఇచ్చట ఏ దేవతవలన ఏ వ్యక్తి ఉద్భవించెనో ఆ వ్యక్తికి ఆదేవతయే ప్రకృతి అని గ్రహింపవలసియున్నది.

భీష్ముఁడు మొదలగువారు తమ ప్రకృతులైన వసువులు మొదలగువారిలో లీనమగుదురని చెప్పునప్పుడు కూడ నీలకంఠాచార్యుఁడు చెప్పిన కృతహానము అకృతాభ్యాగమము అను దోషములు తప్పవు. మరణించినంతనే భీష్మాదులు తమ ప్రకృతులలో ఐక్యమును పొందినచో, వారు ఈ లోకమునందు కావించిన ధర్మాధర్మకర్మలకు ఫలము ఏమగును ? అది వారిచే అనుభవింపఁబడక ఊరకయే పోవునా ? కృతమనఁగా అనుష్ఠింపఁబడిన కర్మ. హాన మనఁగా వదలుట, తొలఁగిపోవుట, కృతహాన మనఁగా అనుష్ఠింపఁబడిన కర్మ, ఫలము నొసంగకుండ నశించుట. కర్మ ఏదియైనను ఫలమీయకుండ నశించుట అసంభవము. విద్యాభ్యాసము, వాణిజ్యము మొదలగు కర్మలకు ఫలమును అంగీకరించుచు ధర్మాధర్మములకు ఫలము లేదనుట అశాస్త్రీయము. వానికి ఫలము లేకున్నచో, "ఈ కార్యములను చేయవలె, ఈ కార్యములు చేయరాదు" అని చెప్పుచున్న శాస్త్రము లన్నియు వ్యర్థము లగును.

ఇట్లే అకృతాభ్యాగమము మఱియొక దోషము. అకృత మనఁగా చేయఁబడినది. అగమ మనఁగా వచ్చుట ; అభ్యాగమ మనఁగా అభిముఖముగా వచ్చుట. చేయనిదానికి ఫలము వచ్చుట అకృతాభ్యాగమము. విద్యాభ్యాసము చేయనివానికి పాండిత్యము వాణిజ్యము చేయనివానికి దానివలన ధనము లభించుననుట ఇట్టిదే. ఏ

దేవతనుగూర్చియైనను మిగులశ్రద్ధతో ఆరాధింపకుండ ఎవఁడైనను ఆదేవతయందు ఐక్యము నొందునని చెప్పుట అకృతాభ్యాగమమే యగును.

అట్లయినచో "ఏయే యోధుఁడు ఏయే దేవునియొక్క అంశమో అతఁడు స్వర్గమున తన తన యంశ (దేవుని) సాన్నిధ్యము పొందెను" అన్న వాక్యమున కేమియర్థము?

వీరిలో కొందఱు అంశములవలన జన్మింపఁగా మఱికొందఱు ఆ దేవతలే మనుష్యులుగా జన్మించిరి. శాపవశమున ప్రభాసుఁడను వసువు భీష్ముఁడుగా జన్మింపఁగా, యముఁడు విదురుఁడుగా జన్మించెను. శాపవశమున ఆ దేవతలే మనుష్యజన్మము నొందిరని చెప్పవలె, వారి యంశములు జన్మించె నని చెప్పుటకు వీలులేదు. కావున వీరు కారాగార శిక్ష పొందినవారి వలె, ఆ శిక్షాకాలము పూర్తియైనంతనే తమస్థానములకు యథాపూర్వముగా చేరుదురు. ప్రభాసుఁడను వసువు శాపవశమున భీష్ముఁడుగా జన్మించి, శాపాంతమున ఆశరీరమును వదలి యథాపూర్వముగ ప్రభాసుఁడయ్యెను. ఈ సందర్భమున సాన్నిధ్యము, సాలోక్యము, ఐక్యము మొదలగు భావములకు ప్రసక్తి లేదు. అట్లయిన భీష్మశరీరముతో ఆయన గావించిన ధర్మాధర్మకృత్యములకు ఫలమును ఆయన అనుభవించెనా, లేదా ? ద్రౌపదీపరిభవమును చూచి సహించుట మొదలుగా తనవలన సంభవించిన దోషములకు ఆయన శరతల్పమున బుద్ధిపూర్వకముగా వ్యథననుభవించి ప్రాయశ్చిత్తముఁ గావించుకొనెను. అట్లే ఆయన యుధిష్ఠిరాదులతో కొంతకాలము వీరస్వర్గమునందుండి, తాను గావించిన యజ్ఞదానాదుల పుణ్యఫలము ననుభవించి తరువాత యథాపూర్వముగ వసుపదమున నెలకొనియుండును. కావున అట్టివారు మనుష్యశరీరమువలన సంభవించిన ధర్మాధర్మకృత్యములయొక్క ఫలముల ననుభవించిన తరువాతనే పూర్వస్థితిని పొందుదురనుట స్పష్టము.

అర్జునాదులు ఇట్టివారు కాదు. ఇంద్రుఁడు స్వయముగా మనుష్యజన్మమును పొందలేదు. ఆయన తేజములోని యొకయంశమువలన, తండ్రివలన కుమారునివలె, అర్జునుఁడు జన్మించెను. నరుఁడనుమహర్షి అర్జునుఁడుగా జన్మించెననియు

మహాభారతమున ప్రసిద్ధముగా నున్నది. నారాయణ మహర్షి విష్ణు పదవినొంది తనయంశభాగముచే వసుదేవు నావేశించి శ్రీకృష్ణుడుగా జన్మించినతరువాత, ఆయనకు మిత్రుడైన నరుడను మహర్షి ఇంద్రునావేశించి అర్జునుడుగా జన్మించెనని గ్రహింపవలసియున్నది. భీమాదులు నరకమునందుండగా యుధిష్ఠిరుడు చూచెనని, అప్పుడు ఆయన వ్యథ నొంది ద్రోణునివిషయమున చెప్పిన యసత్యమునకు ఫలమనుభవించెనని చెప్పఁబడియున్నది. దీనినిబట్టి యంశములవలన జన్మించినవారు మనుష్యశరీరములతో తాము కావించిన ధర్మాధర్మకార్యములయొక్క పుణ్యాపాపఫలములను పూర్తిగా అనుభవించిన తరువాతనే తమకు ప్రకృతులైన దేవతలయందు లీనమైరనుట స్పష్టము. కావున ఎవనికైనను ఈలోకమున గాని పరలోకమునగాని కర్మలయొక్క ఫలము అనుభవింపక తప్పదని గ్రహింపవలసియున్నది. ఈ యభిప్రాయముతోనే వైశంపాయనుఁడు కర్మలయొక్క అంతమున వానిఫలము అనుభవింపకుండ తమకు ప్రకృతులైన దేవతలను పొందుట శక్యము కాదు (న శక్యతే) అని చెప్పెను.

ద్రోణుఁడు బృహస్పతిని చేరెనని ఇచ్చట నున్నది. కాని ఆయన బ్రహ్మలోకమున కరిగెనని తన్నిర్యాణసందర్భమున చెప్పఁబడియున్నది. ఇది పరస్పర విరుద్ధము కాదా ? కాదు. ఆయన ముందుగా జనకుఁడైన బృహస్పతియొద్దకు పోయి, ఆయనతో కూడ కొంతకాలము ఉండి యజ్ఞదానాదికముల వలన కలిగిన పుణ్యమును స్వర్గభోగరూపమున అనుభవించి పిమ్మట బ్రహ్మలోకమున కరిగెనని గ్రహింపవలసియున్నది. అంటుత్రొక్కగా వచ్చిన వృక్షమునకు మూలవృక్షమునకు భిన్నముగా స్వతంత్రముగా వికాసము కలిగినట్లు, తండ్రియొక్క అభ్యుదయ నిశ్శ్రేయసములకంటె కుమారుని యభ్యుదయనిశ్శ్రేయసములు భిన్నములుగా సిద్ధించునట్లు, బృహస్పతి దేవగురువుగా అధికారపదవియందు అట్లేయుండఁగా, పుత్రుఁడైన ద్రోణుఁడు సత్యవ్రతపాలనమువలన, బ్రహ్మోపాసనమువలన బ్రహ్మలోకమునకు చేరెనని గ్రహింపఁదగును.

# సాత్త్వత కాండము

## I. పరమార్థ కలశము

## 1. తత్త్వోపదేశ కమండలువు

### (i) ఆదేశచమసము

ద్వారకయందు ఉత్పాతములు సంభవించుటను చూచి శ్రీకృష్ణుఁడు యదువృద్ధులను పిలిచి, "అనేకములైన యుత్పాతములు సంభవించుచున్నవి ; కావున మనము పుణ్యప్రదమైన ప్రభాసక్షేత్రమునకు పోయి స్నానములు దేవపితృతర్పణములు చేయుదము" అని చెప్పెను.

అప్పుడు శ్రీకృష్ణుఁడు ఈలోకమును వదలిపోఁదలచుకొన్నాఁడని ఉద్ధవుఁడు గ్రహించి ఏకాంతమునందు ఆయనను కలిసికొని "కృష్ణా ! నీవు ఈ లోకమును వీడిపోవఁదలఁచుకొన్నచో నన్ను కూడ నీతో తీసికొనిపొమ్ము" అని యర్థించెను. ఉద్ధవుడు వసుదేవుని తమ్ముఁడైన దేవభాగుని కొడుకు ; శ్రీకృష్ణునికంటె చిన్నవాఁడై యుండవచ్చును.

శ్రీకృష్ణుఁ డిట్లనెను. "బ్రహ్మదేవుఁడు అర్థింపఁగా నేను అంశముచేత అవతరించితిని. ఆయన కోరినదేవకార్యము పూర్తిగా నిర్వహింపఁబడినది. ఈ యాదవకులము శాపముచేత నిర్దగ్ధమైయున్నది. వీరు అన్యోన్యవైరములతో పోరాడి నశింతురు. తరువాత ఏడవదినమున సముద్రుఁడు ఈ పురమును ముంచివేయును. నాచేత పరిత్యక్తమైన యీ భూమియందు నీవు ఉండరాదు. అయ్యా ! కలియుగమునందు జనులు అధర్మమునందు రుచికలవా రగుదురు.

నీవు మాత్రము ఈ ప్రదేశమును వీడి స్వజనుల యందు బంధువులయందు స్నేహమును పూర్తిగా పరిత్యజించి నాయందు మనస్సును చక్కఁగా ఉంచి సర్వభూతములయందు సమదృష్టికలవాఁడవై భూతలమున చరించుచుండుము.

వాక్కుచేత కన్నులచేత శ్రవణాదులచేత మనస్సుచేత గ్రహింపఁబడునది యంతయు నశించునదియని మాయామనోమయ మని తెలిసికొనుము. యోగయుక్తుఁడు కానివానికి జగద్రూపముగా వివిధ పదార్థములు ఉన్నట్లు భ్రమకలుగుచుండును. ఆ భ్రమ పదార్థములయందు గుణదోషములను స్ఫురింపఁజేయును. గుణదోషబుద్ధివలన కర్మ అకర్మ వికర్మ అను భిన్నభావములు స్ఫురించును. కావున ఇంద్రియములను చిత్తమును నియమించి నీయందే జగత్తు విస్తృతమై యున్నదని, నీ స్వరూపము అధీశ్వరుఁడనైన నాయందున్నదని చూడుము. జ్ఞానవిజ్ఞానములచేత దేహధారులకు ఆత్మస్వరూపుఁడవై ఆయాత్మానుభవముచేత సంతుష్టుఁడవై అంతరాయములచేత కష్టముల నొందవు. గుణదోషములకు అతీతుఁడవై నిషేధములను పాటించుచునేయుందువు ; కాని దోషబుద్ధివలన కాదు ; అట్లే విహితకృత్యములను ఆచరించుచునే యుందువు ; కాని గుణబుద్ధివలన కాదు. పసిపిల్లవాఁడు మంచిపని చేసినప్పుడు అందు గుణమున్నదని కాని, చెడుపనిని మానుకొనినప్పుడు, అందు దోషమున్నదని కాని ఎట్లు ఎఱుంగడో అట్లే నీవు కూడ గుణదోషములకు అతీతుఁడవై వర్తింతువు. జ్ఞానవిజ్ఞానములయందు నిశ్చయము కలవాఁడవై విశ్వమును నాస్వరూపముగా చూచుచు సర్వభూతములకు సుహృత్తువై శాంతుఁడవై మరల విపత్తును పొందవు".

శ్లో॥ మయా నిష్పాదితం హ్యత్ర దేవకార్య మశేషతః ।
యదర్థ మవతీర్ణోఽహ మంశేన బ్రహ్మణార్థితః ॥ 2

శ్లో॥ కులం వై శాపనిర్దగ్ధం నంక్ష్య త్యన్యోన్య విగ్రహాత్ ।
సముద్ర స్సప్తమేఽహ్న్యేనాం పురీం సంప్లావయిష్యతి ॥ 3

శ్లో॥ న వస్తవ్యం త్వయై వేహ మయా త్యక్తే మహీతలే ।
జనోఽభద్రరుచి ర్భద్ర భవిష్యతి కలౌ యుగే ॥ 5

శ్లో॥ త్వం తు సర్వం పరిత్యజ్య స్నేహం స్వజనబంధుషు ।
మ య్యావేశ్య మనః సమ్యక్ సమదృగ్విచరస్వ గామ్ ॥ 6

శ్లో|| య దిదం మనసా వాచా చక్షుర్భ్యాం శ్రవణాదిభిః |
నశ్వరం గృహ్యమాణం చ విద్ధి మాయామనోమయమ్ || 7

శ్లో|| పుంసోఽయుక్తస్య నానార్థో భ్రమః స గుణదోషభాక్ |
కర్మాకర్మవికర్మేతి గుణదోషధియో భిదా || 8

శ్లో|| తస్మా ద్యుక్తేంద్రియ గ్రామో యుక్త చిత్త ఇదం జగత్ |
ఆత్మ నీక్షస్వ వితత మాత్మానం మయ్యధీశ్వరే || 9

శ్లో|| జ్ఞానవిజ్ఞాన సంయుక్త ఆత్మభూత శ్శరీరిణామ్|
ఆత్మానుభవతుష్టాత్మా నాంతరాయై ర్విహన్యసే || 10

శ్లో|| దోషబు ద్ధ్యోభయాతీతో నిషేధా న్న నివర్తతే |
గుణబుద్ధ్యా చ విహితం న కరోతి యథార్భకః || 11

శ్లో|| సర్వభూతసుహృ చ్ఛాంతో జ్ఞానవిజ్ఞాననిశ్చయః |
పశ్యన్ మదాత్మకం విశ్వం న విపద్యేత వై పునః || 12

స్కంధ. 11 అధ్యాయ - 7

"నీవు మాత్రము ఈ ప్రదేశమును వీడి" పొమ్ము అని భగవానుఁడు చెప్పుటవలన ఉద్ధవుఁడు ద్వారకా ప్రాంతమును యదువులరాజ్యమును వీడిపోయినచో మునులశాపము ఆయనపై ప్రసరింపదని ఆవిధముగా ఆయన మరణమును తప్పించుకోవలె ననుట భగవంతుని యభిప్రాయమని వ్యక్తమగుచున్నది.

ఇంద్రియములచేత మనస్సుచేత గ్రహింపఁబడుచున్నదాని నంతను మాయామనోమయముగా గ్రహింపవలయునని భగవంతుఁ డుపదేశించుచున్నాఁడు. ఇంద్రియములచేత గ్రహింపఁబడునది మనస్సుచేత స్వీకరింపఁబడినప్పుడే మనకు ఆవిషయము భాసించును. మనస్సు ఏ యింద్రియముతో కూడియుండదో ఆయింద్రియమువలన మనకు విషయమేదియు భాసింపదు. మనము గాఢమైన యాసక్తితో ఏదేని దృశ్యమును చూచుచున్నప్పుడు, ప్రక్కనున్నవాఁడు ఏదేని మాట

చెప్పినచో అది వినఁబడదు. అసమయమున చక్షురింద్రియమునందు మగ్నమైయున్న మనస్సు శ్రవణేంద్రియముతో సంబంధమును పొందలేదన్నమాట. కావున ఇంద్రియములచేత గ్రహింపఁబడుచున్న విషయములు మనస్సునందు ప్రతిబింబించినప్పుడే మన వ్యవహారమున జగత్తు భాసించుచున్నది. నిద్రలో మనస్సు పనిచేయనప్పుడు భాసింపక, మేల్కొన్న తరువాత మనస్సు పనిచేయుచున్నప్పుడే భాసించుచున్న జగత్తు మనోమయ మనుట స్పష్టము.

"మాయామనస్సు" అని భగవానుఁడు మనస్సుయొక్క స్వరూపమును నిర్దేశించినాఁడు. మనస్సు మాయామయము. మాయ అనఁగానేమి ? అయథార్థములు యథార్థములుగా భాసించుటయే మాయ. దుర్జనుఁడు వినయమును ప్రకటించుచున్నప్పుడు అయథార్థమైన వానివినయమును మాయయని చెప్పుచున్నాము. కాని దిక్కులు కాలము లెక్కలు మొదలుగా వ్యవహారమంతయు అయథార్థమే. దిక్కులు యథార్థముగా సృష్టియందు సహజముగా లేవు. సూర్యుఁడు యథార్థముగా ఉదయించుట లేదని, అస్తమించుట లేదనియు అందఱకు తెలియును. కాని సూర్యుఁడు ఉదయించుచున్నట్లుగా కన్పించుచున్న వైపును తూర్పు దిక్కని, అస్తమించుచున్నట్లుగా కన్పించుచున్న వైపును పడమటి దిక్కని చెప్పుచున్నాము. కాలమునకు మనభావనయే తప్ప వేఱుగా రూపము లేదు. కావున దానియందు విభాగములు లేవు. అయినప్పటికి జరిగిన దానిని భూతమని, జరుగుచున్న దానిని వర్తమానమని, జరుగబోవు దానిని భవిష్యత్తు అని పేర్కొనుచున్నాము. వస్తువుల పరిగణనము కూడ ఇట్టిదే. సృష్టిలో వస్తువులన్నియు ఒక్కొక్కటిగానే యుండును. కాని మనము మనుష్యులు వరుసగా ఉన్నప్పుడు దగ్గరగా ఉన్న వాఁడు మొదటివాఁడని, వానిప్రక్కన ఉన్నవాఁడు రెండవ వాఁడని ఈ విధముగా లెక్కపెంచుకొని పోవుచున్నాము. సహజముగా ఎవఁడును మొదటివాఁడు, రెండవవాఁడు, మూడవవాఁడు కాఁడు. కావున ఈ వ్యవహారమంతయు మన యపేక్షాబుద్ధిపై (sense of relativity) ఆధారపడియున్నదే కాని సహజము కాదు యథార్థమును కాదు (neither natural nor real). ఇట్లు అయథార్థమైన దానిని యథార్థముగా గ్రహింపఁజేయుచున్నది మనస్సే. కావున మనస్సు మాయామయము.

యోగయుక్తుఁడు కాని వానికి జగత్తునందు నానార్థభ్రమ కలుగుచున్నది. భ్రమ అనగా లేనిది ఉన్నట్లుగా గాని, ఒక పదార్థము దానికంటె భిన్నమైన మఱియొకపదార్థముగా గానితోఁచుట. స్వప్నమునందు ఒక్క మనస్సు మాత్రమే యుండఁగా దానియందు అనేక పదార్థములు సంఘటనములు తోఁచుట భ్రమయే. అట్లే జాగ్రదవస్థయందు కూడ ఒక్క పరమాత్మయే యుండఁగా (ఏక మేవాద్వితీయం బ్రహ్మ) దానియందు నానాపదార్థరూపముగా జగత్తు గోచరించుట భ్రమయే. నగలను కొనుచున్నవారికి అవి నానారూపములు గల వివిధ వస్తువులుగా వ్యామోహమును కలిగించుచున్నను, వర్తకునకు అన్నింటియందును బంగారమే ప్రధానముగా గోచరించుచుండును. బంగారమునందు వివిధ పదార్థములను చూచువారికి ఒక్కొక్క వస్తువునందు కొన్ని గుణములు కొన్ని దోషములు కన్పించుచుండును. వివిధవ్యక్తులలో వివిధ సంఘటనములలో గుణదోషములు తోఁచుచున్నప్పుడు అప్పుడు ఏది కర్మ, ఏది అకర్మ, ఏది వికర్మ అను సందేహములు కలుగను. శాస్త్రవిహితమైనది కర్మ. దానిని చేయకుండుట లేక అందులోపము కలుగుట అకర్మ. నిషిద్ధమైనది వికర్మ. ఈ కర్మాచరణకు ఫలముగా సంసారమేర్పడుచున్నది.

యోగికి సంసార మేర్పడదు. యోగమనఁగా ఇంద్రియములను నిగ్రహించి, అద్దము నందు ప్రతిబింబములవలె, ఆత్మయందే జగత్తు ప్రతిబింబించుచున్నదను నిశ్చయముతో చిత్తమును ఆత్మయందు నిలుపుట. జ్ఞానవిజ్ఞానములు కలవానికి అభ్యాసము యొక్క బలముచేత చిత్తము ఆత్మయందు నిలుచును. "జగత్తు మిథ్య ; బ్రహ్మమే సత్యము" అని బోధించుటయే వేదములయొక్క తాత్పర్య మని దృఢముగా గ్రహించుట జ్ఞానము. నిద్రలోని యనుభవమును విమర్శించి గ్రహించుచు గాఢ సమాధియందు కేవలమైన యాత్మయందు లీనమగుట విజ్ఞానము.

ఇట్టియోగి తనయందున్న యాత్మయే సకల భూతములయందు ఉన్నదని సంతుష్టుఁడైనప్పుడు అంతరాయములచేత విఘ్నముల నొందఁడు. పరోక్షజ్ఞానము కలవాఁడు విహితములైన యజ్ఞాదికర్మలను చేయకున్నచో దేవతలు కోపముతో వానికి యోగసాధనమునందు అంతరాయములను అనఁగా విఘ్నములను

కలిగింపఁగలరు. కావున అపరోక్షజ్ఞానము కలుగువఱకు యోగిస్వధర్మ విహితకర్మలను ఫలాభిసంధిరహితముగా చేయుచునే యుండవలె. అపరోక్షజ్ఞానముతో (Direct knowledge and experience) సర్వభూతములకు అంతరాత్మయైయున్నవానికి, అతఁడు తమకు కూడ అంతరాత్మయే యగుటచే, దేవతలు ఎట్టి విఘ్నములను కలిగింపలేరు.

అట్టి జ్ఞాని పూర్వసంస్కారముల ననుసరించి విహితములైన కర్మలను చేయుచుండవచ్చును. కాని అవి గుణవంతములైన కర్మలు అను గుర్తింపుతో ఆలోచనతో చేయఁడు. సజ్జనునకు ఇతరునకు ఆహ్లాద్యమును కలిగించుచు మాటాడుట, మర్యాదతో వర్తించుట ఎట్లు సహజముగా సంభవించునో అట్లే యోగికి కూడ విహితకర్మాచరణము సహజముగానే సంభవించును. అట్లే నిషిద్ధకర్మలను కూడ అతఁడు సహజముగనే (instinctively) మానుకొనును. అర్భకుఁడు మంచిపని చేసినప్పుడు గాని, చెడ్డపనిని చేయనప్పుడు గాని, వానికి పదార్థములయందు గుణదోషవివేచనము ఎట్లుండదో అట్లే అవధూత కూడ ఏపనిని చేసినను పూర్వసంస్కారవశముననే చేయును గాని జగత్తులోని వివిధపదార్థములను, వానియందలి గుణదోషభేదములను గుర్తింపఁడు. అట్లు జగత్తునందు ఈశ్వరునే చూచుచున్నవానికి మరల విపత్తి కలుగదు ; అనగా సంసారము కలుగదు.

## (ii) ప్రపత్తి చమసము

భగవానుని యాదేశమును విని ఉద్ధవుఁడు నిర్విణ్ణుఁడై ఇట్లు ప్రార్థించెను. "యోగేశ్వరా ! నా నిశ్శ్రేయసము కొఱకు నీవు సన్న్యాసలక్షణమైన త్యాగమును చెప్పితివి. భోగవిషయపరులకు నీయందు భక్తిలేని వారికి కోరికలను త్యజించుట దుష్కరము. పుత్త్రమిత్త్రాదుల యనుబంధములతో కూడిన యీ శరీరమునందు "ఈ శరీరమే నేను, ఈ సంసార మంతయు నాది" అని గాఢమైన భావనచేత విమూఢుఁడనై యున్నాను. నేను నీ భృత్యుఁడను. నీవు చెప్పిన పరమార్థమును నేను చక్కఁగా ఎట్లు సాధింపగలనో ఆవిధానమును చెప్పి ఇట్లు చేయుమని శాసింపుము. సత్యమైన యాత్మతత్త్వమును నాకు బోధించుటకు తగినవాఁడు

పండితులలో గాని దేవతలలోగాని ఎవఁడును కన్పించుటలేదు. శరీరధారులైన బ్రహ్మాదిదేవత లందఱు నీమాయచేత మోహితులై వెలుపలనున్న పదార్థములను వాస్తవములనుగా భావించుచున్నారు. కావున సర్వజ్ఞుఁడవు పరమేశ్వరుఁడవు నారాయణుఁడవు నరునకు సఖుఁడవు అయిన నిన్ను, స్పష్టముగా దుఃఖములచేత తప్తుఁడనై నిర్విణ్ణుఁడనైయున్న నేను శరణమును పొందుచున్నాను.

శ్లో॥ యోగేశ ! యోగవిన్యాస ! యోగాత్మన్ ! యోగసంభవ ! |
నిశ్శ్రేయసాయ మే ప్రోక్తః త్యాగ సన్న్యాసలక్షణః ॥ 14

శ్లో॥ త్యాగోఽయం దుష్కరో భూమన్ కామానాం విషయాత్మభిః |
సుతరాం త్వయి సర్వాత్మ న్న భక్తై రితి మే మతిః ॥ 15

శ్లో॥ సోఽహం మమాహ మితి మూఢమతి ర్విగాఢః
త్వన్మాయయా విరచితాత్మని సానుబంధే |
త త్త్వంజసా నిగదితం భవతా యథాహం
సంసాధయామి భగవ న్ననుశాధి భృత్యమ్ ॥ 16

శ్లో॥ సత్యస్య తే స్వదృశ ఆత్మన ఆత్మనోఽన్యం
వక్తార మీశ విబుధేష్వపి నానుచక్షే |
సర్వే విమోహితధియ స్తవమాయ యేమే
బ్రహ్మాదయ స్తనుభృతో బహిరర్థభావాః ॥ 17

శ్లో॥ తస్మా ద్భవంత మనవద్య మనంతపారం
సర్వజ్ఞ మీశ్వర మకుంఠ వికుంఠధిష్ణ్యమ్ |
నిర్విణ్ణధీ రహ ముహవృజినాభితప్తో
నారాయణం నరసఖం శరణం ప్రపద్యే ॥ 18

శ్రీధరీయము - ఉహ స్ఫుటం - నిర్వేదే హేతుః వృజినైః | దుఃఖై రభితప్తః - హకార గౌరవాయ వృకారో యుక్త ఇవ పఠనీయః ......

స్కంధము - 11 - అధ్యాయము - 7

భగవానుఁడు ఇట్లు చెప్పెను. "సాధారణముగా లోకమునందు లోకతత్త్వ విచక్షణులైన మునులు తమ బుద్ధిచేతనే తమ్ము విషయవాసనలనుండి సముద్ధరించు కొనుచున్నారు. ముఖ్యముగా పురుషునకు ఆత్మయే గురువు. అతఁడు ప్రత్యక్షముచేత అనుమాన ప్రమాణముచేత శ్రేయస్సును పొందుచున్నాఁడు. సాంఖ్యయోగ విశారదులై ధీరులైనవారు పురుషజన్మము నందే నన్ను విశదముగా సర్వశక్తి సమన్వితునిగా చూచుచున్నారు. ఒకపాదము రెండుపాదములు మూఁడుపాదములు నాలుగుపాదములు బహుపాదములు గలగిన జంతువులు, పాదములు లేనివి ఎన్నో సృష్టింపఁబడుచున్నవి. వానియందు పురుషునితనువే నాకు ప్రియము. ఈ శరీరమునందు జీవులు ఈశ్వరుఁడనై అగ్రాహ్యుఁడనై యున్న నన్ను బుద్ధి మొదలగు గుణములను హేతువులనుగా గైకొని సాక్షాత్తుగా అనుమాన ప్రమాణము ననుసరించి వెదకుచున్నారు".

శ్లో॥ ప్రాయేణ మునయో లోకే లోకతత్త్వవిచక్షణాః ।
సముద్ధరంతి హ్యాత్మాన మాత్మనై వాశుభాశయాత్ ॥ 19

శ్లో॥ ఆత్మనో గురు రాత్మైవ పురుషస్య విశేషతః ।
యత్ప్రత్యక్షానుమానాభ్యాం శ్రేయోఽసా వనువిందతే ॥ 20

శ్లో॥ పురుషత్వే చ మాం ధీరా స్సాంఖ్యయోగవిశారదాః ।
ఆవిస్తరం ప్రపశ్యన్తి సర్వశక్త్యుపబృంహితమ్ ॥ 21

శ్లో॥ ఏకద్విత్రిచతుష్పాదో బహుపాద స్తథాపదః ।
బహ్వ్యః సన్తి పురః సృష్టా స్తాసాం మే పౌరుషీ ప్రియా ॥ 22

శ్లో॥ అత్ర మాం మృగయం త్యద్ధా యుక్తా హేతుభి రీశ్వరమ్ ।
గృహ్యమాణై ర్గుణై ర్లింగై రగ్రాహ్య మనుమానతః ॥ 23

స్కంధము - 11 - అధ్యాయ - 7

దానమునందు త్యాగము కలదు. కష్టపడి సంపాదించిన ధనములను పరులకొఱకు ఇచ్చుట త్యాగమే. అంతకంటెను వానప్రస్థమునందు గృహపుత్ర మిత్రాదులను త్యజించుట కష్టతరము. ఇచ్చట భగవంతుఁడు చెప్పుచున్న త్యాగము

సన్న్యాసలక్షణమైనది. ఇది కష్టతమము. ఇందు భగవానుఁడు సంపదలను భార్యాపుత్త్రాదులనే కాక వానియందలి యనురాగమును త్యజింపుమని చెప్పుచున్నాఁడు. అనగా హృషీకేశమునకో బదరికాశ్రమమునకో పోయిన తరువాత పుత్త్రమిత్రాదులను ఎవ్వరిని స్మరింపరాదన్నమాట.

ఇట్టి త్యాగమును గావించుటకు తనయందు దేహాభిమానము అహంకార మమకారములు ఎంత ప్రతిబంధకములుగా నున్నవో గుర్తించి ఉద్ధవుఁడు నిస్సంకోచముగా గురువునకు నివేదించుచున్నాఁడు. తమయందున్న దోషములభారమును, ప్రభావమును తమయశక్తతను గుర్తించుట సామాన్యులకు సాధ్యము కాదు. కావుననే అనేకులు సులభముగ సన్న్యాసమును స్వీకరించి త్వరితముగ దుర్గతుల పాలగుచున్నారు. భగవంతుఁడు అర్జునునకు చెప్పినట్లుగా ఈలోకమును అనిత్యముగా అసుఖముగా గుర్తించియే (అనిత్యమసుఖం లోక మిమం ప్రాప్యభజస్వమామ్) ఉద్ధవుఁడు, "దుఃఖములచేత తప్తుఁడనై నిర్విణ్ణుఁడనైయున్నాను" అని నిస్సంకోచముగా నిర్వేదమును భగవంతునకు నివేదించి ఆయనను శరణము పొందుచున్నాఁడు. ఈలోకము ఏ విధముగనైనను సుఖప్రదముగా తోఁచుచున్నంతవఱకు యథార్థముగ విరక్తి కలుగదని, గాఢమైన విరక్తియున్ననే తప్ప దేహాభిమానము అహంకారమమకారములు తొలఁగవని, అవి తొలఁగిననే గాని సన్న్యాసలక్షణమైన త్యాగము సంభవింపదని స్పష్టమగుచున్నది.

వైద్యునియొద్ద రోగివలె, గురువునొద్ద శిష్యుఁడు అభిమానమును చంపుకొని వినయముతో తనయందున్న యహంకారమమకారాది దోషములను నివేదించుకోవలె. ఇట్టి గురుశుశ్రూషయే అహంకారమమకార త్యాగమునకు ప్రథమము ప్రధానమునైన సాధనమని గుర్తింపవలసియున్నది. ఉద్ధవుఁడు తన్నుగూర్చి భృత్యునిగా చెప్పుకొనుట గుర్తింపఁదగిఉన్నది.

భగవంతుని ఉద్ధవుఁడు "నరసఖమ్" అని పేర్కొనుట సాభిప్రాయముగా నున్నది. నరుఁడనగా అర్జునుఁడని, మనుష్యుఁడని రెండు అర్థములు కలవు. ఆయన అర్జునునకు ఎట్లు తత్త్వము నుపదేశించెనో అట్లే తనకు కూడ ఉపదేశింపవలె

ననుట ఒక యభిప్రాయము. భక్తుఁడైన సామాన్యనరునకు గురువు లభింపక, దిక్కులేని పరిస్థితి ఏర్పడినప్పుడు భగవంతుఁడే, సఖునివలె స్వయముగా గాని లేక గురువును చూపించిగాని సంసారమునుండి ఉద్ధరింపవలయు ననుట మఱియొక యభిప్రాయము.

"ముఖ్యముగా పురుషునకు ఆత్మయే గురువు" అని భగవానుఁడు చెప్పుట గమనింపఁదగియున్నది. ఈవాక్యము ననుసరించి ఎవఁడైనను బుద్ధిశాలియైన వాఁడు గురుశుశ్రూష కావింపక సొంత బుద్ధితో ఆత్మతత్త్వమును విచారించి గ్రహింపవచ్చునని భగవంతుఁడు చెప్పినట్లు భావింపవచ్చునా ? సంసారమునుండి నిర్వేదమును పొందినవాఁడు గురువు నొద్దకే పోవలయును "సగురు మే వాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అని వేదము విధించుచున్నది భగవానుఁడు కూడ, "తత్త్వదర్శనులైన జ్ఞానులు నీకు జ్ఞానమును ఉపదేశింపఁగలరు" అని అర్జునునకు చెప్పియుండెను. మఱిపై వాక్యము ఈ వాక్యములకు విరుద్ధము కాదా ? కాదు. ఈవాక్యముయొక్క సందర్భమును పరిశీలించినచో ఈవిరోధము పరిహృత మగును.

భగవానుఁడు ఈలోకమును విడిచిపెట్టి పోవుదునని చెప్పుచున్నాఁడు. "నీవు తప్ప తత్త్వమును బోధింపఁగలవాఁడు బ్రహ్మాదిదేవతలలో కూడ ఎవఁడును లేఁడు ; నిన్ను శరణుపొందుచున్నాను ; నేను సంసారము నుండి ఎట్లు ఉద్ధరింపఁబడుదునో అట్లు బోధింపుము" అని ఉద్ధవుఁడు ప్రార్థించుచున్నాఁడు. ఉద్ధవుఁడు చెప్పినట్లు భగవానునివలె తత్త్వమును బోధింపఁగలవాఁడు మఱియొకఁడు లభించుట దుర్ఘటమే ; కాని కేవలము అసంభవము కాదు. శ్రీకృష్ణుఁడు ఉద్ధవుని బదరికాశ్రమమునకు పొమ్మని చెప్పఁబోవుచున్నాఁడు. అక్కడ కాని ఇతరాశ్రమములలో కాని వ్యాసనారద మైత్రేయశుకాది మహర్షుల వంటివారు ఉండరని చెప్పుటకు వీలులేదు. తన్ను విడిపోయినంతనె ఉద్ధవునకు సందేహము కలిగినచో వేఱొకనిని ఆశ్రయించుటకు ఇష్టము కలుగక పోవచ్చును. అట్టియెడల, ఒకసారి విన్న తత్త్వమునుగూర్చి మననము చేసికొనినపుడు లోకతత్త్వ విచక్షణులైనవారు తమబుద్ధినే అవలంబించి సందేహములను నివారించుకొనుచు నిశ్చయమును పొందవచ్చునని

భగవానుఁడు ఉద్ధవునకు ధైర్యమును కలిగించుచున్నాఁడు. ఒక గురువును ఆశ్రయించి వారి బోధవలన సంతృప్తిని సంతోషమును పొందువారికి అనేకులకు మఱియొకనిని గురువునుగా ఆశ్రయించుటకు మనస్సు ఒప్పకుండుట సహజము. అట్టియెడల మేధావియైనవాఁడు తనబుద్ధినే గురువునుగా లోకతత్త్వమును పరిశీలించుచు ప్రత్యక్షముచేత అనుమాన ప్రమాణము చేతే అనేక విషయములను గ్రహింపవచ్చునని భగవానుఁడు బోధించుచున్నాఁడు. ఈకారణముచేతనే ఆయన, శ్రద్ధ పరిశీలనదక్షత ఆలోచనపటిమ కలవాఁడు పృథివి మొదలగు పదార్థములవలన కూడ అనేకధర్మములను తత్త్వజ్ఞలక్షణములను గ్రహింపఁగలఁడని అవధూతవృత్తాంతమును చెప్పఁబోవుచున్నాఁడు. ఆయన ఇరువది నలువురను గురువులనుగా స్వీకరించినాఁడు. కాని వారియొద్ద ఆయన శుశ్రూషచేయలేదు ; వారు బోధింపలేదు. అట్లయినచో గురుశుశ్రూషాపూర్వకమైన యుపదేశము లేకయే కేవలము తన లోకతత్త్వపరిశీలన దక్షతచేతనే ఆత్మతత్త్వమును గ్రహించెనని చెప్పవచ్చునా ?"

"సాధారణముగా లోకమునందు లోకతత్త్వవిచక్షణులైన మునులు తమబుద్ధిచేతనే తమ్ము విషయవాసనలనుండి సముద్ధరించుకొనుచున్నారు" అని భగవంతుఁడు చెప్పినవాక్యము నిశితముగా పరిశీలింపఁదగియున్నది. తత్త్వమును విన్నంతనే విషయవాసనలు పోవు. గురువువలన ఉపదేశమును పొందినవారు దానిని మననము చేసికొనుచు విషయవాసనలనుండి దూరమగుటకు తామే యత్నింపవలె. ఈ ప్రయత్నకాలమున గురువు సన్నిహితుఁడై యుండకపోవచ్చు ; ఒకవేళ ఉండినను ఆయన కొంతవఱకె శిష్యునకు సాయము చేయగలఁడు ; ఎక్కువభాగము శిష్యుఁడు స్వయంకృషితోనే ముందునకు పోవలసియుండును. అప్పుడు వానికి వానిబుద్ధియే గురువగుట సంభవించును.

ఇట్లుగాక కొందఱు, జడభరతునివలె ఈ జన్మమున గురుశుశ్రూష, ఉపదేశము లేకయే స్వయముగా జ్ఞానమును పొందవచ్చును. ఏదియు నిర్నిమిత్తముగా సంభవింపదు కావున, అట్టివారు పూర్వజన్మమునందు గురుశుశ్రూష చేసి ఉపదేశమును పొంది ఆ సంస్కారముయొక్క బలముచేత ఈ జన్మమున తత్త్వస్ఫురణమును పొందినారని గ్రహింపవలసి యుండును. కావున ఈ వాక్యమునందు, ముందు

గురుశుశ్రూష గావించి తరువాత మననము చేసికొనువారు ప్రధానముగా ఉద్దేశింపఁబడినారని, కొలఁదిమంది మాత్రమే జన్మసిద్ధజ్ఞానులు సూచింపఁబడినారని గ్రహింపవలసియున్నది. అంతే కాని ఈవాక్యము చేత మేధావులైనవారు గురుశుశ్రూష లేకుండ సొంతబుద్ధితో ఆత్మతత్త్వమును గ్రహింపవచ్చునని భగవంతుఁడు చెప్పినట్లుగా తలంపరాదు. గురుశుశ్రూష లేనివానికి అహంకారము దురభిమానము పెరుగునే కాని తరుగదు.

గురువువలన తత్త్వమును విన్నవారు ప్రత్యక్షానుమానములచేత విన్నదానిని మననము చేసికొనుచు విశదముగా గ్రహించి శ్రేయస్సును పొందుదురు. అక్షమనఁగా ఇంద్రియము. ఇంద్రియగోచర మగునది ప్రత్యక్షము. చక్షురింద్రియమునకు రూపము, శ్రోత్రేంద్రియమునకు శబ్దము మొదలుగా ఇంద్రియముల మూలమున మనము గ్రహించునది యంతయు ప్రత్యక్షమే. ఈ ప్రత్యక్షజ్ఞానముపై ఆధారపడి ఇంద్రియములకు గోచరము కాకుండ ఉన్న విషయమును ఊహించుట అనుమానము.

"బ్రహ్మమొక్కటియే యున్నది ; రెండవది లేదు" అని పరమప్రమాణమైన వేదము చెప్పుచున్నది. దానిననుసరించి, "ఆత్మయే బ్రహ్మము ; అది తప్ప రెండవది లేదు" అని గురువు ఉపదేశించుచున్నాఁడు. అయినను ఆత్మ గోచరించుట లేదు ; జగత్తు ప్రత్యక్షముగా గోచరించుచున్నది. స్వప్నమునందు కూడ మనస్సు గోచరింపక జగత్తే గోచరించుచున్నది. అప్పుడది సత్యముగానే తోఁచినను మేల్కొన్నంతనే అదియంతయు అసత్యమేయని, లేనిది ఉన్నట్లుగా భాసించుచుండెనని గ్రహించుచున్నాము. అప్పుడు మనస్సు ఒక్కటియే తప్ప రెండవ పదార్థము లేదని, అప్పుడు భాసించుచుండిన జగత్తు యథార్థముగా లేదని నిశ్చయించుకొనుచున్నాము. ఈ నిశ్చయము ఎట్లు కలిగినది ? మనస్సు యొక్క మఱియొకదశను, జాగ్రద్దశను, గ్రహించుచున్నప్పుడు, దానియందు పూర్వదశలో గోచరించిన జగత్తు మిథ్య యనునిశ్చయము కలుగుచున్నది. అట్లే జాగ్రద్దశను దాటి సమాధిదశను పొందినప్పుడు మనస్సు ఆత్మయందు లీనమై జగత్తు గోచరింపనప్పుడు అది మిథ్యయే యని నిశ్చయమేర్పడుచున్నది. అంతేకాదు. దేహేంద్రియమనోబుధ్యాదులతో జాగ్రత్తు గోచరించుచుండిన జగత్తు అనిత్యము

అచేతనము నిరానందమని, ఆత్మ నిత్యము చేతనము ఆనంద మని సమాధియందు తెలియుచున్నది. కావున ఇట్లు ప్రత్యక్షములైన స్వప్నాది దృష్టాంతములను బట్టి జగత్తును మిథ్యగా ఆత్మను సచ్చిదానందమునుగా గ్రహించుట అనుమానము.

రాజ్ఞి ధీమంతులు బుద్ధి మొదలగు గుణములను లింగములనుగా, అనఁగా సూచకములనుగా హేతువులనుగా, గ్రహించి ఇంద్రియములచేత గ్రహించుటకు వీలులేని యాత్మస్వరూపమును బోధపఱచుకొనుచున్నారు. దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి మొదలగునవి జడములు. ఇవి చేతనములవలె వర్తించుచున్నవన్నచో, దీపమునకు లోపల (Bulb) వెలుగు నిచ్చుచున్న విద్యుత్తు (Electricity) ఉన్నట్లు, వీనికి కూడ లోపల చైతన్యమును కలిగించుచున్న చేతనపదార్థము ఉండవలె. అది సకల భూతములయొక్క దేహాదులయందు ఇట్లే చైతన్యమును కలిగించుచున్నది. ఇట్లు సర్వవ్యాపకమైన చేతనమే ఆత్మ. ఈవిధముగా గ్రహించుట కూడ అనుమానమే. ఇంతమాత్రమున ఆత్మ కేవలము అనుమానము చేత గ్రహింపఁబడునని తలంపరాదు.

ఇట్లు ప్రత్యక్షానుమానములచేత ఆత్మస్వరూపమును విశదముగా గ్రహింపగలుగుట పురుషశరీరమునందే సాధ్యమగుచున్నది. పశువులకు ఆకలి, దప్పిక వానిని తీర్చుకొనుటకు కావలసిన పరిజ్ఞానము తప్ప మఱి యేదియు నుండదు. కావున బుద్ధియొక్క ప్రాభవము కలిగిన పురుషజన్మమే శ్రేష్ఠము.

## 2. అవధూత కమండలువు

### (i) పృథివ్యాది చమసము

లోకతత్త్వపరిశీలనలో నిపుణులైన మునులు ఏవిధముగా లోకమువలన పెక్కు విషయములను గ్రహింతురో విశదమొనర్చుటకు శ్రీకృష్ణుఁ డొక యితిహాసమును చెప్పెను.

యదువు ఒకచోట యువకుఁడైన బ్రాహ్మణుని నిర్భయముగా చరించుచున్న యవధూతను చూచి వినయముతో నమస్కరించి యిట్లనెను. "విప్రవర్యా ! నీవు విద్వాంసుఁడవయ్యును బాలునివలె చరించుచున్నావు. మిగుల నిపుణమైన

యీయకర్తృత్వ బుద్ధి ఎట్లు లభించినది ? మానవులు సాధారణముగా ఆయుస్సుయశస్సు సంపదలు మొదలగు వానిని కోరుచు, వానికి సాధనములైన ధర్మార్థకామములనుగూర్చి తెలిసికొనగోరుచుందురు. నీవు పండితుఁడవు సమర్థుఁడవు వాగ్మివి అయ్యును జడునివలె పిచ్చివానివలె పిశాచమువలె దేనియందును అభిలాషను పొందుటలేదు. జనులందఱు కామలోభాగ్నులచే దహింపఁబడుచుండఁగా నీవు గంగాప్రవాహమున నిలిచియున్న యేనుఁగువలె సుఖముగా నున్నావు. విషయభోగములకు దూరుఁడవైన నీవు నీయందే ఎట్లు ఆనందించుచున్నావో చెప్పుము".

ఆ బ్రాహ్మణుఁడు ఇట్లనెను. "రాజా ! నాకు చాలమంది గురువులున్నారు. వారిని నేను నా బుద్ధిచేతనే పరిశీలించి ఎన్నో విషయములను గ్రహించి ముక్తుఁడనై ఇచ్చట తిరుగుచున్నాను. వారిని పేర్కొందును వినుము. పంచభూతములు, చంద్రసూర్యులు, కపోతము, కొండచిలువ, సింధువు, శలభము, తుమ్మెద, ఏనుఁగు, తేనెటీగ, హరిణము, మీనము, పింగళ, కురరము (గ్రద్ద వంటి యొక విధమైన పక్షి), బాలుఁడు, కుమారి, శరములను తయారుచేయువాఁడు, సర్పము, సాలెపురుగు, సుపేశకృత్తు (తుమ్మెద). ఈయిరువది నలువురను గురువులను వలె ఆశ్రయించి పరిశీలించుచు వీరివలన ఎన్నో విషయములను నేర్చుకొంటిని. ఎవరివలన ఏవిషయమును నేర్చుకొంటినో చెప్పెదను. వానిని నీవు గ్రహింపుము.

దైవవశమున గదా చరాచరములైన భూతములు వచ్చి పడుచున్నవని యెఱింగిన ధీరుఁడు వానివలన కలుగుచున్న బాధలను సహించుచు ఆత్మనిష్ఠ నుండి చలింపరాదు. ఈ వ్రతమును నేను భూమివలన నేర్చుకొంటిని. పృథివియందు ప్రముఖములైన పర్వతములను పరిశీలింపుము. అవి పరులకొఱకే కదా వనములను భరించుచు నదులను స్రవింపఁజేయుచున్నవి. సాధువులీపదార్థ పరత్వమును వానివలన గ్రహింపవలె. అట్లే భూమియందు సాధారణములైన వృక్షముల సంగతిఁ జూడుము. తమయొద్దనుండి ఎవరు ఎన్ని కొమ్మలను రెమ్మలను పూలను పండ్లను కోసికొనిపోవుచున్నను అవి వారికి వశమగుచున్నవే కాని వలదనుట లేదు. కావున వానికి శిష్యుఁడై విద్వాంసుఁడు సహనమును నేర్చుకోవలె.

ప్రాణవాయువును పరికింపుము. అది ఆహారమాత్రముననే వర్తించుచున్నది, కాని రూపరసాదులను కోరుటలేదు. అట్లే ముని కూడ ప్రాణము నిలుచుటకొఱకే ఆహారమును స్వీకరింపవలె ; కాని ప్రియములైన పదార్థములను కోరరాదు. ప్రాణమును నిలుపుకొనకున్నచో జ్ఞానయోగ సాధనము భగ్నమగును. కావున అందులకు ఎంత అవశ్యకమో అంతమాత్రమే ఆహారమును గైకొనవలె ; అంతకు మించి రుచిని కోరుచు భుజించినచో వాక్కు మనస్సు అరుచులయందు విక్షేపమును పొందును. వెలుపల చరించుచున్న వాయువు శైత్యము ఉష్ణము మొదలుగా ఎన్నో ధర్మములను పొందుచు ఎక్కడఁ దిరుగుచున్నను వనమునందో దావాగ్నియందో సక్తమై నిలిచిపోవుటలేదు. అట్లే యోగి కూడ విషయములందు ప్రవర్తించుచున్నను వానియందలి గుణములనుండి దోషములనుండి తొలఁగియుండవలయునే కాని వానియందు ఆసక్తుఁడు కారాదు. పుష్పములు మొదలగువానియందు ప్రవేశించినవాయువు సుగంధము మొదలగువానికి ఆశ్రయమైనట్లుగా తోఁచుచున్నను, మఱుక్షణముననే వానిని వీడి స్వరూపముతో చరించుచున్నది. ఆవిధముననే పార్థివములైన శరీరములలో ప్రవేశించినయోగి ఆత్మయందే దృష్టికలవాఁడై ఆయాగుణములతో సంయోగమును పొందుచున్నను, అవి తనస్వరూపము కాదను నిశ్చయముతో నుండవలె.

స్థిరములు చరములునైన సకలపదార్థములయందు వ్యాపించియున్న యాకాశము ఘటములు గృహములు మొదలగువానియందు ఉన్నను, వానిచే పరిమితమగుట లేదు, వానికి అంటుకొనియుండుట లేదు. అట్లే గృహదేహాదుల యందున్న మునితన స్వరూపము వానిచేత పరిమితమగుట లేదని, వానికి అంటుకొనియుండుట లేదని సర్వభూతములయందు వ్యాపించియున్నదని గ్రహింపవలె. వాయువుచేత ప్రేరితములైన మేఘాదులు నీరు విద్యుత్తు మొదలుగా ఎన్ని పదార్థములను తనయందు విజృంభింపఁజేసినను ఆకాశము వాని స్పర్శను కూడ పొందుటలేదు. అట్లే కాలవశమున తనయందు ఎన్ని దేహాదులు వచ్చుచు పోవుచున్నను యోగి వాని స్పర్శను పొందరాదు.

నీరు సహజముగ స్వచ్ఛమై మధురమై తీర్థమై తన్ను దర్శించి స్పృశించి కీర్తించువారిని పవిత్రులను చేయుచున్నది. యోగి కూడ స్వభావముచేత ప్రజలయెడ స్నేహముతో మధురముగ మాటాడుచు తీర్థమువలె తన్ను దర్శించి ప్రణమిల్లి కీర్తించువారిని పవిత్రులను గావింపవలయును.

అగ్నివలె యోగయుక్తుఁడు తపస్సుచేత దీప్యమానుఁడై ఉదరభాజనుఁడై సర్వమును భక్షించువాఁడయ్యును దోషభాజనుఁడు కాఁడు. మఱియును ఒకచోట బూడిదచేత కప్పఁబడిన నిప్పువలె ప్రచ్ఛన్నముగా నుండుచు, మఱియొకచోట ప్రకటముగా నుండి జనులచె ఉపాసింపఁబడుచు వారు నివేదించు పదార్థములను భుజించుచు యోగి వారువేసి యుండిన పాపములను చేయఁబోవుచున్న యశుభములను దహించుచున్నాడు. కట్టెలు మొదలుగా ఇంధనములయందు ప్రవేశించిన యగ్ని, తనకు సహజముగా ఉచ్చత్వ నీచత్వాది భేదములు లేకపోయినను, అయింధనముల ననుసరించి పెద్దదిగా చిన్నదిగా తెల్లగా ఎఱ్ఱగా నీలముగా వివిధవర్ణములతో భాసించుచుండును. అట్లే తత్త్వజ్ఞుఁడు కూడ, స్వరూపముచేత సకల భేదరహితుడయ్యును. ప్రారబ్ధవశమున సంక్రమించుచున్న యున్నతములు నీచములును అయిన దేహములయందు ఆయుపాధుల ననుసరించి అధికుడుగా అధముఁడుగా దేవవిప్రశూద్రపశుపక్ష్యాది వర్తనములతో భాసించుచుండును.

జనులకు అగోచరమైన కాలముయొక్క వర్తనముచేత కళలు హెచ్చుట తగ్గుట చంద్రునియందు కన్పించుచున్నను యథార్థముగా ఆబింబము ఎల్లప్పుడు ఏకరూపముగనే యుండును. అట్లే జన్మము మొదలుకొని శ్మశానాంతములైన దశావికారము లన్నియు దేహములకే సంభవించుచున్నవి, కాని ఆత్మకు సంభవించుట లేదు. అది ఎప్పుడును నిర్వికారమే అని యోగి బావించుచుండవలె.

సూర్యుఁడు కిరణములచేత జలాశయములనుండి నీటిని గైకొని మరల వర్షించుచు, ఆ నీటియందు ఎట్టిసంగమును పొందఁడు. అట్లే ముని కూడ ఇంద్రియములచేత విషయములను స్వీకరించి అర్హులైనవారికి ఆపదార్థముల నొసంగుచు, వానిని సంపాదించితి నని గాని, ఇచ్చుచుంటినని గాని అభిమానమును

పొందరాదు. సూర్యుఁడు ఒక్కఁడే ఘటాదులయందున్న జలములలో ప్రతిబింబించి ఆయుపాధి భేదముల ననుసరించి అనేకరూపములతో భావింపఁబడుచుండును. అట్లే ఆత్మకూడ దేహములైన యుపాధులయందు ప్రవేశించిన దానివలె ఒక్కొక్క యుపాధి ననుసరించి యొక్కొక్కవిధముగా లోకులచే భావింపఁబడుచున్నది. సూర్యుఁడు ప్రతిబింబములకు జలాశయములకు అతీతుఁడుగా ఎల్లప్పుడు ఏకరూపముగా ఉన్నట్లే తన స్వరూపమైన యాత్మకూడ సకలభూతములయందు వ్యాపించియున్నను ఆయుపాధుల కన్నింటికి అతీతముగా ఏకరూపముగా నున్నదని జ్ఞాని భావించుచుండవలె".

"అగ్నివలె యోగయుక్తుఁడు ఉదరభాజనుఁడగును" అనుటను ఇట్లు గ్రహింపవలె. భాజనమనగా పాత్ర. సన్న్యాసి భిక్షావృత్తిచే జీవించును. అప్పు డతఁడు భిక్షాపాత్రను కలిగియుండును. అవధూతకు భిక్షావృత్తి యుండదు. ఆయనకు ఉదరమే పాత్ర. అనగా ఎవరైనను ఆహారము తెచ్చి నోటికి అందించినచో అది ఆయనయొక్క ఉదర మనుపాత్రయందు పడును. ఇది అగ్నియొక్క లక్షణము. అగ్ని పాత్రను గైకొని భిక్షకై ఎవనియొద్దకు పోదు. యోగ్యులైనవారు అగ్నిదేవుని అర్చించి ఆయన జిహ్వలైన జ్వాలలయందు ఆహుతులను వేయుదురు. కావున ఈ పద్ధతిని అగ్నినుండి అవధూత నేర్చుకొనును.

చంద్రునికళల యభివ్యక్తిని **(Manifestation)** శ్రీధరాచార్యుఁడు ఇట్లు వివరించెను. ఆదిత్యుని మండలము తేజోమయము. చంద్రమండలము ఆపోమయము; అనఁగా జలతత్త్వమును అధికముగా కలిగి చల్లగా నుండును. ఒక నక్షత్రముననే చంద్రుఁడు సూర్యుఁడు ఉన్నప్పుడు, సూర్యుని వెనుకనున్న చంద్రుఁడు భూమియందున్న జనులకు కన్పింపఁడు. ఆదినము అమావాస్య యగును. చంద్రుఁడు అఱువది గడియలకు మఱియొక నక్షత్రమునకు చేరును. ఆదిత్యుఁడు పదుమూఁడు అహోరాత్రములకు మఱియొకనక్షత్రమునకు చేరును. చంద్రుఁడు మఱియొక నక్షత్రమునకు చేరినప్పుడు ఆదినము పాడ్యమి అగును. సూర్యునియొద్దనుండి కొంచెము ప్రక్కకు వచ్చిన చంద్రునిపై ఆదిత్యునియొక్క పదునైదవతేజోభాగము ప్రతిబింబించును. అందువలన పాడ్యమియందు ఆతేజోభాగము చంద్రమండలమున

రేఖామాత్రముగ గోచరించును. ఆరేఖను కళ అని చెప్పుచున్నాము. ఈ విధముగా పదునైదు దినములకు పదుమూఁడు నక్షత్రములయంతరము చంద్రసూర్యులకు ఏర్పడును. ఇరువదియేడు నక్షత్రముల రాశి చక్రమునందు అప్పుడు చంద్రుఁడు సూర్యునకు అభిముఖముగా నుండుట తటస్థించి సూర్యుని తేజోమండలములోని కళలన్నియు చంద్రమండలమున ప్రతిబింబించును. ఆదినము పూర్ణిమ యగును. మరల బహుళప్రతిపత్తునుండి చంద్రమండలమున కళలు క్షీణించుట మొదలగును. కళలయొక్క ఈ యుత్పత్తి క్షయములవలన చంద్రమండలమునకు యథార్థముగా ఉత్పత్తి క్షయములు లేనట్లే దేహాదులకు జన్మవినాశాదివికారములు ఉన్నను వానియందున్న సర్వవ్యాపకమైన యాత్మకు ఎట్టి వికారములు లేవని ప్రాజ్ఞుఁడు గ్రహింపవలె.

వ్యాపకమైన పదార్థమును గ్రహించుటకు లేక గుర్తించుటకు ఏది సాధనమగునో అది ఆపదార్థమునకు ఉపాధి యగును. బిందెలు గిన్నెలు మొదలగునవి ద్రవపదార్థములకు ఉపాధులు. కట్టెలు మొదలైన యింధనములు అగ్నికి ఉపాధులు. గాజు గోళములలో (bulbs) నుండి వెలుగు నిచ్చు టంగ్స్టన్ తీగలు మొదలగునవి విద్యుత్ప్రవాహమునకు (Current of electricity) ఉపాధులు. ఇట్లే సర్వవ్యాపకమైన యాత్మ దేహాదులయందు గుర్తింపఁదగియుండుటచే అవి ఆత్మకు ఉపాధులగుచున్నవి.

## (ii) కపోత చమసము

అవధూత ఇంకను ఇట్లు చెప్పెను. "ఎవరితో ఎప్పుడును అమితమైన స్నేహమును, ఎవరియందును అత్యంతమైన ఆసక్తిని పొందరాదు. అట్లు చేసినవాఁడు కపోతమువలె సంతాపమును పొందును.

ఒక పావురాయి తనభార్యతో కూడ ఒకయరణ్యమునందు ఒక చెట్టుమీఁద గూడు నిర్మించుకొని కొన్ని సంవత్సరములు సుఖముగా నుండెను. ఆరెండును ప్రతిదినము స్నేహము ప్రవర్ధమానమగుచుండఁగా ఆసనశయనక్రీడావిలాస సంలాపాదులతో హాయిగా వనవీథులలో విహరించుచుండెను. భార్య ఏది కోరినను ఆకపోతము ఆపదార్థమును ఎంత శ్రమించియైనను తెచ్చి యిచ్చుచుండెను.

కొంత కాలమునకు కపోతి గర్భమును ధరించి గూటియందు అండములను పెట్టెను. ఆయండములనుండి పిల్లలు ఉద్భవించి ఆదంపతులకు తమ కూజితములచేత క్రీడలచేత మిగుల సంతోషమును కలిగించుచుండెను తల్లిదండ్రులు కూడ మిగుల ప్రేమతో వివిధములైన ఆహారములను తెచ్చి యిచ్చుచు వానిని పోషించుచుండిరి.

ఒకనాఁడు వారిరువురు పిల్లలకు ఆహారమును సంపాదించుటకై పోయి అడవిలో అనేక ప్రాంతములలో తిరుగుచుండిరి. ఆసమయమున యాదృచ్ఛికముగా బోయవాఁడొకఁడు ఆకపోతముల నివాసమైన వృక్షమునొద్దకు వచ్చి గూటియొద్ద చరించుచున్న పిల్లలను చూచి ఆ గూటిక్రింద వలనుపఱచి దానియందు గింజలను చల్లి కొంచెము దూరములో దాఁగియుండెను. ఆపిల్లలు గింజలకొఱకు వలపై వ్రాలి దానియందు చిక్కువడి ఆక్రోశింపఁజొచ్చెను.

కొంతసేపటికి కపోతకపోతములు బిడ్డలకు ఆహారమును గైకొని గూటియొద్దకు వచ్చుచుండెను. దూరమునుండియే తన కుమారుల ఆక్రోశశబ్దములను విని తల్లి దుఃఖపరవశయై పరువెత్తుకొని వచ్చి ఆక్రోశించుచు, వలను గమనింపక, పుత్రులయొద్ద వ్రాలి, వలలో చిక్కువడెను. వెనుకనుండి వచ్చుచుండిన కపోతము ప్రాణముకంటె అధికప్రియులైన బిడ్డలు భార్యవలయందు చిక్కుకొని విలపించుచుండుటను చూచి పరమదుఃఖమును పొంది, "అత్యంతప్రియులైన పుత్రులు పతివ్రతయై ప్రాణసమానురాలైన భార్యయు గతించిన తరువాత నేనెట్లు బ్రదుకుదును" అని విలపించుచు ఆవలయందు పడెను. బోయవాఁడు చాలసంతోషముతో ఆపక్షి కుటుంబము నంతనుగైకొని వెడలిపోయెను.

మహారాజా ! పశుపక్ష్యాదులలో లేని విజ్ఞానము వివేకము మనుష్యజన్మమునం దున్నవి. కావున మానవజన్మము శ్రేష్ఠము. ఇందు జ్ఞానవిజ్ఞానములను సంపాదించుకొని ముక్తిని పొందుటకు అవకాశమున్నట్లుగా ఇతరజన్మములలో లేదు. కావున ఇది ముక్తి మార్గమునకు తెఱచియుంచిన ద్వారము. ఈద్వారమునకు చేరియు వెనుకకు మరలి పావురాయివలె విషయభోగముల ననుభవించుచు సంసారమును పెంచుకొనుచు

అందు చిక్కుకొని అధోగతి నొంది అదమజన్మల నొందువాఁడు దయనీయుఁడు. అట్టివానిని ఆరూఢచ్యుతునిగా బుధులు పేర్కొందురు".

చెట్టును గాని కొండను గాని ఎక్కినవాఁడు ఆరూఢుఁడు. చ్యుతి అనగా జాఱుట. పైనుండి క్రిందికి జాఱినవాఁడు ఆరూఢచ్యుతుఁడు. సంసార మనువృక్షమునకు అగ్రభాగము మనుష్యజన్మము. ఎన్నో జన్మలపుణ్యాఫల ముండుననే తప్ప మనుష్యజన్మము లభింపదు. అందులో కూడ పుణ్యాతిశయముచేతనే విజ్ఞాన వివేకములు కలుగును. అట్టి బుద్ధిశాలి కూడ పరమార్థమును గ్రహించి ముక్తుఁడై సంసారవృక్షమును వీడి పైకి ఎగిరిపోయి ఆనందముతో స్వేచ్ఛగా విహరింపక, విషయభోగలోలుఁడై వృక్షాగ్రభాగము నుండి జాఱినచో పతితుఁడై శోచనీయుఁడగును.

## (iii) అజగరాదిచమసము

యదువును చూచి ఆబ్రాహ్మణుఁడు మఱియు ఇట్లు చెప్పెను. "అయ్యా! ప్రారబ్ధమువలన దుఃఖమెట్లు వచ్చిపడుచున్నదో అట్లే సుఖము కూడ మనము కోరినను కోరకున్నను స్వర్గముననే కాదు, నరకమున కూడ సంభవించును. అందువలన వివేకి దానిని కోరఁడు, దానికై యత్నింపఁడు. మంచి భోజనమో విరసమైనదో అధికముగనో అల్పముగనో అయాచితముగ వచ్చిపడినదానిని, అజగరమువలె, యోగి భుజింపవలె. అతఁడు ఇంద్రియపాటవము, మనోబలము, శరీరశక్తి చక్కఁగా కలిగియుండియు, ఆహారములభింపకున్నచో అనేకదినములు, కొండచిలువవలెనే ఎట్టి ప్రయత్నము చేయక, నిద్రింపక శయనించి యుండవలె. ఇది అజగర వ్రతము.

ప్రసన్నుఁడై గంభీరుఁడై ముని, సముద్రమువలె, దుర్విగాహ్యుఁడు, దురత్యయుఁడు, అనంతుఁడు అక్షోభ్యుఁడై యుండవలె. అతఁడు నారాయణపరాయణుఁడై కామములు సమృద్ధముగ సిద్ధించినప్పుడు, అవి లభింపనప్పుడు, వర్షములలో పొంగక, వేసవిలో కృశింపక యుండు సముద్రమువలె స్తిమితముగ నుండవలె".

శరత్కాలమున ఒండుమట్టి అడుగునకు పోయి ప్రవాహమునందు నీరు తేరుకొనును. అట్లు తేటగా నుండుట ప్రసన్నత. రాగద్వేషాదుల మాలిన్యము తొలఁగిన మనస్సునకు ప్రసన్నత.

సముద్రమున ఒక యడుగునకు క్రింద జలచరములో శిలలో రత్నములో ఏమి యుండునో తెలియదు. అట్లే మహాపురుషుల యంతఃకరణము నందున్న యనుగ్రహము కాని యాగ్రహము కాని ఏదియైనను ఇతరులకు సులభముగా తెలియదు. అది గాంభీర్యము. అట్టివాఁడు గంభీరుఁడు.

గాహన మనఁగా ప్రవేశించుట విశేషముగా ప్రవేశించుట విగాహనము. అట్లు ప్రవేశించుటకు వీలైనది విగాహ్యము. దుఃఖముచేత లేక మిగుల ప్రయత్నముచేత విగాహ్యమైనది దుర్విగాహ్యము. ఎంతో ప్రయత్నముచేత లోనికి ప్రవేశింపఁదగినది యగుట చేత సముద్రము దుర్విగాహ్యము. మునియొక్క యంతఃకరణమునందు ప్రవేశించి ఆయనయభిప్రాయములను గ్రహించుట కష్టసాధ్యమగుటచేత ఆయన దుర్విగాహ్యుఁడు.

అత్యయ మనఁగా అతిక్రమించుట లేక దాఁటుట. కష్టముచేత దాటఁదగినది యగుటచేత సముద్రము దురత్యయము. మునిని అతిక్రమించుట, అనఁగా ఆయనకు అవమానకరముగా వర్తించుట అసాధ్యము, కావున ముని దురత్యయుఁడు.

అంతమనఁగా అవధి. దేశకాలములయొక్క అవధులకు అతీతమైన యాత్మయే స్వరూపముగా కలవాఁడగుటచే జ్ఞాని అనంతుఁడు.

రాగద్వేషాదులచేత క్షోభనొందని వాఁడు అక్షోభ్యుఁడు.

ఒక్కొక్క విషయముచేత ఆకర్షింపఁబడి ఒక్కొక్క జంతువు నశించుచున్నది. రూపముచేత కీటకము. గంధముచేత మధుకరము, స్పర్శచేత గజము, శబ్దముచేత హరిణము, రసముచేత మీనము సమ్మోహితములై విపత్తి నొందుచున్నవి. ఈ జంతువులవలన ఈ విషయముల యాకర్షణము ఎంత అపాయకరమో గ్రహించి యోగి వానికి దూరముగా నుండవలయు నని అవధూత ఇట్లు చెప్పుచున్నాఁడు.

వస్త్రాభరణాదులచేత అలంకృతయైన స్త్రీయొక్క రూపమును చూచి ప్రలోభము నొంది మూఢుఁడైనవాఁడు, దీపజ్వాలను చూచి మూఢమై అందు ప్రవేశించి నశించు కీటకమువలె, విపత్తు నొందును.

మధుకరము ఒక్కొక్క పుష్పమునుండి కొంచెము కొంచెముగా ఆహారమును స్వీకరించుచు ఆపుష్పములకు హింస కలుగకుండ ఎట్లు వర్తించునో అట్లే యోగి కూడ ఒక్కొక్క గృహమునుండి కొంచెము కొంచెముగనే భిక్షను గ్రహించుచు నుండవలె. అట్లుకాక సువాసనయొక్క ప్రలోభముచేత ఒక పద్మము నందే యుండి సాయంకాలమునకు ఆపుష్పము ముకుళితమైనప్పుడు నశించు మధుకరమువలె, యతి ఒక యింటియందే అచ్చటి యాతిథ్యముచేత ఆకర్షింపఁబడి చిరకాలమున్నచో ఆకుటుంబములోనివారితో స్నేహము సంగము ఏర్పడి, వైరాగ్యదూరుఁడై నశించును. మఱియు మధుకరము వలెనే యోగి సూక్ష్మములు మహనీయములు అయిన సకల శాస్త్రములనుండి సారభూతములైన యంశములనే గ్రహింపవలె ; వానియందు పాండిత్యమును సంపాదింపవలయు నను ప్రలోభమును పొందరాదు.

మధుకరములు రెండు విధములు. పుష్పముల నుండి అప్పటికప్పుడు ఆహారమును గైకొనునది భ్రమరము లేక తుమ్మెద. పుష్పములనుండి మధువును సేకరించి ఒకచోట చేర్చి తేనెపట్టును తయారు చేయునది తేనెటీగె. అది తాను తినక అట్లు కూడఁబెట్టిన ఆ తేనెపట్టును మానవులు హరించుచుందురు. అది ఆవిధముగా నిరాశకు దుఃఖమునకు లోనగుచున్నది. ఆ తేనెను హరించుటకై మానవులు దానిని చంపుటయు తటస్థించుచున్నది. భిక్షువుకూడ, "ఇది సాయంకాలము తిందును ; ఇది రేపటికి ఉండును" అని భిక్షాద్రవ్యములను కూడఁ బెట్టరాదు. అట్లు కూర్చుటవలన లోభము పెంపొందుటయే కాక ఇతరులకు అసూయ కలుగును. కావున యోగి బికను పాత్రయందుఁ గైకొనక చేతియందే గైకొని యప్పటికప్పుడే భుజించుచుండవలె.

కొయ్యతో చేయఁబడిన యువతియొక్క బొమ్మనైనను యతి పాదముతో కూడ స్పృశింపరాదు. ఆడయేనుఁగు యొక్క స్పర్శచేత ఆకృష్టమై దాని వెంటఁబడిన యేనుఁగును మానవులు ఉపాయములచేత బంధించుచుందురు. ఒక్కొక్కప్పుడు

ఆయేనుఁగును దానికంటె బలము కలిగిన యేనుఁగులు వచ్చి మార్కొని సంహరించును.

తాము తినక తేనెటీగలు కూడఁబెట్టిన తేనెను అనాయాసముగా హరించి గైకొనువాఁడు కూడ భిక్షువునకు గురువే. ఎంతో కష్టపడి సంపాదించుకొన్న పదార్థములను గృహస్థులు ఆశీస్సులను కోరుచు యతులకు సమర్పించుచుందురు. కావున యతి స్వయముగా పదార్థములను పక్వాన్నములను సంపాదించుకొనుటకు యత్నింపరాదు.

వేటకాని గీతముచేత ఆకర్షింపఁబడి హరిణము వానిచే సంహరింపఁబడుచున్నది. అట్లే గ్రామ్యములైన స్త్రీలయొక్క నృత్యగీతాదులను వనచరుఁడైన యోగి చూడరాదు వినరాదు. ఋష్యశృంగునంతవాఁడు స్త్రీల నృత్యగీతాదులకు వశుఁడయ్యెను గదా !

గాలమునందుండు ఎరల రుచికి లోఁబడి చేపలు మృత్యువు నొందుచున్నవి. జిహ్వ మనస్సును రుచిచేత అమితముగ మథించును. ఆహారమును వదలి ఇంద్రియములను త్వరలో జయింపవచ్చును. కాని ఉపవాసము చేయుచున్నవానికి రసమునుగూర్చి భావన ప్రవర్ధమాన మగుచుండును. "తక్కిన యింద్రియములను జయించినను రసనేంద్రియమును జయించువఱకు ఎవ్వఁడును జితేంద్రియుఁడు కానేరఁడు. రసనేంద్రియము జయింపఁబడినచో సర్వము జయింపఁబడినట్లే యగును". (రసనము = నాలుక)

## (iv) పింగళాఖ్యాన చమసము

వైరాగ్యమును ఎట్లు పొందవచ్చునో తెలుపుటకు అవధూత పింగళకథను ఇట్లు చెప్పెను. "పూర్వము విదేహనగరము నందు పింగళ అను వేశ్యయుండెను. ఆమెవలన నేను గ్రహించిన బోధను వినుము. ఒకదినమున ఆమె తనయింటివాకిట నిలిచియుండి మార్గమునందు వచ్చుచు పోవుచున్న విటులను గమనించుచుండెను. ఆమె, 'వీనికంటె మఱియొకఁడైనచో అధికముగా ధన మొసంగునేమో' అని తలంచుచు

ఆవేళ వచ్చిన వారిని వదలుకొనెను. తరువాత ఎవరును రాలేరి. అర్ధరాత్రము వఱకు ఆమె లోపలికి వెలుపలికి తిరుగుచు నుండెను.

అర్ధరాత్రము దాఁటుచుండఁగా, "ఇంక ఎవ్వరురారు. ఈనాఁడు నాకు ధనమేమియు లభింపదు" అని ఆమె నిరాశతో దీనురాలై నిద్రాభంగమున ముఖము ఎండిపోవుచుండఁగా చింతింపఁజొచ్చెను. అదృష్టవశమున ఆదిగులు వలన ఆమెకు శుభము కలిగించునట్టి పరమనిర్వేదము కలిగెను. ఆశాపాశములను నిర్వేదము కత్తివలె ఖండించును. అయ్యో ! ఎప్పటికైనను నిర్వేదమును పొందనివాఁడు దేహబంధమును త్యజింపగోరఁడు. ఆమె అప్పుడు చెప్పిన గీతమును వినుము.

'అహో ! నామోహాతిశయమును చూడుఁడు. ఇంద్రియములను జయింపక బాలిశనై అసత్పురుషుని కోరికను తీర్చుకొనుటకై కామించుచున్నాను. రతిప్రదుఁడు విత్తప్రదుఁడు నిత్యుఁడునై సమీపమునందే యాత్మరూపుఁడై యున్న యీరమణుని వీడి కోరికల నొసంగలేని వానిని దుఃఖమును భయమును ఆర్తినిశోకమును మోహమును ఇచ్చువానిని నేను అజ్ఞానురాలనై భజించుచున్నాను. అత్యంతము నింద్యమైన వేశ్యావృత్తిచేత నాశరీరమును పరితపింపచేసితిని. ధనతృష్ణకలవాఁడు దీనుఁడు స్త్రీలంపటుఁడును అయిన నరునకు శరీరమును అమ్ముకొని వానివలన విత్తమును రతిని కోరుచుంటిని. వెదురు బొంగునకు వెదురు బద్దలను గూర్చి రోమముతో నఖములతో చర్మముతో కప్పఁబడిన యెముకలగూడును, మలినమును స్రవింపఁజేయు నవద్వారములతో మలమూత్ర పూర్ణమైన శరీరమును కామ్యమైన దానినిగా నేను తప్ప మఱి ఎవతెయైన పొందునా ? ఆత్మప్రదుఁడు అచ్యుతుఁడునైన యీరమణునికంటె అన్యుని అసతియై ఎవతె కోరును ? ఈవిదేహ నగరమున నేనొక్కతనే మూఢురాలను.'

ఇతడు సుహృత్తు ; ప్రియతముఁడైన నాథుఁడు. ఇతఁడు సకల శరీరధారులకు ఆత్మ. నా శరీరమును ఆయనకు అమ్మి ఆయనతో లక్ష్మీదేవివలె క్రీడింతును. కోరికలను తీర్చు మానవులు గాని జన్మమృత్యువులు కల దేవతలు కాని భార్యలకు ఎంత ప్రీతికలిగించుచున్నారు ? నేనేదో పుణ్యకర్మను చేసియుంటిని. దానివలన

విష్ణుదేవుఁడు ప్రీతుఁడయ్యెను. అందువలననే దురాశ కల నాకు సుఖమును కలిగించునట్టి యీ నిర్వేదము కలిగినది. నేను మందభాగ్యురాలను కాను. అయినచో, సంసారమును ఉపసంహరించి శమమును కలిగించునట్టి యీ నిర్వేదమును క్లేశములు కలిగించియుండవు. నీచసాంగత్యమును పొందియున్న నేను, ఇప్పుడు ఆదేవునిచే చేయఁబడిన యుపకారమును శిరసావహించి దురాశను వీడి ఆపరమేశ్వరునే శరణము పొందుదును. ఏది లభించునో దానిచే జీవించుచు సంతుష్టురాలనై నా యీ యాత్మయైన రమణునితోనే విహరింతును. విషయభోగములచేత అంధుఁడై సంసారకూపమున పడి కాలసర్పముచే మ్రింగఁబడుచున్న వానిని ఈశ్వరుఁడు తప్ప ఎవఁడు రక్షింపగలఁడు ? అఖిల ప్రపంచమునుండి నిర్వేదము కలిగినప్పుడు తన్ను తానే రక్షించుకొనుచు, కాలసర్పముచే కబళింపఁబడున్న యీజగత్తును జాగరూకతతో గమనించుచుండవలె".

ఇట్లు నిశ్చయించుకొని ఆమె కామతృష్ణవలన కలిగిన దురాశను ఛేదించి శాంతిని పొంది శయనించెను. ఆశయే కదా పరమదుఃఖము. నైరాశ్యమే పరమసుఖము. ఆశను త్రెంచుకొనుట వలననే పింగళ సుఖముగా నిద్రించెను".

శ్లో॥ ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్ |
యథా సంఛిద్య కాంతాశాం సుఖం సుష్వాప పింగళా || 43

స్కంధము XI - అధ్యాయ. 8

లక్ష్యమును సాధించుటకై చిరకాలముగా మన మవలంబించుచున్న సాధనము, అందులకు పనికిరానిదని, అప్పటిదాక దాని నవలంబించి చేసిన కృషి యంతయు వ్యర్థమైనదని నిరూపితమైనప్పుడు కలుగువేదన నిర్వేదము. నిత్యము సుఖమును పొందుటకు విటులవలన విత్తమును రతిని పొందుటయే సాధనముగా పింగళ చిరకాలము వేశ్యావృత్తిని అవలంబించెను. క్రమముగా ఆమెకు ధనాశ పెరిగెను. ఆశయొక్క అతిశయమువలననే ఆనాఁడు సామాన్యులుగా కన్పించిన వారినందఱను తొలఁగఁద్రోసెను. తుదకు ఆమె యాశకు తగినవాఁడు ఎవఁడును రాలేదు. ఆ నిరాశ ఆమెయందు ఆలోచనను రేకెత్తించెను. పరమసుఖమును పొందుటకై తాను

అవలంబించుచున్న వేశ్యావృత్తి సాధనము కానేరాదని, అప్పటిదాక తాను గడిపిన జీవితమంతయు వ్యర్థమే అనితోఁచినది. అందువలన ఆమెకు నిర్వేదము కలిగినది.

ప్రౌఢమైన వయస్సునందు కూడ బాలునివలె వర్తించువాఁడు బాలిశుఁడు, అట్టి స్త్రీ బాలిశ. వయస్సు పెరుగుచున్నప్పటికి వివేకమును పొందకుండుట బాలిశత్వము.

ప్రత్యుపకారదృష్టి లేకుండ ఉపకారము చేయు మిత్రుఁడు సుహృత్తు.

పురుషునకు వేశ్యవలె గాక భార్యగానున్నను భర్తవలన పరమసుఖము లభింపదని తలంచుచు, రక్తమజ్జాస్థి మలినమయమైన పురుష శరీరమును కోరుటయే తప్పని పింగళ కామమునందు పూర్ణమైన విరక్తి నొందినది. అందువలన పురుషసంగమునకు అవకాశములేని పరిచారకాదివృత్తి నవలంబించి లభించినదానితో జీవనము చేయుటకు ఆమె నిశ్చయించినది.

## (v) కురరాది చమసము

యదువునకు అవధూత మఱియు ఇట్లు చెప్పెను.

'రాజకుమారా ! ఏది ఏది ప్రియతమ మని యొకఁడు అట్టి పదార్థమును కూర్చుకొనుచుండునో అదియంతయు వానికి దుఃఖమునే కలిగించును. అది దుఃఖప్రదమని తెలిసికొని ఏమియు లేకుండ నుండువాఁడు అనంతమైన సుఖమును పొందును. మాంసమును సంపాదించుకొని యొక కురరము, (ఒకానొక పక్షిజాతి) పోవుచుండెను. ఆ మాంసము కొఱకు దానికంటె బలవత్తరములైన పక్షులు దానిపై వచ్చి పడెను. వెంటనే అది ఆమాంసమును వదలెను. ఆపక్షులు మాంసము పైఁబడి దానిని వదలిపెట్టెను. ఆవిధముగా కురరము ఆపదనుండి తప్పించుకొని సుఖమును పొందెను. కావున పరమార్థ సుఖమును కోరువాఁడు పదార్థ పరిగ్రహమును పరిత్యజింపవలె.

పసిపిల్లవానికి మానావమానములు సంసారబాధ్యతలు ఉండవు. వాఁడు తనయందే తాను క్రీడించుచు ఆనందించుచుండును. అట్లే నేనును దుఃఖము

దిగులు లేకుండ నాస్వరూపముచేతనే ఆనందించుచున్నాను. శిశువు, బుద్ధియొక్క పారము నొందినవాఁడు - వీరిద్దఱే చింతలేని వారు ఆనందపూర్ణులు.

ఒకపేద కుటుంబమున ఒక కన్య యుండెను. ఆమెను వధువునుగా వరించుటకు ఒకనాఁడు బంధువులు వచ్చిరి. తల్లిదండ్రులు వారిని గౌరవించి యింటివెలుపలి యరుగుల మీదనో రచ్చబండమీదనో వారితో కూడ కూర్చుండి మాటాడుచుండిరి. తల్లి దూరమగుటచేఁ గాబోలు ఆకన్యయే వడ్లను దంపి బియ్యమును తయారు చేయవలసియుండెను. అందువలన ఆమె రహస్యముగా వడ్లను దంపఁజొచ్చెను. దంపునప్పుడు చేతులయందున్న కంకణముల వలన పెద్ద ధ్వని బయలుదేరెను. దానివలన తాను వడ్లను దంచుచున్నట్లుగా వచ్చినవారు గ్రహింతురేమోయని ఆమె సిగ్గుపడుచు, రెండు చేతులనుండి ఒక్కొక్క కంకణము తప్ప తక్కినవానిని తీసివైచెను. రెండు ఉన్నప్పుడు వచ్చిన ధ్వని, ఒక్క కంకణమువలన పుట్టదు. ఆవిధముగా నిశ్శబ్దముగా ఆ కన్య రహస్యమును కాపాడుకొనుచు తన పనిని సాధించుకొనెను. ఈ కథను విని నేను "అనేకులు చేరినచో కలహము, ఇద్దఱైనను లోకవార్తా ప్రసంగము కలుగును ; ఒక్కఁడుగా నున్నప్పుడే నిశ్శబ్దమైన యేకాంతమున ఏకాగ్రతవలన సమాధి అనుకార్యసిద్ధి కలుగును" అను బోధమును పొంది ఆవిషయమున ఆమెను గురువునుగా భావించుచున్నాను. కావున యతి ఒంటరిగానే చరించుచుండవలె.

యతి సోమరితనమును వీడి, ఒకే ఆసనమునందు చాలసేపు నిశ్చలముగా నుండుటను అభ్యసించి, ప్రాణాయామమును అవలంబించి, వైరాగ్యముచేత అభ్యాసముచేత మనస్సును విషయములపైకి పోనీయక లక్ష్యమునందు నిలుపవలె. రజస్సును తమస్సును వీడి సత్త్వమును వృద్ధిఁ బొందించి చిత్తమును ఆత్మయందు లగ్నమొనరించినచో దానియందున్న కర్మవాసనలు మెల్లమెల్లగా నశించుచుండఁగా అది, ఇంధనములు లేని యగ్నివలె, క్రమముగా నిశ్చలమై సమాధిని పొందును. బాణమును తయారుచేయుచు దానియందే లగ్నమైన మనస్సు కలవాఁడు తన ప్రక్క నుండి మహారాజు పోవుచున్నను ఎట్లు తెలిసికొనలేఁడో అట్లే ఆత్మయందు మగ్నమైన చిత్తము కలవానికి తనలోపల వెలుపల ఏమి జరుగుచున్నదో తెలియనే తెలియదు.

ముని, సర్పమువలె, ఇల్లులేని వాఁడై గుహయందు రహస్యముగ నివసించుచు, రాకపోకలయందు జనులచే గుర్తింపఁబడక, ఎవరైనను ఎదురైనచో అల్పముగ మాటాడుచు ఏకాంతమునందే యుండవలె. అశాశ్వతమైన శరీరముకొఱకు శాశ్వతమైన యిల్లు కావలయునని తలంపరాదు. ఇతర ప్రాణులొనర్చిన పుట్టలవంటి వానియందే పాము సుఖముగా వర్ధిల్లుచున్నది. కావున ఎవఁడైనను సొంతముగా తనకు ఇల్లు కావలయునని నిర్మింపఁబూనుకొనుట దుఃఖమును సంపాదించుకొనుటయే యగును.

కల్పాంతమునందు కాలవశమున సత్త్వరజస్తమస్సుల సమత్వమును పొందఁగా నారాయణుఁడు తన మాయచేత సృష్టింపఁబడిన జగత్తును ఉపసంహరించి అద్వితీయుఁడై కేవలుఁడై ఆనందాత్ముఁడై యుండును. ప్రళయము యొక్క అంతమునందు తన స్వరూపమైన కాలముచేత, సమష్టియందు ప్రధానమను పేరు గలిగి నిశ్చలముగా నున్న త్రిగుణాత్మకమైన తనమాయను ఆపరమేశ్వరుఁడు సంక్షోభింపఁజేసి దాని నుండి మహత్తత్త్వమును పుట్టించును. ఆమహత్తత్త్వమువలన అవ్యక్తముగా నున్న ప్రధానమునుండి మూఁడుగుణములు వైషమ్యము నొంది సర్వతోముఖమైన సృష్టి ఆరంభమగును. పుష్పసముదాయము సూత్రము నందువలె, ఈ మహత్తత్త్వమునందు సృష్టియంతయు కూర్పఁబడుచున్నది కావున ఈ తత్త్వమును సూత్రమనియు పేర్కొందురు. ఈ సూత్రము క్రియాశక్తి ప్రధానమైనది (kinetic energy of creation). ఈ సూత్రముతో విశ్వమును సృష్టించి క్రీడించి పరమేశ్వరుఁడు కల్పాంతమున ఈ సూత్రమును దానితోపాటు విశ్వమును తనలోనికి ఉపసంహరించుకొనుచున్నాఁడు. పరమేశ్వరుని యీ క్రీడావిలాసమును నేను గ్రహించుటలో సాలెపురుగు నాకు గురువైనది. అది హృదయమునుండి పైకి వచ్చిన సూత్రమువలె సాగుచుండుపదార్థమును నోటి నుండి వెలుపలికి ప్రసరింపఁజేసి కొంతసేపు దానితో క్రీడించి దానిని మరల లోనికి ఉపసంహరించుకొనుచున్నది. దీనివలన ఈశ్వరుని సృష్టివిధానము నాకు విశదమైనది.

నిరంతరము గాఢముగ ఆత్మనుధ్యానించుచున్నచో క్రమముగా మనస్సు ఆత్మస్వరూపమే యగును. స్నేహమువలన గాని ద్వేషమువలనఁగాని భయమువలనఁగాని ఎవఁడు దేనియందు మనస్సును సంపూర్ణముగ నిలిపియుంచునో

అది ఆపదార్థముతో సమానమైన రూపమును పొందును. భ్రమరముచేత గూటియందు బంధింపఁబడిన కీటము భయముచేత నిరంతరము దానినే ధ్యానించుచు ఆదేహమునందే భ్రమరరూపముతో సమానమైన రూపమును పొందుచున్నది. దేహము విడకున్నను కీటకమునకు అట్టి సారూప్యము కలుగుచుండగా, నిరంతరము ఆత్మనే [illegible] దేహము పడిపోయినప్పుడు ఆత్మైక్యము సిద్ధించుటలో ఆశ్చర్యమేమున్నది?

ఈ విధముగా నేను ఇరువది నలువురియొద్ద నేర్చుకోవలసిన విషయములను గ్రహించితిని. నేను నా దేహమువలన నేర్చుకొన్నదానిని కూడ చెప్పెదను వినుము. వివేకమునకు విరక్తికి హేతువై యీ శరీరమే నాకు గురువయ్యెను. ఇది జనన మరణములను కలిగియుండుటయే కాక, దీనివలన జరుగు ప్రతికార్యమునకు ముగింపునందు దుఃఖమే కలుగుచున్నది. కావున దీనియందు విరక్తి పుట్టినది. మఱి ఈశరీరమువలననే తత్త్వము లన్నింటిని విమర్శించుచున్నాను. కావున దీనియందు అనురాగము ఉండనక్కఱలేదా ? ఎంతగా నాకు ఉపకారము చేసియున్నను ఒకప్పటికి ఇది నక్కలు గ్రద్దలు మొదలగు వానికి భక్ష్యము కావలసియేయున్నది. కావున పరకీయమైన దీనియందు విరక్తిని పొందుటయే వివేకము. ఈదేహమునకు ప్రీతిని కలిగించుటకై ఎంత కష్టపడి ధనమును సంపాదించి భార్యాపుత్త్రపశు భృత్యాదులను పోషించుచున్నను ప్రారబ్ధకర్మ ముగిసినంతనే ఇది పడిపోవుచున్నది. ఇది కేవలము నశించుట లేదు. మఱియొక వృక్షము యొక్క ఉత్పత్తికి విత్తనములు ఏర్పఱచు వృక్షమువలె ఇది తాను నశించుచు మఱియొక దేహము కలుగుటకు కావలసిన విత్తనములవంటి కర్మవిశేషములను భద్రపఱచియే పోవుచున్నది. ఇది చక్కఁగా పనిచేయుచున్నప్పుడు కూడ యథార్థముగా సుఖము లేదు. సవతులు భర్తను ఆప్రక్కకు ఈ ప్రక్కకు లాగునట్లు జిహ్వాచక్షుస్సు శ్రవణము మొదలుగా ఇంద్రియములు తమ తమవిషయముల వైపునకు లాగుచు అశాంతిని కలిగించుచునే యుండును.

అయినను ఈ పురుషశరీరము కేవలము ఉపేక్షింపఁదగినది కాదు. ఇది చాల విలువ కలది. పరమేశ్వరుఁడు వృక్షపశుపక్షి జలచరాదుల శరీరములను

సృష్టించి సంతుష్టి నొందక తుదకు బ్రహ్మమును దర్శించుటకు సమర్థమైన బుద్ధి కలిగిన పురుషదేహమును సృష్టించి సంతోషించెను. ఇది యనిత్యమేయైనను అత్యంతము దుర్లభము. ఎన్నో జన్మలతరువాత మహాపుణ్యా విశేషమువలన మనుష్యశరీరమును పొందినవాఁడు ధీరుఁడై ఇంద్రియములను విషయములనుండి మరలించి బుద్ధిని ఆత్మకు అభిముఖము కావించి, మృత్యువునకు నిరంతరము సన్నిహితమైన యీదేహము పడిపోక ముందే, మోక్షమును పొందవలె. విషయభోగములు ఏ జంతుశరీరమునందైనను లబించును కాని, మోక్షసాధనము మాత్రము సంభవము కాదు.

ఈవిధముగా విజ్ఞానమును సంపాదించుకొని, అహంకార రహితుఁడనై ఆత్మనిష్ఠుఁడనై ఎచ్చటను సంగమును పొందక విహరించుచున్నాను. ఒక్క గురువువలన కలుగు జ్ఞానమే పుష్కలము కాదు. బ్రహ్మమును అద్వితీయమునుగా నిరూపించుచు మహర్షులే ఒక్కొక్కరు పెక్కువిధములుగా బోధించుచున్నారు. విషయము సమానమేయైనను ఒక్కొక్కరియొద్ద ఒక్కొక్కయంశము విశేషముగా మనస్సునకు హత్తుకొనును. కావున జ్ఞానవిశేష సంగ్రహణమునకై ప్రయత్నించుచునే యుండఁదగును''.

ఈ సంవాదమును చెప్పి భగవానుఁడు ఉద్ధవునితో ఇట్లనెను. ''మహాత్ముఁడైన యావిప్రుఁడు ఇట్లు బోధింపఁగా యదువు ఆయనకు వందనముఁ గావించి పూజించెను. ఆయన సంప్రీతుఁడై వెడలిపోయెను. మనవంశము పూర్వుఁడైన యా నహుషుని కుమారుఁడు ఆయవధూత చెప్పినదానిని చక్కఁగా గ్రహించి సర్వసంగవిముక్తుఁడై సమచిత్తుఁడయ్యెను.''

గురువులు అనేకులు ఉండవలయునా అనువిషయమును శ్రీధరాచార్యుఁడు ఇట్లు విమర్శించెను. ''చాలమంది గురువులతో ఏమి పని ? శ్వేతకేతువు భృగువు మొదలగువారు పెక్కుమంది గురువులను ఆశ్రయింపలేదు కదా ! బ్రహ్మమును గూర్చి సప్రపంచముగా నిష్ప్రపంచముగా అనేకులు పెక్కువిధములుగా బోధించి యుండుట వలన ఒక్క గురువువలన కలిగిన జ్ఞానమే పుష్కలము కాదు అని

చెప్పఁబడినది. ఇచ్చట భావమిది. వీరు పరమార్థము నుపదేశించు గురువులు కాదు. కాని ఆత్మవిషయమున కలుగు అసంభావన మొదలగు వానిని మాత్రమే అన్వయవ్యతిరేకములచేత, తొలఁగించువారగుదురు. అందువలన అట్టి గురువులు అనేకులుండుట యుక్తమే. జ్ఞానప్రదుఁడైన గురువునుగూర్చి ఒక్కనినే భగవానుఁడు, "నన్నుగూర్చి చక్కఁగా ఎఱింగిన వానిని శాంతుని గురువునుగా ఉపాసింపవలయును" (శ్లో. 5 అధ్యాయ. 10 స్కంధము 11) అని చెప్పఁబోవుచున్నాఁడు ; మఱియును "కావున ఉత్తమమైన శ్రేయస్సును తెలిసికొనఁగోరువాఁడు గురువును ఆశ్రయింపవలె" (తస్మా ద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసుశ్శ్రేయ ముత్తమమ్) అని వెనుక చెప్పియున్నాఁడు".

"జీవుఁడనైన నాయందున్నయాత్మ పరమేశ్వరునియందున్న పరమాత్మ అగుట అసంభవము" అని తలంచుట అసంభావన.

దృష్టాంతమునందు ప్రయోజనమునకు అనుకూలించునట్లుగా నిరూపింపఁబడిన విధానమును అనుసరించుట అన్వయము. దానియందు ప్రయోజనమునకు ప్రతికూలించునట్లుగా నిరూపింపఁబడిన దానిని పరిహరించుట వ్యతిరేకము. ఒక విషయమునే అన్వయముఖముగా వ్యతిరేక ముఖముగా కూడ బోధింపవచ్చును. ఆశను త్రెంచుకొని విషయభోగములనుండి విరక్తయై పింగళపరమసుఖమును పొందెనని చెప్పినప్పుడు ఈవిధానము పరమసుఖమను లక్ష్యమునకు అనుకూలము. కావున దీనిని అనుసరించుట అన్వయము. సంసారము నందు మగ్నుఁడైనవాఁడు కపోతమువలె నశించునని చెప్పినప్పుడు సంసారలంపటత్వము పరమసుఖమను ప్రయోజనమునకు ప్రతికూలము. కావున దీనిని పరిహరించుట వ్యతిరేకము.

"యదువు హైహయుఁడు మొదలగువారు యోగముయొక్క బుద్ధిని ఉభయాత్మకమైన దానిని పొందిరి" (శ్లో|| యోగర్ధి ముభయీం యదుహైహయాద్యాః|) అని చెప్పఁబడియుండుటవలన ఈ యవధూత దత్తాత్రేయుఁడే యని శ్రీధరాచార్యుఁడు ఉద్ఘాటించెను.

# II. సాధనకలశము

## 1. తత్త్వజ్ఞ లక్షణ కమండలువు

### (i) గురు శుశ్రూషా చమసము

బియ్యము గోధుమలు వానిని వండి ప్రధాన ద్రవ్యమైన యన్నమును పొందిన తరువాత, కూర పచ్చడి చారు పులుసు మొదలగునవి దానికి పుష్కలత్వమును కలిగించును. అట్లే గురువుయొక్క ఉపదేశమువలన ఆత్మజ్ఞానమును పొందినవానికి, లోకపరిశీలనమువలన సంపాదించుకొను విజ్ఞానాంశములు పుష్కలత్వమును కలిగించును. కావున మోక్షమును గోరువాఁడు మొదట గురువునాశ్రయించి ఆయనవలన ఆత్మజ్ఞానమును పొందుట ఆవశ్యకమని భగవానుఁడు ఉద్ధవునితో ఇట్లు చెప్పుచున్నాఁడు.

"మోక్షమును కోరువాఁడు శ్రుతిస్మృతులయందు నాచేత చెప్పఁబడిన వానిలో తనకు స్వధర్మములైన వానియందు ఆదరము కలవాఁడై, నన్ను ఆశ్రయించి, తన వర్ణమునకు ఆశ్రమమునకు కులమునకు ఆచారమైన దానిని, ఫలాపేక్ష లేకుండ, ఆచరింపవలయును. స్వప్నమునందు మనోరథములయందు తోఁచుపదార్థము లెట్లు నిష్ఫలములో అట్లే యీజగత్తు నందు గోచరించుచున్న సకల పదార్థములు అసత్యములనియే అతఁడు గ్రహింపవలె. అతఁడు మత్పరాయణుఁడై నిత్యనైమిత్తికములైన కర్మలను మాత్రము ఆచరించుచు కామ్యములైన కర్మలను త్యజింపవలె. తత్త్వము నెఱుంగవలయు నని పూనుకొనినవాఁడు నిత్యనైమిత్తికములను ఆదరింపక యమములను దృఢముగా అభ్యసించుచు నియమములను అవకాశము ననుసరించి అవలంబించుచుండవలయును. నన్ను గూర్చి చక్కఁగా తెలిసికొన్నవానిని శాంతుని మత్స్వరూపునిగ గురువునుగా ఉపాసింపవలె. దేహాదులయందు అభిమానమును మమత్వము లేనివాఁడై, ఇతరులయెడ మత్సరము నొందక, అసూయారహితుఁడై, సత్యవచనుఁడై, తొందఱపాటు లేకుండ, గురువునందు దృఢమైనభక్తి కలవాఁడై తత్త్వమును తెలిసికోవలయు నను నిరంతరమైన యభిలాషతో అతఁడు గురువును సేవించుచుండవలె.

"సకల శరీరధారులయందు 'నేను' అనుస్ఫురణము సమానముగానే యున్నది; అనఁగా సకలదేహములలో నేనే ఉన్నానన్నమాట ; అందువలన వారు భార్యాపుత్త్రాదులవలన పొందుచున్న సుఖము నాదియే అగును ; అట్టియెడల నాకు ప్రత్యేకముగ నున్నట్లు వీరిని కొందఱను భార్యాపుత్రాదులని నేను ఏల అభిమానింపవలె" అని ఆలోచించుకొనుచు అతఁడు భార్యాపుత్త్రాదులయందు ఉదాసీనుఁడై యుండవలె. అతఁడు ఆత్మదృష్టికలవాఁడై తనస్వరూపము స్థూలదేహము కంటె సూక్ష్మదేహముకంటెఁ భిన్నమైనదని గ్రహింపవలె. కొట్టియందు మండుచున్న యగ్ని దానికంటెఁ భిన్నము. కొట్టి దహింపఁబడుచుండఁగా అగ్ని దానికంటె భిన్నమై దానిని దహించుచు ప్రకాశించుచున్నది. అట్లే "నాదేహము, నాయంతఃకరణము" అని స్థూల సూక్ష్మదేహములను ప్రకాశింపఁజేయుచున్న యాత్మవానికంటె భిన్నము. వివిధములైన యాకృతులు గల పాత్రలలో ప్రవేశించిన జలము అయాపాత్రల యొక్క ఆకారములతో వర్ణములతో కన్పించును. అరూపములు వర్ణములు పాత్రలకు సంబంధించినవియే కాని నీటికి సంబంధింపవు. అట్లే ఆత్మ వివిధ దేహములలో ప్రవేశించి అయా దేహములయొక్క రూప వర్ణాదిగుణములు కలిగిన దానివలె కన్పించుచున్నది. పురుషునకు దేహాభిమానమువలన సంసారము కలుగుచున్నది. ఆయభిమానము తొలఁగినచో అతఁడు ముక్తుఁడగుచున్నాఁడు. ఆ యభిమానము విద్యవలననే తొలఁగును.

కావున మోక్షమును కోరువాఁడు ఆత్మతత్త్వమును తెలిసికోవలయు నను గాఢమైన యిచ్ఛతో గురువును సేవించి ఆత్మను తెలిసికొని దేహాదులయందు వస్తుబుద్ధిని క్రమముగా త్యజింపవలె. విద్యాభ్యాసము అగ్నికొఱకై అరణిని మథించుటవంటిది. ఆచార్యుఁడు క్రింది యరణి యగుచో, శిష్యుఁడు ఉత్తరారణియగును. ఆచార్యుఁడు చెప్పుట శిష్యుఁడు వినుట మననము చేసికొనుట మొదలుగా కృత్యపరంపరయే మథనము. ఈ మథనమువలన అగ్నివలె జ్ఞానము ఉదయించి అజ్ఞానమును దహించును. అత్యంతము విశుద్ధమైన యాబుద్ధి, సంసారకారణములైన గుణములను వాసనలను అన్నింటిని దహించి, ఇంధనముల నన్నింటిని దహించి ఆరిపోవునట్టి నిప్పువలె, శమించును".

శ్లో॥ నివృత్తం కర్మ సేవేత ప్రవృత్తం మత్పర స్త్యజేత్ ।
జిజ్ఞాసాయాం సంప్రవృత్తః నాద్రియేత్ కర్మచోదనామ్ ॥ 4

స్కంధము - 11 - అధ్యాయ 10

శ్రీధరీయవ్యాఖ్య : నివృత్త మితి, నివృత్తం నిత్య నైమిత్తిక మేవ కర్మ కుర్యాత్ । ఆత్మవిచారే తు సమ్యక్ప్రవృత్తః నివృత్తకర్మచోదనా మపి నాద్రియేత్ ॥

సంధ్యావందనము అగ్నిహోత్రము మొదలగునవి నిత్యములు. గ్రహణాది పుణ్యకాలములయందు చేయవలసిన స్నానతర్పణ శ్రాద్ధాదులు నైమిత్తికములు. వీనిని ఇచ్చట నివృత్తకర్మలని పేర్కొనుట గమనింపఁదగియున్నది. నివృత్తుని కర్మ నివృత్త కర్మ. సంసారమునుండి నివృత్తుఁడైనవాఁడు, అనఁగా వెనుకకు మరలినవాఁడు నివృత్తుఁడు. ఇట్టివాఁడు తప్పక సన్న్యాసి యగునని చెప్పుటకు వీలులేదు. అందఱకును సన్న్యాసమున అధికారము లేదు. పింగళగాని, యదువుగాని సంన్యసించినట్లు చెప్పఁబడలేదు. వారికి సంన్యాసమున అధికారము లేకపోయినను సంసారమునుండి నివృత్తులైనా రనుట స్పష్టము. 'ఆదరింపక' (నాద్రియేత) అను మాటవలన ఇచ్చట కేవలమైన సంన్యాసాశ్రమము ఉద్దేశింపఁబడ లేదని స్పష్టమగుచున్నది. సన్న్యాసి నిత్యనైమిత్తికములను పూర్తిగా వర్జింపవలె. సన్న్యాసి విషయమున వానిని ఆదరించుట ఆదరింపక పోవుట అను వికల్పమే లేదు. నివృత్తుఁడైన గృహస్థుని విషయముననే ఇది వర్తించు ననుట స్పష్టము. ఆచార్యుఁడు తత్త్వబోధ కావించుచున్నప్పుడు సంధ్యావందనాదుల విషయమున కాలాతిక్రమణము జరిగినను, దానిని లెక్కపెట్టకుండ అధ్యాత్మవిచారమునే కొనసాగింపవలె. నిత్యనైమిత్తికాది కార్యక్రమములకంటె అధికముగా తత్త్వవిచారమునే ఆదరింపవలె. కాని అంతమాత్రముచేత ఆ కార్యములను మానుకోవచ్చు నని తలంపరాదు. తత్త్వవిచారము ముగిసిన తరువాత కాలాతిక్రమణ ప్రాయశ్చిత్తాదులతో వానిని ఆచరింపవలసినదే అని గ్రహింపవలసియున్నది.

యమనియమాదులను భగవానుఁడే వివరింపఁబోవుచున్నాఁడు.

వేదప్రమాణసిద్ధమై ఆచార్యునిచే ఉపదేశింపఁబడు నాత్మయొక్క అద్వితీయత్వము, నిత్యత్వము మొదలగువానికి భిన్నముగా విరుద్ధముగా జీవులనేకు లని నిత్యమైనయాత్మ లేదని చెప్పుమతములు లోకమున కలవని వానివలన భ్రమనొందరాదని భగవానుఁడు వానిని ఉటంకించి ఖండించెను. అట్లె ఆయన కర్మవాదమును కూడ నిరాకరించెను. "ఆత్మ జడము ; దానిని పొందుటవలన సుఖమేమున్నది ? యజ్ఞాదికర్మలవలన స్వర్గసుఖాదులను దివ్యపదవులను పొందవచ్చును" అని కొందఱందురు. కాని నిరంతర మృత్యుభయముచే ఈలోకములోని భోగములు కేవలసుఖప్రదములు కానట్లే, పతన భయమువల్ల స్వర్గాది భోగములు కూడ ఆనందప్రదములు కావని, బ్రహ్మదేవుఁడు కూడ పరమేశ్వరుఁడైన తనకు భయపడుచునే యుండునని చెప్పి భగవానుఁడు ఇట్లనెను. "ఇంద్రియములు కర్మలను సృజించుచున్నవి. జీవుఁడు ఇంద్రియసంయుక్తుఁడై భోగముల ననుభవించుచున్నాఁడు. సత్త్వాదిగుణములవైషమ్యము ఉన్నంతవఱకు జీవుల యందు నానాత్వము ఉండును. నానాత్వమువలన అధికశక్తి కలవానికి అల్పసత్త్వుఁడు లోఁబడవలసియే యుండును. అస్వతంత్రత పరాధీనత్వము ఉన్నంతవఱకు ఈశ్వరునివలన భయముండనే యుండును. గుణవైషమ్యకృతమైన యీ సంసారమునుండి ముక్తుఁడైనవాఁడే పరమానందమును పొందగలఁడు".

## (ii) ముక్తిస్వరూప చమసము

భగవంతుని యీ యుపదేశమును విని ఉద్ధవుఁడు ఇట్లనెను. "స్వామీ ! ఈవిషయమున నాకు సందేహము కలుగుచున్నది. త్రిగుణములయందు వర్తించుచున్నవాఁడు ముక్తుఁడగునా ? లేక గుణములయొక్క ఆవరణము నుండి తొలగినవాఁడు ముక్తుఁడగునా ? గుణములనుండి ఎవఁడైన తొలఁగినచో వానికి గుణములవలన కలుగు దేహాంతఃకరణాదులు ఉండవు. అవి లేకుండ ఎవఁడును శ్రవణమననాదులను గావింపఁలేడు. ఇంక ముక్తి ఎట్లు కలుగును ? గుణములవలన దేహేంద్రియాదులను పొందియున్నవానికి వానివలన బంధము తప్పదు. ఇంక ముక్తి ఎట్లు కలుగును ? జీవించుచు ముక్తులైనవారు ఎవఁడైన ఉన్నచో, అట్టివాఁడు

ట్లు వర్తించును ? ఎట్లు విహరించును ? ఎట్లు కూర్చుండును ? ఎట్లు పరుండును? ట్లు నడుచును ? ఏ లక్షణములచేత వానిని మనము ఎఱుంగవచ్చును ? కాఁజూడ నిత్యబద్ధుఁడైన వానినే ఏదేని ఒక విశిష్టతవలన నిత్యముక్తునిగా ప్పుచున్నారా ఏమి అనుభ్రమ నాకు కలుగుచున్నది. ప్రశ్నలనెఱింగి సమాధానము ప్పుటలో నీవు శ్రేష్ఠుఁడవు. కావున చెప్పుము".

ఆరంభమున అర్జునుఁడు కూడ స్థితప్రజ్ఞునిగూర్చి ఇట్లే ప్రశ్నించెను. అర్జునుఁడు శ్రీకృష్ణుని స్థితప్రజ్ఞునిగా గుర్తింపనట్లే, ఈ ప్రశ్నలవలన ఉద్ధవుఁడు కూడ భగవానుని ముక్తునిగా గుర్తించుట లేదని స్పష్టమగుచున్నది. గోవర్ధనమును ఉద్ధరించుట మొదలగు మహిమలవలన శ్రీకృష్ణుఁడు విష్ణుదేవుని యవతారమై యుండునని ఉద్ధవుఁడు తలంచుచుండెను. ఇంద్రత్వము మొదలగు పదవులవలె విష్ణుత్వము కూడ ఒక పదవియే అగుటచే, ఆయన మరల వైకుంఠమునకు పోయి ఆలోకమును పరిపాలించుచు నుండవచ్చు నని, అట్టిపరిపాలనము కూడ సంసారమే అగుటచేత, ఆయన కూడ ముక్తుఁడు కాదనియే ఉద్ధవుఁడు భావించుచున్నాఁ డనుట స్పష్టము. ముక్తుఁ డనఁగా శ్రీకృష్ణునివలె దేహధారియై అందఱవలె తినుచు త్రావుచు విహరించుచు నుండఁడని, చాలవిలక్షణముగా నుండునని ఉద్ధవుఁడు తలంచుచున్నాఁడు.

ఉద్ధవుని యీ యభిప్రాయమును తొలఁగించుచు భగవానుఁడు "దేహధారినై యున్నను నేను ముక్తుఁడనే" తన్ను ముక్తునిగా నిర్దేశించుచు ఇట్లు సమాధానము చెప్పెను. "బద్ధుఁడు, ముక్తుఁడు అను వ్యవహారము గుణములకు సంబంధించినదే కాని వాస్తవముగా నాకు లేదు. గుణములకు మూలము మాయ లేక అవిద్య. అవిద్య ఎవనికుండునో వానికి గుణములు, వానివలన సంసారము తోఁచును. నాకు అవిద్య లేదు. కావున నాకు బంధము లేదు మోక్షము లేదు. శోకమోహములు, వానికి మూలములైన సుఖదుఃఖములు, ఆ యనుభవములకు ఆధారమైన దేహము మొదలుగా ఈ సంసారమంతయు స్వప్నములోకూడ నున్నది. అది అప్పుడు ఆభాసమాత్రమే. ఇప్పుడు ఈ జాగ్రత్తులోని యీ జగత్తు కూడ ఆభాసమాత్రమే. మాయచేతనే అవిద్యవలన బంధము, విద్యవలన ముక్తి అనాదిగా ఉన్నవి. అవిద్య

యందు ఉన్నవారు బద్ధులుగనే యుండఁగా దాని నుండి తొలఁగినవాఁడు ముక్తుఁడగుచున్నాఁడు.

ముక్తునియొక్క బద్ధునియొక్క భేదమును వినుము. ఒకపెద్ద అశ్వత్థ వృక్షమునందు రెండు పక్షులు గూళ్ళు కట్టుకొనియున్నవి. రూపము కూజితము మొదలగువానిచేత అవి సమానముగా కన్పించుచు మిత్రులవలె నుండెను. వానిలో ఒకటి పండ్లను ఆసక్తితో భుజించుచుండఁగా రెండవది ఏమియు తినక ఊరకయే చూచుచుండెను. మొదట పక్షివంటివాఁడు బద్ధుఁడు. రెండవ పక్షివంటివాఁడు ముక్తుఁడు. బద్ధునకువలె ముక్తునకు కూడ దేహము ఉండును. కాని అతఁడు దేహమునందు ఉన్నను దానితో సంబంధమును పొందఁడు. స్వప్నమునుండి మేల్కొన్నవాఁడు తనకు ఆస్వప్నమునందు కలిగిన శరీరమువలన ఏర్పడిన సుఖదుః ఖాదులను గూర్చి చెప్పుచున్నను, ఆశరీరము నందు ఇప్పుడు తానున్నట్లు తలంపఁడు. అట్లే ముక్తుఁడు కూడ జాగ్రత్తులోని వ్యవహారమును స్వప్నమునుగానే చూచుచు శరీరముతో సంబంధము లేనివాఁడు గానే యుండును. "ఇంద్రియములే విషయములందు ప్రవర్తించుచు కర్మలు చేయుచు, వాని ఫలములను కూడ అవియే అనుభవించుచున్నవి. నేను ఏమియు చేయుట లేదు ; దేనిని అనుభవించుట లేదు" అని అతఁడు దేహేంద్రియాదులవలన జరుగుచున్న కార్యములతో వాని ఫలములతో ఏమియు సంబంధమును పొందక ఊరక చూచుచుండును. అజ్ఞాని అట్లు తలంపక, "ఆకార్యముల నన్నింటిని నేనే చేయుచున్నాను, అఫలములను నేనే అనుభవించుచున్నాను" అని అహంకారముతో ఆశరీరమే తన స్వరూపమునుగా భావించుచు బద్ధుఁడగుచున్నాఁడు. శరీరమునందున్నను ముక్తుఁడు తన్ను కర్తనుగా భోక్తనుగా ఎప్పుడును తలంపఁడు. "నోరు అన్నము తినుచున్నది, నీటిని త్రావుచున్నది; వానివలన ఈ ప్రాణము ఆకలిదప్పికలను తీర్చుకొనుచున్నది. ఇంద్రియములు ప్రియములో అప్రియములో అయిన విషయములను అందించుచుండగా ఈ మనస్సు సుఖమునో దుఃఖమునో పొందుచున్నది ; వీనితో నాకు ఏమియు సంబంధము లేదు" అని అతఁడు తలంచును. ప్రకృతియందున్నను సూర్యుఁడు, వాయువు ఆకాశము ఎట్లు దానితో సంబంధింపక యున్నవో అట్లే

ముక్తుఁడు దేహమునందున్నను దేహము లేనివాఁడుగానే యుండును. ప్రాణేంద్రియ మనో బుద్ధులయొక్క వ్యాపారములు ఎవనియందు వాని సంకల్పము లేకయే జరుగుచుండునో వాఁడు దేహమునందున్నను ఆదేహ గుణములచేత బద్ధుఁడు కాఁడు. తన శరీరము హింసింపఁబడినను లేక పూజింపఁబడినను ఆ హింసచేత పూజచేత అతఁడు వికృతిని పొందఁడు.

ఆత్మారాముఁడైన ముని ఎవనిని స్తుతింపక నిందింపక మంచిపనిని చెడ్డపనిని దేనిని చేయక జడునివలె వర్తించుచుండవలె. శాస్త్రరూపమైన శబ్ద బ్రహ్మమునందు పారంగతుఁడై, ఆత్మరూపమైన పరబ్రహ్మమునందు నిష్ణాతుఁడు కానివాఁడు, పాలనీయని ధేనువును పోషించువానివలె, శాస్త్రాధ్యయనమువలన కలుగు శ్రమనే ఫలమునుగా పొందును. పాలనొసంగని యావును, భక్తిలేని భార్యను, సేవావిధిచే పరులకు అధీనమైన దేహమును, దుష్టమైన సంతానమును, యోగ్యులకు ధర్మకార్యములకు ఉపయోగపడని ధనమును, భగవత్ప్రసంగము లేని వాగ్విలాసమును అనువీనిని రక్షించుకొనుచుండువాఁడు దుఃఖము వెంట దుఃఖమునే పొందుచుండును. పావనములైన నాయవతార లీలావిశేషములు దేనియందు ప్రశంసింపఁబడవో అట్టి వాగ్విన్యాసము, గొడ్రాలి భార్యాత్వమువలె, వ్యర్థము. అట్టి వాక్పరిశ్రమను ధీరుఁడు ఆదరింపఁడు.

ఈ విధముగా గాఢమైన యిచ్ఛతో ఆత్మతత్త్వమును తెలిసికొనుచు, గోచరించుచున్న నానాపదార్థములు వాస్తవముగా నున్నవను భ్రమను తొలఁగించుకొనుచు సంకల్పరహితమైన మనస్సును నాయందు నిలిపి సాధకుఁడు సకలవ్యవహారమును విరమించుకోవలయును. బ్రహ్మమునందు నిశ్చలముగా మనస్సును నిలుపుటకు శక్తి లేకున్నచో ఫలములను నాకు అర్పించుచు కర్మల నాచరించుచుండవలె. శ్రద్ధాళువై యతఁడు లోకపావనములైన నాకథలను వినుచు, స్మరించుచు, గానము చేయుచు అభినయము చేయుచు నుండవలె. నన్ను ఆశ్రయించి నాకొఱకు ధర్మార్థకామములను ఆచరించువాఁడు నాయందు నిశ్చలమైన భక్తిని పొందును. సత్పురుషులతోడి సంగముచేత భక్తితో నన్ను ఉపాసించువారు వారియుపదేశమున నాస్థానమును సుఖముగా పొందుదురు".

# 2. భక్తలక్షణ కమండలువు

## (i) భక్తి చమసము

ఉద్ధవుఁడిట్లనెను. "పరమేశ్వరా ! నీమతమున సత్పురుషుఁడు ఎట్టివాఁడు? అట్టివారిచే ఆదరింపఁబడి నీయందు ఉపయోగపడునట్టి భక్తి ఎట్టిది ? చెప్పుము".

భగవానుఁడిట్లు చెప్పెను. "కృపాళువు, ఎవ్వనికి ద్రోహము చేయనివాఁడు, సకలదుఃఖములను సహించు సత్త్వసహితుఁడు, అసూయాదిరహితుఁడు, సుఖదుఃఖములయందు సమముగా ఉండువాఁడు, ఎల్లరకు ఉపకారము చేయువాఁడు, కామములచేత చిత్తక్షోభమును పొందనివాఁడు, ఇంద్రియములను నిగ్రహించువాఁడు మృదుస్వభావుఁడు, శుచియైనవాఁడు, సంపదను పొందనివాఁడు, ఐహికాముష్మికభోగములను వేనిని కోరనివాఁడు, మితముగా భుజించువాఁడు, ఒంటరిగా నుండువాఁడు, మనోనిగ్రహము కలవాఁడు, ధర్మమున స్థిరమైనవాఁడు, నన్ను శరణుపొందినవాఁడు తత్త్వమననశీలుఁడు, జాగరూకుఁడు, గంభీరుఁడు, ఆపదయందు దైన్యము నొందనివాఁడు, 'ఆకలి దప్పికలు, శోకమోహములు, జరామృత్యువులు' అనునాఱింటిని జయించినవాఁడు ; తన్ను గూర్చి గొప్పగా తలంపనివాఁడు, యోగ్యులను గౌరవించువాఁడు, సమర్థుఁడు, సమానులతో మైత్రిని పొందువాఁడు, కరుణ కలవాఁడు, భూతభవిష్యద్వర్తమాన విశేషములను చక్కఁగా గ్రహించువాఁడు సత్పురుషుఁడు.

ఈ గుణదోషములను ఎఱింగియు శ్రుతిస్మృతులయందు నాచే విధింపఁబడినవానిలో తనకు విహితములైన ధర్మములను సైతము వదలి నన్నే భజించువాఁడు కూడ సాధుపుంగవుఁడే యగును. నేను ఎంతవాఁడనో, ఎవఁడనో, ఎట్టివాఁడనో తెలిసికొన్నను, తెలిసికొనలేక పోయినను అనన్యభావముతో నన్ను భజించువారు భక్తులలో శ్రేష్ఠులే యగుదురు".

శ్లో॥ ఆజ్ఞాయైవం గుణాన్ దోషాన్ మయాదిష్టానపి స్వకాన్ ।
ధర్మాన్ సంత్యజ్య యస్సర్వాన్ మాం భజేత్సోఽపి సత్తమః ॥ 31

శ్లో॥ జ్ఞాత్వా జ్ఞాత్వాపి యే వై మాం యావాన్ యశ్చాస్మి యాదృశః ।
భజం త్యనన్యభావేన తే వై భక్తతమా మతాః ॥ 32

స్కంధ - 11 - అధ్యాయ. 11

పరులదుఃఖమును తొలఁగింపవలయు ననుతలంపు కృప. శరీరశక్తి మనోబలము సత్త్వము. ఆకలి మొదలుగా ఆఱింటిని జయించుట అనఁగా వానివలన కలుగు వ్యథవలన ధర్మమార్గము నుండి తప్పకుండుట ఇతరుల కష్టములయందు సానుభూతిని పొందుట కరుణ.

గుణదోషముల నెఱింగియు స్వధర్మమును కూడ పరిత్యజించి తన్ను భజించువాఁడు కూడ సాధుపుంగవుఁడే యగునని భగవానుఁడు చెప్పుటకు ఏమి యర్థము ? "మేము భక్తుల"మని ప్రకటించుచు ధర్మమును పరిత్యజించువారు కూడ సాధుపుంగవులే యగుదురా? "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" అని యర్జునునితో భగవానుఁడు చెప్పిన సందర్భ మెట్టిదో ఇదియు నట్టిదే. ఇచ్చట ప్రస్తావింపఁబడినది సామాన్యమైన భక్తి కాదు. ఇది అనన్య భక్తి. సంపదను గాని తన శక్తిసామర్థ్యములను గాని మహాపురుషులను గాని దేవతలనుగాని ఆశ్రయింపక పరమేశ్వరునే ఆశ్రయించి తనయోగక్షేమములను ఆయనకే అప్పగించి నిరంతరము ఆయననే భావించుచు ధ్యానించుచుండుట అనన్యభక్తి. ప్రహ్లాదుఁడు విభీషణుఁడు మొదలగువారు చాలకొలఁది మంది మాత్రమే ఇట్టిభక్తులుగా ఉదాహరింపఁ దగినవారు. ఇట్టివారు లోకధర్మములను పాటింపకపోయినను సాధుపుంగవులే యగుదురని భగవానుఁడు చెప్పుచున్నాఁడు. తత్త్వవిచారమునందు నిమగ్నులైనవారివలె వీరు కూడ భక్తి పారవశ్యముతో సంకీర్తనాదులు చేయుచున్నప్పుడు అన్నపానములను ఆదరింపనట్లే ఒక్కొక్కప్పుడు సంధ్యావందనాదులను సకాలముగా ఆచరింపక పోవచ్చునని, అయినప్పటికిని వారు సాధువరేణ్యులే అగుదురనుట భగవంతుని యభిప్రాయముగా గ్రహింపవలసియున్నది. ఇట్టివారు ఈశ్వరశరణాగతికి ప్రతిబంధకములుగా ఏర్పడిన ధర్మములను కొన్నింటిని అతిక్రమించినను, ఎల్లప్పుడు నాస్తికులవలె ధర్మమును అతిక్రమించి స్వేచ్ఛావర్తనులై యుందురని తలంపరాదు.

తండ్రిమాటను ఆదరింపక విష్ణువును భజించిన ప్రహ్లాదుఁడు, అన్నచేపరిత్యజింపఁబడి ఆతని శత్రువైన శ్రీరాముని శరణుజొచ్చిన విభీషణుఁడు, శరణాగతి ధర్మమునకు విరుద్ధములుగాని నిత్యనైమిత్తిక రాజ్యపాలనాది ధర్మములను శ్రద్ధతో అనుష్ఠించినారని, వారు స్వేచ్ఛావర్తనులు కారని గ్రహింపవలసియున్నది. ఇటీవల మహాభక్తాగ్రగణ్యులుగా ప్రసిద్ధులైన పోతన్న, కంచెర్ల గోపన్న (రామదాసు), త్యాగరాజస్వామి పుండరీకుఁడు, తుకారామ్, తులసీదాసు మొదలగువారెవ్వరును నిత్యనైమిత్తికాది ధర్మములను వదలిపెట్టిన స్వేచ్ఛావర్తనులు కారని, ధార్మిక వరేణ్యులే అని గుర్తింపవలసియున్నది. సూర్యుఁడు అగ్ని మొదలగు రూపములలో తన్ను అర్చింపవలయునని భక్తిని గూర్చి చెప్పుచు భగవానుఁడే ధర్మానుష్ఠానమునే ప్రముఖముగ ఉద్ఘాటింపఁ బోవుచున్నాఁడు.

తరువాత భగవానుఁడు భక్తి విధానమును ఇట్లు వివరించినాఁడు. "నా ప్రతిమలను నా భక్తులను దర్శించుట, పాదాభివందనాదులచేత స్పృశించుట, అర్చించుట, పరిచర్య, స్తుతించుట, నాగుణములను కర్మలను కీర్తించుట, నాకథలను వినుటయందు శ్రద్ధ, నన్ను ధ్యానించుట, తనకు లభించిన దంతయు నాకు నివేదించుట, దాసభావము నా జన్మమును కర్మలనుగూర్చి యితరులకు చెప్పుట, నా పర్వదినముల విశేషమును ప్రకటించుట, నాయాలయములయందు సంగీత గోష్ఠులతో ఉత్సవములను జరుపుట, చాతుర్మాస్యము మొదలైన వార్షికపర్వములయందు పుణ్యక్షేత్రములకు యాత్రలు చేయుచు అచ్చట నన్ను ఉద్దేశించి విశేషపూజలను గావించుట, వైదికముగా గాని తాంత్రికముగా గాని నా వ్రతములయందు దీక్ష వహించుట, నాయర్చామూర్తులను స్థాపించుటయందు శ్రద్ధ, నాపూజా మహోత్సవములకొఱకు ఉద్యానములను ఉపవనములను పురమందిరములను స్వయముగాఁ గాని ఇతరులతోడ్పాటుతోఁగాని ఉద్యమించుట, నాయాలయములయందు సమ్మార్జనము నీళ్లు చల్లుట గోమయముతో అలుకుట సర్వతోభద్రాదిమండలములతో అలంకరించుట మొదలగు పనులను దాసునివలె వంచనము లేకుండ చేయుట, "ఈసేవలన్నియు నేను చేయుచున్నాను" అని యహంకరింపకుండుట, చేసిన కార్యములను ప్రకటింపకుండుట, ఇతరదేవతలకు

నివేదించిన ధూపదీపాదికమును నాకు నివేదింపకుండుట, లోకమున అందఱకును ఏది అత్యంతము ఇష్టమో తనకు ఏది మిగుల ప్రీతికరమో అట్టి పదార్థములను నాకు నివేదించుట భక్తిలోని ప్రకారములు. ప్రియతమ పదార్థమును నాకు నివేదించినచో 'అది అనంతమైన పుణ్యఫలము నొసంగును.

సూర్యుఁడు, అగ్నిమొదలుగా పదార్థవిశేషములు నాకు పూజాస్థానములు. సూర్యునియందు వైదికములైన సవితృసూక్తములతో, అగ్నియందు హవిస్సుతో విప్రాగ్రేసరునియందు ఆతిథ్యముతో, గోవులయందు పచ్చిక మొదలగువానితో, విష్ణుభక్తునియందు బంధుత్వాదరముతో, హృదయాకాశమునందు ధ్యాననిష్ఠతో, వాయువునందు ప్రాణదృష్టితో, తోయమునందు అర్ఘ్యతర్పణాదులతో, భూమి యందు మంత్రరహస్యన్యాసములతో, ఆత్మయందు తాను పొందుచున్న సకలభోగములతో, సకల భూతములందు క్షేత్రజ్ఞుఁడు సమముగా నున్నాఁడనుభావనతో, శంఖచక్రగదాంబుజ హస్తునిగా చతుర్భుజునిగా నన్ను ధ్యానించుచు పూజింపవలయును. ఇష్టాపూర్తములను నిర్వహించుచు వానివలన కూడ నన్నే పూజించుచున్నట్లు ధ్యానించువాఁడు కూడ సాధువులను సేవించుచు నాయందు శ్రేష్ఠమైన భక్తిని పొందును.

ఉద్ధవా ! సాధారణముగా భక్తియోగము, సత్సంగము అను రెండును లేకుండ నన్ను పొందుటకు వేఱొక యుపాయములేదు. నీవు నాకు భృత్యుఁడవు సఖుఁడవును అగుటచేత రహస్యమును చెప్పుచున్నాను వినుము. యోగము సాంఖ్యము స్వాధ్యయము తపస్సు దానము ఇష్టాపూర్తములు మొదలుగా ఇవి యేవియు సత్సంగమువలె, సాంసారికములైన సర్వసంగములను తొలఁగింపలేవు ; నాయందు ధ్యానమును నిలుపలేవు. సత్సంగముచేతనే దేవదానవదైత్యగంధర్వాదులే కాక మనుష్యులలో స్త్రీలు శూద్రులు అంత్యజాలు కూడ, ఖగమృగాదులు సైతము రాజసతామస స్వభావములు కలవారయ్యును ఆయా యుగములలో నన్ను పొందిరి. ప్రహ్లాదవిభీషణ బలివృషపర్వాదులు, సుగ్రీవహనుమజ్జాంబవదాదులు, జటాయువు తులాధారుఁడు ధర్మవ్యాధుఁడు, కుబ్జ, గోపికలు, యజమానపత్నులు మొదలగువారు ఇట్లే కృతార్థులైరి. వీరిలో అనేకులు వేదములనెఱుంగరు ; చాలగొప్పవారిని సేవింపలేదు ; వ్రతములు

తపస్సులు చేయలేదు ; అయినను సత్సంగముచేతనే నాధ్యానమునందు స్థిరమైన చిత్తము కలవారై నన్ను పొందిరి.

నన్ను గాఢముగ ప్రేమించుట తప్ప మూఢచిత్తలైన గోపికలు ఏమి సాధనలు చేసినారు ? అక్రూరుడు నన్ను మాయన్నను మధురకు తీసకొని పోయినప్పుడు నాయందు గాఢమైన యనురాగముతో ఆగోపికలు తీవ్రమైన వియోగదుఃఖమున పొంది ఎచ్చటను ఎవ్వరితో ఏవిధముగానైన సుఖమును పొందలేక పోయిరి ప్రియతముఁడైన నాతో బృందావనమున విహరించిన రాత్రులు అరక్షణమువలె వారికి గడచిపోయెను. అట్టి రాత్రులే నావియోగమున వారికి ప్రళయకల్పమువలె దీర్ఘములయ్యెను. సముద్రమునందు ప్రవేశించిన నదులకు నామరూపములు ఎట్లుండవో, అట్లే సమాధియందు మునులకు తమనామరూపములు గోచరింపవు. ఆప్రకారముగానే నాయందు మగ్నమైన చిత్తముగల గోపికలకు తమ శరీరముకాని ఈ లోకముకాని పరలోకము కాని ఏదియు గోచరింపలేదు. వారికి చెట్లయందు పుట్టలయందు ఎల్లయెడల నారూపమే గోచరించుచుండెను. బ్రహ్మమునుగా నాస్వరూపమును వారు ఎఱుంగరు. కాని వేయివిధములైన భావనలతో జారునిగానే నన్ను భావించుచు, అనన్యభావముచేత, నాస్వరూపమైన బ్రహ్మమునే పొందిరి. కావున ఉద్ధవా ! శ్రుతిస్మృతుల చోదనమును, ప్రవృత్తి నివృత్తిని, వినవలసినదానిని, ఇప్పటికి విన్నదానిని సర్వమును విడి, సర్వజీవులకు ఆత్మనుగా సర్వజగత్స్వరూపముగా నన్ను ఒక్కనినే శరణు పొందుము. నావలన నీవు నిర్భయుఁడ వగుదువు".

పుష్పములకొఱకు ఉద్దేశింపఁబడినది యద్యానవనమని, ఫలములకొఱకు పెంపొందింపఁబడినది ఉపవనమని శ్రీధరాచార్యుఁడు నిర్వచించెను.

అవధూతలకు వలె నిరంతరమైన ఆత్మానుసంధానము కలుగుటకు గోపికలకు భక్తిపారవశ్యము సిద్ధించుటకును సూర్యుఁడు అగ్నిమొదలుగా పూజాస్థానములయందు భగవంతుని ధ్యానించుచు యథావిధిగ పూజించుచు స్వధర్మమును సాధారణభక్తులు అనుష్ఠించుచు నుండవలసినదే యని పై సందర్భమువలన వ్యక్తమగుచున్నది.

## (ii) హంసచమసము

ఉద్ధవుఁడు ఇట్లనెను. "యోగేశ్వరా ! నీమాటలు వినుచుండగా నామనస్సును భ్రమింపఁజేయుచున్న సంశయము తొలఁగుటలేదు".

శ్లో|| సంశయ శ్శృణ్వతో వాచం తవ యోగేశ్వరేశ్వర !
న నివర్తత ఆత్మస్థో యేన భ్రామ్యతి మే మనః || 16

స్కంధము - 11 - అధ్యాయ 12

ఈ సంశయ మేదియో పై శ్లోకమున చెప్పఁబడలేదు. వెంటనే భగవానుఁడు సమాధానము చెప్పఁజొచ్చెను. ఆ సమాధానమును బట్టి శ్రీధరాచార్యుఁడు ప్రశ్నస్వరూపమును సమాధాన తాత్పర్యమును ఇట్లు నిరూపించెను. "పూర్వము 'నాచేత చెప్పఁబడిన స్వధర్మముల యందు శ్రద్ధకలవాఁడవగుము' (మ యోదితే ష్వవ హిత స్స్వధర్మేషు మదాశ్రయః - శ్లో.1, అధ్యాయ 10) అని కర్మ కర్తవ్యమని చెప్పితివి. "ఇప్పుడు సర్వమును త్యజించి నన్ను శరణమును పొందుము. (మా మేక మేవ శరణ మాత్మానం సర్వదేహినామ్ | యాహి సర్వాత్మభావేన మయా స్యా హ్యకుతో భయః || శ్లో.15 - అధ్యాయ. 12) అని చెప్పుచున్నావు. ఈ విషయమున ఆత్మకు కర్తృత్వాదికము ఉన్నదా లేదా అని ఆత్మలక్షణమును గూర్చి సంశయము తొలఁగుటలేదు ; లేదా కర్మ చేయఁదగినదా లేక త్యజింపఁదగినదా అను సంశయమైనను తొలఁగుటలేదు - ఈ సంశయమతితో ఉద్ధవుఁడు ప్రశ్నించుచున్నాఁడు.

ఈ సంశయమునకు ఉత్తరముగా భగవంతుఁడు చెప్పుచున్న సమాధానమున భావమిది. ఈశ్వరుఁడు తన మాయచేత ప్రపంచాత్మకుఁడుగా భాసించుచున్నాఁడు. ఆ ప్రపంచముయొక్క అధ్యాసవలన జీవులకు అనాదియైన యవిద్యచేత కర్తృత్వాదికము, దానివలన విధి ప్రతిషేధములయందు అధికారము భాసించుచున్నది. ఇట్లు ప్రపంచము భాసించుచున్నప్పుడు జీవులకు చిత్తశుద్ధి కొఱకు "కర్మములు చేయుము" అని చెప్పఁబడినది. వారికే మరల, చిత్తశుద్ధి సిద్ధించిన తరువాత, కర్మలవలన కలుగు జడత్వమును (ఆసక్తిని) తొలఁగించుట కొఱకు, భక్తికి విక్షేపమును

కలిగించునట్టి కర్మల యందలి యాదరమును పరిత్యజించి దృఢవిశ్వాసముతో భగవంతుని భజింపుము అని చెప్పఁబడినది. విద్య (జ్ఞానము) కలిగినతరువాత (వారికే) ఏదియు కర్తవ్యము లేదని చెప్పఁబడుచున్నది.

పూర్వం తావ న్మయోదితే ష్వవహితః స్వధర్మేషు ఇత్యాదినా కర్మ కర్తవ్య మిత్యుక్తం | ఇదానీం తు సర్వం త్యక్త్వా మాం శరణం యాహి ఇత్యుచ్యతే | తత్ర కి మాత్మనః కర్తృత్వాది అస్తి నాస్తి వా ఇతి, ఆత్మస్థః ఆత్మవిషయః సంశయః న నివర్తతే | యద్వా | కర్మకార్యం త్యాజ్యం వా ఇతి ఆత్మస్థః హృదిస్థః సంశయః న నివర్తతే ఇతి వృచ్ఛతి - సంశయ ఇతి యేన సంశయేన ఉత్తరం 'స ఏష' ఇత్యష్టభిః |

అయం భావః ఈశ్వర స్తావత్ స్వమాయావశాత్ ప్రపంచాత్మనా భాతిః| తత్ప్రపంచాధ్యాసా చ్చ జీవానా మనాద్యవిద్యయా కర్తృత్వాదిః తతః విధిప్రతిషేధాధికారః (భాతి) తదానీం సత్త్వ శుద్ధ్యర్థం 'కర్మాణి కురు' ఇత్యుక్తమ్ ; సత్త్వే చ శుద్ధే పునః కర్మజాడ్యపరిహారాయ భక్తివిక్షేపకం కర్మాదరం పరిత్యజ్య దృఢవిశ్వాసేన భజే త్యుక్తమ్ ; జాతాయాం తు విద్యాయాం న కించి త్కర్తవ్య మస్తీతి (ఉక్తమ్)

భగవంతునిబోధ కంతకును ఇదియే తాత్పర్యము. అర్జుననకు భగవంతుఁడు మొదట "స్వధర్మమున నిధనము శ్రేయము (స్వధర్మే నిధనం శ్రేయః) అని చెప్పి మరల, "సర్వధర్మములను వీడి నన్ను ఒక్కనినే శరణము పొందుము" (సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ) అని చెప్పినప్పుడు కూడ ఆయన తాత్పర్య మిదియే యని గ్రహింపవలసియున్నది. అవధూతస్థితి లేక అట్టి భక్తి పారవశ్యము కలుగు వఱకు ఎల్లరు స్వధర్మకర్మలను ఆచరింపవలసినదే అనుట స్పష్టము.

భగవంతుని సమాధానములోని ప్రధానవిషయములను ఇట్లు గ్రహింపవచ్చును. "ఈ సంసారము మహావృక్షమువలె సూర్యమండలమువఱకు వ్యాపించియున్నది. దీనికి సుఖము దుఃఖము అనునవి రెండు ఫలములు. గ్రామములందు వసించుచు వివిధకామనలతో కర్మపరాయణులై కొందఱు దుఃఖఫలమును భుజించుచుందురు. ఇతరులు అరణ్యములందు వసించుచు హంసలై సుఖఫలమును భుజించుచుందురు.

ఈ విధముగా బహురూపములతో విస్తృతమై మాయామయమైయున్న ఈ సంసారముయొక్క తత్త్వమును తెలిసికొన్నవాఁడు, వేదములయొక్క తాత్పర్యమును గ్రహించును. గురువులయొక్క ఉపాసనచేత నాయందు అనన్యమైన భక్తిని పొంది, దానివలన కలిగిన వాడియైన గండ్రగొడ్డలివంటి జ్ఞానముచేత ధీరుఁడవై జాగరూకుఁడవై జీవభావమునకు మూలకందమైన లింగ (సూక్ష్మ) శరీరమును ఛేదించి ఆత్మస్వరూపుఁడవై, ఆ జ్ఞానమును అస్త్రమును త్యజింపుము.

సంసారకారణములైన సత్త్వము, రజస్సు, తమస్సు అనుగుణములు బుద్ధికి సంబంధించినవే ; కాని ఆత్మకు లేవు. సత్త్వముచేత రజస్సును తమస్సును హతమొనరింపవలె. తరువాత ఆ సత్త్వముచేతనే కలిగిన జ్ఞానముచేత సత్త్వగుణమును కూడ నిర్మూలింపవలె. చిత్తశుద్ధివలన మద్భక్తిరూపమైన ధర్మము రూపొందును. సాత్త్వికములైన శాస్త్రాదులను ఉపాసించుటవలన సత్త్వము దానివలన ధర్మము పెంపొందును. సత్త్వవృద్ధివలన కలిగిన శ్రేష్ఠమైన ధర్మము రజస్సును తమస్సును హతమొనరించును. అవి రెండును నశించినంతనే వాని మూలమున కలుగునట్టి రాగద్వేషాదిరూపమైన యధర్మము నశించును.

శాస్త్రము, నీరు, ప్రజ, దేశము, కాలము, కర్మ, జన్మ, ధ్యానము, మంత్రము, సంస్కారము - అను నీపది పదార్థములు గుణములకు హేతువు. వీనిలో సాత్త్వికములైన వానినే పెద్దలు ప్రశంసించుచు, రాజసములను ఉపేక్షించుచు తామసములను నిందింతురు. కావున సత్త్వగుణవృద్ధికొఱకు సాత్త్వికములైన వానినే సేవింపవలె. దీనివలన ధర్మము కలుగును. దానివలన గుణములను తొలఁగించి ఆత్మ సాక్షాత్కారమును కలిగింపఁ గలిగిన జ్ఞానము ప్రాదుర్భవించును. పరస్పర ఘర్షణమువలన వెదుళ్లనుండియే పుట్టిన యగ్ని ఆ వెదుళ్లనే దగ్ధ మొనరించి ఆరిపోవునట్లు, గుణముల విషమ సమ్మేళనమువలన రూపొందిన శరీరమునుండి పుట్టిన జ్ఞానాగ్ని ఆదేహమునందున్న యభిమానమును దగ్ధమొనర్చి శమించును". శ్రీధరాచార్యుఁడు ఊహించి నిరూపించిన యుద్ధవుని సంశయమునకు భగవంతుని ప్రత్యుత్తరమువలన సమాధానము ఇట్లు లభించెనని గ్రహింపవచ్చును. ఆత్మకు కర్తృత్వాదికము ఉన్నదా లేదా ? ఈ జగత్తు వాస్తవముగా (Reality)

గోచరించుచున్నంతవఱకు జీవులకు కర్తృత్వభోక్తృత్వాదులు తప్పక యుండును. కాని ఆత్మకు కర్తృత్వభోక్తృత్వాది విశేషములు ఏవియు లేవు. అది నిర్విశేషము. నిర్విశేషమై చైతన్యమాత్రమైన యాత్మయే తమయొక్క స్వరూపమని గ్రహించి ఆత్మనిష్ఠులైన యవధూతలు, ప్రహ్లాదుని వలె సకల పదార్థములయందు భగవత్స్వరూపమును చూచు మహాభక్తులు ఈ జగత్తును ఎండమావులలో కన్పించు నీరువలె అసత్యముగనే గ్రహింతురు. ఆ నీటివలన దప్పిక తీర్చుకోవలె ననుతలంపు ఎట్లు కలుగదో అట్లే వారికి కూడ ఈ జగత్తు వలన సుఖమును పొందవచ్చునను తలంపు కలుగదు, అందువలన కర్తృత్వ భోక్తృత్వములు ఉండవు.

కర్మ చేయఁదగినదా లేక పరిత్యజింపఁదగినదా అనునది రెండవ వికల్పము. జగత్తు యథార్థముగా కన్పించుచు కర్తృత్వము తోఁచుచున్నంత వఱకు జీవత్వముండును. అంతవఱకు స్వధర్మకర్మలను తప్పక అనుష్ఠింపవలసినదే. కాని వానికే ఆత్మనిష్ఠ కలిగిన తరువాత జగత్తు అసత్యమని దృఢముగా తోఁచుచున్నప్పుడు కర్మలు, కర్తృత్వము, కర్తవ్యములు ఏవియు భాసింపవు.

సాత్త్వికపదార్థములను ఇట్లు గ్రహింపవలెను. జ్ఞానవైరాగ్య ప్రదమైనదే శాస్త్రము; నాస్తికమైనది ఉభయలోక సుఖభోగసాధనమైనది కాదు. తీర్థములే నీరు ; రుచికర పానీయములు కాదు. జ్ఞానవైరాగ్య సంపన్నులే ప్రజ ; లౌకికులు కాదు ; ఏకాంతములు పవిత్రములునైన వనములు మొదలగునదియే దేశము ; వీథులు విలాసగృహములు కాదు. బ్రాహ్మీముహూర్తము మొదలుగా ప్రశాంతమైన సమయమే కాలము ; ఉత్సవములో ఊరేగింపులు జరుగు సమయము కాదు ; ప్రదోషము నిశీథము మొదలగునది కూడకాదు. నిత్యనైమిత్తికమైనదే కర్మ ; కామ్యము, శత్రుహింసాత్మకమైన అభిచారికము మొదలైనది కాదు. గురువులవలన మంత్రోపదేశమును పొంది వైష్ణవ దీక్షనో శైవదీక్షనో వహించుటయే జన్మము ; పుణ్యమును సంపాదించి స్వర్గముననో ఈ లోకమున సంపన్నుల యింటనో జన్మించుట కాదు ; క్షుద్రమంత్రదీక్షలు కూడ కాదు. పరమేశ్వరునియందు చిత్తము నిలుపుటయే ధ్యానము ; కామినీ కాంచన భావనము కాదు ; శత్రుసంహార చింతనము కాదు. గురువుచే నుపదేశింపఁబడిన అష్టాక్షర పంచాక్షర ప్రణవాదికమే మంత్రము ; కామ్యములు క్షుద్రములు నైన

మంత్రములు కాదు. దోషములను తొలఁగించి గుణములను పెంపొందించుకొనుట సంస్కారము. రాగద్వేషాదులను తొలఁగించుకొనుచు దమశమాదులను పెంపొందించుకొనుటయే సంస్కారము ; గృహదేహాదుల సౌష్ఠవము కాదు ; అలంకరణము కాదు.

ఉద్ధవుఁడు ఇట్లు ప్రశ్నించెను. "అయ్యా ! విషయభోగములు ఆపదలకు స్థానము లని సాధారణముగ మర్త్యు లెఱుంగుదురు. అయినను వారు కుక్కలవలె గాడిదలవలె మేకలవలె ఎందువలన భోగములను అనుభవించుచునే యున్నారు?"

తమ్ము తిరస్కరించుచు ఆడ కుక్కలు మొఱుఁగుచు తొలఁగిపోవుచున్నను మగకుక్కలు వానివెంటఁ బడుచునే యుండును. ఆడగాడిదలు వెనుక కాళ్ళతో తన్నుచునే యున్నను మగగాడిదలు వానిపైకి విజృంభించుచునే యుండును. మెడకు త్రాడుగట్టి లాగుకొనిపోవుచునే యున్నను మేకలు మేఁత నిచ్చుచున్న వారివెంట పోవుచునే యుండును. అట్లే మానవులు కూడ తిరస్కార రోగాది విపత్తులకు లోనగుచుండియు స్త్రీ మద్యపానాది వ్యసనములకు లోనగుచున్నారు.

భగవంతుఁ డిట్లనెను. "ప్రమత్తుఁడైన వానికి తనస్వరూపము కాని దేహమునందు, "దేహమే నేను" అనుభావము హృదయమును ఆక్రమించును. దానివలన సత్త్వప్రధానమైన మనస్సునందు కూడ రజోగుణము ప్రబలి, "ఇది నాకు కావలె ; దీని నిట్లు సంపాదింపవలె' అను సంకల్పవికల్పములతో కామము బయలుదేరును. కామ్యమైన పదార్థమును గూర్చి, ధ్యానమువలన "అహో ఏమి దీనిరూపము, ఆహా ఏమి దీని విలాసము" అనుభావపరంపరలతో కామము గాఢమై దుర్భర మగును. దానికి వశుఁడై ఇంద్రియములను నిగ్రహింపలేక, తుదకు దుఃఖము తప్పదని తెలియుచున్నను, ఆకామవేగముచేత విమోహితుఁడై వివిధకార్యములను చేయుచు వాని ఫలములచే బద్ధు డగును. విషయదోషములను గ్రహించి మనస్సును నిగ్రహించినవాఁడు వానియందు ఆసక్తి నొందఁడు. అప్రమత్తుఁడు, "ఈకామమును నిగ్రహించుట అసాధ్యము" అని నిర్వేదమును పొందక ప్రాణాయామాదులచేత మనస్సును నిగ్రహించి నాయందు నిలుపవలయును. అన్నివైపుల నుండి మనస్సును

ఆకర్షించి సాక్షాత్తుగా నాయందు నిలుపుట అనునీయోగమును నా శిష్యులైన సనకాదులకు ఉపదేశించితిని".

ఆ మాట విన్నంతనే, 'పురాతనులైన యాసనకాది మహర్షులను ఎప్పుడు ఏ రూపమున ఉపదేశించి యుండును' అనుకుతూహలముతో ఉద్ధవుఁడు ఇట్లు ప్రశ్నించెను. "భగవానుఁడా ! ఆమహర్షులకు బోధించునప్పుడు నీవు ఏ రూపముతో బోధించితివో ఆ రూపమును తెలిసికొనఁగోరుచున్నాను".

"ఏ రూపముతో" (యేన రూపేణ) అన్నప్పుడు ఉద్ధవుఁడు భగవంతుని యప్పటి ఆకృతినే కాక ఉపదేశముయొక్క రూపమును, అనఁగా ప్రకారమును కూడ తెలిసికొనఁగోరుచున్నాఁడు. ఆ మహర్షులకు ఎట్లు ఆయన ఉపదేశించెనో ఆ ప్రకారముననే తనకు కూడ ఉపదేశింపవలయునని ఉద్ధవుఁడు కోరుచున్నాఁడు.

భగవానుఁడు ఇట్లు చెప్పెను. "హిరణ్యగర్భునకు మానసపుత్త్రులైన సనకసనందనాదులు దుర్విజ్ఞేయమైన యోగముయొక్క పరాకాష్ఠనుగూర్చి ఇట్లు ప్రశ్నించిరి. 'విషయములందు మనస్సు విహరించుచున్నది. ఆయనుభవమువలని సంస్కారమూలమున విషయములు మనస్సులో నెలకొనుచున్నవి. మోక్షమును గోరువాఁడు ఆ విషయములను అతిక్రమింపఁ దలఁచునప్పుడు మనస్సునకు విషయములకు పరస్పరత్యాగమెట్లు సంభవించును ?" జగత్తునకు సృష్టికర్త యయ్యును ఆమహాదేవుఁడు, కర్మప్రధానమైన బుద్ధి కలవాఁడగుటచే, దానినిగూర్చి ఆలోచించియు, ఆ ప్రశ్నయొక్క బీజమును గ్రహింపలేక నన్ను ధ్యానించెను. అప్పుడు నేను హంసరూపముతో ఆయనయొద్దకు పోయితిని. వారు నన్నుచూచి బ్రహ్మదేవుని పురస్కరించుకొని ఎదురుగా వచ్చి పాదాభివందనము గావించి, "మీరు ఎవరు?" అని ప్రశ్నించిరి. అట్లు అడిగిన యాతత్త్వజిజ్ఞాసువులతో నేనేమంటినో చెప్పెదను. గ్రహింపుము.

"మీ ప్రశ్న ఎట్లు కుదురును ? మీరు నాయాత్మను గూర్చి ప్రశ్నించుచున్నారా లేక దేహమునుగూర్చి ప్రశ్నించుచున్నారా ? ఇది ఆత్మను గూర్చి ప్రశ్నయైనచో, ఏక వస్తువైన యాత్మకు నానాత్వము లేదు. ఉన్నది యొక్కటియే యైనప్పుడు

అనేకులలో ఒకనిని అడిగినట్లు, "మీరు ఎవరు" అని అడుగుట ఎట్లు కుదురును? విశేష మేదియును లేని యాత్మనుగూర్చి నేనైనను దేనినవలంబించి సమాధానము చెప్పుదును ? పంచభూతాత్మకమైన దేహమునుగూర్చియైనను ఈ ప్రశ్న కుదురదు. పంచభూతాత్మకత్వముచేత సకల దేహములు సమానములే. కుండలన్నియు మట్టితో ఏర్పడుచుండగా ఒక కుండను చూచి, "ఇది ఏమి పదార్దము" అని యడుగుట వ్యర్థము. చట్టిమూకుఁడు కుండ మొదలుగా అన్నింటియందును యదార్థమైన వస్తువు మట్టియే. కుండ, చట్టి, మూకుఁడు అను నామములు వాక్కులో భేదములే కాని వస్తువులు కావు. వాని యాకారములు కూడ వస్తువులు కావు. మట్టిని వదలినచో ఆనామరూపములకు అస్తిత్వము లేదు. అట్లే దేహములలో కూడ పంచభూత సమ్మేళనాత్మకమైన పదార్థ మొక్కటే వస్తువు ; నామరూపములకు వస్తుత్వము లేదు. కావున ఈ దృష్టితో కూడ మీ ప్రశ్న కుదురదు. మీరు మనస్సుచేత ఇంద్రియములచేత దేనిని గ్రహించుచున్నారో అది యంతయు నేనే అని, నాకంటె అన్యముగా ఏదియు లేదని చక్కఁగా ఆలోచించి గ్రహింపుఁడు.

ఇంక, బిడ్డలారా ! విషయములకు చిత్తమునకు వియోగమెట్లు సంభవించునని మీరడుగుచున్నదానికి సమాధానమును వినుఁడు. వాసనామయమైన మనస్సు విషయములలో విహరించుచుండఁగా, ఆ విషయమానుభవము చేత వాసనలు పెరుగుచున్నవి. వాసనామయమైన చిత్తము సూక్ష్మదేహమె, అది బీజముగా దాని నుండి చెట్టువలె స్థూలదేహము కలుగుచున్నది. ఈ దేహములు జీవునకు స్వరూపమైనచో మీరన్నట్లు విషయములకు చిత్తమునకు వియోగము సంభవింపదు. కాని నాయంశమైన జీవునకు ఇవి స్వరూపము కాదు. కావున ముముక్షువు నిర్విశేషమైన నాస్వరూపమును పొంది వానిని పరిత్యజింపవలె. జగత్తు, స్వప్నము, సుషుప్తి అనుదశలలో జరుగుచున్న సంసారము బుద్ధికి సంబంధించినదే కాని, యథార్థముగ జీవునకులేదు. "నేను భుజించుచున్నాను. నేను నిద్రించుచున్నాను ; నేను కలఁగనుచున్నాను' అని చెప్పుచున్న జీవుఁడు, ఆ దశలు మాఱినను తానుమాఱక, వానికి సాక్షిగా నిర్విశేషముగ నున్నాఁడు. ఇట్లే 'నేను బాలుఁడుగ నుంటిని, తరుణుఁడనైతిని, వృద్ధుఁడ నగుచున్నాను' అనుచు జీవుఁడు ఈదశలకు కూడ సాక్షిగా ఉన్నాఁడు.

సాక్షిస్వరూపమైన యాత్మకు ఏ భావములు లేవు. అందువలన, స్వప్నములో తోఁచుపదార్థములవలె, స్వర్గాదులు, వానికి సాధనములైన యజ్ఞాది కర్మలు మొదలగునవి యన్నియు మిథ్యలే. ఎవఁడు వెలుపల అనుక్షణము నశించుచుండు పదార్థములను అనుభవించుచున్నాఁడో, వాఁడే కలయందు వానితో సమానములైన పదార్థములను అనుభవించుచున్నాఁడు. వాఁడే నిద్రయందు వానిని అన్నింటిని ఉపసంహరించుకొనుచున్నాఁడు. ఈ విధముగా విమర్శించి ఇవి యన్నియు మాయచేత నాయందు గోచరించుచున్నవని నిశ్చయించుకొని సంశయములకు మూలమై హృదయమునందున్న అహంకారమును జ్ఞానమను ఖడ్గముచేత ఛేదించి నన్ను భజింపుఁడు. భ్రమ మాత్రమైన యీ సంసారము నుండి దృష్టిని మరలించి ఆత్మసుఖము ననుభవించుచు దేనిని కోరక యూరక యుండవలయును. ఎండమావులలో నీరు లేదని నిశ్చితముగా తెలిసినను అది నీరువలె ఎట్లు భాసించుచునే యుండునో, అట్లే ఈ ప్రపంచము, భ్రమ మాత్రమే కాని యథార్థముగా లేదు, అని నిశ్చయించుకొన్నవానికి కూడ శరీరపతన పర్యంతము అప్పుడప్పుడు భాసించుచునే యుండును. కాని సురాపానముచేత మత్తుఁడైనవాఁడు తనపై నున్న వస్త్రము జాఱిపోయినను, ఎవఁడైనను దైవికముగా తెచ్చికప్పినను ఎట్లు గుర్తింపఁడో అట్లే ఆత్మానందపరవశుఁడు కూడ తనదేహము లేచుచున్నను నిలిచియున్నను పడియున్నను లెక్కపెట్టఁడు. అతఁడు దానిని గమనింపకున్నను, ఆశరీరమునకు ఆరంభకమైన కర్మ యున్నంతవఱకు ప్రాణములతో ఇంద్రియములతో వర్తించుచునే యుండును. మేల్కొన్నవాఁడు స్వప్న ప్రపంచమునువలె సమాధియోగమున సిద్ధిపొందినవాఁడు తనదేహముతో పాటు ఈ ప్రపంచమును లెక్కపెట్టఁడు.

విప్రులారా ! మీకు ధర్మమును బోధించుటకై సాంఖ్యమునకు యోగమునకు రహస్యమైన విషయమును చెప్పితిని. నన్ను విష్ణువునుగా నెఱుంగుఁడు".

ఇట్లు సనకాదులు సంశయమును తీర్చుకొని నన్ను స్తుతించుచు పూజించిరి. పరమేష్ఠి చూచుచుండఁగా నేను నా స్థానమునకు చేరితిని".

ఏ విషయమును తెలిసికొనలేక సనకాదులు ప్రశ్నించుచున్నారో ఆయజ్ఞానము ఆ ప్రశ్నకు బీజము. అది బ్రహ్మదేవునకు కూడ ఆలోచించినను తోఁచలేదనుట ఆశ్చర్యకరము. ఆయనకు ఆత్మవిద్య తెలియదనుటకు వీలులేదు. తన లోకమునకు చేరినవారికి ఆయన ఆత్మవిద్యను బోధించునని వారు ముక్తులై ఆయనతోపాటు కల్పాంతమున కైవల్యమును పొందుదురని వేదము చెప్పుచున్నది. "బ్రహ్మలోకమున వేదాంతవిజ్ఞానముచేత ఆత్మతత్త్వమును చక్కఁగా నిశ్చితముగా తెలిసికొని, సన్న్యాసయోగముచేత యతులు శుద్ధమైన సత్త్వము కలవారై కల్పాంతమునందు పరమమైన యాత్మజ్ఞానామృతమువలన అందఱు ముక్తిని పొందుచున్నారు".

మం|| వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః |
తే బ్రహ్మలోకే తు పరాన్తకాలే పరామృతాత్ పరిముచ్యన్తి సర్వే ||

ముండకోపనిషత్తు

వందలకొలఁది యశ్వమేధములచేతనో, లక్షలయేండ్ల తపస్సులవలననో ఒకానొకఁడు బ్రహ్మలోకమునకు అధిపతి యగును. పై మంత్రమునుబట్టి ఆయన ఆత్మవిద్యయందు కూడ పారీణుఁడై యుండుననుట స్పష్టము. కావుననే ఆ మహర్షులు ఆయనను ప్రశ్నించిరి. అట్లయినచో ఆ ప్రశ్నబీజము ఆయనకు తెలియకపోవుటయేమి? ఒక శాస్త్రమున ఒక యధ్యాపకుఁడు పారీణుఁడై యుండవచ్చును. ఆయన అనేక పర్యాయములు ఆ శాస్త్రమును బోధించుచు నుండవచ్చును. మహాతార్కికుఁడు మేధావియునైనవాఁడు ఆ శాస్త్రమున ఒక సూక్ష్మవిషయమునుగూర్చి ప్రశ్నించినప్పుడు, దానికి సమాధానము ఆయనకు తోఁచకపోవుట, ఆయన తన యాచార్యునియొద్దకు పోయి ఆసమాధానమును తెలిసికొని వచ్చి తన శిష్యులకు బోధించుచుండుట అసంభవము కాదు, అసహజము కాదు. బ్రహ్మమును తెలిసికొన్నవాఁడు బ్రహ్మమే యగునని వేదము చెప్పుచున్నది. (బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి - తైత్తిరీయోపనిషత్) బ్రహ్మవేత్తలందఱు తత్త్వమును బోధింపఁగలరని కాని, వేదాంత శాస్త్రమునందు పారీణులై యుందురని కాని తలంచుటకు వీలులేదు. తత్త్వబోధ జరుగునప్పుడు ఆయావ్యక్తుల సంస్కారముల ననుసరించి ఒక్కొక్కవ్యక్తికి ఎన్నో సంశయములు

కలుగవచ్చును. వారు ఎంతగా తార్కికులు మేధావులును అయియుందురో వారి ప్రశ్నలు కూడ అంత జటిలముగా నుండును. ఇందువలననే వేదము కూడ పెక్కుమంది యొక్క సంశయములను నివారించుటకొఱకు ఎన్నో యుపనిషత్తులలో ఒక్క ఆత్మతత్త్వమునే ఎన్నో ప్రకారములలో బోధించినది. ఆ యుపనిషత్తులకు భాష్యములు, ఆభాష్యములకు ఎన్నో వ్యాఖ్యానములు వెలసినవి. అభిప్రాయభేదములు వచ్చినప్పుడు వాదప్రతివాదములలో తర్కములు ప్రబలును. హర్షుఁడు అద్వైతమునకు భిన్నములైన సకలవాదములను ఖండించుచు "ఖండన ఖండఖాద్యము" అను గ్రంథమును రచించెను. ఖాద్యమనఁగా తినఁదగిన పదార్థము. ఖండఖాద్యమనగా కలకండతో వండిన జీడిపప్పుల పాకమువంటి పిండివంట అన్నమాట. ఆయన ఖండఖాద్యమునువలె ప్రతివాద ఖండనమును కొనసాగించెను. తర్క పండితులకు అది కలకండవలెనే యుండవచ్చును. కాని సామాన్యముగ వేదాంతశాస్త్రమును అధ్యయనము చేసినవారికి అది కొఱుకుడు పడదు. అంతమాత్రమున వారికి వేదాంతశాస్త్రమున పరినిష్ఠితమైన జ్ఞానము కలుగలేదని చెప్పుటకు వీలు లేదు. బ్రహ్మదేవుని విషయమున కూడ మనము ఇట్లే గ్రహింపవలసియున్నది. ఇందులకు హేతువును కూడ భగవంతుఁడే ఒక్క మాటలో చెప్పినాఁడు. కర్మప్రధానమైన బుద్ధకలవాఁడగుటచే (కర్మధీః) ఆయన ఆప్రశ్న బీజమును గ్రహింపలేకపోయెను. ఆయన వందలకొలఁదిగా అశ్వమేధములు చేసి ఆపుణ్యఫలముగా బ్రహ్మలోకమునకు అధిపతియై యుండును. అందువలన, ఆయన ఆత్మవిద్యాశాలి యైనప్పటికి పూర్వసంస్కారవశమున ఆయన బుద్ధియందు యజ్ఞకర్మవిద్యయే ప్రబలముగా నుండెను. ఆకారణముచేత ఆయనకు ఆ ప్రశ్నబీజము స్ఫురింపలేదు. అంతమాత్రమున ఆయనయందున్న యాత్మజ్ఞానముకాని, ఆత్మానందమునకు గాని లోపము కలిగినట్లు తలంపరాదు. దీనినిబట్టి తత్త్వమును బోధించువాఁడు ఎట్టి సంశయమునైనను తీర్చుటకు సమర్థుఁడై శాస్త్రవాదమునందు జాగరూకుఁడై యుండవలయునని గ్రహింపవలసియున్నది. ఇది కూడ ఒక సంసారమే. కావుననే అవధూతలు సాధారణముగా బోధించుటకు కూడ పూనుకొనరు.

హంసరూపమున వచ్చిన విష్ణుదేవునకు సనకాదులు పాదాభివందనము (కృత్వా పాదాభివందనమ్) చేసినారనుట వలన విష్ణుదేవుఁడు మనుష్యలోకములోని

హంస యనుపరివ్రాజకుని రూపముతో వచ్చెననియే గ్రహింపవలసియున్నది. అట్లు కాకున్నచో పక్షిరూపమైన హంసకు వారు పాదాభివందనము చేయుట కుదురదు. కుటీచకుఁడు, బహూదకుఁడు హంస, పరమహంస అని సంన్యాసమున నాలుగు తరగతులున్నవి. పరమహంసలు సాధారణముగా అవధూతలై ఆత్మవిద్యా ప్రసంగమున కూడ విరక్తులై యుందురు. హంసలు కొంతవఱకు జిజ్ఞాసువులను బోధచేత అనుగ్రహించుటకు సుముఖులై యుందురు.

భగవానుఁడు సనకాదులప్రశ్నకు వెంటనే సమాధానము చెప్పక, "మీరు ఎవరు ?" అని సాధారణముగా వారు అడిగిన మాటను ఖండించుచు బోధించుటకు ఏల పూనుకొనెను ? భూలోకమున నిర్యాణము నొందిన పరివ్రాజకులు బ్రహ్మలోకమునకు సంన్యాసిరూపములతో పోరు. ఇక్కడ ఈ శరీరమును వదలిన వారు అక్కడ ఆలోకమునకు తగినతేజోమయములైన రూపములతోనే యుందురు. విష్ణుదేవుఁడు హంస సన్న్యాసిగా సాక్షాత్కరించినంతనే, "భూలోకములో అడవులలో గుహలలో తిరుగుచునుండు సంన్యాసి ఇక్కడికి ఏల వచ్చినాఁడు ? ఎట్లు వచ్చినాఁడు" అని వారికి విస్మయము కలిగెను. తూర్పు దేశమునుండి ఏ సంన్యాసియైన అమెరికావంటి దేశములలో అధ్యక్షుని భవనసమీపమున కన్పించినచో అక్కడి వారికి ఎట్లు విస్మయము కలుగునో వారికి కూడ అట్లే విస్మయము కలిగెను. అంతే కాదు, వారు ఆయనకు పాదాభివందనము చేసినను మేము బ్రహ్మలోకములోని వారము అను నాధిక్యభావన వారి మనస్సులో ఉండవచ్చును. మఱియును తమ ప్రశ్నను విని పరమేష్ఠి కూడ వెంటనే సమాధానము చెప్పక ఆలోచించుచు ఊరకుండుటవలన, "మనము వేసిన ప్రశ్న సామాన్యమైనది కాదు" అని తమ ప్రజ్ఞను గూర్చిన ప్రశంసాభావము కూడ వారియందు ఉండవచ్చును. అందువలన వారియందున్న యీ యాధిక్యభావమును (Superiority Complex) తొలఁగించుకొఱకు భగవానుడు వారిప్రశ్నయే కుదురదని నిరూపించి వారియందు వినయమును కలిగించెను. తత్త్వజ్ఞానమునకు సర్వసమత్వభావము పునాది. "మనుష్యలోకములోని వాఁడు బ్రహ్మలోకములోనున్నమాకు బోధించుట యేమి" అను తలంపు వారియందు ఉన్నచో వారు ఆ బోధమును సరిగా గ్రహింపరు. అందువలన వారికి వినయమును కలిగించి తరువాతనే వారిప్రశ్నకు భగవానుఁడు సమాధానమును చెప్పెను.

## (iii) ధ్యాన చమసము

ఉద్ధవుఁడు భగవానుని ప్రశ్నించెను. "స్వామీ ! సకలసంగములనుండి మనస్సునుమరలించి నీయందు నిలుపుటకై నీవు ఫలాపేక్షారహితమైన భక్తియోగమును చెప్పుచున్నావు. కాని బ్రహ్మవేత్తలు ఎన్నో సాధనములను చెప్పుచున్నారు. వానిలో దేనిని అవలంబించినను మోక్షము లభించునా ? లేక అన్నింటిలో ఒక్కటే ముఖ్యమై తక్కినవి దానికి అంగములగునా ? చెప్పుము".

భగవంతుఁడు ఇట్లు చెప్పెను. "నాయందు చిత్తమును నిలుపుటకు సాధనమైన వేదధర్మమును నేను పూర్వము బ్రహ్మదేవునకు చెప్పితిని. అది కాలవశమున ప్రళయమునందు నష్టమయ్యెను. దానిని పరమేష్ఠి తనకు జ్యేష్ఠపుత్రుఁడైన మనువునకు బోధించెను. ఆయన నుండి ప్రజాపతులై బ్రహ్మలైన యేడుగురు మహర్షులు ఆవిద్యను గ్రహించిరి. వారి పుత్త్రులవలన దేవదానవమనుష్యాదులు గ్రహించిరి. సత్త్వరజస్తమస్సుల సమ్మేళనవైవిధ్యముచేత వారు బహువిధములైన స్వభావములను గలిగియుండిరి. తమస్వభావముల ననుసరించి, తాము అనుష్ఠించుచున్న కర్మలను బట్టి రుచిభేదములవలన వేదార్థమును అనేక విధములుగా విచిత్రములైన వాగ్విన్యాసములతో వారు వ్యాఖ్యానించుచు బోధింపఁజొచ్చిరి. అందువలన మతభేదములు ఏర్పడెను. నామాయావశులైన కొందఱు వేదవిరుద్ధములైన పాషండమతములను కూడ ప్రబలఁజేసిరి. ఈ కారణముచేత యజ్ఞముదానము తపస్సు వ్రతములు మొదలగునవియేకాక భోజనము కామము ఐశ్వర్యము మొదలగునవి కూడ పరమపురుషార్థములుగా ప్రసిద్ధములయ్యెను.

ఇవి యేవియు పరమార్థసాధనములు కావు. ఇవి అన్నియు అల్పఫలమునే యొసంగును. సర్వసంగములను పరిత్యజించి నాయందు మనస్సు నిలిపినవానికి కలుగుసుఖము విషయభోగపరాయణులైన వీరికి ఎట్లు లభించును ? సర్వభూతసముఁడైన వానికి సకల దిక్కులు సుఖప్రదములే యగును. నాయందు చిత్తము నిలిచిన వానికి సార్వభౌమత్వము, మహేంద్రత్వము బ్రహ్మపదవి కూడ ప్రలోభమును కలిగింపలేదు. అట్టిభక్తునివలె లక్ష్మీదేవి శంకరాదులు కూడ నాకు

ప్రియులు కారు. అట్టి సమదర్శనుఁడైన మునివలన నాయందున్న భువనములు పవిత్రతను పొందునని నేను అతనివెంట తిరుగుచుందును. వానికి కలుగు సుఖమెంతటిదో ఇతరులెఱుంగరు.

నా భక్తుఁడు ఒకప్పుడు ఇంద్రియములను జయింపలేక వానిచే బాధపెట్టఁబడుచున్నను, మండుచున్న యగ్నిచే సమిథలవలె, తీవ్రమైన భక్తిచే వాని పాపములన్నియు దగ్ధము లగును. ధర్మము తపస్సు స్వాధ్యాయము మొదలగునవి ఏవియు గాఢమైన భక్తివలె పరమార్థమును సాధింపలేవు. తపస్సుతో కూడిన విద్యయైనను నాభక్తి లేకున్నచో పవిత్రతను కలిగింపలేదు. వాక్కు గద్గద మగుచుండఁగా మనస్సు ద్రవించుచుండఁగా, ఒకప్పుడు నవ్వుచు మఱియొకప్పుడు బిగ్గరగా ఏడ్చుచు మఱియొకప్పుడు లజ్జనెఱుంగక నృత్యము చేయుచు నన్ను భజించువాఁడు లోకమును పవిత్రమొనరించును. అట్టిభక్తుఁడు కుక్కమాంసమును వండుకొని తినువాఁడయ్యును ముక్తిని పొందును.

అగ్నిచేత బంగారము మాలిన్యమును పోఁగొట్టుకొని స్వరూపమును పొందునట్లు భక్తియోగముచేత ఎవఁడైనను పరిశుద్ధుఁడై నన్ను పొందును. అంజనము కలిగిన కన్నులు గూఢములైన పదార్థములను ఎట్లు గుర్తించునో, అట్లే పుణ్యప్రదములైన నాయవతారగాథలను వినుట చేత చెప్పుటచేత నా భక్తుఁడు సూక్ష్మములైన తత్త్వరహస్యములను క్రమక్రమముగా గ్రహింపఁగలఁడు. విషయములను ధ్యానించుచో మనస్సు వానియందు లీనమగును ; నన్ను ధ్యానించుచో అది నాయందే లీనమగును. కావున స్త్రీలకు వారియందు ఆసక్తిగల పురుషులకు దూరముగా ఏకాంతమునందు కూర్చుండి నన్నుగూర్చి చింతింపుము.

ఉద్ధవుఁడు ఇట్లడిగెను. "ప్రభూ ! మోక్షమును కోరువాఁడు నిన్ను ఏ రూపముతో ఏ ప్రకారముగా ధ్యానింపవలయునో చెప్పుము".

భగవానుఁడు ఇట్లు చెప్పెను. "సమమైన యాసనమునందు సుఖముగా కూర్చుండి కాయమును కంఠమును శిరస్సును నిటారుగా నిలిపి చేతులను

ఒడియందుంచుకొని, నాసాగ్రమును చూచుచున్నట్లుగా అన్నివైపులనుండి దృష్టిని మరలించి మనస్సును ఏకాగ్రమొనరించి ప్రాణవాయువుయొక్క శుద్ధికొఱకు పూరక కుంభక రేచకములతో గాని, రేచక కుంభక పూరకములపద్ధతిలోఁగాని ప్రాణాయామమును మెల్లమెల్లగా అభ్యసింపవలయును. మూఁడు సంధ్యలయందు పదేసి ప్రాణాయామములను చేయుచున్నచో ఒక్క మాసములోపలనే ప్రాణవాయువును జయించును.

ప్రాణవాయువును నిలుపఁగఁలిగిన తరువాత ఇట్లు ధ్యానింపవలయును. హృదయపద్మమునకు నాళము (తొడిమ) ఊర్ధ్వముగా, ముఖము క్రిందుగానుండును. దానిని ఊర్ధ్వముఖముగా, వికసించినదానినిగా, కేంద్రమునందు కర్ణికను (దుద్దు) దాని చుట్టును ఎనిమిది దళములు కలదానినిగా భావింపవలె. కర్ణికయందు సూర్యమండలము, దానిపై చంద్రమండలము, దానిపై అగ్నికుండమును, దానియందు మకర కుండల శోభితము వనమాలాకౌస్తుభ కిరీట కటకకటి సూత్రాంగద శోభితము, చతుర్భుజము సర్వాంగ సుందరమును అయిన నారూపమును ధ్యానింపవలయును. సమగ్రరూపధ్యానము సిద్ధించిన తరువాత, చిఱునవ్వుతో కూడిన నాముఖమునందే ధ్యానమును కేంద్రీకరింపవలె. అప్పుడు ఇతరావయవములను స్మరింపరాదు. ముఖమునందు ధ్యానము సిద్ధించినతరువాత మనస్సును ఆకాశమునందు నిలుపవలె. తరువాత దానినుండి కూడ చిత్తమును ఆకర్షించి నాయందు నిలుపవలె. పిదప ఏమియు చింతింపరాదు. ఈవిధముగా సమాధిస్థితి నొంది జ్యోతిస్సునందు జ్యోతిస్సునువలె సర్వాత్మకమైన నాస్వరూపమునందు తనస్వరూపమును చూచును. ఇట్టి తీవ్రమైన ధ్యానముచేత ద్రవ్యము జ్ఞానము క్రియ అను వానియందున్న భ్రమ నశించి తొందరగా చిత్తము ప్రశాంతి నొందును.

శ్లో|| సర్వాంగసుందరం హృద్యం ప్రసాదసుముఖేక్షణమ్ |
సుకుమార మభిధ్యాయే త్సర్వాంగేషు మనో దధత్ || 41

శ్లో|| ఇంద్రియా ణీంద్రియార్థేభ్యో మనసాకృష్య తన్మనః |
బుద్ధ్యా సారథినా ధీరః ప్రణయే న్మయి సర్వతః || 42

శ్లో|| త త్సర్వ వ్యాపకం చిత్త మాకృ ష్యైకత్ర ధారయేత్ |
నాన్యాని చింతయే ద్భూయ స్సుస్మితం భావయే న్ముఖమ్ || 43

శ్లో|| తత్ర లబ్ధపదం చిత్త మాకృష్య వ్యోమ్ని ధారయేత్ |
త చ్చ త్యక్త్వా మదారోహో న కించి దపి చింతయేత్ || 44

శ్లో|| ఏవం సమాహితమతి ర్మా మే వాత్మాన మాత్మని |
విచష్టే మయి సర్వాత్మన్ జ్యోతి ర్జ్యోతిషి సంయుతమ్ || 45

శ్లో|| ధ్యానే నేత్థం సుతీవ్రేణ యుంజతో యోగినో మనః |
సంయా త్యాశు నిర్వాణం ద్రవ్యజ్ఞాన క్రియా భ్రమః || 46

స్కంధము - 11 - అధ్యాయ. 14

భగవద్గీతయందు భగవానుఁడు అర్జునునకు చెప్పిన యధ్యాత్మ విద్యాసంప్రదాయమునకు, ఇచ్చట ఉద్ధవునకు చెప్పినదానికి భేదము కన్పించుచున్నది. భగవంతుఁడు వివస్వంతునకు, ఆయన తనకుమారుఁడైన మనువునకు, ఆ వైవస్వత మనువు తన పుత్త్రుఁడైన యిక్ష్వాకువునకు ఈ విద్యను బోధించినట్లు భగవద్గీతలో నున్నది. ఇచ్చట పేర్కొనఁబడిన మనువు బ్రహ్మదేవునకు జ్యేష్ఠపుత్త్రుఁడు తన తమ్ములైన భృగ్వాదులకు బోధించెను. భృగువుఁ మరీచి, అత్రి, అంగిరసుఁడు పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు అను సప్తఋషులు సృష్టిచేయుటకొఱకు బ్రహ్మదేవునిచే నియోగింపఁబడి ప్రజాపతులైరి. బ్రహ్మకు ప్రతినిధులగుటచే వీరు కూడ బ్రహ్మలుగనే ప్రసిద్ధులైరి. ఈ యధ్యాత్మవిద్యా సంప్రదాయము కల్పాంతరములోనిదని గ్రహింపవలె.

"సుఖముగా కూర్చుండి" (యథాసుఖమ్) అనుటవలన స్వస్తికాద్యులైన యాసనములను ప్రయత్నపూర్వకముగా అవలంబింపనక్కఱ లేదని, తనకు ఎట్లు కూర్చుండినచో సుఖముగా నుండునో అట్లు కూర్చుండవచ్చునని వ్యక్తమగుచున్నది.

భగవద్గీతలోని యాఱవయధ్యాయములో చెప్పఁబడిన ధ్యానయోగ ప్రకారమే ఇందు కొంచెము విపులముగా బోధింపఁబడినది. ముందు సమగ్రమైన విష్ణుదేవుని

రూపమును, తరువాత ముఖమును, పిమ్మట ఆకాశమును, అనంతరము ఆత్మస్వరూపునిగా తన్ను ధ్యానింపవలయునని, పిదప ఏమియు చింతింపరాదని భగవద్గీతయందు చెప్పినట్లే ఇందు బోధించెను.

శ్లో॥ శనై శ్శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్ ॥ 25

భీష్మపర్వణి - అధ్యాయ. 30 (భ.గీ. 6)

ముఖమువఱకు సాకారధ్యానము చెప్పఁబడినది. తరువాత ఆకాశము ధ్యానింపఁదగినదిగా చెప్పఁబడినది. ఇది నిర్గుణబ్రహ్మమునకు ప్రతీకమని చెప్పవచ్చును. సృష్టిక్రమమున ఆత్మనుండి ఆకాశము పుట్టినదని చెప్పఁబడినది. (ఆత్మనః ఆకాశ స్సంభూతః - తైత్తిరీయము) కావున యోగి కూడ ఆకాశమునుండి ఆత్మయందు ప్రవేశింప వలసియున్నది. ఆకాశమునకు అనంతరమున "నాయందు" అని భగవంతుఁడు చెప్పినప్పుడు నిర్విశేషము చైతన్యమాత్రమైన యాత్మయందే అని గ్రహింపవలె. ఆయన తనస్వరూపమును సర్వభూతములయందు వ్యాపించి, సర్వమునకు ఆది, మధ్యము, అంతమును అయిన ఆత్మనుగా భగవద్గీతయందు నిర్దేశించియున్నాఁడు.

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహ మాది శ్చ మధ్యం చ భూతానా మన్త ఏవ చ ॥ 20

భగవద్గీత - అధ్యాయ - 10

ఈ విధముగా భగవంతుఁడు భక్తిమార్గమున ధ్యానయోగమునందు ప్రవేశించి యోగి సర్వవ్యాపకము అఖండము అద్వితీయమునైన చైతన్యమాత్రమైన పరబ్రహ్మమునందు నెలకొనుటకు మార్గమును నిరూపించెను.

'ఏమియు చింతింపరాదు' (న కించి దపి చింతయేత్) అనఁగా ధ్యానము, ధ్యేయము, ధ్యానించువాఁడు అను మూఁడు పదార్థము లున్నట్లుగా తలంపరాదని శ్రీధరాచార్యుఁడు వివరించినాఁడు. ఆత్మయందు మనస్సు నిలుపుట యనఁగా

'సర్వము ఆత్మయే ; దానికంటె అన్యముగ ఏదియు లేదను నిశ్చయము కలిగి యుండుటయే యని పిదప ఏమియు చింతింపరాదని, ఇది యోగమునకు పరమవిధియని శ్రీశంకర భగవత్పాదులవారు చెప్పిరి.

ఆత్మసంస్థం ఆత్మని సంస్థం, ఆత్మైవ సర్వం న తతోఽన్య త్కించి దస్తీత్యేవ మాత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్ | ఏష యోగస్య పరమో విధిః |

యోగముయొక్క పరమస్థితియందు విష్ణువు, ఈశ్వరుఁడు మొదలగువారి విగ్రహములతో దేనిని చింతింపరాదని, ఆరంభమున అభ్యసించునట్టి ఆ ధ్యానమంతయు నిర్విశేషము చైతన్యమాత్రమునైన యాత్మయందు మనస్సు నిలిచి పోవుటకే సాధనమని దీనివలన స్పష్టమగుచున్నది.

ద్రవ్యజ్ఞాన క్రియాభ్రమ యనఁగా, నిర్విశేషమై ఒక్కటిగా నున్న యాత్మయందు స్త్రీలు, పురుషులు పశువులు మొదలుగా నానా పదార్థములున్నట్లుగా తోఁచుట ద్రవ్యభ్రమ. ఆపదార్థములను తల్లితండ్రి భార్యభర్త పుత్త్రుఁడు అను సంబంధభేదములతో గ్రహించుట జ్ఞాన భ్రమ. వారికొఱకు ఏదో చేయవలయునని కర్తవ్యభావన, చేయుచున్నానను కర్మభావన క్రియాభ్రమ. ఇట్లే దృశ్యము ద్రష్ట దర్శన రూపముగా కూడ ఈ భ్రమను గ్రహింపవచ్చును.

ఈ రెండు సంప్రదాయములందును ఈయధ్యాత్మవిద్యను వివస్వంతుఁడు మనువునకు, బ్రహ్మకూడ జ్యేష్ఠపుత్రుఁడైన మనువునకు ప్రముఖముగా బోధించుట గమనింపఁదగియున్నది. బ్రహ్మదేవునివలన ప్రజాపతులవలన సృష్టి జరుగునప్పుడు ప్రజలను పాలింపవలసినవాఁడు మనువు. విశ్వపాలనమున మనువు ఇంద్రునకు పై అధికారి. అట్టి పరిపాలకునకు అధ్యాత్మవిద్య అత్యంతము ఆవశ్యకమని వ్యక్తమగుచున్నది.

## (iv) సిద్ధి చమసము

భగవానుఁడు "జితేంద్రియుఁడై స్థిరచిత్తుఁడై ప్రాణవాయువును నియమించి నాయందు చిత్తమును నిలిపిన వానికి సిద్ధులు కలుగును" అని చెప్పెను.

వానిని గూర్చి వివరింపుమని ఉద్ధవుఁడడిగెను.

భగవానుఁడు ఇట్లు చెప్పెను. "యోగపారగులు సిద్ధులు పదునెనిమిది, అని చెప్పుదురు. వానిలో నాయందు భావన ప్రధానముగా నుండునవి యెనిమిది; తక్కినపది సత్త్వముయొక్క ఉత్కర్షచే కలుగునవి. యోగముచేత దేనిని మనస్సునందు యోగి ధారణచేయునో దాని ననుసరించి సిద్ధి సంభవించును. నన్ను సూక్ష్మభూతాత్మకునిగా మనస్సునందు ధారణచేయువానికి "అణిమ" అను సిద్ధి కలుగును. ఒక్కొక్క భూతముయొక్క మహత్త్వమునకు ఆధారమైన వానినిగా నన్ను ధ్యానించువానికి ఆభూతము యొక్క మహత్త్వరూపమైన "మహిమ" అను సిద్ధి కలుగును. భూతములయొక్క పరమాణువులరూపము కలవానినిగా నన్ను ధ్యానించువానికి "లఘిమ" కలుగును. సకలభూతముల యందు "నేను" అనుస్ఫురణతో సకలేంద్రియములకు అధిష్ఠానముగా నన్ను ధ్యానించుచో సకలేంద్రియములకు తత్త్వరూపమైన "ప్రాప్తి" కలుగును. సృష్టియందు క్రియాశక్తి ప్రధానమైన మహత్తత్త్వమును నన్ను ధ్యానించుచో పరమేష్ఠిపదరూపమైన "ప్రాకామ్యము" సిద్ధించును. త్రిగుణాత్మకమైన మాయకు అధీశ్వరునిగా కాలాత్మకునిగా నన్ను ధారణచేయువానికి క్షేత్రములను క్షేత్రజ్ఞులను ప్రబోధనము చేయఁగలిగిన "ఈశిత్వము" సిద్ధించును. సకల సృష్టియందు స్థూలరూపమున వ్యాపించియున్న విరాట్టు కంటె, సూక్ష్మరూపమున వ్యాపించియున్న హిరణ్యగర్భునికంటె, ఈ రెండు రూపములకు అధిష్ఠానముగా మాయారూపుఁడైన అవ్యాకృతునికంటె పరుఁడైన తురీయునిగా (నాల్గవవానినిగా) భగవంతుఁడైన నారాయణునిగా నా యందు ధారణచేసిన వానికి నాధర్మములతో "వశిత్వము" సంభవించును. నిర్గుణబ్రహ్మమైన నాస్వరూపమునందు ధారణచేయుటవలన వశిత్వము నందు సకలకామములకు అవసానము కలిగి పరమానందము ప్రాప్తించును.

శ్వేతద్వీపమునకు అధిపతినిగా శుద్ధధర్మమయునిగా నన్ను భావించుచు నాయందు ధారణచేయువానికి శ్వేతత్వరూపమైన 'అనూర్మిమత్త్వము' కలుగును. ఆకాశాత్మకమైన ప్రాణమునుగా నాయందు మనస్సును నిలిపి ప్రాణఘోషమును చింతించువానికి ఆయాకాశమునందు భూతములయొక్క వాక్కులను పొందుచు "దూరశ్రవణము" కలవాఁడగును. చక్షురింద్రియమును సూర్యునియందు, సూర్యుని చక్షురింద్రియమునందు, ఆ రెండింటియందును నన్ను ధ్యానించువాఁడు "దూరదర్శనము"ను పొందును. మనస్సును దేహమును దానితో నుండు ప్రాణవాయువుతోకూడ నాయందు చేర్చి ధ్యానించువాఁడు అధారణాబలములచేత మనస్సుతో ఎచ్చటికి బయలుదేరునో అచ్చటికి శరీరమును కూడ చేర్చు సిద్ధియైన "మనోజవము" ను పొందును. అచింత్యమైన శక్తి కలవానినిగా నానారూపాత్మకునిగా నన్ను ధ్యానించుచు మనస్సుచేత ఏ యేరూపమును భావించునో ఆ రూపమును శరీరమున పొందుచు "కామరూపత్వము" కలవాఁడగును. ఇతరుని శరీరమున ప్రవేశింపఁదలఁచు యోగసిద్ధుఁడు ఆశరీరమునందు తాను ఉన్నట్లుగా భావించుచు తనశరీరము నుండి వాయురూపుఁడై వెడలి, ఒక పుష్పమునుండి మఱియొక పుష్పమున ప్రవేశించు తుమ్మెదవలె, ఆశరీరమున ప్రవేశించును. అది "పరకాయప్రవేశ" సిద్ధి. పార్ష్ణి భాగముచేత మలవిసర్జన స్థానమును నొక్కిపట్టి, ప్రాణమును హృదయమునుండి వక్షమునకు, అచ్చటనుండి కంఠమునకు, కంఠమునుండి మూర్ధమునకు ఎక్కునట్లు చేసి బ్రహ్మరంధ్రమునుండి బ్రహ్మమునకు చేరుచు శరీరమును వదలుట 'స్వచ్ఛంద మృత్యువు' అనుసిద్ధి. దేవతలతో కూడ క్రీడింపవలయునని కోరుచు నన్ను శుద్ధ సత్త్వమూర్తినిగా ధ్యానించువానిని సత్త్వవృత్తులైన దేవతాస్త్రీలు విమానము నందుంచి సేవింతురు. ఇది 'సురాక్రీడ' మను సిద్ధి. సత్యసంకల్పుఁడనైన నాయందు మనస్సు నిలిపి, ఏ సమయమునందైనను ఏప్రకారముగనైనను 'ఇది ఇట్లుండవలయు' నను బుద్ధిచేత నిశ్చయించినచో అది యట్టిదిగానే ప్రాప్తించుట 'సంకల్పసిద్ధి'. ఈశిత్వము వశిత్వము కలవానినిగా నన్ను భావించువాఁడు దేనిని ఆజ్ఞాపించినను అది, నాయాజ్ఞవలెనే అప్రతిహతముగా జరుగును. ఇది 'ఆజ్ఞాసిద్ధి'.

నాభక్తిచేత శుద్ధచిత్తుఁడై ధారణ నెఱింగినయోగి త్రికాలజ్ఞుఁడైన యీశ్వరునిగా నన్ను ధ్యానించువానికి స్వజన్మ మృత్యుజ్ఞానముతో కూడిన 'త్రైకాలిక సిద్ధి', 'పరచిత్తాద్యభిజ్ఞత' అను సిద్ధియు కలుగును. అగ్ని జలము మొదలగు వానిచేత ఎట్టి యభిఘాతమును పొందనివానినిగా నన్ను ధ్యానించుయోగి యోగమయశరీరుఁడై శీతము ఉష్ణములకు అతీతముగా నుండునట్టి "అద్వంద్వము' "అగ్నిస్తంభనము", "జలస్తంభనము" మొదలగు సిద్ధులను పొందును. శ్రీవత్సము, ధ్వజము ఆతపత్రము మొదలగువానితో నాయవతార విభూతి విశేషములను ధ్యానించువాఁడు "అపరాజితత్వ" సిద్ధిని పొందును.

జితేంద్రియుఁడై ప్రాణములను నియమించి తురీయమైన నారాయణ పరబ్రహ్మమునుగా నన్ను ధారణచేయువానికి దుర్లభమైన సిద్ధి ఏదియు నుండదు. పక్షులకు ఖేచరత్వము జలజంతువులకు జలస్తంభనము సహజమైనట్లు కొందఱకు జన్మసిద్ధముగనే కొన్ని సిద్ధులు లభించును. కొందఱకు ఔషధులచేత మంత్రములచేత తపస్సుచేత కొన్ని సిద్ధులు కలుగును. యోగధారణచే నన్ను పరమునిగా ఉపాసించువానికి ఈ సిద్ధులన్నియు సులభములే యగును. కాని నన్ను పొందనభిలషించు వారికి ఇవియన్నియు ప్రలోభములను కలిగించుచు మత్పదప్రాప్తిని దూరమొనరించుచుండును. ఈ సిద్ధులకొఱకు యోగమును త్యజింపరాదు. సిద్ధుల కన్నింటికి నేనే హేతువును, పతిని. మోక్షమునకు యోగమునకు బ్రహ్మమును బోధించునాచార్యులకు నేనే ప్రభువును".

శ్రీధరాచార్యుఁడు వీనిని కొంత వివరించెను. అణిమ మహిమ లఘిమ అనుమూఁడు దేహమునకు సంబంధించినవి. దేహము చిన్నదియగుట అణిమ. ఈ సిద్ధిచేతనే ఆంజనేయుఁడు లంకలో పిల్లియంత ఆకారమును పొందఁగలిగెను. దేహము పెద్దదియగుట మహిమ. ఈ సిద్ధిచేతనే ఆయన సీతాదేవికి విశ్వాసమును కలిగించుటకై మహోన్నతమైన రూపమును పొందెను. లఘిమ అనగా శరీరము తేలిక యగుట. ఈ సిద్ధిచేతనే ఆయన గాలిలో తేలుచు పయనించుచు సముద్రమును లంఘించెను.

సర్వప్రాణులయొక్క ఇంద్రియములతో కూడ అధిష్ఠానదేవతలతో సంబంధమును పొందుట ప్రాప్తి. ఈలోకమున భూవివరాదులయందు కాని, పరలోకములయందున్న కాని అభిలషితములైన పదార్థములను దర్శించి వానివలన భోగములను పొందఁగలిగిన సామర్థ్యము ప్రాకామ్యము. శక్తియనఁగా మాయ ; దానియందు అంశములైన క్షేత్రములను క్షేత్రజ్ఞులను ప్రేరణము చేయఁగలుగుట ఈశిత్వము. విషయభోగములయందు సంగము నొందక ఉండఁగలుగుట వశిత్వము. ఇందు ఏకామమువలన ఏ సుఖమును కోరుచున్నాఁడో ఆకోరికలయొక్క ఆసుఖములయొక్క పరిసమాప్తిని పొందఁగలుగుటయె సిద్ధి. అణిమ, మహిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనునవి మాత్రమే యిందు పేర్కొనఁబడినవి. కాని యివి యెడే.

శ్లో॥ అణిమా మహిమా మూర్తే ర్లఘిమా ప్రాప్తి రింద్రియైః ।
ప్రాకామ్యం శ్రుతదృష్టేషు శక్తిప్రేరణ మీశితా ॥ 4

శ్లో॥ గుణే ష్వసంగో వశితా యత్కామ స్తదవస్యతి ।
ఏతా మే సిద్ధయ స్సౌమ్య అష్టా వౌత్పత్తికా మతాః ॥ 5

"గరిమ"ను, శరీరముయొక్క బరువు అధికమగుటను, సిద్ధినిగా పేర్కొందురు. దానిని కలుపుకొన్నచో ఇవి ఎనిమిది యగును. వీనియందు భగవంతుని ధ్యానము ప్రధానము.

అనూర్మిమత్త్వము, దూరశ్రవణము, దూరదర్శనము, మనోజవము, కామరూపము, పరకాయప్రవేశము, స్వచ్ఛందమృత్యువు, దేవక్రీడానుదర్శనము, సంకల్పసిద్ధి, ఆజ్ఞా - ఈ పదిసిద్ధుల యందు సత్త్వగుణముయొక్క ఉత్కర్షయే ప్రధానము.

త్రికాలజ్ఞత్వము, అద్వంద్వము, పరచిత్తాద్యభిజ్ఞత్వము, అగ్న్యజలాదిస్తంభనము, అపరాజయము - అనునవియైదును క్షుద్రసిద్ధులు.

# (V) విభూతి చమసము

ఉద్ధవుఁడు ఇట్లనెను. "పరమేశ్వరా ! నీవు భూతములకు ఆత్మవై వానియందు గూఢముగ నున్నావు. పరమర్షులు ఏయే భావములతో ఏయె పదార్థములయందు నిన్ను ఉపాసించుచు సంసిద్ధిని పొందుచున్నారో ఆప్రకారమును చెప్పుము".

శ్రీకృష్ణుఁడు కురుక్షేత్రయుద్ధమున అర్జునుఁడు ఇట్లే అడిగెనని, ఇంచుమించుగా ఆవిభూతి విశేషములనే ఇచ్చట కూడ చెప్పెను. వానిలో కొన్నింటిని ఇట్లు గ్రహింపవచ్చును.

"సకల భూతములకు సృష్టిస్థితి లయములు నేనే. జయించుటకు శక్యము కాని వానిలో నేను మనస్సును... ఆశ్రమములలో నాల్గవది నేను... వర్ణములలో మొదటివర్ణము నేను... ఓషధులలో యవధాన్యము నేను.... యజ్ఞములలో బ్రహ్మయజ్ఞము, వ్రతములలో అహింస నేను... యోగములలో సమాధిని... ధర్మములలో సంన్యాసమును.... క్షేమములలో బాహ్యపదార్థములపై మనస్సును పోనీయకుండుట... వ్యాసులలో ద్వైపాయనుఁడను భాగవతులలో నీవు (ఉద్ధవుఁడు)..... హవిస్సులలో ఆవునెయ్యి .... సాత్త్వతములైన తొమ్మిది మూర్తులలో నేను ఆదిమూర్తిని.... బ్రహ్మణ్యులలో నేను బలిని..... నీకు సంక్షేపముగా నావిభూతులను చెప్పితిని. ఇవి యన్నియు వాక్కుచేత చెప్పఁబడుచున్న మనో వికారములే. వాక్కును మనస్సును ప్రాణమును ఇంద్రియములను నియమింపుము. బుద్ధిని సత్త్వసంపన్నతచేత నియమింపుము. సంసారమార్గమున మరల ప్రవేశింపవు. వాక్కును మనస్సును చక్కఁగా నియమింపని యతియొక్క వ్రతము తపస్సు జ్ఞానము, పచ్చికుండలోని నీరువలె, జారిపోవును. కావున యతి మత్పరాయణుఁడై నాభక్తితో కూడిన బుద్ధితో వాక్కును మనస్సును ప్రాణములను నియమింపవలె. ఆవిధముగా అతఁడు యోగపరిసమాప్తిని పొందును".

సాత్త్వతమైన నవవ్యూహార్చనమునందు వాసుదేవుఁడు సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు, నారాయణుఁడు, హయగ్రీవుఁడు, వరాహుఁడు, నృసింహుఁడు, వామనుఁడు అను తొమ్మిదిమూర్తులుండును.

బ్రహ్మమునందు, అనఁగా వేదములయందు బ్రాహ్మణులయందు, సాధువుగా వర్తించువాఁడు బ్రహ్మణ్యుఁడు. సర్వస్వమును కోల్పోవుటకు సిద్ధపడియైనను బ్రాహ్మణబ్రహ్మచారియైన వామనునకు మూఁడడుగుల భూమిని దానము కావించి, సత్యమును నిల్పుకొనుటచే బలిచక్రవర్తి బ్రహ్మణ్యులలో శ్రేష్ఠుఁడయ్యెనని గ్రహింపవలసియున్నది.

# III. ప్రవృత్తిధర్మ కలశము

## 1. వర్ణాశ్రమ కమండలువు

### (i) ధర్మాచార తారతమ్య చమసము

ఉద్ధవుఁడు ఇట్లు శ్రీకృష్ణుని ప్రార్థించెను. "పరమేశ్వరా ! వర్ణాశ్రమాచారవంతులు, ఇతరమానవులు స్వధర్మమును అనుష్ఠించుటచేత వారికి నీయందు భక్తి కలుగునని చెప్పితివి. నీవు పూర్వము హంసరూపముతో బ్రహ్మదేవునకు పరమధర్మమును బోధించితివి. చాలకాలము గడచిపోవుటచే మర్త్యలోకమునందు అప్పటి నీయనుశాసనము ఇక ముందు సాధారణముగా గోచరము కాదు. ఈధర్మమునకు బ్రహ్మదేవుని సభయందు కూడ నీవు తప్ప మఱియొకఁడు నీవంటివాఁడు ప్రవక్త, కర్త, రక్షకుఁడు కలుగఁడు. నీవు ఈ లోకమును వదలివెళ్లిన తరువాత ఈధర్మమును ఎవఁడు ప్రవచనము చేయగలఁడు ? కావున నీభక్తిని కలిగించుటకై సమర్థమై ఎవనికి ఏయే దేశకాలములలో స్వధర్మమగునో బోధింపుము".

శ్రీకృష్ణుఁడు ఇట్లు చెప్పెను. "నీ ప్రశ్నము నిశ్శ్రేయసమును కలిగించునదియై ధర్మయుక్తముగా నున్నది. మొదటకృతయుగమునందు "హంస" అని ధర్మము పేర్కొనఁబడుచుండెను. పాపరహితులైన మానవులు నన్ను పరిశుద్ధతత్త్వరూపునిగా ధ్యానించుచు తపోనిష్ఠులై యుండిరి. అప్పుడు ప్రణవమే వేదము. తపస్సుచేతనే వారి కర్తవ్యము కృతమగుటచేత, ఆయుగమునకు కృతయుగ మను పేరు రూఢమయ్యెను.

త్రేతాయుగముయొక్క ఆరంభమునందు నాహృదయమునుండి త్రయీవిద్య ఆవిర్భవించెను. నేను త్రివృద్రూపమైన యజ్ఞమునుగా ఉంటిని. విరాట్పురుషుని ముఖమునుండి విప్రులు, బాహువులనుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు పాదములనుండి శూద్రులు తమయాచారలక్షణములతో జన్మించిరి. విరాట్పురుషుని హృదయముయొక్క క్రిందిభాగమైన జఘనము నుండి గృహస్థాశ్రమము, హృదయమునుండి బ్రహ్మచర్యము, వక్షమునుండి వానప్రస్థము, శీర్షమునుండి సంన్యాసము ఆవిర్భవించెను. వర్ణములకు ఆశ్రమములకు వానిజన్మస్థానములనుబట్టి ధర్మములయందు తారతమ్యమేర్పడెను.

శమము, దమము, తపస్సు, శౌచము, సంతోషము, క్షాంతి, ఆర్జవము, నాయందు భక్తి, దయ, సత్యము అనుగుణములు బ్రాహ్మణప్రకృతి యయ్యెను. తేజస్సు, బలము, ధృతి, శౌర్యము తితిక్ష, ఔదార్యము, ఉద్యమము, స్థైర్యము, బ్రహ్మణ్యత్వము, ఈశ్వరత్వము క్షత్రియస్వభావ మయ్యెను. ఆస్తికత్వము, దాననిష్ఠ, దంభము లేకుండుట, విప్రసేవనము, పదార్థములను సంపాదించుటలో, "ఇఁక చాలును" అనునుపేక్ష లేకుండుట వైశ్యులకు సహజమయ్యెను. విప్రులకు, గోవులకు, దేవతలకు, వంచనము లేకుండ సేవచేయుట, అవృత్తివలన లభించుదానితో సంతోషము నొందుట శూద్రులకు ప్రకృతియయ్యెను. అహింస, సత్యము, దొంగతనము లేకుండుట, కామక్రోధలోభపరత్వము లేకుండుట, భూతములకు ప్రియమును హితమును కలిగింపవలయునను నభిలాష సకల వర్ణములవారికి ధర్మము.

వర్ణధర్మములనుండి ఆశ్రమధర్మముల నుండి తొలఁగిన వారికి అశుచిత్వము, అనృతము, దొంగతనము, నాస్తికత్వము, నిష్ప్రయోజనమైన కలహము, కామము, క్రోధము, లోభము అనుగుణములు స్వభావమగును".

త్రయీవిద్య అనగా వేదవిద్య. యజ్ఞమునందు హౌత్రము, ఆధ్వరము, ఔద్గాత్రము అను మూఁడు కార్యములు ప్రధానముగ నుండును ; అందువలన అది త్రివృద్రూపము.

జన్మస్థానములనుబట్టి ఆశ్రమములలో ఒకదానికంటెనొకటి గుణోత్తరమైనట్లే వర్ణములలో కూడ ఒకదానికంటె నొకటి గుణోత్తరమయ్యెను. ఆశ్రమములలో సంన్యాసమువలె, వర్ణములలో బ్రాహ్మణవర్ణము శ్రేష్ఠము.

బహిరింద్రియ నిగ్రహము దమము. మనోనిగ్రహము శమము. ధర్మతత్త్వములనుగూర్చి ఆలోచించుట తపస్సు. ఇతరులవలన అవమానమో అపకారమో కలిగినప్పుడు సహించుట క్షాంతి. ఇది బ్రాహ్మణునకు గుణమగును, కాని క్షత్త్రియునకు కాదు. మనస్సులో నున్నదానినే వాక్కుచేత ప్రకటించుట, అట్లే ఆచరించుట ఆర్జవము. శత్రువులకు భయమును తాపమును కలిగించుశక్తి తేజస్సు. బడలిక కలుగుచున్నను, సంకల్పబలముచేత, ఆరంభించినకార్యమును వీడకుండుట ధృతి. ఇతరులవలన అవమానమో అపకారమో కలిగినప్పుడు సహింపక ప్రజ్వలించుట శౌర్యము. పూజార్హులైన వారియెడ క్షత్త్రియులకు కూడ సహనమే గుణమగును గాని శౌర్యము గుణము కాదు. ఆకలిదప్పికలను శస్త్రఘాతము మొదలగువానిని ఓర్చుకొనఁ గలుగుట తితిక్ష. వేదపరిరక్షణమున బ్రాహ్మణపోషణమున శ్రద్ధ బ్రహ్మణ్యత్వము. శాస్త్రాచార్యవాక్యములయందు విశ్వాసము ఆస్తికత్వము. తనకు లేనిగుణమును శక్తిని ఉన్నట్లు ప్రకటించుట దంభము.

అహింస మొదలగు ధర్మములు సకలవర్ణములవారికి సాధారణములని చెప్పుటచేత, అవి ప్రత్యేక వర్ణభేదముల ననుసరించి విధింపఁబడుటలేదని, అందువలన వర్ణవ్యవస్థకు సంబంధింపక ఇతరదేశములలో నున్న సకల మానవసమాజములలో మానవత్వమున ఉన్నతిని కోరువారందఱు అనుష్ఠింపవలసినవే అని గ్రహింపవలసియున్నది.

## (ii) వృత్తివిశేష చమసము

భగవానుఁడు ఆశ్రమధర్మములను చెప్పుచు ప్రస్తావవశమున వృత్తి విశేషములను చెప్పెను. "అధ్యయనము, యజ్ఞము దానము బ్రాహ్మణ క్షత్త్రియవైశ్యులకు విహితములు. ప్రతిగ్రహము, అధ్యాపనము, యజ్ఞమును చేయించుట అనునీమూఁడును బ్రాహ్మణునకే విహితములు. అధ్యాపన యజ్ఞాదికర్మలవలన ఇతరులనుండి ధనాదికమును ప్రతిగ్రహించుట తపస్సును తేజస్సును యశస్సును తొలఁగించును. ఈ రెండింటియందును దోషమున్నదని గ్రహించిన బ్రాహ్మణుఁడు ఈ వృత్తులను కూడ వదలి శిలవృత్తిచేత గింజలు ఏరుకొనుట గాని ఉంఛవృత్తిచేఁగాని జీవింపవలయును. బ్రాహ్మణదేహము క్షుద్రమైన కామములకొఱకు కోరఁబడుటలేదు;

ఈలోకమున కృచ్ఛ్రాదిరూపమైన తపస్సుచేయుట కొఱకు చనిపోయిన తరువాత అనంతమైన సుఖమును పొందుట కొఱకు బ్రాహ్మణశరీరము కోరఁబడుచున్నది. శిలోంఛవృత్తులతో విరజమైన మహాధర్మము నవలంబించి నాయందు మనస్సును నిలిపి గృహమునందుండి భోగములయందు ప్రసక్తుఁడు కానివాఁడు శాంతిని పొందుచున్నాఁడు.

జీవనమునకై కష్టపడుచున్న నాభక్తుని సముద్ధరించువారికి ఆపదలు కలిగినచో, సముద్రమునందు నావవలె, నేను వారిని ఆ కష్టములనుండి త్వరితముగ సముద్ధరింతును. ఆపదలు వచ్చినప్పుడు ప్రభువు ధీరత్వముతో తన్ను తానుద్ధరించుకొని ప్రజల నందఱను కాపాడవలయును. ఇట్లు పాలించు ప్రభువు సకలపాపరహితుఁడై దివ్యమైన విమానమున ఇంద్రునితో కూడ క్రీడించును.

జీవనము జరుగనియాపద నొందిన బ్రాహ్మణుఁడు విక్రయింపఁదగిన పదార్థములతో వైశ్యవృత్తిచేఁగాని, యోధవృత్తిచేఁగాని జీవించుచు ఆపదను దాటవలయును. కాని ఏ పరిస్థితియందును శ్వవృత్తిని, (అనఁగా కుక్కవృత్తిని నీచులను సేవించుటను) అవలంబింపరాదు. క్షత్రియుఁడు ఆపదయందు వైశ్యవృత్తిచే గాని, వేటచేఁగాని, విప్రవృత్తిచేఁగాని జీవింపవలె ; శ్వవృత్తిని మాత్రము అవలంబింపరాదు. ఆపదయందు వైశ్యుఁడు శూద్రవృత్తిని, శూద్రుఁడు చాపలు అల్లుట మొదలగువృత్తులను అవలంబింపవలె. ఆపదలు తొలఁగిన తరువాత ఎల్లవారును స్వవర్ణధర్మములనే అనుష్ఠింపవలె".

శ్లో॥ ప్రతిగ్రహం మన్యమాన స్తప స్తేజో యశో నుదమ్ |
అన్యాభ్యా మేవ జీవేత శిలై ర్వా దోషదృక్తయోః ॥ 40

శ్లో॥ బ్రాహ్మణస్య హి దేహోయం క్షుద్రకామాయ నేష్యతే !
కృచ్ఛ్రాయ తపసే చేహ ప్రేత్యానంతసుఖాయ చ ॥ 41

శ్లో॥ శిలోంఛవృత్త్యా పరితుష్టచిత్తో ధర్మం మహాన్తం విరజం జుషాణః |
మ య్యర్పితాత్మా గృహ ఏవ తిష్ఠన్ నాతిప్రసక్త స్సముపైతి శాంతిమ్ ॥ 42

భాగవతే - ఏకాదశస్కంధే - అధ్యాయః - 17

భూస్వామిచేత పొలమునందు పరిత్యజింపఁబడిన ధాన్యకణములు శిలములు; వానిని ఏరుకొనివచ్చి వానితో జీవించుట శిలవృత్తి. అంగడి మొదలగుప్రదేశముల యందు పడియున్న ధాన్యకణములను ఏరుకొని తెచ్చుకొని వానితో జీవించుట ఉంఛవృత్తి.

శిలోంఛవృత్తులతో అతిథులను అభ్యాగతులను ఆదరించుట మహాధర్మము. విరజమనఁగా నిష్కామము.

"ఛీ!" అనుచు ఎంగిలికూటి నొసంగుచున్నను కుక్క తోక ఆడించుచు తినుచు కృతజ్ఞతతో ఇంటిని వదలకుండును. అట్లు అవమానములను భరించుచు, సంపదచే మాత్రమే అధికులైయున్న నీచులను ఆశ్రయించి సేవించుచు బ్రతుకుచుండుట శ్వవృత్తి. విహితములైన ఉపాధ్యాయవృత్తి, యజ్ఞములనుచేయించుట మొదలగువానియందు సేవాభావము కొలఁదిగా నున్నను అవమానములకు అవకాశము తక్కువ. ఏమైనను వీనియందు కొంతవఱకు స్వాతంత్ర్యము తగ్గిపోవునని మహర్షులు అనేకులు రాజులను ఆశ్రయింపక ఈ వృత్తులను కూడ అవలంబింపక వనములలో ఆశ్రమములను నిర్మించుకొనుచుండిరి.

జీవనము జరుగనియాపదలో ఆపద్ధర్మముగా వైశ్యవృత్తిని అవలంబింపవలసిన పరిస్థితియందు కూడ ధాన్యాది పదార్థములను విక్రయించుటకే పూనుకోవలయును, కాని నిషిద్ధములైన మద్యమాంసాదుల వ్యాపారమును అవలంబింపరాదు. ఆపదగడచిపోయిన తరువాత ఆవృత్తులను వదలి స్వధర్మకర్మలనే అవలంబింపవలె. ఈకాలమున జీవనముకొఱకు ప్రభుత్వోద్యోగములలో, వ్యాపార సంస్థలలో, కర్షక కార్మికవృత్తులలో పనిచేయుచున్నవారు తమకు స్వాధీనమైన సమయమునందు అవకాశము ననుసరించి సంధ్యావందనాది కర్మలను నిర్వర్తించుకొనుచునే యుండవలె. ఆసమయమును వినోదవిహార క్రీడాకాలక్షేపములకు వినియోగింపరాదు. సంపన్నత కలిగి ఉద్యోగమునో వృత్తినో వీడఁగలిగిన స్వాతంత్ర్యము కలిగినప్పుడు యథావిధిగ స్వవర్ణధర్మవిహితములైన సంధ్యావందన దేవతార్చన వ్రతపూజావిధానాదికమును సాంగోపాంగముగా అనుష్ఠించుటకే పూనుకోవలె. "ఈ కలికాలమున ధర్మానుష్ఠానమెట్లు జరుగును ?" అని నిర్వేదమును ప్రకటించుట నీచత్వలక్షణము. అవకాశమును ఉన్నంతవఱకు వినియోగించుకొని ధర్మము నాచరించుట ధీరునిలక్షణము.

## (iii) పదార్థ నిర్వచన వచనము

మోక్షమునకు సాధనములైన వర్ణధర్మములను ఆశ్రమధర్మములను భగవానుఁడు విపులముగ వర్ణించి, గోచరించుచున్న పదార్థములన్నియు ఆత్మకంటె అన్యముగా లేవని—ఆత్మయొక్కటే సత్పదార్థమని, జగత్తు సర్వము స్వప్నమువలె ఇంద్రజాలమువలె అసత్యమని నిశ్చితముగ గ్రహించుట జ్ఞానమని, ఆ జ్ఞానముయొక్క అభ్యాసముచేత ఆత్మ తప్ప దేహాదికమైన ప్రపంచము గోచరింపకుండుట విజ్ఞానమని ఉద్ధవునకు పెక్కు విధములుగ బోధించెను. స్వధర్మానుష్ఠానమువలననే అనన్యమైన భక్తి, దానివలన దేహాదికమైన ప్రపంచమునందు అసంగము, దానివలన జగత్తు గోచరింపక ఆత్మయే గోచరించునని భగవానుఁడు నిరూపించెను.

లోకమున ప్రసిద్ధములైన యమనియమాదుల సంఖ్యావిషయమున స్వరూప నిర్ణయమునందును కొందఱు ఒకవిధముగా, ఇతరులు ఇంకొక విధముగా నిరూపించుచుందురు. అందువలన ఉద్ధవుఁడు ప్రసిద్ధములైన పదార్థములనుగూర్చి ప్రశ్నించెను. వానికి అన్నింటికి భగవానుఁడు ఇట్లు క్రమముగా సమాధానములు చెప్పెను.

ప్రశ్న : యమము ఎన్ని విధములు ?

అహింస, సత్యము, అస్తేయము (దొంగతనము లేకుండుట) అసంగము, హ్రీ (లజ్జ), అసంచయము (కూడబెట్టకుండుట), ఆస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, క్షమ, అభయము - పంద్రెండు విధములు - ఇవి ముముక్షువునకు ముఖ్యములు.

ప్రశ్న : నియమము ఎన్ని విధములు ?

బాహ్యశౌచము, ఆభ్యంతర శౌచము, జపము, తపము, హోమము, శ్రద్ధ, ఆతిథ్యము, భగవదర్చనము, తీర్థయాత్ర, పరోపకారమున అభిలాష, తుష్టి, ఆచార్యసేవనము - పంద్రెండు విధములు - ఇవి సకాముఁడైన వానికి ఆవశ్యకములు. వీనిని చక్కఁగా అనుష్ఠించినచో ఇవి అభిలాష ననుసరించి అభ్యుదయమును, మోక్షమును కూడ కలిగించును.

ప్రశ్న : శమ మనఁగా ఏమి ?

నాయందు నిష్ఠ కలిగిన బుద్ధియే శమము.

ప్రశ్న : దమ మనఁగా ఏది ?

ఇంద్రియములను నియమించుట.

ప్రశ్న : తితిక్షాలక్షణ మేమి ?

దుఃఖమును సహించుట.

ప్రశ్న : ఏది ధృతి ?

జిహ్వను, ఉపస్థను (మైథునరతిని) జయింపఁగలుగుట.

ప్రశ్న : దానమేది ?

భూతములయెడ దండమును (దండనమును) వదలుట శ్రేష్ఠమైన దానము. (ధనముల నొసంగుట కాదు)

ప్రశ్న : ఏది తపస్సు ?

కామమును త్యజించుట తపస్సని చెప్పఁబడుచున్నది. (కృచ్ఛ్రాది వ్రతములు కాదు)

ప్రశ్న : శౌర్య మేది ?

స్వభావమును జయించుట (పరాక్రమము కాదు)

ప్రశ్న : సత్య మనఁగా నేమి ?

సకలపదార్థములయందు సమమైన బ్రహ్మమును దర్శించుట (యథార్థభాషణము మాత్రమే కాదు)

ప్రశ్న : ఋతము ఎట్టిది ?

సత్యము ప్రియమును అయిన వాక్కు.

ప్రశ్న : శౌచము ఏది ?

కర్మలయందు ఆసక్తి లేకుండుట.

ప్రశ్న : ఏది సంన్యాసము ?

కర్మలను త్యజించుట.

ప్రశ్న : ఇష్టమైన ధనమేది ?

ధర్మమే ఇష్టమైన ధనము. (పశుధనాది సంపద కాదు)

ప్రశ్న : ఏది యజ్ఞము ?

పరమేశ్వరుఁడనైన నేనే యజ్ఞము. (యజ్ఞమును పరమేశ్వర స్వరూపమనియె అనుష్ఠింపవలయును, కాని క్రియామాత్రముగా కాదు).

ప్రశ్న : దక్షిణ ఏమి ?

జ్ఞానోపదేశము. (హిరణ్యాదికమును మాత్రమే ఇచ్చుట కాదు)

ప్రశ్న : పురుషునకు ఏది బలము ?

ప్రాణాయామము శ్రేష్ఠమైన బలము. (లొంగకుండ విజృంభించుచున్న వానిని వశపఱచుకొనఁగల శక్తిని బలమందురు. వశపఱచుకొనుటకు దుర్ఘటములైన వానిలో మనస్సునకు మించినది లేదు. అట్టి మనస్సును నియమించుటకు సాధనమైన ప్రాణాయామము బలమని చెప్పఁదగియున్నది ; కేవలము దేహపాటవము కాదు.

ప్రశ్న : శ్రీమంతమైన భాగ్య మనఁగా ఏది ?

నాయొశ్వరత్వమునుగూర్చి భావించుట (సంపదకాదు)

ప్రశ్న : ఏది లాభము ?

ఉత్తమమైన నా భక్తి. (పుత్రపౌత్త్రాదికము కాదు)

ప్రశ్న : ఏది విద్య ?

ఆత్మయందు గోచరించుచున్న పదార్థముల భేదములు దేనిచేత గోచరింపకుండ ఆత్మయే గోచరించునో అది విద్య (కేవలమైన యధ్యాత్మ శాస్త్రజ్ఞానము కాదు)

ప్రశ్న : హ్రీ అనఁగా నేమి ?

అకర్మలయందు జుగుప్స (లజ్జామాత్రము కాదు. తన్ను తాను రక్షించుకోవలయును అను నిచ్ఛ జుగుప్స (గోప్తుం ఇచ్ఛా జుగుప్సా) ఇతరులు కావించు మద్యపానాదులను చూచి సిగ్గుపడుచు వెనుకకు మరలుట)

ప్రశ్న : పరమమైన లక్ష్మి ఏది ?

గుణములే పరమమైన లక్ష్మి. (కిరీటాదికములు కాదు).

ప్రశ్న : ఏది సుఖము ?

కలుగుచున్న సుఖమును దుఃఖమును గుర్తింపకుండుట. (భోగానుభవము కాదు)

ప్రశ్న : దుఃఖ మేది ?

గ్రామ్యసుఖములయందు అపేక్ష. (జ్వరతాపాదికము కాదు)

ప్రశ్న : ఎవఁడు పండితుఁడు ?

సంసారబంధమునుండి మోక్షమును పొందువిధమును ఎఱింగినవాఁడు. (కేవలము శాస్త్రవిద్వాంసుఁడు కాదు)

ప్రశ్న : మూర్ఖుఁ డెవఁడు ?

దేహము గృహము మొదలగువానిని తన్నుగా భావించువాఁడు. (తప్పని తెలిసియు తన యభిప్రాయమున పట్టుదలను వదలనివానిని లోకమున మూర్ఖుఁ డందురు)

ప్రశ్న : ఏది సరియైన పథము ?

నాయొద్దకు తప్పక చేర్చునట్టి నివృత్తి మార్గము

ప్రశ్న : ఏది ఉత్పథము ?

(పథమును అతిక్రమించి వర్తించుట) చిత్తమునకు విక్షేపమును కలిగించు ప్రవృత్తి మార్గము.

ప్రశ్న : ఏది స్వర్గము ?

సత్త్వగుణముయొక్క అతిశయము (ఇంద్రలోకము కాదు)

ప్రశ్న : నరకమేది ?

తమోగుణముయొక్క ఉద్రేకము (తామిస్రాదికము మాత్రమే కాదు)

ప్రశ్న : బంధువు ఎవరు ?

గురువే బంధువు (సోదరాదులు కాదు). గురువును నేనే.

ప్రశ్న : గృహ మేది ?

మనుష్య శరీరమే గృహము. (భవనములు కాదు)

ప్రశ్న : ఆఢ్యుఁడు ఎవఁడు ?

గుణసంపన్నుఁడే ఆఢ్యుఁడు. (ధనసంపన్నుఁడు కాదు)

ప్రశ్న : ఎవఁడు దరిద్రుఁడు ?

అసంతుష్టుఁడు (ధనహీనుఁడు కాదు)

ప్రశ్న : ఎవఁడు కృపణుఁడు ?

ఇంద్రియములను జయింపలేనివాఁడు (కేవలము దీనుఁడు కాదు)

ప్రశ్న : ఈశ్వరుఁడెవఁడు ?

విషయములయందు అసక్తమైన బుద్ధికలవాఁడు. (ప్రభువుకాదు)

ప్రశ్న : అనీశ్వరుఁడు ఎవఁడు ?

విషయములయందు ఆసక్తి కలవాఁడు. (ప్రభుత్వము లేనివాఁడు కాదు)

ఉద్ధవా ! నీప్రశ్నల కన్నింటికిని సమాధానము చెప్పితిని. పదార్థములయందలి యీగుణదోషములను బహువిధముల వర్ణించుట వలన నేమి ప్రయోజనము ? ఒక్క మాట వినుము. గుణదోషములను గుర్తించుటయే దోషము ; వానిని గుర్తింపకుండుటయే గుణము.

శ్లో॥ కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః |
గుణదోషదృశి ర్దోషః, గుణ స్తూభయ వర్జితః || 49

భాగవతే - ఏకాదశ స్కంధే - అధ్యాయః - 19

## 2. వేదార్థ నిర్ణయ కమండలువు

### (i) యోగత్రయ చమసము

పైసారాంశమును విన్నంతనే ఉద్ధవుఁడు పెక్కు సందేహములను పొంది ఇట్లు ప్రశ్నించెను. "అరవిందాక్షా ! వేదములు నీయాజ్ఞారూపములు. వానియందున్న విధినిషేధములను పాటింపవలయు నన్నచో కర్మలయందు గుణదోషములను గ్రహింపక తప్పదు. వర్ణాశ్రమాదిభేదములు ద్రవ్యము దేశము కాలము వయస్సు స్వర్గము నరకము మొదలుగా సకల విషయములలో గుణదోషములను గుర్తింపకుండ కర్మల ననుష్ఠించుట సాధ్యము కాదు. గుణదోషములయందు భేదదృష్టి లేకున్నచో విధినిషేధాత్మకమై నీయాజ్ఞారూపమైన వేదము మనుష్యులకు ఎట్లు మోక్షమును కలిగించును ? ఇంద్రియమనోబుద్ధులకు అగోచరములైన సాధ్యసాధనాది విషయములందు మనుష్యులకు, పితరులకు దేవతలకు కూడ నీవచోరూపమైన వేదమే శ్రేష్ఠమైన చక్షుస్సుగా నున్నది. దానివలననే ఇది గుణము ఇది దోషమ..

అని గ్రహించుచున్నాము ; కాని మేము స్వయముగా నిర్ణయించుట లేదు. నీయాజ్ఞారూపమైన వేదముచేత విధింపఁబడియున్న భేదదృష్టి, ఇప్పటి నీయీవచనముచేత ఎట్లు తొలఁగిపోవును ? ఇది నాకు భ్రమను కలిగించుచున్నది. ఈ భ్రమ తొలఁగింపుము''.

గుణదోషములయొక్క దృష్టి లేకున్నచో కర్మకాండయే కాదు నివృత్తిధర్మము కూడ కొనసాగదు. ముముక్షువు శ్రోత్రియుఁడైన బ్రహ్మనిష్ఠునే గురువునుగా ఆశ్రయింపవలె ; ఇతరుని ఆశ్రయింపరాదు. యతి వేదాంతవాక్యములతోనే తత్త్వమును విచారించుచుండవలె గాని లౌకికములైన వాక్యచర్చలయందు నిమగ్నుఁడు కారాదు. కావున ఈ విధముగా గుణదోషములను గుర్తింపకున్నచో మోక్షధర్మసాధనము కూడ జరుగదు.

భగవంతుఁడు ఇట్లు సమాధానము చెప్పెను. ''మానవుల శ్రేయస్సుకొఱకు నేను జ్ఞానము కర్మము భక్తి అను మూఁడు యోగములను చెప్పితిని ; మఱియొక యుపాయము ఏదియును లేదు. కర్మలయందు నిర్వేదమును పొంది వానిని సంన్యసించినవారికి జ్ఞానయోగము, ఫలముల నపేక్షించుచు కర్మలయందు విరక్తిని పొందని వారికి కర్మయోగము, కర్మలయందు విరక్తిని పొందకున్నను వానియందు ఆసక్తి లేక, నాయవతారలీలా కథావిశేషములయందు శ్రద్ధను పొందినవారికి భక్తి యోగము సిద్ధిని కలిగించును. నిర్వేదము కలుగువఱకు, లేక, నాకథలను వినుట మొదలగువానియందు శ్రద్ధకలుగువఱకు కర్మలను అనుష్ఠింపవలసినదే. స్వధర్మమునందు ఉండి నిష్కామముగా యజ్ఞములను చేయుచు, కామ్యనిషిద్ధ కర్మలను పూర్తిగా పరిత్యజించిన వాఁడు స్వర్గమునకు పోఁడు, నరకమున పడఁడు, ఈ శరీరమునందు వర్తించుచు స్వధర్మనిరతుఁడై పాపరహితుఁడై రాగద్వేషాదిమలినములను పోఁగొట్టుకొని శుచియైనవాఁడు విశుద్ధమైన జ్ఞానమునుగాని, యాదృచ్ఛికముగా నాభక్తిని గాని పొందును. నరకమునందున్న వారు ఈమనుష్య శరీరమును ఎట్లు కోరుచుందురో అట్లే స్వర్గమునందున్నవారు కూడ దీనిని కోరుచుందురు. స్వర్గనరకములలో కలుగు శరీరములు భక్తిజ్ఞానములను కలిగించుటకు సాధకములు కావు. బుద్ధిమంతుఁడు స్వర్గమునే కాదు, ఈ శరీరమును కూడ

కోరరాదు. దీనియందు ఉండుటవలన ఈ దేహమునందు అభిమానము కలిగి ఆత్మపదమునుండి జారుటకవకాశము కలుగును.

మరణించు స్వభావముకల (మర్త్యమైన) ఈ శరీరము చక్కఁగా వినియోగించుకొన్నచో మోక్షప్రదమే యగునని గ్రహించినవాఁడు, మృత్యువునకు పూర్వమే జాగరూకుఁడై జన్మరాహిత్యమునకై ప్రయత్నించవలె. పడిపోవుచున్న చెట్టు నుండి తన గూడును విడి నిస్సంకోచముగా పక్షి పైకి ఎగిరిపోవునట్లు, మోక్షమును గోరినవాఁడు శరీరము పడిపోవుటకు పూర్వమే సకల సంగములనుండి విముక్తుఁడై పరతత్త్వమును తెలిసికొని మృత్యువు వచ్చినప్పుడు నిశ్చింతగా శరీరమును విడచి కైవల్యమును పొందును. సకలాభ్యుదయములకు మోక్షమునకు మూలమై సంసారసాగరమును తరించుటకు నౌకవంటి మనుష్యశరీరమును పొందినవాఁడు, కర్ణధారునివంటి గురువును ఆశ్రయించి, నాయందలి భక్తి అను అనుకూలమైన మారుతముతో తరింపకున్నచో, అది ఆత్మహత్యతో సమానమే యగును.

కర్మయోగమువలన చిత్తశుద్ధి సిద్ధించి సకలకార్యములయందు విరక్తుఁడైనవాఁడు మనస్సును నిశ్చలముగా నుండునట్లు జ్ఞానయోగమును అభ్యసించవలయును. ఆరంభమునందు మనస్సు మిగులచంచలముగా నున్నప్పుడు, దానిమార్గమును కొంత అనుసరించుచు, దానిని వదలకుండ నెమ్మదిగా ఆత్మస్వరూప చింతనమునకు మరలించవలె. మనస్సును యథేష్టముగా వదలరాదు. వశపడకుండ పరుగెత్తుచున్న గుఱ్ఱమును, దానివెంట కొంతదూరము పరుగెత్తి దానిపైకెక్కి, మార్గమునకు మరలించునట్లు మనస్సును కూడ ఇంద్రియనిగ్రహముచేత ప్రాణాయామముతో ఆత్మధ్యానమునందు నిలుపవలె. మనోనిగ్రహమే పరమయోగము. ఆత్మనుండి ఆకాశము, దానినుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నివలన జలము, జలమువలన పృథివి ప్రభవించుటగా తోఁచుచున్న సృష్టిప్రకారమును, ఈభూతములన్నియు ఆత్మస్వరూపములై ఆత్మయందే ఉండుటను, తుదకు పృథివి జలములందు, జలములు అగ్నియందు, అగ్నివాయువు నందు, వాయువు ఆకాశమునందు, ఆకాశము ఆత్మయందు లీనమగుటగా తోఁచుచున్న ప్రళయప్రకారమును మాటిమాటికి ధ్యానించుచున్నచో మనస్సు ప్రసన్నమగును.

ఈ విధమైన గురూపదేశమును పెక్కువిధముల చింతించుచున్నచో మనస్సునకు దేహాదులయందు అభిమాన మను దురాత్మత్వము తొలఁగిపోవును. యమాదులైన యోగమార్గములచేత, జీవునియొక్క ఈశ్వరునియొక్క తత్త్వమును పరిశీలించుచుండుటచేత, నన్ను అనేక ప్రకారముల ఉపాసించుచుండుటచేత, యోగి యోగగమ్యుఁడనైన నన్ను స్మరించుచుండవలయును.

ఏ కారణముచేతనైనను పొరపాటున నింద్యమైన పనిని యోగిచేయుట సంభవించినచో యోగముచేతనే ఆ దోషమును పోఁగొట్టుకోవలయును ; కాని అందులకు ఇతర ప్రాయశ్చిత్త విధానములను అవలంబింపరాదు. తమ తమయధికారము ననుసరించి ఏయే యోగముయొక్క నిష్ఠ ఏర్పడియున్నదో దానినే పాపపరిహారము కొఱకు కూడ అవలంబించుట గుణము ; దానిని వదలి ప్రాయశ్చిత్తముకొఱకు చాంద్రాయణాదికములై యన్యవిధానములను అవలంబించుట దోషము. ఈవిషయమున గుణదోషములయొక్క నిర్ణయమిదియే. సహజముగా కర్మలన్నియు అశుద్ధములే. వానివిషయమున కొంత సంకోచము కలిగించుటకై, "ఇది చేయఁదగినది, ఇది చేయరానిది" అని విధినిషేధములను, మనుష్యులయందలి సంగములను క్రమక్రమముగా తొలఁగించుటకై, వేదము చెప్పుచున్నది.

నాకథలయందు శ్రద్ధకలిగినవాఁడు, అన్యకర్మలయందు నిర్వేదమును పొందియు, కామములు దుఃఖాత్మకములని ఎఱింగియు వానిని పరిత్యజించుటకు సామర్థ్యము లేనప్పుడు, నాయర్చనమునందు శ్రద్ధాళువై, భక్తిచేతనే సర్వము సంభవించునను దృఢనిశ్చయము కలవాఁడై, కామములకు దుఃఖమే ఫలమని నిదించుచు వానిని అనుభవించుచున్నను నన్ను భజింపవలయును. వెనుకఁ జెప్పఁబడిన భక్తియోగముతో నన్ను మాటిమాటికి భజించుచుండు మునికి, ఆతని హృదయమునందు నేను ఉండుటవలన అచ్చట నున్న కామము లన్నియునశించును. నన్ను అఖిలాత్మకునిగా ఆయోగి దర్శించునప్పుడు హృదయ గ్రంథియొక్క ముడి విడిపోయి సకల సంశయములు ఖండితము లగును ; కర్మలు క్షయము నొందును. మత్స్వరూపుఁడే అయిన భక్తియుక్తునకు జ్ఞానముగాని వైరాగ్యముగాని సాధారణముగా శ్రేయస్సాధనము కాదు. కర్మలచేత తపస్సుచేత జ్ఞానవైరాగ్యములవలన యోగముచేత దానధర్మ

తీర్థయాత్రాదులచేత ఏది ఏది లభించునో స్వర్గముకాని మోక్షముగాని వైకుంఠముగాని ఏదియైనను అదియంతయు భక్తియోగముచేతనే లభించును. నాయందు అనన్యమైన భక్తి కలవారు జన్మరాహిత్యమును కూడ కోరరు. దేనిని కోరకుండుటయే పరమశ్రేయస్సని చెప్పుదురు. కావున నిష్కామమునకు నాయందు నిరపేక్షమైన భక్తి కలుగును. సమచిత్తులై బుద్ధికంటె పరమైన యాత్మతత్త్వమును పొంది నాయందు ఏకాంతభక్తి కలిగినవారికి జగత్తునందు గుణదోషములను గుర్తించుటవలన కలుగు పుణ్యపాపములు ఏవియు సంభవింపవు. ఈ విధముగా నాచేత ఆదేశింపఁబడిన యీ యోగమార్గము లను అనుష్ఠించువారు పరబ్రహ్మముగా చెప్పఁబడుచున్న నాస్థానమును క్షేమముగా పొందుదురు".

సాధకదశలో నున్నయీయోగు లెవరైనను కామ్యకర్మలయందు ప్రవర్తించుచున్నంతవఱకు గుణదోషములను గుర్తించుచు విధినిషేధములను పాటింపక తప్పదు. నిష్కామకర్మయోగమును అనుష్ఠించుచున్నవారు ప్రారబ్ధముచేత సంభవించుచున్న వ్యవహారమునందు యథాశక్తిగా విధినిషేధములను పాటింపవలసినదే. కర్మయోగమువలన చిత్తశుద్ధి కలిగి జ్ఞానయోగమునందు గాని భక్తియోగమునందు గాని అభినివేశమును (పట్టుదలను) పొందినవారు యాదృచ్ఛికముగా గుణదోషములను గుర్తించుచు స్వల్పముగా విధినిషేధములను పాటించుచుందురు. వారు ఆ యోగములందు సిద్ధులైన తరువాత జగత్తును పరమేశ్వర స్వరూపముగానే చూచునప్పుడు వారికి గుణదోషముల భావన, విధినిషేధముల ప్రసక్తియు ఉండదు.

శ్లో॥ యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధ స్తు యః పుమాన్ ।
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః ॥ 8

శ్రీధర : యదృచ్ఛయా కేనాపి భాగ్యోదయేన - మత్కథాదౌ జాతశ్రద్ధః యః కర్మసు నిర్విణ్ణో న భవతి - తత్ఫలేషు చ సక్తో న భవతి - తస్య భక్తియోగః సిద్ధిదః - తత్ర కామ్యకర్మసు ప్రవర్తమానస్య సర్వాత్మనా విధి ప్రతిషేధాధి కారః ఇతి ఉత్తరాధ్యాయే వక్ష్యతి - నిష్కామకర్మయోగాధికారిణ స్తు యథాశక్తి - న చ జ్ఞానభక్తి యోగాధికారాత్ ప్రాగేవ - తదధికృతయోః స్వల్పః - తాభ్యాం సిద్ధానాం తు న కించి దిత్యర్థః ॥

శ్లో॥ తావ త్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా ।
మత్కథా శ్రవణాదౌ వా శ్రద్ధా యావ న్న జాయతే ॥ 9

శ్రీధరః : సావధిం కర్మయోగ మాహ నవభిః తావ దితి | కర్మాణి నిత్యనైమిత్తికాని - యావతా యావత్ ||

జ్ఞానయోగసాధకులకుఁ గాని భక్తియోగసాధకులకుఁగాని ఏదేని పాపము సంభవించినచో వారు దానిని పోఁగొట్టుకొనుటకు జ్ఞానయోగి ప్రణవజపాదికమును, భక్తుఁడు ఏకాహము సప్తాహము మొదలగు దీక్షలతో నామసంకీర్తనాదులను అవలంబింపవలసినదే. కాని కర్మయోగ విషయమందువలె కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగువానిని అవలంబింపరాదు. ఎవరు ఎవరు ఏ యధికారమునందున్నారో వారు ఆయధికారముల యందలి విధులనే పాపపరిహారము కొఱకు అవలంబించుటయే గుణము ; ఇతరుల యధికారములోని దానిని అవలంబించుట దోషము. కర్మనిష్ఠులకు చాంద్రాయణాదికము ఎట్లు పాపమును తొలఁగించునో అట్లే జ్ఞానులకు ప్రణవజపాదికము, భక్తులకు నామసంకీర్తనాదికము పాపమును పరిహరించును. కావున ప్రతివ్యక్తి తనయధికారము ననుసరించియే వర్తింపవలె.

వేదముయొక్క దృష్టిలో సకలకర్మలు సహజముగనే అశుద్ధములు ; కావున పరిత్యాజ్యములు. అందువలన గుణదోష నిరూపణముచేత వేదము విధినిషేధములను ఏర్పఱచి కర్మలవిషయమున సంకోచమును కలిగించుచున్నది. ఎంగిలి తినరాదు, మద్యమును త్రాగరాదు, పరస్త్రీని పొందరాదు మొదలగునవి సహజముగనే అశుద్ధములు త్యాజ్యములు. వీనినుండి మనుష్యులను దూరమొనర్చుటకై నిషేధములు ఏర్పడినవి. అందఱును వీనికి పాల్పడరు. కొందఱు వీనికి లోనగుదురు. అప్పుడు వారికి పాపములు ప్రాప్తములగును. నిషేధములు ఇట్లు ప్రాప్తములైన పాపములను తొలఁగింపలేవు. అవి ప్రాయశ్చిత్తములచేత, ప్రణవజపనామ సంకీర్తనాదులవల్లనే నశించును. దుష్టములైన మద్యపానాదులయందు సంగమును తొలఁగించుటయే నిషేధములకు తాత్పర్యము. పురుషునకు ప్రవృత్తికంటె అశుద్ధి మఱియొకటి లేదు. స్వభావమువలన కలుగుచున్న ప్రవృత్తిచేతనే వానికి మాలిన్యము కలుగుచున్నది. కాని సకలకర్మలనుండి యొక్కసారిగా నివృత్తిని పొందుట శక్యము కాదు. అందువలన,

"ఇదియే చేయఁదగినది ; ఇది చేయరానిది" అని స్వాభావికమైన ప్రవృత్తిని సంకోచింపఁజేయుచు వేదము నివృత్తినే ఉద్దేశించుచున్నది. కావున వేదము ప్రవృత్తిపరము కాదు. ఈవిషయము, పై అధ్యాయమున (ఇరువదియొకటి) వివరింపఁబడుచున్నది. ఈవిధముగా యోగికి స్వాభావికమైన ప్రవృత్తియే ఉండదు; కావున ప్రాయశ్చిత్తాది విధులతో వానికి సంబంధము లేదు.

కర్మఠులు (కర్మశ్రద్ధ కలవారు) నిషేధములవలన నిషిద్ధకర్మల నుండి దూరమగుదురు. కర్మయోగులు కామ్యకర్మలను పరిత్యజింతురు. జ్ఞానయోగ భక్తి యోగాభ్యాసకులు నిత్యనైమిత్తకములైన కర్మలయందు కూడ అత్యంతము ఆవశ్యకములైన వానిని మాత్రమే ఆచరింతురు. సంన్యాసమున అవి కూడ తొలఁగిపోవును. జ్ఞానసిద్ధియందు అనన్యభక్తిసిద్ధియందు జగత్తు అంతయు పరమేశ్వరస్వరూపముగా పరబ్రహ్మముగా గోచరించునప్పుడు సకలకర్మలు నివృత్తములై నైష్కర్మ్యసిద్ధి కలుగును. ఇదియే సకలవేదములకు తాత్పర్యము.

శ్లో॥ యది కుర్యా త్ప్రమాదేన యోగీ కర్మవిగర్హితమ్ ।
యోగేనైవ దహే దంహో నాన్య త్కుర్యాత్ కదాచన ॥ 25

శ్రీధరః : నను పాపోత్పత్తౌ ప్రాయశ్చిత్తం కార్య మేవ తత్రాహ యదీతి । యోగేన జ్ఞానాభ్యాసే నైవ - ఏతచ్చ భక్తస్యాపి నామసంకీర్తనా ద్యుపలక్షణార్థమ్ నాన్యత్ కృచ్ఛ్రాది ॥

శ్లో॥ స్వే స్వేఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః ।
విపర్యయ స్తు దోష స్స్యా దుభయో రేష నిశ్చయః ॥ 26

శ్రీధరః : నను నిత్యనైమిత్తికం కర్మ సత్త్వశోధకత్వాత్ గుణం, హింసాదికం తు అశుద్ధిహేతుత్వాత్ దోషః, తత్ర చ తన్నివర్తకత్వాత్ కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తం గుణః ఇతి విధి ప్రతిషేధాభ్యా ముక్తత్వాత్ ప్రాయశ్చిత్తం వినా యోగేనైవ కథం పాపం దహేత్ । తత్రాహ ద్వాభ్యామ్ స్వే స్వే ఇతి, స ఏవ గుణో నేతరః ॥

శ్లో॥ కర్మణాం జాత్యశుద్ధానా మనేన నియమః కృతః ।
గుణదోషవిధానేన సంగానాం త్యాజనేచ్ఛయా ॥ 27

శ్రీధరః : త దుపపాదయతి కర్మణా మితి | యస్మాత్ విధినిషేధాభ్యా మనేన గుణదోషవిధానేన కర్మణాం నియమః సంకోచః కృతః కుత ఇత్యాహ జాత్యా ఉత్పత్త్యైవ అశుద్ధానాం, న చ ప్రాప్తానామ్ సంగానాం త్యాజ నేచ్ఛయా |అయం భావః పురుషస్య అశుద్ధి ర్నామ న ప్రవృత్తేః అన్యాస్తి స్వాభావిక ప్రవృత్త్యైవ తస్య మలినత్వాత్ | న చ సహసా సర్వతో నివృత్తిః కర్తుం శక్యతే | అతః ఇదం న కర్తవ్య మిద మేవ కర్తవ్య మితి స్వాభావికప్రవృత్తిసంకోచద్వారేణ నివృత్తి రేవ క్రియతే | తథా చ న ప్రవృత్తిపరో వేదః తథా ఉత్తరాధ్యాయే వక్ష్యామః, ఉత్పత్త్యైవ హి కామేషు (శ్లో. 24 - అధ్యాయ 21) ఇత్యాదినా అతో యోగినః స్వాభావికప్రవృత్త్యభావాత్ న ప్రాయశ్చిత్తాది విధిగోచరతా ఇతి" శ్రీమద్భాగవతే - అధ్యాయః - 20

## (ii) విధినిషేధ చమసము

యోగత్రయమును వివరించినతరువాత భగవానుఁడు వీనిలో ఏయొక్కదానినైనను అవలంబింపక కేవలము కామ్యకర్మలే ప్రధానముగా ప్రవర్తించువారు శాస్త్రవిహితములైన విధినిషేధములను తప్పక పాటింపవలసినదే యని ఇట్లు వచించెను.

"భక్తిజ్ఞాన క్రియారూపములైన యీమూఁడు మార్గములను వీడి చంచలములైన ప్రాణేంద్రియములతో క్షుద్రములైన భోగములను పొందుచుండువారు అనేక జన్మలను పొందుచు సంసారచక్రమున పైకి క్రిందికి పరిభ్రమణము నొందుచుందురు. వీరికి తమయధికారమునకు ఏది ఉచితమో అది గుణమగును, ఏది అనుచితమో అది దోషమగును. ఇదియే గుణదోషముల నిర్ణయము. సమానములైన వస్తువులయందు "ఇది యోగ్యము, ఇది అయోగ్యము" అను పరిశీలనమువలన యోగ్యమైనది శుద్ధమని అయోగ్యమైనది అశుద్ధమని గ్రహింపఁబడుచున్నది. ఈ గుణదోషములు నిమిత్తముగా శుద్ధమైనది శుభమని, అశుద్ధమైన అశుభమని గ్రహింపఁబడుచున్నది. శుద్ధి, అశుద్ధి అనుభేదములు ధర్మముకొఱకు, గుణదోషములు వ్యవహారముకొఱకు, శుభాశుభములు జీవయాత్రకొఱకు ధర్మప్రవృత్తియొక్క భారమును వహించుచున్న నాచేత ఆచారరూపమున ప్రదర్శింపఁబడినవి.

బ్రహ్మదేవునినుండి స్థావరమువరకు ప్రాణులయొక్క సకలశరీరములకు పంచభూతములే కారణములు. వానియందున్న యాత్మకూడ ఒక్కటే. అయినను ప్రాణులయొక్క పురుషార్థసిద్ధికొఱకు సమానములైన యీదేహములయందు విషమములైన నామరూపములను వేదము కల్పించుచున్నది. జీవుల యొక్క ప్రవృత్తిని నియమించుటకొఱకు నేను దేశకాలవస్తువులయందు గుణదోషములను విధించుచున్నాను.

కృష్ణహరిణసంచారములేనిది, బ్రాహ్మణభక్తిలేనిది యైన దేశము అశుచి యగును. కృష్ణమృగ సంచారము కలిగిన దేశమైనను సత్పురుష వర్జితమైనది, ఆచారసంస్కారములులేని సమాజము కలది, ఊషరక్షేత్రము (చవుడునేల) అశుచి ప్రదేశములే యగును. ద్రవ్యసంపత్తియుండు కాలము లేక సహజముగా యోగ్యమై యుండుసమయము కర్మకు యోగ్యమగును. ఎప్పుడు కర్మానుష్ఠానము జరుగుటకు వీలులేదో ఆకాలము అశుద్ధమగును. ద్రవ్యము, వచనము, సంస్కారము, కాలము మహత్త్వము అల్పత్వము అనువానిచేత ద్రవ్యమునకు శుద్ధి అశుద్ధి ఏర్పడుచున్నవి. శక్తిచేత అశక్తిచేత జ్ఞానముచేత సమృద్ధిచేత కలుగునట్టి పాపము దేశము ననుసరించి, అవస్థ ననుసరించి ఏర్పడును.

ధాన్యము, దారువు, అస్థి, వస్త్రము, రసము, తైజసములైన ధాతువులు చర్మము అనువానికి, కాలము వాయువు అగ్ని మృత్తిక అనువానిచేత ప్రత్యేకముగాఁ గాని సంయుక్తములైన రెండింటిచే, మూఁడింటిచేఁగాని శుద్ధికలుగును. అమేధ్యమైన పదార్థముచేత లేపనము సంభవించిన ద్రవ్యమునకు అదుర్వాసన అలేపనముపోయి దేనిచేతనైన సహజస్థితి కలిగినచో అప్పుడా పదార్థము శుద్ధమగును.

స్నానము దానము తపస్సు అవస్థ వీర్యము సంస్కారము నన్ను స్మరించుట చేత ద్విజుఁడు పరిశుద్ధుఁడై కర్మను ఆచరింపవలెను.

పరిజ్ఞానమువలన మంత్రశుద్ధి, ఫలమును నాకర్పించుటవలన కర్మశుద్ధియు సంభవించును. శుద్ధములైన ఈయాఱింటిచేత (దేశ, కాల ద్రవ్య కర్త్రుమంత్ర కర్మలు) ధర్మము సంపన్నమగును. ఇవి శుద్ధములు కానిచో అధర్మము ఏర్పడును.

కాని యొక సందర్భమున గుణము కూడ దోషమగుట మఱియొకచోట దోషము సైతము గుణమే యగుటయు శాస్త్రవిధిచేతనే సంభవించును. గుణదోషముల నిర్ణయించుచున్న శాస్త్రము ఆగుణదోషముల భేదమునే బాధించుచున్నది. కొందఱకు దోషమైన యాకర్మయే పతితులకు పాతకము కానేరదు. క్రింద పరుండినవాఁడు నేలపై పడుట సంభవింపదు కదా ! ఆశ్రమధర్మముచేతనే ఏర్పడియున్న సంగము గృహస్థునకు పతనము కలిగింపదు.

గృహస్థుఁడు కూడ ఏయే విషయమునుండి వెనుకకు మరలునో ఆయావిషయమునుండి విముక్తుఁడగును. ఈ నివృత్తి ధర్మము మానవులకు శోకమోహభయములను దూరమొనరించుచు క్షేమప్రదమగును. విషయముల యందలి గుణములను ధ్యానించుటవలన ఎవనికైనను వానియందు సంగము కలుగును. ఆసంగమువలన కామము, దానివలన కలహము సంభవించును. దానివలన దుర్భరమైన క్రోధ ముద్భవించును. క్రోధమునుండి తమస్సు ప్రభవించి జ్ఞానమును కబళించును. జ్ఞానరహితుఁడైన మనుష్యజంతువు శూన్యుఁడగును. పిదప, మూర్ఛితునకు మృతునకు ఏ పురుషార్థము ఎట్లు సంభవింపదో అట్లే జ్ఞానశూన్యుఁడు పురుషార్థము నుండి భ్రంశము నొందును. విషయములయందలి ఆసక్తి నొందినవాఁడు తనవిషయమును, ఇతరుల విషయమును కూడ గ్రహింపలేఁడు. అట్టివాఁడు వృక్షమువలె జీవించుచు కొలిమి తిత్తివలె ఉచ్ఛ్వాసనిశ్వాసములు కావించుచుండును.

కర్మలవలన స్వర్గాదిఫలములు కలుగునని చెప్పుచున్న వేదవచనములు, చేదుమందును తినిపించుటకై "తిన్నచో లడ్డువు" లిత్తునని తల్లి బిడ్డతో చెప్పుమాటలవంటివే, కాని, పరమశ్రేయోదాయకములు కావు. తమకు అనర్థహేతువులైన సంపదలయందు ఆయుర్బలవీర్యాదులయందు పుత్త్రాదిస్వజనులయందు మానవులకు సహజముగనే ఆసక్తి కలుగుచుండును. తమ శ్రేయస్సు నెఱుంగక కామమార్గములయందు ప్రవర్తించుచు శ్రేయస్సును బోధింపు మని ప్రణతులై యున్నవారిని వేదము మరల ఆసంసారమార్గములయందే ఎట్లు ప్రవేశపెట్టును ? వేదముయొక్క యా తాత్పర్యము నెఱింగిన వేదవేత్తలు ఆఫలశ్రుతి వాక్యములను పరమార్థములనుగా వచింపరు. కుబుద్ధులు వికసించిన పుష్పములవలె నుండు ఆవాక్యములను పరమార్థఫల ప్రదములైనట్లుగా గ్రహించుచుందురు".

ఈ యుపదేశమును ఇట్లు వివరముగా గ్రహింపవచ్చును. ఏయోగమునందును ప్రవేశము లేక ధనధాన్యపుత్త్ర పౌత్త్రాదిసంపదలను స్వర్గభోగాదులను కోరి వ్రతములను యజ్ఞాదులను అనుష్ఠించువారికొఱకు ద్రవ్యకాలదేశాదులయొక్క గుణదోషములు వివరింపఁబడుచున్నవి. జ్ఞానముచేతఁగాని భక్తిచేతఁగాని సిద్ధిని పొందినవారికి వీనితో సంబంధము లేదు. యోగసాధకులు కొద్దిగా వీనిని పాటించుచుందురు. కర్మయోగనిష్ఠులైన వారికి నిత్యనైమిత్తికమైన కర్మ, సత్త్వశుద్ధిని కలిగించునది యగుటచే, గుణమే యగును. దానిని చేయకుండుట నిషిద్ధముల నాచరించుట దోషమే యగును. అట్లే వారికి ఆదోషములను పోగొట్టునట్టి కృచ్ఛ్ర చాంద్రాయణాదివ్రతములు ప్రాయశ్చిత్తములుగా గుణములె యగును. కాని జ్ఞానయోగనిష్ఠులకు జ్ఞానాభ్యాసమే సిద్ధిహేతు వగుటవలన గుణమగును ; భక్తినిష్ఠులైనవారికి శ్రవణకీర్తనాదులే గుణము. ఈ యిరువురకు పై సాధనములకు విరుద్ధమైన దంతయు దోషమే అని చెప్పఁబడెను. సిద్ధులు సాధకులు కాక కేవలము కామ్యకర్మప్రధానులైన వారికి గుణములు దోషము లన్నియు వివరింపఁబడినవి.

మఱి నిత్యనైమిత్తికములు కృచ్ఛ్ర చాంద్రాయణాదులు కొందఱకు గుణములై కొందఱకు దోషము లెట్లగును ?" అగ్ని కొందఱను దహించును కొందఱను దహింపదు" అని చెప్పవచ్చును ? గుణములైనవి అందఱకును గుణములు, దోషములు కూడ అందఱకును దోషములు కానక్కఱలేదా ? కావు. ప్రతివ్యక్తికి తనయధికారమునకు ఏది యుచితమగునో అది గుణము. ఏది యనుచితమో అది దోషమగును. ఆరోగ్యసిద్ధికొఱకు యువకులకు వివిధములైన వ్యాయామములు గుణములే యైనను వృద్ధులకు కావు. దృఢమైనయాహారము వృద్ధులకు దోషమే యైనను బలిష్ఠులైన యువకులకు గుణమే యగును. కావున గుణదోషములు పదార్థములయందు లేవు. అధికారిభేదమును బట్టి అవి ఎప్పటికప్పుడు గ్రహింపఁబడుచున్నవి.

లభించిన పదార్థముల నన్నింటిని అనుభవింపవలయునను వాంఛ మానవులకు సహజము. దేనివలన మేలు కలుగునో దేనివలన కీడు కలుగునో తెలుపుచు శాస్త్రము స్వాభావికమైన యీ ప్రవృత్తికి సంకోచమును (Limitation) కలిగించుచున్నది.

మేలు కీడు అను పరిమాణముల ననుసరించియే శుద్ధి అశుద్ధి, గుణము దోషము, శుభము అశుభము అనునవి నిర్ణయింపఁబడుచున్నవి. వీని ననుసరించియే కొన్ని పదార్థములు గ్రహింపఁదగినవి అని, ఇతరములు గ్రహింపరానివని ఏర్పాటు సంభవించుచున్నది. శుద్ధములైన పదార్థములవలన ధర్మము, అశుద్ధములైన వానివలన అధర్మము కలుగును. వ్యవహారము కొఱకు గుణదోషములు నిర్ణయింపఁబడుచున్నవి. వంచనము దోషమే. అయినను ప్రజారక్షణము కొఱకు క్రూరమృగములను వధ్యులైన మహాపాపులను వంచించి వధించుట గుణమే యగును. శుభాశుభములు జీవయాత్రకొఱకు నిశ్చయింపఁబడుచున్నవి. హీనవర్ణముల వారివలన పరిగ్రహము, ఉచ్ఛిష్టభోజనము మొదలగునవి అశుభములేయైనను ఆపదలయందు ప్రాణము నిలుపుకొనుటకై ఎంత మాత్రము ఆవశ్యకమో అంతమాత్రము స్వీకరించుట పాపము కాదు : కాని అధికముగ స్వీకరించుట పాపమే యగును. ధర్మము, వ్యవహారము, జీవయాత్ర చక్కఁగా సిద్ధించుటకై శుద్ధ్యశుద్ధులు, గుణదోషములు, శుభాశుభములు ఏర్పఱుపఁబడినవి. ఈ దృష్టితోనే దేశకాలపదార్థములయందు భేదములు గుర్తింపఁబడుచున్నవి.

కృష్ణమృగ సంచారము, బ్రాహ్మణభక్తి, ఆచారసంస్కారములు మొదలగు గుణములు ఈనాఁడు ఆ సేతుహిమాచలముగా అన్ని ప్రాంతములలో అరుదగుచున్నవి. వేదధర్మమునందు విశ్వాసము లేని ప్రభుత్వములు రాజకీయ సమాజముల ప్రచారములు ఉగ్రవాదుల విప్లవచర్యలు అతివృష్టి అనావృష్టి మొదలగు వానివలన కాలము కూడ ధర్మాచరణమునకు అనుకూలముగా లేదు. అయినను ధర్మమునందు శ్రద్ధకలిగినవారు లభ్యములైన పదార్థములతో, లభించుచున్న పండితులతో శక్తివంచనము లేకుండ సాధ్యమైనంతవఱకు వేదాధ్యయనము, సంధ్యావందనము పంచయజ్ఞములు శ్రాద్ధములు మొదలగువానిని జరుపుచుండవలె. యుద్ధములకు సంకల్పించినవారు అవి పూర్తియగువఱకు ఇతర కార్యములకు సంకల్పించుటకు వీలు లేదు. అవి పూర్తయిన తరువాత నైమిత్తికములైన శ్రాద్ధాదులను జరుపుదురు. అట్లే తుపాను భూకంపము మొదలగునవి సంభవించినప్పుడు కూడ ఆగిపోయిన యాబ్దికాది కార్యములను కూడ పరిస్థితులు చక్కఁబడినంతనే

సాధ్యమైనంతవఱకు జరుపుకొనవలె. ధర్మానుష్ఠానమునందు మంత్రహీనత క్రియాహీనత సంభవించినను కర్తయొక్క శ్రద్ధయే ఫలప్రదమగును.

ద్రవ్యమునకు శుద్ధి అనేక విధముల సంభవించును. బంగారము అగ్నిచేత శుద్ధి యగునట్లు గంగాజలము చేత కొన్ని శుద్ధి నొందును. పుష్పములు మొదలగునవి జలప్రోక్షణము మొదలగు సంస్కారములచేత శుద్ధి నొందును. మంత్రజలముచే ప్రోక్షించినను క్రిందటి దినమున వండిన యన్నము పరిశుద్ధము కానేరదు, నైవేద్యమునకు పనికిరాదు. కొన్ని కాలముచేత శుద్ధినొందును. సూతకము మృతకము మొదలుగా అశౌచములు సంభవించినప్పుడు అశుచిదినములు గడచిపోయిన తరువాత స్నానములచేత వ్యక్తులు, జలప్రోక్షణాదులచేత పదార్థములు శుద్ధములగును. పదార్థము యొక్క రాశినిబట్టి కూడ శుద్ధి ఏర్పడును. నదీ ప్రవాహజలమునకు ఎగువప్రదేశమున పశువులు మునిఁగి తేలుచున్నను దిగువప్రదేశమున కొంతదూరము నందు గ్రహింపఁబడు జలము శుద్ధమే యగును ; కాని చిన్నగుంట యందలి జలము అశుద్ధమే యగును. అట్లే పెద్ద సంతర్పణములయందు పెద్ద యన్నపురాశులయందు ఏ మూలనైనను జంతువుల స్పర్శ సంభవించినచో ఆ మూల నాలుగైదు చేటలయన్నమును తొలఁగించి తక్కిన దానిని పరిశుద్ధముగనే భావింపవలె. కాని విస్తరిలో వడ్డించిన యన్నమును కాని చిన్నపాత్రలో నున్న పదార్థమును గాని జంతువు స్పృశించినచో అదియంతయు అశుద్ధమై వర్జింపవలసినదే యగును. సూర్యగ్రహణాదులయందు పదార్థములు అశుచియగును. అప్పుడు శక్తిమంతులై ఆరోగ్యశాలురైన వానికి అవి యశుద్ధములే యైనను, రోగగ్రస్తులై అశక్తులైన వారికి శుద్ధములవలె పరిగ్రాహ్యములే యగును. పుత్రజన్మము బంధుమృతి మొదలగునవి సంభవించినప్పుడు, ఆవార్తలు తెలిసినప్పటినుండియే అశుచిత్వ మేర్పడును. తెలియుటకు పూర్వము జరుపఁబడిన దేవతార్చనము శ్రాద్ధము వ్రతములు మొదలగునవి పరిశుద్ధములె అయిఫలప్రదములె యగును. సంపన్నుఁడు జీర్ణములై మాసియున్న వస్త్రములతో దేవతలను అర్చింపఁబూనుకొన్నచో అతఁడు అశుచియే యగును ; కాని దరిద్రునకు అదిదోషము కానేరదు. ముహూర్తముల శుభాశుభములయందు, పదార్థముల శుద్ధ్యశుద్ధులయందు సందేహము కలిగినప్పుడు

బ్రాహ్మణవచనముచేత, అనఁగా "ఈ ముహూర్తము సుముహూర్తమగును గాక ; ఈపదార్థము పరిశుద్ధమగును గాక" (అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు ; అయం పదార్థ శ్శుద్ధో భవతు) అని బ్రాహ్మణుఁడు చెప్పినచో, ఆముహూర్తము సుముహూర్తము, ఆపదార్థము పరిశుద్ధము అగును.

అయోగ్యములైన పదార్థములు దొంగలు మొదలగువారిచే భయగ్రస్తములైన దేశములయందు, భూకంపాదులు సంభవించినకాలము, రోగాదుల యవస్థలయందు అశక్తులైనవారికి పాపమును కలిగింపవు ; కాని నిర్భయములైన ప్రదేశములందు, ప్రశాంతములైన సమయములయందు రోగరహితులై సమర్థులైనవారు సోమరితనముచేత అట్టిపదార్థముల నుపయోగించినచో తప్పక పాపము సంభవించును. కావున దేశము, కాలము, వయస్సు, శక్తి, అశక్తి మొదలగువాని ననుసరించి శుచిత్వము అశుచిత్వము శుద్ధి అశుద్ధి, గుణముదోషము ఏర్పడునని గ్రహింపవలె. ఆపదయందు హీనవర్తనము గ్రహింపఁదగినదే యైనను, ఆపదపోయిన తరువాత కూడ ఆవర్తనమునందే యుండుట పాపమును కలిగించును.

భగవానుఁడు మఱియు నిట్లు చెప్పెను. "ఫలశ్రుతి వాక్యములే పరమార్థములని తలంచుచు కొందఱు, 'యజ్ఞములతో ఇచ్చట దేవతలను పూజించి దేవలోకమునకు పోయి రమింతుము; యజ్ఞఫలము ముగిసిన తరువాత మరల ఇచ్చటకి వచ్చి గొప్పవంశములందు జన్మించి మహాభవనములు కలవారమగుదుము' అని యుద్ఘాటించుచుందురు. ఇట్టి మనోహరములైన వాక్కులచేత విక్షిప్తములైన మనస్సులు కలవారికి, మహాకార్యముల ననుష్ఠించుచున్నామను నభిమానముతో గర్వితులైన వారికి మత్కథా ప్రసంగము కూడ రుచింపదు. కాండత్రయ విషయములైన యీవేదములు బ్రహ్మాత్మ బోధకములు. కాని ఋషులు పరోక్షముగ చెప్పుదురు. నాకు కూడ పరోక్షమే ప్రియము.... వేదము దేనిని విధించుచున్నది, దేనిని ప్రకాశింపఁజేయుచున్నది, దేనిని అనువదించి వికల్పించుచున్నది - అను వేదముయొక్క హృదయమును నాకంటె అన్యుఁడెవఁడును ఎఱింగినవాఁడు లేఁడు. వేదము యజ్ఞరూపమున నన్నే విధించుచున్నది ; ఆయాదేవతారూపములతో నన్నుగూర్చియే చెప్పుచున్నది ; నన్నే అవలంబించి సర్వమును తొలఁగించుచున్నది. సకలమైన

వేదార్థము ఇంతమాత్రమే. శ్రుతి నన్ను ఆశ్రయించి మాయామాత్రముగ భేదమయమైన సృష్టిని అనువదించి, భేదదృష్టిని ప్రతిషేధించి ప్రసన్నమగుచున్నది".

శ్లో॥ వేదా బ్రహ్మాత్మవిషయా స్త్రికాండవిషయా ఇమే ।
పరోక్షవాదా ఋషయః పరోక్షం మమ చ ప్రియమ్ ॥ 36

శ్రీధరః : త దేవం వేదానాం ప్రవృత్తిపరత్వం నిరాకృత్య - ప్రకృతం నివృత్తి పరత్వ మేవ ఉపసంహరతి - వేదా ఇతి - కర్మబ్రహ్మదేవతాకాండవిషయా ఇమే వేదాః బ్రహ్మాత్మవిషయాః, బ్రహ్మై వాత్మా న సంసారీ ఇత్యేతత్పరాః తత్పరత్వ ప్రతీతే చ, శ్లో॥ ఫలశ్రుతి రియం నృణాం న శ్రేయోరోచనం పరమ్ । శ్రేయో వివక్షయా ప్రోక్తా యథా భైషజ్యరోచనమ్ ॥ (శ్లో. 23 - అధ్యాయ 21) ఇతి ఉక్త మేవ కారణ మనుస్మారయతి - పరోక్షేతి పరోక్షవాదాః అతీంద్రియార్థ ప్రతిపాదన పరాః - ఋషయః మంత్రాః, తద్ద్రష్టారో వా తత్కిమితి యస్మాత్ పరోక్ష మేవ మమ చ ప్రియమ్ । అయం భావః శుద్ధాంతఃకరణై రేవ ఏత ద్బోద్ధవ్యం నాన్యై రనధికారిభిః, వృథా కర్మత్యాగేన భ్రంశప్రసంగాత్ ॥ (అధ్యాయ - 21)

శ్లో॥ కిం విధత్తే కి మాచష్టే కి మనూద్య వికల్పయేత్ ।
ఇ త్యస్య హృదయం లోకే నాన్యో మద్వేద కశ్చన ॥ 42

(అధ్యా. 21)

శ్రీధరః : కర్మకాండే విధివాక్యైః కిం విధత్తే, దేవతాకాండే మంత్రవాక్యైః కి మాచష్టే, ప్రకాశయతి జ్ఞానకాండే కి మనూద్య వికల్పయేత్ నిషేధార్థమ్ । ఇత్యేవం అస్య హృదయం తాత్పర్యమ్ మత్ మత్తః అన్యః కశ్చి దపి న వేద ॥

శ్లో॥ మాం విధత్తేఽభిధత్తే మాం వికల్ప్యాపోహ్యతే హ్యహమ్ । 43

శ్రీధరః - నను తర్హి త్వం మే కృపయా కథయ - ఓ మితి కథయతి మా మితి । మా మేవ యజ్ఞరూపం విధత్తే, మా మేవ త త్తత్ దేవతారూప మభిధత్తే - న మత్తః పృథక్ య చ్చ ఆకాశాది ప్రపంచజాతమ్, శ్రు ॥ తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః - ఇత్యాదినా వికల్ప్య అపోహ్యతే తదప్యహ మేవ - న మత్తః పృథ గస్తి ॥

శ్లో|| ఏతావాన్ సర్వవేదార్థః శబ్ద ఆస్థాయ మాం భిదామ్ |
మాయామాత్ర మనూ ద్యాంతే ప్రతిషిధ్య ప్రసీదతి || 44

శ్రీధరః : కుత ఇ త్యపేక్షాయాం సర్వవేదార్థం సంక్షేపతః కథయతి - ఏతావా నితి ఏతావా నేవ సర్వేషాం వేదానా మర్థః త మే వాహ శబ్దో వేదః మాం పరమార్థరూప మాస్థాయ ఆశ్రిత్య భిదాం మాయామాత్ర మితి అనూద్య - శ్రు|| నేహ నానాస్తి కించన - ఇతి ప్రతిషిధ్య ప్రసీదతి నివృత్త వ్యాపారో భవతి |

దీనిని ఇట్లు గ్రహింపవచ్చును. వేదమంతయు కర్మకాండము దేవతా కాండము బ్రహ్మకాండము అని మూఁడు కాండములుగా నున్నది. కాని వేదములు బ్రహ్మకాండమునందే తాత్పర్యమును కలిగియున్నవి. "బ్రహ్మమే జీవునియందు ఆత్మగానున్నది, అది సంసారికాదు" అని చెప్పుటయే సకలవేదములకు పరమతాత్పర్యము. ఈ విషయము శ్లో|| ఫలశ్రుతి రియం నృణామ్..... "అని మొదలగు శ్లోకమున (శ్లో. 23 - అధ్యాయ 21) ముందే చెప్పఁబడినది. "ఈ మందును మింగినచో నీకు మిఠాయి నొసంగుదును" అని తల్లి పిల్లవానికి చెప్పుమాటలవలె, వేదము కూడ ఈ తాత్పర్యమును బోధించుటకొఱకే ముందుగా రుచిని కలిగించుటకై ఫలశ్రుతివాక్యములను చెప్పుచున్నది. ఫలశ్రుతిని చెప్పుటకుఁగల యాకారణమునే ఇప్పుడు భగవానుఁడు, "ఋషులుపరోక్షముగ చెప్పుదురు. అది నాకు కూడ ప్రియమే" అని భంగ్యంతరమున మరొకపద్ధతితో చెప్పుచున్నాఁడు.

ఋషు లనఁగా మంత్రములని గాని, ఆ మంత్ర ద్రష్టలని గాని గ్రహింపవచ్చును. ఋషులు తత్త్వవిషయమును ప్రత్యక్షముగా, అనఁగా నేరుగా, చెప్పుటకు ఇష్టపడరు; వారు పరోక్షముగనే చెప్పుదురు. భగవంతునకు కూడ తత్త్వమును అట్లు చెప్పుటయే ఇష్టము. ఋషులు కాని, భగవంతుఁడు గాని తత్త్వమును నేరుగా స్పష్టముగా ఎందుకు చెప్పకూడదు ? అందఱు తత్త్వమును గ్రహించుటకు అర్హతను కలిగియుండరు. తత్త్వమును పరిశుద్ధమైన యంతఃకరణము కలవారే గ్రహింపవలె. అర్హతలేనివారు తత్త్వబోధకవాక్యములను విన్నచో, తమ అయోగ్యతను గ్రహింపక కర్మానుష్ఠానమును త్యజించి సన్న్యాసులైనచో

ఉభయభ్రష్టులగుదురు. అందువలన ఋషులు, పరమేశ్వరుఁడు కూడ తత్త్వమును గూఢముగ బోధించుటకే ఇష్టపడుదురు. అర్హులకైన ఎట్లు బోధపడవలె అన్నచో పరమేశ్వరుఁడే గురువుయొక్క రూపమున వారికి తగినసమయమునందు తత్త్వమును బోధించును.

"యజ్ఞము విష్ణువే" (యజ్ఞో వై విష్ణుః) అని యుద్ఘాటించుచు వేదము కర్మకాండ రూపమున కూడ పరతత్త్వమునే బోధించుచున్నది. శ్రాద్ధకల్పమునందు కూడ పెద్దలు ఈయర్థమునే బోధించు శ్లోకములను పఠించుచున్నారు.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥

శ్లో॥ యజ్ఞేశ్వరో హవ్యసమస్తభోక్తావ్యయాత్మా హరి రీశ్వరోఽత్ర ।
తత్సన్నిధానా దపయాంతు సద్యో రక్షాం స్యశేషా ణ్యసురా శ్చ సర్వే ॥

శ్లో॥ కర్తా క్రియాణాం స స యుజ్యతే క్రతుః స ఏవ తత్కర్మఫలం చ య చ్చ ।
స్రుగాది యత్సాధన మ ప్యశేషం హరే ర్న కించిత్ వ్యతిరిక్త మస్తి ॥

శ్లో॥ త్వాం యోగిన శ్చింతయన్తి త్వాం యజన్తి చ యజ్వనః ।
హవ్యకవ్యభు గేక స్త్వం పితృదేవ స్వరూపధృత్ ॥

(దేనిచేత హవిస్సు అర్పింపఁబడుచున్నదో అట్టి స్రుక్స్రువాదికము అర్పణము. దానిని బ్రహ్మవేత్త బ్రహ్మముగనే గ్రహించును. అట్లే ఆయనకు హవిస్సు, అగ్ని, హవన క్రియ (హుతము) కూడ బ్రహ్మముగనే గోచరించును ; కర్తయైన తాను బ్రహ్మమే. బ్రహ్మమున కంటె అన్యముగా ఏదియు లేదను నిశ్చయమే బ్రహ్మకర్మ సమాధి, ఆసమాధిచేత పొందఁబడుచున్న ఫలము కూడ బ్రహ్మమే.

యజ్ఞములయందు సకలదేవతలకు అర్పింపఁబడుచున్న సమస్త హవ్యములకు భోక్త, యజ్ఞేశ్వరుఁడు అవ్యయాత్ముఁడును అయిన హరి ఇచ్చట, అనఁగా శ్రాద్ధకర్మయందు ఈశ్వరుఁడుగ నున్నాఁడు. ఆయనయొక్క సన్నిధానమువలన అసురులు రాక్షసులు అందఱును ఈ క్షణమే తొలఁగిపోవుదురు గాక !

ఈ క్రియలకు కర్త హరియే. ఈ క్రతురూపమున ఆయనయే రూపొందింపఁబడుచున్నాఁడు. ఈ క్రతురూపకర్మయొక్క ఫలము కూడ ఆయనయే. స్రుక్కు స్రువము మొదలుగా సమస్తమైన సాధనసముదాయమంతయు ఆయనయే. హరికి అన్యముగా ఏదియును లేదు.

పరమేశ్వరా ! నిన్నుగూర్చి యోగులు చింతనము చేయుచున్నారు. యజమానులు నిన్నుగూర్చి యజ్ఞములు చేయుచున్నారు. నీవు ఒక్కఁడవే దేవస్వరూపమును ధరించుచు హవ్యములను, పితృస్వరూపమును ధరించుచు కవ్యములను భుజించుచున్నావు).

దేవతాకాండయందు కూడ వేదము పైన చెప్పినట్లుగా హవ్యములను భుజించు దేవస్వరూపమున, కవ్యములను భుజించు పితృస్వరూపమున పరమాత్మయే యున్నాఁడని బోధించుచున్నది.

బ్రహ్మకాండమునందు శ్రుతి సృష్టినిగూర్చి చెప్పుచు "ఆత్మనుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు" (ఆత్మన ఆకాశ సంభూతః, ఆకాశాద్వాయుః' అను ప్రకారమున సృష్టి జరిగినట్లు చెప్పి, తుదకు సృష్టియన్నదే లేదని నిషేధించుచున్నది; సృష్టికి పూర్వము ఆత్మ లేక బ్రహ్మము ఒక్కటియే యున్నది ; రెండవది లేదు" (ఏక మే వాద్వితీయం బ్రహ్మ) అని ఉద్ఘాటించుచున్నది. ఒక్కటియే వస్తువున్నచో దానినుండి రెండవ పదార్థము ఎట్లు వచ్చును. ఒక బంగారపు ముద్దను ఒకచోట ఎంతకాల ముంచినను దానినుండి ఏ యితర పదార్థము రెండవది పుట్టదు. అంతేకాదు. మనుష్యప్రయత్నములేకుండ అది తనంతట తాను గిన్నెగా గాని, ఆభరణముగా గాని రూపొందదు. అట్టియెడల ఆత్మనుండి దానికంటె భిన్నమైన రెండవ వస్తువుగా ఆకాశము ఎట్లు సంభవించినది ? దానినుండి వాయువెట్లు సంభవించినది ? నిజముగా సంభవింపలేదనియే వేదము, "ఇక్కడ (సృష్టియందు) నానావిధమైనది ఏదియు లేదు" (నేహ నానాస్తి కించన) అని ప్రకటించుచున్నది. నానా విధమైనది లేదనగా ఒక్కవస్తువే ఉన్నదని యర్థము. ఒక్క వస్తువే యున్నచో, రెండవదియే లేకున్నచో, అనంతకోటి భేదములతో ఈసృష్టి ఎట్లు గోచరించుచున్నది? మనకు గోచరించునది యంతయు యథార్థవస్తువుగా ఉండవలయునని నియమము

లేదు. మెఱయుచున్న ముత్యపు చిప్పయందు మనకు వెండి గోచరించినచో యథార్థముగా అచ్చట వెండియుండదు. మట్ట మధ్యాహ్నమున సూర్యకిరణములయందు మనకు జలము గోచరించినచో యథార్థముగా అచ్చట జలముండదు. కావున ఆత్మనుండి ఆకాశము పుట్టినదన్నచో, ఎండమావులలో జలము పుట్టినదని తలంచుటయే యగును. అందువలన సృష్టి గోచరించుటకు మూలముగా ఆత్మయొక్కటియే యున్నది. స్వప్నమునందు ఒక్క మనస్సునందే ఎంతో జగత్తు, నిజముగా లేకపోయినను, ఉన్నట్లే గోచరించుచున్నది. స్వప్నములో మనము చూచు వ్యక్తులు గాని భవనములుగాని యథార్థముగా ఉండి గోచరించుట అసంభవము. అప్పుడు మనస్సు అను ఒక్క పదార్థమే యున్నది. సందె చీఁకటిలో రజ్జువునందు సర్పమున్నట్లు గోచరించునట్లుగా ఒక్క మనస్సే తాను మారక జగద్రూపముగా భాసించుచున్నది. అట్లే ఆత్మ తాను ఏమియు మార్పునొందక యుండఁగా, దానియందు ఈ సృష్టి యంతయు పుట్టినట్లు, వ్యవహారముతో ఉన్నట్లు, తుదకు విలయము నొందినట్లు గోచరించుచున్నది. మనకు ఈలోకమునందు స్వర్గాదిలోకములందు కలుగుచున్నట్లు తోఁచుచున్న సకల సుఖములకు, స్వప్నమునందు సంభవించిన భోగసుఖమునకు మనస్సువలె, ఆనందరూపమైన యాత్మయే మూలము. ఆత్మయే బ్రహ్మము. అదియే విష్ణువునకు శివునకు సకల ప్రాణులకు స్వరూపము. ఆత్మయొక్క ఆనందాంశమును ప్రతిప్రాణి ; సృష్టిగోచరింపని, గాఢనిద్రయందు పొందుచునే యున్నాఁడు. కావున సకలభోగసుఖములకు మూలమైన యాత్మను లేదా బ్రహ్మమును ప్రతిజీవుఁడు సాక్షాత్కరించుకొనవలయు ననియే సకల వేదములకు తాత్పర్యము. యజ్ఞములు చేసినచో స్వర్గభోగములను పొందవచ్చునని చెప్పుట, లేక దేవతలనుగూర్చి వ్రతములు తపస్సులు చేసినచో ఇంద్రుఁడు మొదలగువారి పదవులను పొందవచ్చునని చెప్పుట వేదములకు తాత్పర్యము కాదు.

## (iii) తత్త్వసంఖ్యాన చమసము

ఏకైక వస్తువుగా వేదముచేత చెప్పఁబడిన బ్రహ్మము గోచరము కాదు. బ్రహ్మమొక్కటియే యున్న దనఁగా జగత్తు బొత్తిగా లేదని యర్థము కాదు.

వెండిగిన్నె అన్నప్పుడు గిన్నె వెండికంటె భిన్నమైన మఱియొక వస్తువుగా లేదు. గిన్నెను వెండినుండి విడదీయలేము. అయినను గిన్నె లేదని చెప్పుటకు వీలులేదు. అట్లన్నచో కేవలమైన వెండితో నీరు గాని పాలు గాని త్రాగుట కుదురదు. వస్తురూపమున గిన్నె సత్యము కాకున్నను వ్యవహారమునకు మాత్రమే పనికి వచ్చుచు సత్యమే యగుచున్నది. కావున వెండి వస్తురూపమున సత్యమై యుండఁగా, దానికంటె భిన్నమైన మఱియొక వస్తువు కాక పోయినను వ్యవహారమున ఉపయోగ పడుచున్నంతవఱకు గిన్నె సత్యమే యగుచున్నది. అట్లే ముత్యపుఁ జిప్ప మెఱయుచు వెండివలె కన్పించునప్పుడు, అక్కడ వెండి అసలు లేకున్నను దానియొక్క ప్రతిభాసనము (ఉన్నట్లు గోచరించుట) మనస్సునందు ఆశ, దానికొఱకు పోవుట అనువ్యవహారమును కలిగించుచున్నది. అది ముత్యపు చిప్పయే కాని వెండికాదు, అని తెలియువఱకు ఆవెండి సత్యమే యగుచున్నది. వెండి వస్తురూపమున ఉండుట వాస్తవికసత్యము కాఁగా, గిన్నెరూపమున వ్యవహారమునకుపయోగపడుచుండుట వ్యావహారిక సత్యమై, వ్యవహారమునకు ఉపయోగపడక పోయినను మనోవికారమును కలిగించుటకు సమర్థమగుచుండుటచేత, ప్రతిభాసరూపమున ప్రాతిభాసిక సత్యమగుచున్నది. తెరమీఁద కన్పించుచున్న దృశ్యములన్నియు ప్రాతిభాసిక సత్యములే. తెరపై రావణుని సంహరించిన రామపాత్రధారి, వ్యవహారమున దొంగలను కొట్టుటకు ఉపయోగపడఁడు. అయినను అతఁడు రాముఁడుగా ప్రతిభాసించుచు ప్రేక్షకుల మనస్సులలో వీరరౌద్రాదిరసములను కలిగించుటకు సమర్థుఁ డగుచున్నాఁడు. కావున వాస్తవిక సత్యముతోపాటు వ్యావహారిక ప్రాతిభాసిక సత్యములు కూడ లోకమున ఆదరింపఁబడుచున్నవి.

నామరూపభేదములతో ఒక్కొక్క పదార్థమును యథార్థమైన ప్రత్యేకవస్తువునుగా భావించుచుండుటయే అహంకార మమకారరూపమైన వ్యవహారమునకు మూలము. "అవి యథార్థముగా ప్రత్యేకవస్తువులు కావు ; వివిధవస్తువులసమ్మేళనముతో అవి రూపొందుచున్నవి ; ఆ సమ్మేళనము సడలినంతనే అవి నశించును" అని నిరూపించుచు వానియందు అహంకారమమకారములను తొలఁగించుటయే తత్త్వజ్ఞులకు లక్ష్యము. ప్రతివ్యక్తి తనశరీరమును చూచుకొనుచు, "నేను అందముగా ఉన్నాను ; బలము కలిగియున్నాను" అని అహంకారమును, వ్యాధులచే దానికి

వికారము సంభవించినప్పుడు, "అయ్యో ! నా చేయి, నాకాలు పనిచేయుట లేదు; వీనిని చక్కఁజేయుఁడు" అని విలపించుచు మమకారమును సహజముగా ప్రకటించుచుండును. కాని అంద మనఁగా నేమున్నది ? అది యొక వస్తువా ? చర్మమును తొలగించినచో ఎవరి ముఖమైనను చూచుటకు కూడ దుర్భరమే యగును. మనశరీరములవలె సకల జంతువుల శరీరములు కూడ రక్తమాంస శల్యాదిసమేళనముతో చర్మముచేత కప్పఁబడిన కంకాళములే. కావున శరీరములు ప్రత్యేకవస్తువులు కావు. వీనియందున్న రక్తమాంసాదులు కూడ ప్రత్యేకవస్తువులు కావు. ఇవి కూడ పంచభూతముల సమ్మేళనముతోనే రూపొందుచున్నవి. మనకు గోచరము లగుచున్న పంచభూతములు కూడ ప్రత్యేక వస్తువులు కావు. అవి కూడ సూక్ష్మ భూతములయొక్క సమ్మేళనములే (compounds). పృథ్వీ సూక్ష్మభూతముయొక్క భాగము అధికముగా, జలము అగ్ని వాయువు ఆకాశము అను సూక్ష్మభూతములయొక్క అంశములు కొలఁదిగా చేరఁగా రూపొందినదే స్థూలభూతమై భూమిగా మన కిప్పుడు కన్పించుచున్నది. సూక్ష్మభూతములు కన్పింపవు. ఈ విధముగా ఒక్కొక్క పదార్థముయొక్క రూపమును విశ్లేషించినచో ఒక్కొక్క సమ్మేళనమునందు అనేకపదార్థములు గోచరించును. ఈవిధముగా పరిశీలించినచో అనంతకోటినామరూపభేదములతో గోచరించుచున్న జగత్తులోని పదార్థములకు అన్నింటికిని మూలకములైన వస్తువులు (Elements) కొలదిసంఖ్యలోనే యుండును.

నామరూపగ్రహణములకు పిమ్మట సంఖ్యను గ్రహించుటయే జ్ఞానమునందు ప్రముఖము. "ఈ యంగడిలో ఎన్నో బొమ్మలున్నవి" అని చెప్పువానికంటె "ఇందులో మొత్తము మూఁడువందల బొమ్మలున్నవి ; వీనిలో ఒక వంద చెక్క బొమ్మలు, నూటనేఁబది బొమ్మలు మట్టివి ; ఏఁబది రబ్బరు బొమ్మలు. వీనికి మూలములైన వస్తువులు మాత్రము చెక్క, మట్టి, రబ్బరు అనునవి మూఁడే" అని చెప్పగలిగినవాఁడు జ్ఞానశాలి యగును. సాధారణముగా సంఖ్యానిర్ణయరూపమున జ్ఞానమున చాలభాగము ఏర్పడును. కావున సాంఖ్యము జ్ఞానమునకు నామాంతర మయ్యెను.

సాంఖ్య శాస్త్రమున జగత్తులోని వివిధ పదార్థములకు మూలకములైన వస్తువులును (Elements) తత్త్వములును పేర్లతో నిర్ణయింపఁబడును. కాని ఈ

తత్త్వములసంఖ్యను ఋషులు ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా నిర్ణయించి చెప్పిరి. వీరిలో ఎవరి నిర్ణయమును ప్రమాణముగా గ్రహింపవలె అను సందేహముతో ఉద్ధవుఁడు శ్రీకృష్ణుని ఇట్లు ప్రశ్నించెను. "విశ్వేశ్వరా ! తత్త్వములు ఎన్ని ? నీవు ఇరువది యెనిమిదింటిని చెప్పితివని వింటిమి. కొందఱు ఇరువదియాఱని, మఱికొందఱు ఇరువదియైదని, ఏఁడే అని ఇంకను కొందఱు, పదునైదని ఇతరులు, నాలుగే యని అన్యులు, పదునొకండని కొందఱు, పదునేడని మఱికొందఱు, పదునాఱని ఇతరులు, పదుమూఁడే అని కొందఱు ఉద్ఘాటించుచున్నారు. ఎందువలన వీరిట్లు భిన్నభిన్నముగా చెప్పుచున్నారు ?"

భగవానుఁడిట్లనెను. "అన్నిసంఖ్యలయందు తత్త్వములన్నియు ఉండును. అందువలన బ్రాహ్మణులు చెప్పు ఆప్రకారములన్నియు యుక్తములే. నామాయను స్వీకరించి వారు చెప్పునప్పుడు దుర్ఘటమైనది ఏమి యుండును ? నీవు చెప్పినట్లుగా అవి పరస్పర విరుద్ధములు కావు. నేను చెప్పుచున్న పద్ధతిలో అవి సమంజసములే. కాని వారి యంతఃకరణములయందు విజృంభించుచున్న సత్త్వాది గుణముల సంక్షోభమే ఈవాదములకు మూలము. వారియందు దమము శమము సిద్ధించినంతనే ఈవాదములు ఆగిపోవుచున్నవి.

ఇంక అన్ని సంఖ్యలలో అన్ని తత్త్వములు ఎట్లుండునో వినుము. కొందఱు కొన్నింటిని ప్రముఖములనుగా తలంచి అల్పసంఖ్యలో పేర్కొనునప్పుడు, ఆ తత్త్వములలో వానికి కారణములైనవి కార్యములైనవి యిమిడియుండును. కొందఱు కారణములైన తత్త్వములను కార్యములైన వానిని విడివిడిగా ప్రముఖములనుగా, భావించునప్పుడు వారు వానిని అధికసంఖ్యలో చెప్పుదురు. ఒక్కొక్క సంఖ్యానము (లెక్కపెట్టుట) నందు ఒక్కొక్క యుక్తి యుండును. కావున అన్నియు సమంజసములే".

దీనినిట్లు వివరముగా గ్రహింపవచ్చును. ఒకవిషయమునందే తత్త్వములను మేధావులు లెక్కించునప్పుడు ఒకఁడు చెప్పినసంఖ్య కంటె మఱియొకఁడు చెప్పునట్టి సంఖ్య ఎట్లు భిన్నముగా నుండును ? తత్త్వములన్నియు ప్రత్యేకవస్తువులు కావు. అవి కొన్నింటికి కార్యములై మఱికొన్నింటికి కారణములగును. ఆకాశమునుండి పుట్టిన వాయువు కార్యమే అయినను, అది అగ్నియొక్క సంభవమునకు

కారణమగుచున్నది. కొందఱు కారణములను మాత్రమే లెక్కించుచు వాని కార్యములు వానియందు అంతర్భూతములైనట్లు భావింతురు. మఱికొందఱు కార్యములను పరిగణించుచు వానికారణములు వానియందు అంతర్భూతములైనట్లు భావింతురు.

భగవానుఁడు కారణములను కార్యములను విడివిడిగా పరిగణించుచు అన్ని పక్షములలోని తత్త్వములను సమాహరించి ఇరువది యెనిమిదింటిని పేర్కొన్నాఁడు. సత్త్వము రజస్సు తమస్సు అను మూఁడు గుణములు ; పురుషుఁడు ప్రకృతి, మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని జలము, పృథివి అను తొమ్మిది కారణ తత్త్వములు ; త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు అను జ్ఞానేంద్రియములైదు, వాక్పాణి పాయూపస్థలు అను కర్మేంద్రియము లైదు, మనస్సు ఒకటి, శబ్ద స్పర్శరూపరస గంధములను నైదు విషయములు. (3 + 9 + 5 + 5 + 1 + 5 = 28) - అను నీయిరువది యెనిమిదింటిని భగవానుఁడు తత్త్వములనుగా పేర్కొనెను.

కొందఱు వీనిలో మూఁడుగుణములను ప్రకృతియందు అంతర్భూతము లగు నని లెక్కింపరు. అప్పుడు వారి పరిగణమున తత్త్వములు (28 - 3 = 25) ఇరువదియైదు అగును. కొందఱు పురుషుని జీవునిగా భావించి, పురుషునకు భిన్నముగా ఈశ్వరుని లెక్కింతురు. వారికి అప్పుడు తత్త్వములు (25 + 1 = 26) ఇరువదియాఱు అగును. కొందఱు ఆత్మజీవుఁడు పంచమహాభూతములు అను ఏడే తత్త్వములని చెప్పుదురు. ఈ యేడింటివలననే దేహము ఇంద్రియములు ప్రాణము కలుగుచున్నవి, కావున అవియన్నియు ఈ యేడింటియందే అంతర్భూతము లగునని భావింతురు. పురుషుని పంచమహాభూతములనే పరిగణించువారు తత్త్వములు ఆఱే యందురు. అగ్ని, జలము, పృథివి, వీనికి ఆధారమైన ఆత్మ అనునీ నాలుగే తత్త్వములని మఱికొందఱందురు. ఈ పక్షమునందు అగ్నికి కారణములైన వాయువు, ఆకాశము, ఈ మహాభూతములకు కార్యములైన దేహేంద్రియాదులు వీనియందే ఇమిడియున్నవని గ్రహింపవలె. పదునొకండింటిని గ్రహించువారు మహాభూతములను అయిదింటిని, ఇంద్రియములను అయిందిటిని, ఆత్మను పరిగణింతురు. కొందఱు పంచమహాభూతములను, వాని తన్మాత్రలైన పంచసూక్ష్మభూతములను, పంచేంద్రియములను మనస్సును ఆత్మను కలిపి పదునేడు

తత్త్వములని చెప్పుదురు. పదునాఱని చెప్పువారు వీనిలో ఆత్మయందే మనస్సు ఇమిడి ఉన్నదని మనస్సును లెక్కింపరు. సూక్ష్మభూతములతో కూడిన స్థూలభూతములను మాత్రమే అయిదింటిని, అయిదు ఇంద్రియములను, మనస్సును, పురుషుని, ఈశ్వరుని కలుపుకొని కొందఱు తత్త్వములు పదుమూఁడని చెప్పుదురు. ఈ విధముగా అన్ని పక్షములు అనేకయుక్తులవలన సమంజసములే యగును.

తత్త్వములను తక్కువ సంఖ్యలో గ్రహించుటకు అనేకులు ప్రతిభతో ప్రయత్నించుచుండఁగా భగవానుఁడు అందఱిసంఖ్యలకంటె అధికముగా పరిగణించి ఏల చెప్పెను ? గణిత శాస్త్రమున ఒక ప్రశ్న నిచ్చి దానికి సమాధానము చెప్పుడని యుపాధ్యాయుఁడు విద్యార్థులను అడిగినచో, అత్యంతము ప్రతిభాశాలియైన విద్యార్థి అమితవేగముతో ఆ ప్రశ్నను విమర్శించి మూఁడు మెట్లతో (steps) సమాధానమును (answer) సాధించును. సామాన్యవిద్యార్థి అయిదాఱుమెట్లతో ఆసమాధానమును రాఁబట్టును. కాని ఆ ప్రశ్నను అర్థము చేసికొనలేని విద్యార్థులకు ఆప్రశ్నకు సమాధానము వచ్చు క్రమమును చూపునప్పుడు ఉపాధ్యాయుఁడు మిగుల తక్కువ తెలివి కలిగిన విద్యార్థికి కూడ బోధపడునట్లు పదిలేక పదునైదు మెట్లను చూపుచు సమాధానమును సాధించును. కావున ఉత్తముఁడైన యుపాధ్యాయునివలె భగవానుఁడు లోకమున జరుగుచున్న సకల వ్యవహారమునకు మూలములైన తత్త్వములలో వేనిని వదలకుండ అన్నింటిని సమాహరించి సామాన్యునకు సుఖముగా బోధపడునట్లు ఇరువది యెనిమిదింటిని పేర్కొనెను.

ఏమైనను ఋషులు ఒకరు చెప్పినట్లుగా మఱియొకరు చెప్పక అనేకవిధములుగా చెప్పుటవలన వివిధపక్షములకు వైరుధ్యమున్న దని సామాన్యుఁడు తలంచుట సహజము. కాని భగవంతుఁడు ఇందు మొదట చెప్పినదానిని సావధానముగా గ్రహించినచో ఈ సందేహము కలుగదు. భగవానుఁడు చెప్పినట్లుగా మాయాశక్తివలననే సృష్టి భాసించుచున్నదని గ్రహించిన ఈ వాదములయందు విరోధము తోఁచదు. ఎండమావులలో నీటిప్రవాహము గోచరించుచున్నప్పుడు అది యొకనికి తూర్పునకు పెద్దదిగా ప్రవహించుచున్నట్లు, అదియే మఱియొకనికి చిన్నదిగా పడమటికి ప్రవహించుచున్నట్లు గోచరింపవచ్చును. ఇంకొకఁడు దానికి ఆనకట్ట కట్టినచో

ఆనీరు ఉత్తరపువైపు గ్రామములకు ఉపకరించునని చెప్పుచుండగా, ఆ నీరు దక్షిణపువైపు భూములకు ప్రసరింపఁజేసినచో ఫలసాయము అద్భుతముగా నుండునని మఱియొకఁడు వాదింపవచ్చును. వారివాదములలో ఏది సమంజసమని, ఏది అసమంజసమని చెప్పవచ్చును ? ఎవఁడు ఏకోణమునుండి (Angle of Vision) చూచుచున్నాఁడో, ఆ కోణమునుండి వానివాదము సమంజసమే యగును. కాని అసలు ఎండమావులలో నీరు ఉండదు కదా ! ఆభాసమాత్రమైన యానీరు ఏ వైపునకు పోవుచున్నట్లుగాని, లేక ఒకవైపున అనకట్ట కట్టుటకు నిశ్చయించుట వలనఁగాని లాభమేమున్నది ? నష్టమేమున్నది ? స్వప్నములో లభించిన ధనము పదివేలరూప్యములైన నేమి, పదిపైన లైననేమి ? జగత్తు అంతయు స్వప్నమువలె మాయమాత్రమే అనునిశ్చయము కలుగునంతవఱకు ధీమంతులు తమ ప్రజ్ఞావిశేషములను ప్రసరింపఁజేయుచు ఎన్నో సిద్ధాంతములను ప్రవచనము చేయుచుందురు. శమదమములవలన చిత్తశుద్ధి కలిగి ఈశ్వరానుగ్రహమున జగత్తు స్వప్నమువంటిదే అనునిశ్చయము కలిగినతరువాత వారు ఇట్టి ప్రసంగములనే చేయరు. ఈ తత్త్వముల సంఖ్యావిచారణముకంటె వీనికి మూలమై పరతత్త్వముగా నున్న పరమేశ్వరు నారాధించుచు భావించుచుండుటయే మేలని గ్రహింపవలసియున్నది.

# IV. నివృత్తి ధర్మకలశము

## 1. యోగకమండలువు

### (i) దేహాత్మవివేచన చమసము

"తత్త్వములవలన జగద్రూపమున గోచరించుచున్న ప్రకృతికంటె పురుషుఁడు భిన్నుఁడు ; ప్రకృతివికారములతో ఆయనకు సంబంధము లేదు ; ఆయన నిర్వికారుఁడు, నిర్గుణుఁడు, నిష్క్రియుఁడు ఆనందమయుఁడు" అన్న విషయము భగవానుని యుద్ఘాటనమువలన స్పష్టమగుచున్నది. కాని ప్రకృతివలన ఏర్పడుచున్న దేహమునందు ఆ పురుషునిలేక ఆత్మను స్పష్టముగా విభజించి గ్రహించుట సాధ్యమగుటలేదు. దీనిని ఎట్లు సాధింపవలయునని ఉద్ధవుఁడు భగవానుని ఇట్లు అడుగుచున్నాఁడు. "అయ్యా ! భిన్నములైన తమస్వరూపములచేత ప్రకృతి పురుషుఁడు భిన్నులుగా

మన్నారమట స్పష్టమే. కాని దేహము ఆత్మ అట్లు వేర్వేఱుగా గోచరించుటలేదు. ప్రతివ్యక్తి ఆత్మను దేహముగానే గ్రహించుచున్నాఁడు. దేహమును వదలి ఆత్మనుగాని, ఆత్మను వదలి దేహమును గాని గ్రహించుట సాధ్యమగుటలేదు. అవి ఒకదానినొకటి ఆశ్రయించియున్నవి. అందువలన వానికి భేదమే కన్పించుట లేదు. సుఖదుః ఖాదివికారాత్మకమైన యీ దేహేంద్రియాది సముదాయముకంటె అత్యంతము భిన్నమై ఆనందరూపమైన యాత్మను గుర్తించుట యెట్లు సాధ్యమగునో చెప్పుము".

భగవానుఁడు ఇట్లు చెప్పెను. "పురుషుఁడు ప్రకృతికంటె భిన్నుఁడే. ప్రకృతియందలి గుణముల సంక్షోభముల సృష్టిగా దేహము రూపొందుచున్నది. ఇది వికారమయము. గుణములయొక్క ప్రభావముచేత ప్రకృతి పదార్థములయందు భేదబుద్ధులను కలిగించుచున్నది. వీనిలో విషయగ్రహణమును చూడుము. ఇది మూఁడు విధములుగా జరుగుచున్నది. కంటియందు ప్రవేశించుచున్న సూర్యాంశముయొక్క అనుగ్రహముచేత చక్షురింద్రియము రూపమును గ్రహించుచున్నది. రూపము ఆధిభౌతికము ; చక్షురింద్రియము ఆధ్యాత్మికము ; సూర్యునియొక్క అంశము ఆధిదైవికము. కంటియొక్క గోళము ఉన్నంతమాత్రమున రూపము గ్రహింపఁబడదు. అందునకు కంటిగోళములు, గ్రుడ్లు ఉన్నను, చక్షురింద్రియము లేకపోవుటచే అవి రూపమును గ్రహింపవు. రూపగ్రహణము జరుగునప్పుడు కంటియందు చక్షురింద్రియము ఉన్నదని సిద్ధమగుచున్నది. చక్షురింద్రియము జడము. సూర్యునియొక్క అంశము దానికి అధిష్ఠానముగా లేకున్నచో అది రూపమును గ్రహింపలేదు. అది రూపమును గ్రహించునప్పుడు దానియందు దానికి అధిష్ఠానదైవమైన సూర్యునియంశము ఉన్నదని సిద్ధమగుచున్నది. కాని ఆకాశమున మండలరూపముతో నున్న సూర్యుఁడు స్వతస్సిద్ధముగనే యున్నాఁడు. జీవుల చక్షురింద్రియములందు తనయంశము ప్రవేశించినప్పుడు ప్రవేశింపకుండ నున్నప్పుడు కూడ సూర్యుఁడు సహజముగా ఎల్లప్పుడు ప్రకాశించుచునే యున్నాఁడు. అట్లే ఈ యధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము అను వానియొక్క వ్యవహారము జరుగుచున్నప్పుడు, జరుగకుండ నున్నప్పుడు వీనికి ఆధారమైన యాత్మ స్వతస్సిద్ధముగా ఎల్లప్పుడు ప్రకాశించుచునే యుండును. చక్షురింద్రియ వ్యవహారమునందు వలెనే శ్రోత్రము మొదలుగా తక్కిన యింద్రియముల వ్యవహారములు కూడ మూఁడు విధములుగా జరుగుచున్నవి.

ప్రకృతినుండి మహత్తత్త్వము, దానినుండి గుణక్షోభకృతమైన వికారముగా ఇంద్రియము, తామసమునైన యహంకారము, ప్రభవించుచున్నది. ఇది మూఁడు విధములుగా మోహమును వికల్పమును కలిగించుచున్నది. ఆత్మ జ్ఞానఘనము. దానితోపాటు దానికంటె భిన్నముగా సత్యముగా ప్రకృతి యున్న దని కొందఱు లేదని కొందఱు వివాదమును జరుపుట వ్యర్థము. అయినను తమకు స్వరూపమైన నానుండి తొలఁగిపోయిన బుద్ధులు కలవారికి ఆవివాదము ఎప్పటికిని ముగియదు".

శ్రీధరాచార్యుఁడు ఇంద్రియములయొక్క ఆధ్యాత్మికాది భేదములను ఇట్లు వివరించినాఁడు.

| ఇంద్రియము | ఆధ్యాత్మికము | ఆధిభౌతికము | ఆధిదైవికము లేక అధిష్ఠాన దైవము |
|---|---|---|---|
| 1) చక్షుస్ | చూపు | రూపము | సూర్యుఁడు |
| 2) త్వక్ | త్వక్కు (చర్మము) | స్పర్శము | వాయువు |
| 3) శ్రోత్రమ్ | శ్రవణము (చెవులు) | శబ్దము | దిక్కులు |
| 4) జిహ్వా | జిహ్వ (నాలుక) | రసము | వరుణుఁడు |
| 5) ఘ్రాణము | ముక్కు | గంధము | అశ్వినీ దేవతలు |
| 6) అంతఃకరణము | చిత్తము | గుర్తింపఁదగినది (చేతయితవ్యమ్) | వాసుదేవుఁడు |
| 7) అంతఃకరణము | మనస్సు | ఆలోచింపఁదగినది (మన్తవ్యమ్) | చంద్రుఁడు |
| 8) అంతఃకరణము | బుద్ధి | తెలిసికొనఁదగినది (బోద్ధవ్యమ్) | బ్రహ్మదేవుఁడు |
| 9) అంతఃకరణము | అహంకారము | కర్తవ్యము | రుద్రుఁడు |

ఆత్మ అనఁగా శరీరము. శరీరమునందున్నది ఆధ్యాత్మికము. శరీరమునకు వెలుపల భూతములయందు భౌతికములైన పదార్థములయందు ఉండునది అధిభౌతికము. దివమునందు ఉండువారు దేవతలు లేక దైవములు. ప్రభుత్వమునందు ఒక్కొక్క విభాగమునకు ఒక్కొక్క మంత్రి అధిపతిగా ఉండునట్లు (Ministers holding different portfolios) ఒక్కొక్క ఇంద్రియమునకు ఒక్కొక్క దేవుఁడు అధిష్ఠానదైవముగా నుండును. అంతనియొక్క ప్రభావము అధిదైవికము. ఆయన యొక్క అంశము ఇంద్రియమునకు అధిష్ఠానముగా ఉన్నంతవఱకే ఆయింద్రియము పని చేయును. ఆయంశము తొలఁగిపోయినచో ఆ యింద్రియము పనిచేయదు.

సత్త్వరజస్తమస్సులను గుణముల సమత్వస్థితి (State of Equilibrium) ప్రకృతి. ఆస్థితియందు సృష్టియుండదు. ఆస్థితిని ప్రలయమందురు. ప్రలయమనఁగా ప్రకృష్టమగు లయము (Greatest Balance). ఆ సమత్వస్థితికి, కాలమువలన లేక ఈశ్వరుని వీక్షణమువలన, భంగము కలిగినప్పుడు వైషమ్యము (Imbalance) కలుగును. వైషమ్యము నొందిన ప్రకృతి నుండి మహత్తత్త్వము ఉద్భవించును. ఇది సృష్టిలోని సమస్తక్రియాశక్తి (Total universal creative energy) అగుటచే చాల గొప్పది అనునర్థమున "మహత్" అని దీనిని పేర్కొనుచున్నారు. క్రియ జ్ఞానపూర్వకమై యుండును. జ్ఞానము లేక క్రియ సంభవింపదు (There can be no creative act without knowledge). ప్రవాహాదులు యంత్రములు (Engines) మొదలగువానియందుండు చలనము (movement) క్రియకాదు. సంకల్పపూర్వకమైన చలనప్రేరణమే క్రియ. మేఘములకు అధిష్ఠానదేవతయైన పర్జన్యుఁడు మేఘములయందు వర్షణమును ప్రేరేపించుట క్రియ. అట్లే యంత్రములయందు చోదకుఁడు (Driver) చలనమును కలిగించుట క్రియ. కావున దీనియందు సమస్తమైన జ్ఞానశక్తి (Total univesal intelligence) కూడ ఇమిడియున్నది. ఇట్లు సమస్త జ్ఞానక్రియాశక్తి రూపమైన యీ మహతత్త్వము, పూలదండలో దారమువలె సకలసృష్టియందు వ్యాపించియుండుటచే దీనిని సూత్రాత్మ, లేక సూత్రమనియ పేర్కొనుచున్నారు. దీనివలన వైకారికము తైజసము తామసము అను మూఁడ విధములుగా జీవునకు మోహమును వికల్పమును కలిగించునట్టి యహంకారమ

ప్రభవించుచున్నది. మోహ మనఁగా ఆత్మకంటె అన్యముగా జగత్తు ఉన్న దను భ్రాంతి. ఆ భ్రాంతి వలన ఆత్మస్వరూపమును వీడి జగత్తునందు వివిధపదార్థములను గుర్తించుట సంభవించుచున్నది. ఈయహంకారము కూడ సమష్టి రూపమైనదే (Universal Ego). దీని నుండి తమోగుణ పరిణామమువలన (evolution) తన్మాత్రలు లేక సూక్ష్మభూతములు, రజోగుణపరిణామమువలన ఇంద్రియములు, సత్త్వపరిణామమువలన మనస్సు, దేవతలు మొదలగువారును సంభవింతురు. సూక్ష్మభూతములను అపంచీకృతభూతము లనియు చెప్పుదురు. వీనినుండి పంచప్రాణములు, దశేంద్రియములు, మనస్సు, బుద్ధి అనువానితో సమష్టిలింగ (సూక్ష్మ) శరీరము రూపొందును. సూక్ష్మభూతములు పంచీకృతములై స్థూలభూతము లగును. ఒక్కొక్క సూక్ష్మభూతములో సగము భాగమునకు 1/8 అంశములతో ఇతర భూతములు కూడినప్పుడు స్థూలభూత మేర్పడును. అనఁగా 1/8 ఆకాశము, 1/8 వాయువు, 1/8 అగ్ని, 1/8 జలముతో కూడిన 1/2 పృథ్వీభాగము స్థూల పృథివి యగును. ఈ విధముగా ఏర్పడు స్థూలభూతములనుండి బ్రహ్మాండము రూపొందును. అది జలములయందుండును. దానియందు సర్వాంతర్యామియైన నారాయణుఁడు లీలామాత్ర విగ్రహుఁడై క్షీరాబ్ధిశాయియై యుండును. ఆయననాభిపద్మమునుండి స్థూలమైన సమస్తసృష్టికి అధిష్ఠానదేవతయైన విరాట్టు చతుర్ముఖుఁడుగా ఆవిర్భవించును. ఆయన నారాయణుని యనుగ్రహమువలన రజోగుణముతో లోకములను లోకపాలకులను జీవులను సృష్టించును".

పై వాక్యములలో సృష్టిక్రమము నిరూపింపఁబడినది. సత్త్వరజస్తమస్సుల సమత్వస్థితి (Balanced state) ప్రకృతి. ఆస్థితియందు సృష్టి యుండదు. ఆ సమత్వస్థితి యున్నంతవఱకు ప్రళయమే (great balance) యుండును. ఆ స్థితి ఈశ్వరుని వీక్షణమువలన మూఁడు గుణములయందు వైషమ్యము (Imbalance) కలుగును. విషమమైన ప్రకృతి నుండి మహత్తత్త్వము (universal creative energy) ఉద్భవించును. దీనియందు జ్ఞానము (knowledge) చలనశక్తి (Dynamic energy) మిళితమై యుండును. ఈ మహత్తత్త్వము నుండి అహంకారము (universal ego) ప్రభవించుచున్నది. దీని నుండి తమోగుణ పరిణామమువలన

పంచసూక్ష్మ భూతములు, రజోగుణ పరిణామమువలన ఇంద్రియములు సత్త్వగుణ పరిణామమువలన మనస్సు, దేవతలు మొదలగువారును సంభవింతురు. సూక్ష్మభూతములనుండి ప్రాణము ఇంద్రియము మనస్సు అనువానితో లింగశరీరము లేక సూక్ష్మశరీరము ఏర్పడుచున్నది. స్థూలభూతములవలన ఏర్పడిన స్థూలశరీరము దగ్ధమైనను సూక్ష్మశరీరము దగ్ధము కాదు. కావున ఈ శరీరముతోనే జీవుఁడు మఱియొక స్థూలశరీరమున ప్రవేశించుచు క్రొత్తజన్మను పొందుచున్నాఁడు.

సృష్టి పరిణామసూత్రముల ననుసరించి జరుగుచున్న దని చెప్పుచున్న పరిణామసిద్ధాంతవాదులు (Evolutionists) పై సృష్టిక్రమమును పరిశీలింపవలసియున్నది. వారందఱును నాస్తికులు కారు. ప్రకృతి తనయంతట తాను పరిణమింపలే దని ఈశ్వరప్రేరణమువలననే అది పరిణమించుచున్న దని దృఢముగా విశ్వసించు శాస్త్రజ్ఞులు అనేకులు ఉన్నారు. ప్రముఖ శాస్త్ర సిద్ధాంతకర్తయైన ఛార్లెస్ డార్విన్ యొక్క పితామహుఁడు ఎరాస్మస్ డార్విన్ సజీవ పదార్థములయొక్క పరిణామసిద్ధాంతమును ప్రకటించినవాఁడు. ఆయన ప్రకృతి పరిణామమునకు మూలముగా ఈశ్వరశక్తిని అంగీకరింపవలసినదే అని ఇట్లు ఉద్ఘాటించినాఁడు.

"ప్రపంచమున జరుగుచున్న దంతయు దానియందే ఉండి దానిపై ప్రభావమును కలిగియున్న శక్తులపైననే ఆధారపడి వాని శాసనములకు ఫలముగానే ఏర్పడుచున్నది. కాని యీశక్తులు, వీనికి ఆధారమైన ద్రవ్యము ఎక్కడ నుండి వచ్చినవో మనకు తెలియదు. ఇచ్చటనే మనవిశ్వాసమునకు అవకాశ మున్నది".

**"All that happens in the world depends on the forces that prevailed in it, and results according to law ; but where these forces and their substratum, Matter, came from, we know not, and here we have room for faith" - (Erasmus Darwin, as interpreted by Weisman. P.3 - Evolution, Genetics and Eugenics - By - H.H. New Man).**

గురుత్వాకర్షణమువంటి ప్రకృతిధర్మము లన్నియు (Natural Laws) భగవంతుఁ డేర్పఱచిన విధులే అని శాస్త్రజ్ఞులు అనేకులు ఉద్ఘాటించుచున్నారు.

"గురుత్వాకర్షణధర్మమువలన విశ్వవర్తనము జరుగుచున్న దనుటవలన భగవంతుని యందు విశ్వప్రవర్తకుఁడను మన విశ్వాసము చలింపనప్పుడు, పరిణామధర్మమువలన విశ్వము ఆరంభమైన దనుటవలన భగవంతునియందు సృష్టికర్త అను విశ్వాసము చలించుటకు కారణ మేదియును లేదు. గురుత్వాకర్షణధర్మమును భగవంతుఁడు విశ్వమును ప్రవర్తింపఁజేయుటకై ఏర్పఱిచిన విధానముగా భావించునప్పుడు, పరిణామధర్మమును సృష్టికొఱకు భగవంతుఁ డేర్పఱిచినవిధానముగా మనము భావింపకుండుటకు కారణ మేదియును లేదు".

"If the substentiation of the universe by the law of gravitation does not disturb our belief in God as the sustainer of the universe, there is no reason why the origin of the universe by the law of evolution should disturb of our faith in God as the creator of the universe. If the law of gravitation be regarded as the Divine mode of substentiation, there is no reason why we should not regard the law of evolution as the Divine process of creation"

(P. 553 - Para - 2, lines 3 to 11 ; Evolution, Genetics and Eugenics - By. H.H. Newman).

భగవంతునిప్రేరణముననే సృష్టి ఆరంభమైనదని, ఆయన ఏర్పఱచిన విధానములే ప్రకృతినిర్వహణధర్మములై దానిని నడపుచున్నవని విశ్వసించునట్టి శాస్త్రజ్ఞులు శ్రీకృష్ణభగవానుఁడు ఉద్ఘాటించిన సృష్టిక్రమమును గ్రహింపవలసియున్నది. ఈ క్రమమునందు త్రిగుణములు మహత్తత్త్వము, అహంకారము, సూక్ష్మభూతములు స్థూలభూతములు సృష్టియొక్క పరిణామమునకు మూలకారణములుగా (Elements) చెప్పఁబడియున్నవి.

ఈనాఁడు మూలకములుగా (Elements) నూటికిపైగా నిరూపింపఁబడుచున్నవి. వీని మూలద్రవ్యములను అణువులుగా (Atoms) పేర్కొనుచున్నారు. ఈ అణువులలో సూక్ష్మములుగా ఎలక్ట్రాన్ ప్రోటాన్, న్యూట్రాన్, ప్రోజిటాన్ మొదలుగా అనేక

పదార్థములున్న వని అవి స్వేచ్ఛగా పరిభ్రమించుటకు కావలసినంత అవకాశము (space) అణువులలో ఉన్నదని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. గురుత్వాకర్షణ శక్తిచేత భూమి, సూర్యుఁడు గ్రహములు మొదలుగా గోళము లన్నియు ఒకదానితో నొకటి ఢీకొనకుండా దూరదూరముగా తమతమ పరిధులలో ఎట్లు పరిభ్రమించుచున్నవో అట్లే అణువులోపల ఎలక్ట్రాన్ మొదలగునవి పరిభ్రమించుచు సమస్థితిలో (Balanced State) ఉన్నవని, అణువును ఛేదించినప్పుడు ఆ సమస్థితి తప్పిపోయి వైషమ్యము ఏర్పడినంతనే గొప్ప అణుశక్తి (Atomic Energy) వెలువడుచున్న దనుట ప్రసిద్ధమైయున్నది.

ఈవిషయముల దృష్టితో ఆలోచించినప్పుడు ప్రోటాన్ మొదలుగా అయిదు సూక్ష్మద్రవ్యములను పంచతన్మాత్రలనుగా లేక సూక్ష్మభూతములనుగా (Subtle Elements) భావింపవచ్చును. అట్లే ఆక్సిజన్, ఉదజని మొదలుగా అయిదు ప్రధాన మూలకములు స్థూలభూతములై (Gross Elements) యుండవచ్చునని తలంపవచ్చును. ఆక్సిజన్ అగ్నియైనచో ఉదజని జలతత్త్వము కావచ్చును.

సూక్ష్మభూతములవలన పంచప్రాణములు మనస్సు, బుద్ధి, దశేంద్రియములు సంభవించి వానివలన సూక్ష్మశరీరము ఏర్పడుచున్నదని చెప్పఁబడుచున్నది. అందువలన దీనిని పరమాణుసృష్టిగా (Nuclear creation) భావించినచో, స్థూలభూతములవలన ఏర్పడుచున్న స్థూలశరీరమును అణుసృష్టిగా (Atomic Creation) భావింపవచ్చును. ఇట్లే అణువు భగ్నమైనప్పుడు దానిలోని ఎలక్ట్రాన్ మొదలగుపదార్థములకు సమస్థితి పోయి అవి గొప్పశక్తిగా (Nuclear Energy) వెలువడునట్లే త్రిగుణాత్మకమైన ప్రకృతి, ఈశ్వరుని వీక్షణముచేత సమస్థితిని కోల్పోయి చైతన్యాత్మకమైన విశ్వపదార్థముగా (universal matter evolving into the form of energy having knowledge and Ego) పరిణమించుచున్న దని తలంపవచ్చును.

నేఁటి శాస్త్రజ్ఞులు ఈ పరిణామ ప్రకారమునే కాక స్థూలశరీరములోని ధాతువుల సృష్టికి, ప్రాణేంద్రియ మనోబుద్ధులయొక్క సృష్టికిఁ గల భేదమును పరిశోధించి గ్రహింపవలసియున్నది.

ప్రకృతివలన ఇంత సృష్టికార్యము జరుగుచుండఁగా దానికి ఆధారమైన యాత్మ నిర్వికారముగ నిష్క్రియముగ, జ్ఞానానందఘనముగా నుండును. ఘనమనఁగా ముద్ద. రజత ఘనమునందు రజతము తప్ప మఱియేదియు నుండదు. దానినే రజతఘనమందురు. అట్లే ఆత్మయందు జ్ఞానరూపమైన యానందము తప్ప మఱియేదియు నుండదు. తనయందు గిన్నెలు కంచములు మొదలుగా ఎన్ని పదార్థములు ఎన్ని నామరూపములను పొందుచున్నను ఎట్టి మార్పును పొందక వెండి ఎట్లుండునో, అట్లే తనయందు ప్రకృతి ఎంత జగత్తును సృష్టించుచున్నను, ఆత్మనిర్వికారముగానే యుండును. ఈవిధముగా ఆత్మప్రకృతికంటె భిన్నమే యైనను, ప్రకృతి ఆత్మకన్న భిన్నముగా ఎప్పుడును ఉండదు. కావున ప్రకృతి సర్వదా ఆత్మయందు అభిన్నముగనే యుండును. అనన్యభక్తితో పరమేశ్వరుని శరణము పొందినవారు, సూర్యకిరణములయందు జలము గోచరించునట్లు, ఆయనయందు ప్రకృతి మాయామాత్రముగ ఉన్నదని తలంతురేకాని అదివేఱొక సత్యవస్తువుగానున్న దని తలంపరు. ఆత్మసాక్షాత్కారము కలుగువఱకు జ్ఞానులయందు కూడ ఈ వివాదము నశింపదు. జగత్తు సత్యముగా భాసించుచున్నంతవఱకు అహంకార మమకారములు తొలఁగవు ; జన్మలు తప్పవు.

ఉద్ధవుఁడు ఇట్లు అడిగెను. "భగవంతుఁడవైన నిన్ను తలంపక వివిధకర్మలను ఆచరించువారికి ఆకర్మలవలన ఉత్తమదేహములు నీచదేహములు ఎట్లు కలుగునో చెప్పుము".

భగవానుఁడిట్లనెను. "కర్మవాసనలతో నిండిన మనస్సు పంచేంద్రియములతో ప్రాణముతో ఒక లోకమునుండి మఱియొకలోకమునకు ఒక దేహమునుండి మఱియొక దేహమునకు పరిభ్రమించుచుండును. జీవుఁడు దానిని అహంకారముతో అనుసరించుచుండును. ఆయాలోకములలోని విషయములను ధ్యానించుచు మనస్సు కర్మానుగతమై వానియందు నూతన దేహములతో ఆవిర్భవించుచు పూర్వజన్మవిషయములను పూర్తిగా విస్మరించును. ఆ విస్మృతియే పూర్వజన్మమునకు మృతి. నూతనవిషయములను మనస్సు తన స్వరూపముగా స్వీకరించుటయే జన్మము. జాగ్రత్తునందున్న తన రూపమునే జీవుఁడు స్వప్నమునందు చూచుచు.

జాగ్రత్తునందున్న దానిని స్మరింపక, అప్పుడు స్వప్నమునందు క్రొత్తగా పుట్టినట్లే తలంచును.

స్వప్నమునందు మనస్సు, లేని వ్యక్తులను ఉన్నట్లు కొన్ని సన్నివేశములు ఇంటిలోపల, మఱికొన్ని సందర్భములు వెలుపల దూరదేశమునందు జరిగినట్లు చూపును. దానియందు వ్యక్తులవలె లోపలవెలుపల అనుభేదము కూడ మిథ్యయే. జాగ్రద్దశయందు కూడ ఉత్తమ మధ్యమ నీచములను పరిగణనము ఆధ్యాత్మికములు, ఆధిభౌతికములు, ఆధిదైవికములు అను భేదములను మనసే సృష్టించుచున్నది. కాలముయొక్క వేగమును మనము గుర్తింపలేము. భూతము లేవియును ఈక్షణములో ఉన్నట్లు మఱుక్షణములో ఉండవు. నదీ ప్రవాహమున నిన్న కన్పించిన నీరే, "ఇదిగో ఇప్పుడు ఇక్కడ ఉన్నది" అని చూపుటకు వీలు లేదు. సాయంకాలము వెలిగించినప్పుడు ఏదీపజ్వాలను చూచితిమో అదియే అర్ధరాత్రమున కూడ ఉండునని చెప్పలేము. దానిలోనికి క్రొత్తనూనె ప్రతిక్షణము ప్రవేశించుచునే యుండును. అట్లే ఎప్పుడో చూచిన వ్యక్తిని గుర్తించుచు "వాఁడే వీఁడు" అని చెప్పుటయు భ్రాంతియే. ఆ వ్యక్తికి ఇప్పటి వ్యక్తికి సాదృశ్యము ఉండును. అందువలననే గుర్తించుచున్నాము. కాని, అప్పటినుండి యిప్పటివఱకు ఎన్నో మార్పులను పొందిన శరీరాదికము ఏకరూపముగనే ఉన్నదనుట కుదురదు.

ప్రాకృతమైన శరీరమునకు అతీతముగా చూడఁగలిగినచో ఏ జీవునకు, జ్ఞానికే కాదు దేహభ్రాంతి కలవానికి కూడ, యథార్థముగా జన్మమరణములు లేవు. కల్పాంతమువఱకు ఉండునట్టి మహాభూతమైన యగ్నికి కొట్టెలతోడి సంబంధము ననుసరించి, "అగ్నిపుట్టినది ; ప్రజ్వలించుచున్నది ; అరిపోయినది" అని చెప్పుట ఎట్టిదో శరీరమునకు సంబంధించిన జన్మ మృత్యువులనుబట్టి జీవుఁడు పుట్టుచున్నాఁడు మరణించుచున్నాఁడు అని చెప్పుటయు అట్టిదె. నిషేకము, గర్భము, జన్మము, బాల్యము, కౌమారము, యౌవనము, మధ్యమవయస్సు, ముసలితనము, మృత్యువు అనునీ తొమ్మిది యవస్థలు శరీరమునకు సంబంధించినవే కాని జీవాత్మకు సంబంధింపవు. ఈయవస్థలకు అతీతముగ "నేను బాలుఁడను", అని చెప్పినవాఁడే "నేను వృద్ధుఁడను" అని చెప్పుచు మార్పునొందక యుండియు పామరుఁడు ఈ యవస్థలను తనవిగా భావించుచున్నాఁడు. వివేకము కలవాఁడు ఈయవస్థలతో

తనకు ఎట్టి సంబంధము లేదని గ్రహించుచున్నాఁడు. తండ్రికి పరలోక గమనోచిత కర్మలను, పుత్రునకు ఇహలోకాగమనోచిత కర్మలను చేయుచున్న వివేకి, శరీరమును వీడుటవలన జీవుఁడు నశించుట, క్రొత్త శరీరమును పొందుటవలన పుట్టుట లేదని గ్రహించుచున్నాఁడు. చెట్టువలె శరీరము కూడ దృశ్యమే. చూచువానికంటె చూడఁబడు పదార్థము ఎప్పుడును భిన్నముగనే యుండును. చెట్టు తాను కానట్లే శరీరము తాను కాఁడు. స్వప్నములోని పదార్థములు ఎట్లు మిథ్యలో జాగ్రద్దశయందు కూడ నిరంతరము మారుచున్న పదార్థములు మిథ్యలే. ఇంత ఎఱింగిన వివేకి కూడ విషయములను ధ్యానించుటవలన సంసారమునందు చిక్కుపడుచునే యున్నాఁడు. ఆత్మస్వరూపము కన్పింపకుండునట్లు ఆభాసమానమైయున్న ఈ జగత్తువలన కలుగుచున్న భ్రాంతిని తొలఁగించుకొనుము. విషయములను అనుభవించుటకై ఉద్యమింపకుము. "ఈ శరీరము నేను కాను" అను దృఢనిశ్చయముతో, దుర్జనులు దీనిపై ఉమిసినను, మూత్రమును విడిచినను, తిట్టినను కొట్టినను పట్టించుకొనకుము. శ్రేయస్సును కోరువాఁడు అచలంచలమైన తన మనస్సుతోనే తన్ను ఉద్ధరించుకోవలె".

శ్రీధరాచార్యుఁడు నిషేకాదులను ఇట్లు వివరించినాఁడు. పురుషుని వీర్యముతో తల్లికడుపులో ప్రవేశించుట నిషేకము. అచ్చట వృద్ధినొందుట గర్భస్థితి. ఉదరకోశము నుండి వెలువడుట జన్మము. అప్పటి నుండి అయిదేండ్ల వఱకు బాల్యము, పదునాఱేండ్లవఱకు కౌమారము. నలుబదియేండ్లవఱకు యౌవనము. అఱువది యేండ్లవఱకు మధ్యవయస్సు.

## (ii) భిక్షుగాథా చమసము

పై యుపదేశమును విని ఉద్ధవుఁ డిట్లనెను. "వాసుదేవా ! దుర్జనులవలన కలుగు కష్టములను సహించుట చాల దుర్ఘటము. నీయందు అనన్యమైన భక్తి కలవారు, శాంతులును అయినవారు తప్ప ఇతరులు ఎవరు వానిని సహింపఁగలరు? స్వభావము బలిష్ఠము. దానియందు ఉబుకుచున్న క్రోధమును ఎవఁడు అణఁపఁగలఁడు?"

భగవానుఁడు ఇట్లనెను. "నీవు బృహస్పతి శిష్యుఁడవు. నీవు చెప్పినది యథార్థమే. దుర్జనుల పరిహాసములచేత, అవమానములచేత సంక్షుభితమగుచున్న మనస్సును సమాధానపెట్టుటకు సమర్థుఁడైన వాఁడెవఁడును లేఁడు. దుర్జనుల పరుషవాక్యములు మర్మములను భేదించి వ్యథ నొందించునట్లుగా శత్రువుల ఘోరబాణతాడనములు కూడ తపింపఁజేయవు. ఈ విషయమున పుణ్యమైన యితిహాసమును వినుము.

మాళవదేశమునందు కృషివాణిజ్యాదులు వృత్తిగా మహాసంపన్నుఁడైన యొక బ్రాహ్మణుఁడు ఉండెను. అతఁడు మిగుల లోభముకలవాఁడు. ఆతఁడు క్రోధశీలుఁడై బంధువులను, అతిథులను మాట మాత్రముగనైన ఆదరింపక కసరుకొనుచు ఇంటిలో ఎవరిని చేరనీయకుండెను. భార్య, బిడ్డలు, భృత్యులు మొదలుగా అందరు విషాదముతో అతనిని ఆదరింపకుండిరి. దేవేంద్రుని ధనమును యక్షులు భృత్యులై రక్షించునట్లు, అతఁడు ధర్మకామ భోగవిహీనుఁడై సంపదను రక్షించుచుండెను. వాని సంపదకు భాగస్వామ్యము కలిగిన పంచయజ్ఞాధి దేవతలు (దేవ, పితృ, మనుష్య, భూత, బ్రహ్మయజ్ఞములు) క్రోధమును పొందిరి. వారి క్రోధమువలన పూర్వజన్మార్జితమై ఇప్పటి సంపదకు మూలమైన పుణ్యము నశించెను. అందుచే దైవము వలన గృహదాహాదులు, కాలమువలన గాదెలతో పాతరలలోనున్న ధాన్యము నశించుట, దొంగలవలన ధనము అపహరింపఁబడుట, రాజువలన దండరూపమున ధనాపహరణము సంభవించి ఆ బ్రాహ్మణబ్రువుఁడు అల్పకాలముననే దరిద్రుఁడయ్యెను. మహాకష్టములపాలై బంధువులచే పరిత్యక్తుఁడై అతఁడు నిర్వేదముతో అమితపరితాపమును పొందుచు ఇట్లనుకొనెను.

"ధర్మమునకు భోగమునకు ఉపయోగింపక ఈధనమును సంపాదించుచ నేను వ్యర్థముగా దేహేంద్రియాదులను తపింపఁజేసితిని. నావంటి లోభియొక్క సంపద ఇక్కడ పరితాపమునకు, చచ్చినతరువాత నరకమును కలిగించుట తప్ప ఎందులకు ఉపకరించును ? కుష్ఠమువలన మచ్చ స్వల్పమైనను సౌందర్యముః హరించునట్లు లోభము కొంచెమైనను సద్గుణములను హరించును. అర్థముః

సాధించునప్పుడు ఆయాసము, అది పెంపొందినప్పుడు రక్షణమునందు భయము, దానికి వ్యయము కలిగినప్పుడు దిగులు, నాశమునందు చిత్తభ్రమము కలుగుచున్నది. అర్థమును సాధించునప్పుడు చౌర్యము, హింస, అసత్యప్రసంగము, దంభము, కామము, క్రోధము అను ఆఱు అనర్థములు ; సంపన్నత కలిగిన తరువాత గర్వము, మదము, మిత్రులతో కలహము, వైరము, అవిశ్వాసము, స్పర్థ అను నాఱు దుర్గుణములతోపాటు స్త్రీసంగము, మద్యపానము, జూదము అను మూఁడు వ్యసనములు కూడ కలుగును. కావున పదునైదు అశుభములకు మూలమైన యర్థమును శ్రేయస్సును కోరువాఁడు మహానర్థమునుగా దూరమొనరింపవలయును. భ్రాతలు భార్యలు తండ్రులు మిత్రులు, చిరకాలముగా తనప్రాణమే వారి ప్రాణముగా ప్రేమించుచున్నవారు, కాని (ఇరువదిగవ్వలు ఒక కాని) చేరినంతనే కానివారు అగుచున్నారు. అల్పమైన యర్థముకొఱకు కూడ స్నేహమును వీడి స్వజనులు సైతము స్పర్థతో చంపుచున్నారు.

స్వర్గమునకు మోక్షమునకు ద్వారమై దేవతలకు సైతము ప్రార్థింపఁదగినదైన యీ మనుష్య శరీరమును అందును బ్రాహ్మణత్వమును పొంది, ఆత్మహితమును భగ్నమొనరించుకొనువాఁడు నీచజన్మలను పొందును. ధనసంపాదన పరత్వమున వ్యర్థముగా నాకు వయస్సు గడచిపోయినది ; కాలవశమున ఆర్జించిన సంపదలు కూడ నశించినవి. వృద్ధుఁడను దరిద్రుఁడనై ఇంక ఏమి పురుషార్థమును సాధింపఁగలను? మృత్యుముఖమున ప్రవేశించుచున్ననాకు ధనములతో కాని ధనదాతలతోకాని, కామములతో కాని కామప్రదులైన దేవతలతో, జన్మకారణములైన కర్మలతోఁ గాని ఏమి ప్రయోజనమున్నది ? సర్వదేవమయుఁడైన యావిష్ణువు నాయందు ఈవిధముగా అనుగ్రహమునే చూపుచు నాకీదశను కలిగించినాఁడు. ఆపదలే కలుగకున్నచో నాకీ నిర్వేదమెట్లు కలుగును ? నిర్వేదమే సంసారసాగర తరణమునకు నౌకయగు విరక్తిని కలిగించుచున్నది. ఇంక మిగిలిన జీవితకాలమునందు జాగరూకుఁడనై ధర్మాదికమును సాధించుచు శరీరమును శోషింపఁజేయుదును. లోకపాలకులు కూడ నా యుద్యమమును ఆమోదింతురుగాక! ఖట్వాంగుఁడు ఒక్క ముహూర్తకాలముననే బ్రహ్మలోకమును సాదించెను."

ఇట్లు నిశ్చయించి ఆ బ్రాహ్మణోత్తముఁడు అహంకారమమకారాదులనువీడి శాంతుఁడై మౌనియై భిక్షువయ్యెను. జితేంద్రియుఁడై అతఁడు జ్ఞానవైరాగ్యములను ప్రకాశింపనీయక భిక్షకొఱకు నగరములందు గ్రామములందు బిచ్చగానివలె తిరుగుచుండెను. అవధూతయైన యావృద్ధుఁడు మలిన దేహముతో జీర్ణవస్త్రములతో భిక్ష మడుగుచుండగా, గర్వాంధులైన దుర్జనులు కొందఱు గుమికూడి అతనిని అనేక విధముల పరిభవింపఁజొచ్చిరి. కొందఱు చేతిలోని త్రిదండమును లాగుకొనఁగా, మఱికొందఱు భిక్షాపాత్రను కమండలువును హరించిరి. కొందఱు అతనిపీటను, రుద్రాక్షమాలను బొంతను, వస్త్రములను తీసికొని, మరల ఇచ్చుచున్నట్లుగా వానిని చూపుచు, అతఁడు అందుకొనుటకు ప్రయత్నింపఁగా అందకుండ దాఁచుచుండిరి. అయినను అతఁడు వాక్కును నియమించుచు ఏమియు మాటాడకుండెను. ఇతఁడు దొంగ అని కొందఱు తిట్టుచు కొట్టుచుండిరి. "వీఁడు దరిద్రుఁడై బంధువులచే పరిత్యజింపఁబడి ఈ వేషముతో స్వార్థమును సాధించుకొనుటకై లోకవంచనము చేయుచు పరమధార్మికునివలె నటించుచున్నాఁడు ; వీనిని బంధింపుఁడు, బంధింపుఁడు" అని యఱచుచు బంధించి ఆటవస్తువుతో వలె వానితో ఆడుకొనుచుండిరి. పెద్దలచే విడిపింపఁబడి అతఁడు ఎట్లో భిక్షను సంపాదించుకొని ఏటియొద్దకు చేరి భుజించునప్పుడు కొందఱు వచ్చి ఆ భిక్షాన్నమునందు ఉమియుచు వానితలపై మూత్రమును విడుచుచుండిరి.

ప్రారబ్ధమువలన ప్రాప్తమైన దానిని అనుభవింపవలసినదే అను దృఢనిశ్చయముతో అతఁడు వారివలన ఎన్ని పరిభవములు కలుగుచున్నను సాత్త్వికమైన ధైర్యముతో సహించుచు యతిధర్మమునుండి చలింపక ఇట్లు పలికెను. "నాకు సంభవించుచున్న సుఖమునకు గాని దుఃఖమునకు గాని ఈ జనులు కారణము కాదు ; దేవతలు, గ్రహములు కర్మ కాలము కూడకాదు. వీని కన్నింటికి మనస్సే పరమమైన కారణము. అదియే ఈ సంసారచక్రమును త్రిప్పుచున్నది. అదియే బలిష్ఠమై గుణములను సాత్త్వికములు రాజసములు తామసములును అయిన కర్మలను చేయించుచున్నది. ఆ కర్మలకు ఫలములుగా వివిధములైన జన్మలు కలుగుచున్నవి. స్వధర్మానుష్ఠానము, దానము, యమము నియమము,

పాండిత్యము, వ్రతములు, యజ్ఞాదికర్మలు మొదలుగా అన్నింటికి మనోనిగ్రహమే పరమలక్ష్యము. మనస్సుయొక్క సమాధానస్థితియే శ్రేష్ఠమైన యోగము. ఎవనికి మనస్సు ప్రశాంతమై యున్నదో వానికి దానధర్మాదులతో ఏమి పని ? ఎవనికి మనస్సు అప్రశాంతమై నశించుచున్నదో వానికి కూడ దానధర్మాదులతో ఏమి ప్రయోజనము ? మనస్సు వశపడినచో ఇంద్రియములు వశపడును ; కాని ఇంద్రియములకు మనస్సు వశము కాదు. ఇంద్రియములే శరీరమున దేవతలు. మనస్సు మహాయోగులకు కూడ భయమును కలిగించుదేవుఁడు. ఆ దేవుని జయించినవాఁడే దేవదేవుఁడు. రాగద్వేషములను ప్రబలఁజేయుచు దుర్భరమైన వేగముతో దుర్జయమై ప్రబలుచున్న మనస్సే మనుష్యునకు అసలు శత్రువు. మూఢులు దానిని జయింపక తోడి మర్త్యులను శత్రువులనుగా భావించుచు వారిపై విక్రమించుటకు ప్రయత్నించుచుందురు. దేహములు మనోమాత్రములే. మనస్సు గ్రహించునప్పుడే దేహముండును ; నిద్రామూర్ఛాదులయందు దేహస్ఫురణమే లేదు. అట్టి మనోమాత్రములైన దేహములలో తనదేహమునందు "నేను" అని, ఇతరదేహములందు, "వీఁడు నావాఁడు, వాఁడు పరుఁడు" అని భావములను కల్పించుకొనుచు దురంతమైన సంసారమునందు మనుష్యులు భ్రమించుచున్నారు.

కావున పూర్వతములైన మహర్షులచేత అనుసరింపఁబడిన పరమాత్మనిష్ఠను అవలంబించి ముకుందపాదారవిందధ్యానముచేతనే సంసారమును తరింతును."

ఇట్లు నిశ్చయించుకొని ఆ భిక్షువు దుర్జనుల పరాభవములను అన్నింటిని సహించుచు, "ఏ భూతముపైనను కోపింపరాదు" అను తన సంన్యాస ధర్మము నుండి చలింపక పై విధముగా పలికెను.

ఉద్ధవా ! మనకు సుఖమును దుఃఖమును కలిగించువాఁడు ఎవఁడును ఎక్కఁడను లేఁడు. అంతయు మనస్సుయొక్క విభ్రమమే. మిత్రులు, శత్రువులు, తటస్థులు అనువారివలన ఏర్పడుచున్న యీ సంసారమంతయు మనస్సుచేతనే కల్పింపఁబడుచున్నది. కావున నాయందు నిలిచిన బుద్ధితో మనస్సును సకల విధముల నిగ్రహింపుము. ఇంతే యోగము యొక్క సారము. భిక్షువుచేత వచింపఁబడిన

బ్రహ్మనిష్ఠమైన యీ గీతమును శ్రద్ధతో వినుచు, ధారణచేయుచు ఇతరులకు వినిపించువాఁడు శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములచేత పరిభవము నొందఁడు".

భిక్షువు తనకుఁ గలుగుచున్న సుఖదుఃఖములకు కర్మకూడ కారణము కాదని చెప్పుట గమనింపఁదగియున్నది. వ్యావహారికముగా జగత్తును సత్యముగా భావించుచున్నంత వఱకు దేహము కూడ సత్యముగనే తోఁచును. సత్యమైన దేహమునకు సత్యమైన కారణమే యుండవలె. ఆ పద్ధతియందు దేహము కలుగుటకు పూర్వజన్మలు కారణములగును. కాని జగత్తు దేహము మనస్సుచేత గ్రహింపఁబడుచున్నప్పుడే అది సత్యమై, దానికి కారణమైన పూర్వజన్మకర్మలు సత్యమగుచున్నవి. స్వప్నమునందలి జగత్తునకు కారణమైన మనస్సే జాగ్రదవస్థయందు కూడ జగత్తునకు కారణమని గ్రహించినప్పుడు, ఆ జగత్తువలె ఈ జగత్తుకూడ మనఃకల్పనమాత్రమై మిథ్యయే యగును. స్వప్నములోని సుఖదుః ఖములకు మనస్సు తప్ప వేఱొక కారణము లేనట్లు, జాగ్రత్తులోని సుఖదుః ఖములకు కూడ మనస్సే కారణము గాని యితరము కాదు.

భగవానుఁడు భిక్షువుయొక్క వాక్యములను గాథయని గీతమని పేర్కొనియున్నాఁడు. ప్రాకృతభాషా ఛందస్సులో గాథలు ప్రసిద్ధములై యున్నవి. గీతమునందు కూడ ఛందస్సులోవలె లయబద్ధత యుండును. మన పూర్వగ్రంథములలో మహాత్ముల ప్రవచనములు కొన్ని గాథలుగా గీతములుగా ప్రసిద్ధములైయున్నవి. భగవద్గీత మొదలగునవి ప్రశ్నోత్తరరూపమున విస్తృతి కలిగియుండగా, గాథలు ఒక్కొక్కవ్యక్తి తనయభిప్రాయములను ఒక మనఃపరిపాక దశలో (A state of sublimation of the mind) వ్యక్తీకరించు ప్రవచనములుగా కన్పించుచున్నవి. అసాధారణమై అపూర్వమైన భావము మనస్సును ఆవేశించినప్పుడు కొందఱు అప్రయత్నముగా. ఆదికవియైన వాల్మీకి మహర్షివలె, వ్యావహారికమైన వచనపద్ధతికి భిన్నముగా అపూర్వమైన విధానమున ఆ భావమును వ్యక్తీకరించుచుందురు. ఆవిధానము సాహిత్యమున ఛందస్సుగానో, సంగీతమున తాళబద్ధమైన లయగానో ఉండును. తెలుఁగున వేమన పద్యము లిట్టివే.

శ్రీకృష్ణుఁడు ఉద్ధవునకు చెప్పునప్పటికి ఈ భిక్షుగాథ లేక గీతము కొన్ని లక్షలయేండ్లకు పూర్వము పుట్టి యుండవచ్చును. ఇట్టిగాథలు, స్త్రీలపాటలవలె, ఒకతరమునుండి మఱియొక తరమునకు విజ్ఞానరూపమైన యాస్తిగా సంక్రమించుచుండును. కావున శ్రీకృష్ణుఁడు కూడ ఈ గాథను పెద్దలవలన గ్రహించి ధారణ చేసి యుద్ధవునకు చెప్పినాఁడని గ్రహింపవలసియున్నది.

## (iii) సాంఖ్య చమసము

బ్రహ్మముకంటె అన్యముగా జగత్తు సత్యముగా నున్నదను భ్రమను తొలఁగించుటకై భగవానుఁడు ఉద్ధవునకు సాంఖ్యయోగమును వివరించెను. ఆయుపదేశమును సారమునుగా ఇట్లు గ్రహింపవచ్చును.

"సృష్టికి పూర్వమున బ్రహ్మము లేక ఆత్మ ఒక్కటే యుండెను. తనకంటె అభిన్నమై తనశక్తిరూపమైన మాయయొక్క విలాసముచేత ఆ బ్రహ్మము పురుషుఁడు, ప్రకృతి అని రెండుగా నయ్యెను. పురుషుఁడు నిర్వికారుఁడు, నిష్క్రియుఁడు. ప్రకృతి కారణకార్యరూపమున పరిణమించు స్వభావము కలది. పురుషుని వీక్షణమాత్రమున ప్రకృతియందు సత్త్వము రజస్సు తమస్సు అనుగుణములు వైషమ్యము నొందును. విషమములైన యాగుణములనుండి మహత్తత్త్వము ఉదయించును. దానినుండి త్రిగుణాత్మకమైన యహంకారము ప్రభవించును. సాత్త్వికాహంకారము వలన ఇంద్రియాధిష్ఠాన దేవతలు మనస్సు ; రాజసాహంకారమువలన దశేంద్రియములు, తామసాహంకారమువలన సూక్ష్మభూతములు ఉద్భవించును. ఇవి యన్నియు కూడి పరమేశ్వరుని చోదనమువలన ఆయనకు స్థానములైన ఆయతనమైన బ్రహ్మాండమును రూపొందించును. అది సలిలములయందు ఉండును. ఆబ్రహ్మాండమునందు లీలావిగ్రహుఁడైన శ్రీమన్నారాయణుని నాభిపద్మమునుండి చతుర్ముఖుఁడైన బ్రహ్మ ఉదయించును. ఆయన భగవానుని యనుగ్రహమువలన రజోగుణముతో భూర్భువస్స్వర్గాదిలోకములను లోకపాలకులను సృష్టించును. దేవతలకు స్వర్గము, భూతములకు భువర్లోకము లేక అంతరిక్షము, మర్త్యులకు భూలోకము నివాసము లయ్యెను. స్వర్గమునకు పైన మహర్లోకము, మొదలైనవి సిద్ధులకు, భూమికి అధోలోకములు

అతలము మొదలైనవి యసురులకు నాగులకు స్థానములయ్యెను. జీవులకు జన్మగతులన్నియు ఈ లోకములయందే సంభవించును. విష్ణుభక్తియోగ నిష్ఠునకు వైకుంఠము గతి యగును.

కర్మయుక్తమైన యీ జగత్తు అంతయు కర్మఫలప్రదుఁడనైన నాచేత (పరమేశ్వరునిచే) ఏర్పఱుపఁబడినది. దీనియందు సుకృతులైన జీవులు పైలోకములయందు సద్గతిని, దుష్కృతులు అధమలోకములయందు దుర్గతులను పొందుచున్నారు.

అణువు, బృహత్తు, సూక్ష్మము, స్థూలము అయిన పదార్థము లన్నియు ప్రకృతిపురుషసంయోగమువలననే సంభవించుచున్నవి. ఏ పదార్థమునకు ఏది ఆదియందు అంతమునందు ఉండునో ఆ వస్తువే మధ్యమునందు కూడ ఉండును. ఆవస్తువునందు గోచరించు వికృతులన్నియు వ్యావహారికములే. ఆదిమధ్యాంతములయందు ఉండు వస్తువే సత్యము. బంగారమునందు గోచరించు వ్యావహారికములైన హారకేయూరాదుల కన్నింటికి బంగారమే సత్యమైనట్లు, కుండ, చట్టి, మూకుడు మొదలగువానియందు మట్టియే సత్యమైనట్లు, వ్యావహారికములైన సకల జగత్పదార్థములకు బ్రహ్మమే ఏకైకమైన సత్యవస్తువు. ఆ బ్రహ్మమే జగత్తునకు ఉపాదానకారణమైన ప్రకృతిగా, ఆధారమైన పురుషుఁడుగా, గుణములకు వైషమ్యమును కలిగించుకాలముగా మూఁడు రూపములతో గ్రహింపఁబడుచున్నది. జీవుని సుఖదుఃఖముల భోగముకొఱకు అమిత బహుళమైన యీసృష్టి జననీజనక సంతానాదిరూపముగా, ప్రకృతిపై పురుషునిదృష్టి ప్రసరించుచున్నంతవఱకు జరుగుచుండును.

పరమేశ్వరుఁడు వీక్షించుటను విరమించి ప్రకృతియందు వ్యాపించుటకు ఆరంభించినంతనే, లోకముల సృష్టి ప్రళయములకు స్థానమైన విరాట్టు పంచభూతముల విభాగముతో పంచత్వము నొందును. అప్పుడు అన్నమునందు (in the matter) మర్త్యములైన శరీరములు లీనమగును. అన్నము ఓషధులయందు లీనమగును. అవి పృథివియందు కలిసి పోవును. పృథివి గంధమాత్రమగును. గంధము సలిలములందు లీనమగును. సలిలములు రసమునందు, అది తేజమునందు,

తేజము రూపమునందు, రూపము వాయువునందు, వాయువు స్పర్శమునందు, అది ఆకాశమునందు, ఆకాశము శబ్దమునందు, అది తామసాహంకారమున లీనమగును. దశేంద్రియములు రాజసాహంకారమున, ఇంద్రియాధిష్ఠానదేవతలు మనస్సు సాత్త్వికాహంకారమున లయము నొందును. త్రిగుణాత్మకమైన యహంకారము మహత్తత్త్వమునందు, మహత్తు అవ్యక్తమునందు, అనఁగా ప్రకృతియందు, లీనమగును. అవ్యక్తము కాలమునందు, కాలము జీవునియందు, జీవుఁడు నిర్వికల్పమైన పరమాత్మయందు లీనమగును.

ఈ విధముగా అద్వితీయమైన పరమాత్మయందే సృష్టి ప్రభవించి, ప్రసరించి, ప్రళయము నొందుచున్నదని చూచుచున్నవానికి ఈ జగత్తు పరమాత్మకంటె అన్యముగా సత్యముగా ఉన్నదను భ్రమ మనస్సునందు ఎట్లు కలుగును ? ఒక క్షణములో కలిగినను, సూర్యోదయమున చీకటివలె, వానిహృదయమున నెట్లు నిలుచును?"

అంతరిక్షము లేక భువర్లోకము భూతములకు స్థానమయ్యె నన్నప్పుడు, భూలోకమున మరణించిన తరువాత మరల భూలోకముననో స్వర్గనరకాదిలోకముల లోనో జన్మించువఱకు సూక్ష్మరూపముతో నుండు జీవులు భూతములని గ్రహింపవలయును. చనిపోయినవానికి వెంటనే జన్మాంతరము లభింపదు ; కొందఱకు కొన్నివందల యేండ్లు పట్టవచ్చును.

స్వర్గమునకు పైనున్నలోకములు సిద్ధులకు స్థానములయ్యె నన్నప్పుడు, సిద్ధులనఁగా యోగసిద్ధులని గ్రహింపవలె. ధ్యానమును భక్తిని జ్ఞానమును అవలంబించి చేయు తపస్సులయందు ఎన్నో ప్రకారములు, ఎన్నో అంతస్తులు కలవు. గాఢమైన తపస్సులయొక్క సిద్ధివలన కొందఱు స్వర్గమునకు పైనున్న లోకములకు చేరుదురు.

విష్ణుభక్తి యందు పరమనిష్ఠ పొందినవానికి వైకుంఠము కలుగునన్నప్పుడు, శివభక్తులకు కైలాసము, దేవీభక్తులకు దేవీలోకము కలుగునని గ్రహింపవలె. జీవులు పొందుగతులలో సర్వోత్తమమైనది సత్యలోకము. దానిపైన ఏ లోకము లేదు. కావున వైకుంఠాదులు బ్రహ్మలోకముననే విభాగములని గ్రహింపవలసియున్నది.

జగత్తునకు ఉపాదానకారణము ప్రకృతి. వస్తువు రూపొందుటకు ఆధారమైన ద్రవ్యము ఆ వస్తువునకు ఉపాదానకారణమగును. వెండిగిన్నె వెండి కంచము మొదలగు వానికి వెండి ఉపాదాన కారణము. ఎండమావులయందు నీరు కన్పించునప్పుడు, త్రాడును చూచుచు సర్పముగా భ్రమించునప్పుడు, ఆ నీటికి, ఆ సర్పమునకు ఉపాదానకారణము అజ్ఞానమే. వెండిలేకున్నచో గిన్నె కంచము లేనట్లు, అజ్ఞానము లేకున్నచో ఆనీరు, ఆ సర్పము ఉండవు. అవిధముగా ప్రకృతి జగత్తునకు ఉపాదానకారణము అగుచున్నది. కావున ప్రకృతి అనఁగా అజ్ఞానము లేక అవిద్య లేక మాయ అన్నమాట.

ఆత్మనుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు అను నీ విధమున చెప్పు సృష్టి ప్రకారమును కారణములనుండి కార్యములు కలుగుటను అనులోమ క్రమమందురు. దీనికి విపరీత విధానమును (opposite process) అనఁగా కార్యములు కారణములయందు లీనమగుటను (effect submerging in the cause) ప్రతిలోమక్రమ మందురు. పృథివి నుండి ఓషధులు, వానినుండు యన్నము, దాని నుండి పురుషుఁడు సంభవించును అని చెప్పుట అనులోమ క్రమము. పురుషుఁడు అనఁగా పురుషాకృతిగల శరీరము, లేక సకల జంతు శరీరములను గ్రహింపవలె. "జాయతే ఇతి జంతుః" అను నిర్వచనము ననుసరించి జన్మించునట్టి ప్రాణులన్నియు జంతువులే. చచ్చిన జంతువుల శరీరములు ఇతర ప్రాణులకు ఆహారము అగును. పురుషుఁడు అన్నమునందు, అన్నము ఓషధులయందు, అవి పృథివియందు లీనమగు ననుట ప్రతిలోమ క్రమము.

పృథివి గంధమాత్రమగు ననఁగా ప్రళయమునందు సూర్యుని మహోగ్రమైన యుష్ణముచేత కరిగి, ఆవిరియై ఇంకను సూక్ష్మస్థితిని పొంది (sublimation) తనకు గుణమైన గంధమాత్రమగును. అట్లే తక్కిన భూతములుకూడ తమ రూపమును కోల్పోయి సూక్ష్మస్థితిలో గుణములై తమకారణములయందు లీనమగును.

అవ్యక్తమైన ప్రకృతి కాలమునందు లీనమగుననఁగా, కాలమువలన కలిగిన గుణవైషమ్యమును కోల్పోయి గుణసామ్యస్థితిని పొందునన్నమాట. కాలము జీవునియందు లయమగు ననుట గమనింపఁదగియున్నది. జీవుఁడు నిర్వికల్పమైన

పరమాత్మయందు లీనమగుచున్నాఁడు. అనఁగా పరమాత్మయే జీవుఁడైనాఁడన్న మాట. పరమాత్మ తనమాయాశక్తిని తనకంటె భిన్నమైన వేఱొక పదార్థమునువలె వీక్షించుట వలననే ఆమాయవలన సృష్టి ప్రసరించుచున్నది. కావున మాయను వీక్షించుటయే పరమాత్మకు జీవత్వము. వీక్షణమును విరమించి స్వరూపమాత్రముగ నుండుటయే పరమాత్మకు నిర్వికల్పస్థితి.

## (iv) పురూరవగాథా చమసము

సాంఖ్యమును బోధించిన పిమ్మట భగవానుఁడు సత్త్వమువలన ఉన్నతగతులు, రజోగుణమువలన మధ్యమగతులు, తమస్సువలన అధమగతులు ఎట్లు కలుగునో వివరించి తమస్సును రజస్సును జయించి సత్త్వనిష్ఠను పొందవలయునని చెప్పి యిట్లనెను.

"ద్రవ్యము దేశము కాలము జ్ఞానము కర్మఫలము కారకము శ్రద్ధ అవస్థ ఆకృతి నిష్ఠ మొదలుగా సర్వము త్రిగుణసంభవమే. ఏది ఏది కనఁబడుచున్నదో, వినఁబడుచున్నదో, బుద్ధిచేత ధ్యానింపఁబడుచున్నదో - ఆ గుణమయములైన భావము లన్నియు ప్రకృతి పురుషాధిష్ఠితములే. ఈ సంసారవికారము లన్నియు గుణకర్మలయొక్క నిబంధనమువలననే సంభవించుచున్నవి. చిత్తమునందు జనించుచున్న గుణములు భక్తియోగముచేత నిర్జింపఁబడును. ఆ భక్తియోగమునందు పరినిష్ఠితుఁడైనవాఁడు మోక్షమునకు అర్హుఁడగుచున్నాఁడు. కావున జ్ఞానవిజ్ఞానములను పొందుటకు యోగ్యమైన మనుష్యశరీరమును పొందిన వివేకి గుణములయందు సంగమును పరిత్యజించి నన్ను భజింపవలె. విద్వాంసుఁడు జాగరూకుఁడై జితేంద్రియుఁడై నిస్సంగుఁడై నన్ను భజించుచున్నచో రజస్సును తమస్సును జయించును. సాత్త్వికులైన వ్యక్తులను పదార్థములను సేవించుచు ఇహలోక పరలోక విశేషములయందు దేనియందును అపేక్ష లేక అతఁడు శాంతమైన బుద్ధితో సత్త్వగుణమును కూడ జయించును. ఆవిధముగా త్రిగుణములనుండి ముక్తుఁడై అతఁడు జీవత్వము వీడి నన్ను పొందును. ఈవిధముగా అంతఃకరణము నుండి పుట్టునట్టి గుణములనుండి జీవునినుండి నిర్ముక్తుఁడై పరమాత్మభావముచేత పూర్ణుఁడై

తనకు వెలుపల లోపల ఏపదార్థమునందును మనస్సును ప్రసరింపఁజేయఁడు ; నాయందలి అనన్యమైన భక్తిచేత తనయందే ఆనందరూపమున నున్న పరమాత్మను నన్ను పొందును. జ్ఞాననిష్ఠచేత గుణమయమైన జీవత్వమునుండి విముక్తుఁడై యథార్థముగ వస్తువులుగా లేకపోయినను వస్తువులవలె కన్పించుచుండు జగద్విషయములందు అతఁడు వర్తించుచున్నను, వానియందు వస్తుదృష్టిలేని వాఁడై, ఆ వస్తువులయందు గుణములయందు సంగమును పొందఁడు".

బాలప్రియ : శాస్త్రవిహితమై ఫలప్రదమైన క్రియ కర్మ. కర్మయొక్క నిర్వాహణమునకు ఉపకరించు సాధనము కారకము. శాస్త్రవాక్యములయందు, వాని ననుసరించి చెప్పునట్టి యాప్తుల యుపదేశములయందు విశ్వాసము శ్రద్ధ. జాగ్రత్స్వప్న సుషుప్తులు, బాల్యాదులు, సుఖదుఃఖాదులు అవస్థలు (states of being). ధ్యానయోగముచేత లభించు ఆయాదేవతలయొక్క రూపములు, నికృష్టకర్మలచేత సంభవించు పశుపక్ష్యాదుల రూపములు ఆకృతులు. శ్రద్ధాతిశయమువలన కర్మానుష్ఠానమునందు కలుగు అచంచలత్వము నిష్ఠ.,

భగవద్విషయమున తత్త్వమునందును వివాదరహితమైన నిశ్చయముతో నిర్మలమైన చిత్తవృత్తి శాంతబుద్ధి.

అహంకార మమకారములతో కర్మలను చేయుచు అనేక జన్మలను పొందుచుండువాఁడు జీవుఁడు. స్థూలశరీరము జీవునకు స్వరూపము కాదు. ఒక స్థూలశరీరము నశించినను దాని నుండియే శరీరముతో మఱియొక స్థూల శరీరమును పొందుచున్నాఁడో అట్టి సూక్ష్మశరీరమే జీవునకు స్వరూపము. దీనినే లింగశరీర మందురు. పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, దశేంద్రియములు, అహంకారమమకార రూపమైన దృఢమైన రజ్జువుచే బంధింపఁబడి పేటముడి పడినట్లుగా లింగశరీరము రూపొందుచున్నది. ఈ లింగ శరీరమే జీవుఁడు. అహంకారమమకార సూత్రము లేక త్రాడు తెగినచో ముడివీడి ఈ శరీరము నశించును. దీనిని నశింపఁజేయుటయే జీవత్వమునుండి విముక్తినొందుట. జ్ఞానముచేతనే అహంకారమమకారములు నశించును. లింగశరీరము నశించినంతనే స్థూలశరీరము పడిపోదు. సూత్రము తెగి

ముత్యాలహారము, దండయొక్క రూపమును కోల్పోయినను ముత్యములు నశింపవు. అవి వెనుకటివలె ఒకరి కంఠము నుండి మఱియొకరి కంఠమునకు అలంకారముగా సంక్రమింపలేవు. అహంకార మమకారసూత్రము తెగినప్పుడు లింగశరీరము నశించినను ప్రాణము, ఇంద్రియములు అంతఃకరణము నశింపవు. అట్లు విడివడిన ప్రాణేంద్రియాంతః కరణములతో స్థూలశరీరమును వహించుచు లోకమున వ్యవహరించు జ్ఞానిని జీవన్ముక్తుఁడందురు. అనఁగా ఇతరులవలె జీవించుచున్నను అతఁడు ముక్తుఁడనియే అర్థము. ప్రారబ్ధమువలన ఏర్పడిన స్థూలశరీరము ప్రారబ్ధము (అది) నశించినప్పుడు పడిపోవును. సుఖదుఃఖములను అనుభవింపఁజేయుచు ఫలము నిచ్చుటకు ఆరంభించిన పూర్వజన్మ కర్మయే ప్రారబ్ధము. జ్ఞానముచే అహంకారమమకారములు నశించినను, ప్రాణేంద్రియాంతఃకరణములు నశింపక పోవుటచే పుణ్యపాపరూపమైన యాప్రారబ్ధకర్మము వాని ద్వారమున స్థూలశరీరమును నడిపించుచు సుఖదుఃఖములను కలిగించుచునే యుండును. సుఖదుఃఖములను అనుభవించుచుండుటయే జీవించుట. మద్యపానముచే ఒడలు మఱచినవాఁడు తనకు కలుగుచున్న గౌరవమును గాని అవమానమునుగాని ఎట్లు గుర్తింపఁడో అట్లే ఆనందమయమైన భక్తిపారవశ్యముచేతఁగాని ఆత్మధ్యానపరాయణత్వముచేఁ గాని ఆ సుఖదుఃఖములను గుర్తింపఁడు. ప్రారబ్ధము ముగిసి స్థూలశరీరము పడిపోవునప్పుడు, లింగశరీరము ముందే భగ్నమై యుండుటచే పరస్పర బంధము లేక విడివడియున్న ప్రాణేంద్రియాంతఃకరణములు ఆ శరీరము నుండి పైకి లేచి మఱియొక శరీరమును పొందలేవు ; స్థూల శరీరము దగ్ధమగుటయో లేక పాతిపెట్టఁబడుటయో సంభవించినప్పుడు అవి తమకు మూలకారణములైె సూక్ష్మభూతములయందు లీనమగును. కారణశరీరమైన యజ్ఞానము, లింగశరీరము, స్థూలశరీరము అను మూఁడు దేహములు నశించి, ఏ యాత్మయందు ఈ దేహములు పుట్టినట్లుగా, వ్యవహరించినట్లుగా గోచరించినవో సర్వవ్యాపకమైన ఆయాత్మ శేషించుటయే విదేహముక్తి లేక కైవల్యము. ఇట్లు ఇక్కడనే ముక్తుఁడైనవాఁడు వైకుంఠాది లోకములకు పోఁడు. ఏ లోకమునకు పోవుటకైనను లింగశరీరము ఉండవలె. అది నశించినది కావున పరలోక గమన ప్రసక్తి లేదు.

ఒకానొకఁడు జీవన్ముక్తుఁడైనను, అతఁడు ఇతరులవలె వ్యవహరించుచుండుటవలన, వాని ముక్తస్థితి సన్నిహితులైన వారికి కూడ తెలియక పోవచ్చును. అట్లే తమయందు అహంకారమమకార గ్రంథి పూర్తిగా విచ్ఛిన్నమైనదో కాలేదో తెలిసికొనుట మహాభక్తులకు మహాయోగులకు కూడ సులభము కాదు. సాధకదశయందు ఒకప్పుడు నిర్మమత్వము నిరహంకారత్వము సిద్ధించి స్థిత ప్రజ్ఞత్వము కలిగినట్లే తోఁచును. కాని కొన్ని యసాధారణ పరిస్థితులు సంభవించినప్పుడు, అహంకార మమకారములు పూర్తిగా నశింపకున్నచో, భూమిలోపల కన్పింపకుండ ఉన్న విత్తనములవలె, పైకి వచ్చి విజృంభించి సాధకుని సంసారసముద్రమున త్రోయఁగలవు. సాధకదశలో జాగరూకతకొఱకై అసత్పురుషులతో సహవాసమును పరిత్యజింపవలయు నని ఉద్ధవుని హెచ్చరించుచు భగవానుఁడు ఇట్లు చెప్పెను.

"భోజనమైథున పరాయణులైన వారితో ఎక్కడనైనను ఎప్పుడైనను శ్రేయస్సును కోరువాఁడు ఎట్టి సంబంధమును పొందరాదు. అట్టివానితో ఏ యొక్కనితో కూడియున్నను, అంధుని అనుగమించువానివలె, పతనమును పొందును. కీర్తిశాలియైన పురూరవ చక్రవర్తి ఊర్వశీవిరహమున మోహవశుఁడై మిగుల శోకించి తుదకు నిర్వేదముతో గాథను వచించెను. తన్ను త్యజించి వెడలిపోవుచున్న యూర్వశిని చూచి ఆమహారాజు ఉన్మత్తునివలె నగ్నముగా ఆమె వెన్నంటి పోవుచు, ఓసీ! ప్రాణేశ్వరీ! క్రూరాత్మురాలా! నిలువుము నిలువుము" అని విలపించెను. ఆమెచేత ఆకృష్టమైన హృదయము కలవాఁడై ఆయన ఎన్నో వర్షఋతువులలో రాత్రులు ఎట్లు వచ్చిపోవుచున్నవో గమనింపనే లేదు. ఆమోహము గతించిన తరువాత ఆయన ఇట్లనెను.

"ఆహా! ఏమి నామోహాతిశయము! కామకశ్మలచిత్తుఁడనై కాంతచే కౌఁగిలింపఁబడి ఆయుఃఖండములు వ్యర్థముగ ఖండితము లగుచున్నవో తలంపనే లేదు. కామకేళియందు మునిఁగి సూర్యుఁడుదయించుటను కూడ నేను తెలిసికొనలేదు. గుంపులు గుంపులుగా వత్సరములు వచ్చి నన్ను వంచించిపోయినవి. అయ్యో! నాసమ్మోహము ఎంత గాఢమైనది. చక్రవర్తిని నరదేవశిఖామణిని అయిన నేను

ఒక్క వనితచేత క్రీడామృగముగా చేయఁబడితిని ! మనుష్యదేవమహేశ్వరుఁడనైన నన్ను గడ్డిపఱకనువలె పరిత్యజించి వెడలిపోవుచున్న యాదేవవేశ్యను చూచుచు పిచ్చివానివలె దిగంబరుఁడనై విలపించుచు ఆమె వెంటఁబడితిని. వెనుక కాళ్ళతో తాడించుచున్నను ఆడగాడిద వెంటబోవు మగగాడిదవలె, ఆడదాని వెంటఁబడుచుండిన నాపెద్దఱికమేమి ! తేజమేమి ? ప్రాభవమేమి ! స్త్రీలచేత హరింపఁబడిన మనస్సు కలవానికి విద్యవలన ఏమి లాభము. తపస్సునకు ఫలమేమి, త్యాగమువలన కీర్తియేమి ? పాండిత్యమువలన ఏమి బలము కలిగినట్లు ! ఏకాంతవాసమున మౌనమును సాధించియు దానిచే ఏమి సాధించినట్లు !

ప్రాభవమును పొందియు పండితుఁడనైతినని యహంకరించుచు మూర్ఖుఁడనై నాశ్రేయస్సును నేను తెలిసికొనలేక ఛీ ! స్త్రీలచేత ఎద్దువలె గాడిదవలె జయింపఁబడితిని. వందలకొలది వత్సరములు ఊర్వశియొక్క అధరాసవమును సేవించుచుండినను నాయందున్న కామము, ఆహుతులచే అగ్నివలె, ప్రజ్వలించుచున్నదే కాని శమించుటలేదు. వేశ్యచే అపహరింపఁబడిన నా చిత్తమును భగవంతుఁడైన విష్ణువు తప్ప ఎవఁడు విముక్తము కావింపగలఁడు ? ఆమె ననుట ఎందులకు ? భోగముకొఱకు పరితపింప వలదని స్త్రీ సంగము దుష్పరిణామకారణమని ఆమె యథార్థమునే బోధించినది. అయినను కామపరవశుఁడనైన నేను మోహమును వీడనైతిని. త్రాడును చూచి పామునుగా భ్రమించినవాఁడు ఆభ్రమచేత మహావ్యధను పొందినచో, అందు త్రాటియొక్క తప్పేమున్నది ? కామమును నిగ్రహింపలేక నేను ఆమెవెంటఁబడుట నా తప్పే కాని, అందు ఆమె దోషమేమున్నది ?

త్రాడును చూచుచు పాము అనుకొని భయగ్రస్తుఁడైన వానివలె, నేనును నిర్మలమైన నా స్వరూపమును దేహము అనుకొని సంసారగ్రస్తుఁడనైతిని. దేహము యొక్క స్వరూపమును విచారింపక దానిని మహనీయముగా తలంచితిని. అతిమలినము, దుర్గంధమయము, అశుచియునైన దేహమునందు, నేను అజ్ఞానముచే కదా సుగంధమును ప్రేమాదిగుణములను కల్పించుకొంటిని. నాయీకాయము ఎవరికి సొంతము ? తల్లిదండ్రులకా, భార్యకా, దీనివలన కర్మఫలములను పొందుచున్న

నాకా, గురువునకా, మిత్రులకా, అంత్యేష్టియందు చరమాహుతిని దీనిని స్వీకరించు నగ్నిహోత్రునకా, యుద్ధమునందు గాని మహాప్రస్థాన సమయమున గాని ఇది పడిపోయినప్పుడు దీనిని భక్షించు కుక్కలకు గ్రద్దలకు ఇది సొంతమా ? దీనిని ఎవఁడును ఇట్లు నిశ్చయించుకొనుట లేదు. స్త్రీముఖమును చూచుచు, "ఆహా ! ఏమి యందము ! ఈమెయొక్క ముక్కు ఎంత చక్కఁగానున్నది ! చిఱునవ్వు ఎంత మనోహరముగా నున్నది !" అని పరవశించుచు ఎల్లరును తుచ్ఛమైన కళేబరమునందు ఆసక్తులగుచున్నారు. చర్మము, మాంసము, రక్తము, నరములు, మేదస్సు, ఎముకలు అస్థికలు మొదలగువానితో కూర్పఁబడిన దేహమునందు భోగమును పొందువానికి, మలమూత్రములయందు రమించు క్రిములకు ఏమి యంతరమున్నది ? కావున వివేకము కలవాఁడు స్త్రీలయందు, స్త్రీలకు సంబంధించిన చిత్రపట శిల్పాదులయందు కూడ ఆసక్తినొందరాదు. వాని యందు చక్షురాదులైన యింద్రియములకు సంయోగము కలిగినప్పుడు మనస్సు సంక్షుభిత మగుచున్నది; అట్టియవకాశ మొసంగనిచో అది మథనము నొందదు. ఎప్పుడో ఒకప్పుడు చూచినదో విన్నదో అయిన వ్యక్తియందో పదార్థమునందో తప్ప బొత్తిగా తెలియని దానియందు భావనయే కలుగదు. ఇంద్రియములను వెలుపలికి పంపివాని మూలమున రూపము మొదలగువానిని మనస్సునకు చేర్చుకున్నచో అది స్తిమితమై శాంతి నొందును. కావున విద్వాంసులు కూడ తమయందు కామక్రోధాదులు నిగ్రహింపఁబడియున్నవను నమ్మకముతో స్త్రీలయందు స్త్రీ చిత్తములయందు కూడ సంగము నొందరాదు ; ఇంక మావంటివారి సంగతి చెప్పవలసినదేమున్నది ?

ఈవిధముగా ఆ మనుష్యదేవదేవుఁడు గతమును పలికి ఊర్వశీభావనను పరిత్యజించి జ్ఞానముచేత మోహము నశింపఁగా, నన్ను తన స్వరూపమునుగా తెలిసికొని సకలసంసార వ్యాపారమును విరమించుకొనెను.

కావున బుద్ధిమంతుఁడు దుష్టులతో సంబంధమును వీడి సత్పురుషులతో సంగమును పొందవలె. వారు మనస్సు యొక్క విషయలోలత్వమును నశింపఁజేయగలరు. సత్పురుషులు దేనియందును అపేక్ష నొందక, నాయందు మనస్సు నిలిపి, సమదర్శనులై, అహంకారమమకార రహితులై, మైత్రీశత్రుత్వాది

ద్వంద్వములకు అతీతులై, ఎవరివలనను దేనిని పరిగ్రహింపక ప్రశాంతులై యుందురు. ఆమహాత్ముల సన్నిధియందు ఎల్లప్పుడు నా కథలు ప్రస్తావింపఁబడుచుండును. అవి వినువారి పాపములను ప్రక్షాళనము గావించును. నాకథలను అనుమోదించుచు ఆదరించు వినుచు గానము చేయుచు నాయందు శ్రద్ధకలవారు గాఢమైన భక్తిని పొందుదురు. బ్రహ్మానందరూపుడనైన నాయందు అనన్యమైన భక్తిని పొందినవానికి, ఇంక పొందవలసినది ఏదియునుండదు. కావున, సూర్యుని సేవించువారికి చీఁకటి చలి ఎట్లుండవో అట్లె సాధువులను సేవించువారికి అజ్ఞానము భయము ఉండవు. నీటిలో మునిఁగి పోవుచున్న వారికి దృఢమైన నౌకవలె, సంసారసముద్రమున మునిఁగి తేలుచున్నవారికి శాంతులు బ్రహ్మవేత్తలునైన సత్పురుషులే ఆశ్రయింపఁదగినవారు. ప్రాణులకు అన్నమే ప్రాణము. ఆర్తులకు నేనే రక్షకుఁడను. మరణించు మానవులకు ధర్మమే పాథేయమైన ధనము. (మార్గమునందు ఉపయోగింపఁబడు ఆహారము). సంసారమును చూచి భయపడువారికి సాధువులే శరణము. ఉదయించిన భాస్కరుఁడు వెలుపలి పదార్థములను దర్శించు చూపు నొక్కదానిని యొసంగుచుండగా, సత్పురుషులు మంచిని చెడును విభజించు వివేకము, సగుణజ్ఞానము, నిర్గుణజ్ఞానము మొదలుగా ఎన్నో చక్షుస్సుల నొసంగుచున్నారు. కావున సాధువులే బంధువులు దేవతలు. పరమాత్మనైన నేను కూడ వారియందే ఉన్నాను".

పురూరవుఁడు ఆవిధముగా ఊర్వశియందు విరక్తుఁడై సర్వసంగవిముక్తుఁడై ఆత్మానందుఁడై మహితలమున విహరించెను.

## (V) ఆరాధన క్రియాయోగ చమసము

పురూరవుని గాథను, సాధువుల భక్తి మహిమను విని ఉద్ధవుఁడు భగవత్పరిచర్యారూపమైన పూజను మహాభక్తులు ఏ ప్రకారమున చేయుదురో తెలిసికోవలయునను కుతూహలముతో భగవానుని ఇట్లు ప్రశ్నించెను. "ప్రభూ ! సాత్త్వతులలో ఎవరు ఎందువలన ఏయధిష్ఠానములలో ఏ ప్రకారముతో అర్చింతురో చెప్పుము. దేవర్షియైన నారదుఁడు, భగవంతుఁడైన వ్యాసుఁడు, దేవాచార్యుఁడైన

బృహస్పతి, సాక్షాత్తుగా నీవలన నుపదేశమును పొందిన చతుర్ముఖుఁడు, పుత్త్రులకు బోధించిన భృగుమహర్షి, పార్వతికి ప్రవచనము గావించిన పరమేశ్వరుఁడు మాటిమాటికి ఈయారాధనరూపమైన క్రియాయోగమును మానవులకు పరమశ్రేయస్సునుగా చెప్పుచుండిరి. అందువలన ఇది సకలవర్ణములవారికి, నాలుగు ఆశ్రమములవారికి సమ్మతమైనదని, స్త్రీలకు శూద్రులకు శ్రేయస్కరములైన వానిలో శ్రేష్ఠమని తలంచుచున్నాను. కర్మబంధమునుండి ముక్తిని కలిగించు నీయారాధన క్రియాయోగమును చెప్పుము".

భగవానుఁడు ఇట్లు చెప్పెను. "ఉద్ధవా ! కర్మకాండము అనంతము. దీనికి పారము లేదు. దీనిసారమును సంక్షేపముగా చెప్పెదను వినుము.

ఈయారాధన రూపమైన యజ్ఞము వైదికము, తాంత్రికము, మిశ్రము అని మూఁడు విధములుగా నున్నది. ఎవఁడైనను ఈమూఁడింటిలో తనకు ఇష్టమైన విధానమున అధికారి భేదమును అనుసరించి నన్ను అర్చింపవచ్చును. తన వేదశాఖననుసరించి ఉపనయనముచేత ద్విజత్వమును పొందినవాఁడు భక్తిశ్రద్ధలతో నన్ను ఎట్లు అర్చింపవలయునో వినుము. అర్చనమునకు ముందు శరీరశుద్ధికొఱకు వైదికములు తాంత్రికములును అయిన మంత్రములతో స్నానమును సాంగముగా చేయవలె. పిమ్మట వేదము విధించిన విస్పష్టములైన విధానములతో సంధ్యోపాసనము మొదలగు కర్మలను నిర్వర్తింపవలెను. అనంతరము దురితక్షయమును కలిగించుచు పావనమైన యారాధనమును సమ్యక్సంకల్ప పూర్వకముగా ఆరంభింపవలయును. ప్రతిమయందు, స్థండిలమునందు, అగ్నియందు, సూర్యునియందు, జలమునందు, హృదయమునందు, బ్రాహ్మణుని యందు - వీనిలో దేనియందైనను తనకు గురువునైన నన్ను శక్తివంచనము లేకుండ తగిన ద్రవ్యములతో భక్తియుక్తుఁడై అర్చింపవలయును. శిలతో, దారువుతో లోహముతో, లేపనముతో, లేఖనముచేత, ఇసుకతో, మనస్సుతో. మణులతో రూపొందింపఁబడుచు ప్రతిమలు ఎనిమిది విధములుగా నున్నవి. ఈశ్వరునకు ప్రతిష్ఠారూపములై మందిరములైన యీప్రతిమలు చలము అచలము అని రెండు విధములుగా నున్నవి.

అచలమైన ప్రతిమయందు అర్చనమున ఆవాహనము ఉద్వాసనము ఉండవు; చలమైన దానియందు వైకల్పికముగా ఆవాహనము ఉండి ఉద్వాసనము లేకపోవచ్చును. స్థండిలమునందు రెండును ఉండును. అవిలేప్యములైన ప్రతిమలయందు అభిషేక ముండును ; విలేప్యములయందు మార్జనము మాత్రమే యుండును. ప్రసిద్ధములైన ద్రవ్యములతో ప్రతిమాదులయందు ఆరాధనయజ్ఞమును నిర్వర్తింపవలె. నిష్కాముఁడైన భక్తుఁడు మాత్రము ఆసమయమునకు లభించుచున్న ద్రవ్యములను వినియోగించుచు, లభింపనివానిని హృదయమునందు భావించుచు నాకర్పించుచున్నట్లుగా అర్పింపవచ్చును. స్నానము అలంకరణము ప్రతిమయందే శ్రేష్ఠమైన యర్చన మగును. స్థండిలమునందు తత్త్వవిన్యాసము, అగ్నియందు ఆజ్యపూర్ణమైన హవిస్సు, సూర్యునియందు అభ్యర్హణము, జలములందు జలతర్పణాదికము శ్రేష్ఠములగును. నా భక్తుఁడు, ఏమియు ఈయలేకపోయినను, శ్రద్ధతో నాకు జలము నొసంగినను అది శ్రేష్ఠమగునర్చనమే యగును. ఇంక అతఁడు గంధము, ధూపము, పుష్పములు దీపము, అన్నము మొదలగువానిని కూడ సమకూర్పఁగలిగినచో ఆపూజనము సర్వశ్రేష్ఠమగునని చెప్పవలసిన దేమున్నది ?

ఆరాధమును ఆరంభించువాఁడు శుచియై ముందుగా పూజాద్రవ్యములన్నింటిని దగ్గరగా ఉంచుకొని, దర్భలతో ఆసనమును ఏర్పఱచుకొని తూర్పుముఖముగా గాని, ఉత్తరముఖముగా గాని, ప్రతిమ అభిముఖముగా కూర్చుండవలయును. పిదప తనయందు న్యాసమును గావించుకొని, ప్రతిమయందు న్యాసమును గావించి, నిర్మాల్యమును తొలఁగించుచు ప్రతిమను చేతితో శుద్ధ మొనరింపవలయును. కలశమును (పూర్ణకుంభమును) ప్రోక్షణీయమును యథావిధిగా చందనపుష్పాదులతో సంస్కరింపవలె. ప్రోక్షణీయపాత్రలోని జలముతో దేవమండపమును, పూజాద్రవ్యములను, తన్ను ప్రోక్షించుకొనవలె. పాద్యమునకు అర్ఘ్యమునకు ఆచమనీయమునకు విడివిడిగా మూఁడు పాత్రలను కలశోదకములతో నింపి ఆయాద్రవ్యములతో సంస్కరింపవలయును. అర్చనము చేయించుచున్న దేశికుఁడు (ఆచార్యుఁడు) హృదయము, శీర్షము, శిఖ అను మంత్రములచేత గాయత్రిచేతను అభిమంత్రింపవలయును.

పిమ్మట వాయువుచేత అంతస్థమైన యగ్నిచేత పిండమును శుద్ధమొనరించి హృదయపద్మమునందు పరమమై అణురూపమైయున్న నాజీవకళను, నాదాంతమునందు సిద్ధులచే భావింపఁబడుదానిని ధ్యానింపవలయును. ఆత్మయైన ఆకళచేత శరీరమంతయు వ్యాప్తము కాగా ఆ కళను మానసికములైన యుపచారములచేత పూజించి తన్మయుఁడు కావలె. తరువాత ప్రతిమాదులయందు నన్ను ఆవాహనము స్థాపనముఁ గావించి ఆవరణాంగ దేవతలను స్థాపించి పూజింపవలయును. ధర్మాదులతో, తొమ్మిది శక్తులతో ఆసనమును కల్పించి, దానియందు అష్టదళమైన పద్మమును కర్ణికచేత కేసరములచేత ఉజ్జ్వలమైన దానిని ఏర్పఱచి, భుక్తికొఱకు ముక్తికొఱకు వైదికముగా తాంత్రికము పాద్యము అర్ఘ్యము ఆచమనీయము మొదలగునుపచారములను గావింపవలె. సుదర్శనము పాంచజన్యము గద, ఖడ్గము, బాణములు, ధనుస్సు, హలము, ముసలము అనునాయుధములను కౌస్తుభమును మాలను శ్రీవత్సమును క్రమముగా పూజింపవలె. పిదప నందుని, సునందుని, ప్రచండుని. చండుని, మహాబలుని, బలుని, కుముదుని, కుముదేక్షణుని, దుర్గాదేవిని, వినాయకుని, వ్యాసుని, విష్వక్సేనుని, గురువులను దేవతలను వారి వారి స్థానములయందు అభిముఖులనుగా ఏర్పఱచి ప్రోక్షణాదులచే పూజింపవలెను.

పూజనమునందు విభవము ననుసరించి చందనము, వట్టివేరు, కర్పూరము, కుంకుమపువ్వు, అగరు ద్రవ్యములతో సువాసితములైన జలములతో స్వర్ణఘర్మానువాకము, మహాపురుషవిద్య, పురుషసూక్తము రాజనము మొదలైన సామవేద మంత్రములతో అభిషేకమును జరుపవలెను. వస్త్రములు, యజ్ఞోపవీతము, ఆభరణములు, పత్రములు, మాలికలు, గంధలేపనములు, అక్షతలు మొదలగువానితో ప్రేమతో యథోచితముగ అలంకరింపవలెను. ధూపదీపముల నొసంగి, బెల్లముతో పాయసము, వెన్న, నెయ్యి, మీఁగడ, చక్కిలములు, అపూపములు, మోదకములు, సంయావములు, పెరుగు, సూపములు మొదలగువానితో నైవేద్యము నొసంగవలయును.

పర్వములయందు వైభవము ననుసరించి దేవునకు తైలాభ్యంజనము, నలుగుపెట్టుట, దంతధావనము, అభిషేచనము, విశిష్టనైవేద్యములు, గీతములు, నృత్తము, నృత్యములు నాట్యములు జరుపఁదగును. శక్తియున్నచో ప్రతిదినము జరుపవచ్చును.

పూజానంతరము యథావిధిగ కుండమునందు అగ్ని హోత్రుని అర్చించి, అందు నన్ను ఆవాహనమొనర్చి, మేలిమి బంగారు వర్ణముకల కాయము, శంఖచక్రగదా పద్మములతో ప్రకాశించు నాలుగు హస్తములు పద్మకేసరముల వర్ణము కలిగిన వస్త్రము మెఱయుచున్న కిరీటము కటకములు కటిసూత్రము శ్రేష్ఠములైన యంగదములు శ్రీవత్సము కౌస్తుభము వనమాలయు కలిగిన వానినిగా ధ్యానింపవలయును. మూలమంత్రముతో పురుషసూక్తముతో ఆజ్యపూర్ణములైన హవిస్సులను ఆహుతుల నొసంగవలెను. వహ్నియందున్న భగవంతుని అర్చించి నమస్కరించి పార్షదులైన నందాదులకు బలులనొసంగి పూజాస్థానమునకు వచ్చి బ్రహ్మమును స్మరించుచు నారాయణాత్మకమైన మూలమంత్రమును జపింపవలె. ప్రతిమయొద్ద, అగ్నిహోత్రనందును అర్చితుఁడైన భగవంతునకు రెండు స్థానములయందును భోజనము పరిసమాప్తమైనట్లుగా భావించి ఉత్తరాపోశనము ఆచమనము నొసంగి నైవేద్యశేషమును విష్వక్సేనునకు ఒసంగి తాంబూలాదికము నొసంగి పుష్పాంజలితో మరల పూజింపవలయును.

నాకథలను చెప్పుచు, గానము చేయుచు నృత్య మొనరించుచు, అభినయించుచు ఒక ముహూర్తము తన్మయత్వము నొందవలె. పౌరాణికములైన స్తవములచేత, పెద్దవి చిన్నవియు నైన దేశభాషాస్తోత్రములచేత స్తుతించి, "పరమేశ్వరా! ప్రసన్నుఁడవగుము" అని ప్రార్థించుచు, భూమిపై దండమును వైచినట్లుగా, సాష్టాంగముగ ప్రణామము కావింపవలయును. శిరస్సును నాపాదములయొద్ద నుంచి కుడిచేతితో కుడిపాదమును, ఎడమచేతితో ఎడమపాదమును గ్రహించి, "భగవానుఁడా ! నేను నీకు ప్రపన్నుఁడనైతిని ; నన్ను మృత్యుగహ్వరమునుండి రక్షింపుము" అని ప్రార్థింపవలె. పిదప నాకు పూజలో నొసంగిన పుష్పాదికమును ప్రసాదమునుగా గ్రహించి భక్తితో శీర్షమున ధరింపవలె. తరువాత ప్రతిమయందు ఏ జ్యోతిని ఆవహించియున్నాఁడో దానిని తనహృదయమునందున్న జ్యోతిస్సునందు ప్రవేశపెట్టుచున్నట్లుగా ఉద్వాసనము గావింపవలె. సర్వభూతములయందు నేను సర్వాత్మకుఁడను ఉన్నాను. కావున అర్చాప్రతిమలయందు దేనియందు ఎవనికి శ్రద్ధ కలుగునో వాఁడు దానియందు

నన్ను అర్చింపవచ్చును. ఈవిధముగా వైదికములు తాంత్రికములునైన క్రియాయోగములతో నన్ను అర్చించువాఁడు ఇహమునందు పరమునందును అభీష్టములను పొందును.

సంపన్నులు నావిగ్రహమును ప్రతిష్ఠించి దృఢమైన మందిరమును కట్టించి పుష్పోద్యానములను ఏర్పఱుపవలె. పూజలు, యాత్రలు, ఉత్సవములు మొదలగునవి సంతతముగా జరుగుటకొఱకు క్షేత్రములను, అంగడులను, గ్రామములను, పురములను ఇచ్చినవారు నా యైశ్వర్యముతో సమానమైన ప్రాభవము నొందుదురు. ఆరాధన పరాయణుఁడు విగ్రహ ప్రతిష్ఠచేత సార్వభౌమత్వమును, ఆలయనిర్మాణముచేత భువన త్రయమును, సంతత పూజా నిర్వహణమునకై క్షేత్రాదుల నొసంగుటచేత బ్రహ్మలోకమును మూఁడింటిని నిర్వర్తించుటచేత నాతో సమానత్వమును పొందును; నిష్కామమైన భక్తియోగము చేత నన్నే పొందును.

దేవతలకుఁగాని బ్రాహ్మణులకుఁ గాని తాను ఇచ్చినదైనను, పరులు ఇచ్చినదైనను, వృత్తిని (జీవనముకొఱకు ఈయఁబడిన భూమి) ఎవఁడు హరించునో వాడు మలమును భక్షించుపురుగుగా కోట్లకొలఁది సంవత్సరములు జన్మల నొందుచుండును. కర్త, సహాయుఁడు, ప్రేరకుఁడు, అనుమోదకుఁడు అను నలువురు కర్మఫలమున భాగస్వామ్యమును పొందుదురు. వీరిలో ఎవరు ఎంత అధికముగా శ్రద్ధతో చేయుదురో వారు అంత అధికముగా పరలోకమున ఫలమును పొందుదురు".

## బాలప్రియ

సాత్త్వతులనఁగా భక్తులు. ఏ ద్రవ్యము నందు భగవంతుఁడు ఆవాహనము గావింపఁబడునో ఆద్రవ్య మాయనకు అధిష్ఠాన (ఆధార) మగును. పూజారూపమైన క్రియయందు మనస్సును నిలుపుట క్రియాయోగము.

భగవానుఁడు చెప్పినట్లుగా కర్మకాండ అనంతమే. ఇందు చెప్పఁబడిన క్రియాయోగము కూడ సామాన్యులకు దుర్ఘటమే. భగవానుఁడు సకలాంగములతో చెప్పిన యీయారాధన విధానమునందు ప్రతివ్యక్తి తన శక్తికి తగినట్లుగా కొన్ని

యంశములను గ్రహించి, అసాధ్యములైన వానిని వదలవచ్చును. పూజనమునందు భక్తి శ్రద్ధలు శాస్త్రము విధించిన ఆచారనియమములను పాటించుట, శక్తివంచనము లేకుండుట, ప్రధానము, కాని వస్తుసంభార సమృద్ధి కాదు. "ఇన్ని యుపచారములు సాంగముగా చేయలేము కాఁబట్టి ఈ పూజలు మనవలన కాదు" అని ఎవఁడును విరమింప నక్కఱలేదు. శ్రద్ధాభక్తులు కలవాఁడు అల్పసంభారములతో అర్చించియు మహాఫలమును పొందును.

వేదమంత్రములతో వైదికములైన అంగములతో పురుషసూక్తాదులతో అగ్నిహోత్రార్చన ప్రధానముగా చేయుపూజ వైదికము. దేవతలు అగ్నియే ముఖముగా గలవారు (అగ్నిముఖా వై దేవాః) అగ్నిముఖమున దేవతల నర్చించుట వైదికమగును. ప్రతిమలయందు వివిధోపచారములతో అర్చించుట తాంత్రికము. అష్టాక్షరాది మంత్ర ప్రధానముగా ప్రతిమల నర్చించుట మిశ్రము.

బ్రాహ్మణునకు గర్భాష్టమసంవత్సరమునందు, క్షత్త్రియునకు గర్భైకాదశమునందు, వైశ్యునకు గర్భద్వాదశవత్సరమునందు ఉపనయనముఁ గావించుట యుత్తమము. దానివలన వారికి ద్విజత్వము, వేద కర్మాధికారము సిద్ధించును.

భగవంతుఁడు సంధ్యోపాసనమునుగూర్చి హెచ్చరించుట గమనింపఁదగియున్నది. భక్తి ఎంతయున్నను స్నానమును ఎట్లు వదలుకొనరాదో, అట్లే ఏకార్యక్రమమును ఆరంభించుచున్నను నిత్యవిధులైన సంధ్యావందనాదికమును వదలుకొనరాదు. యజ్ఞయాగ పరతంత్రులైన మహర్షులు కూడ సంధ్యావందనాది నిత్యకృత్యములను వీడలేదు. సంధ్యోపాసనము చేయనివాఁడు నిత్యము అశుచియై సర్వకర్మలకు అనర్హుఁడగును. (సంధ్యాహీనోఽశుచి ర్నిత్య మనర్హ స్సర్వకర్మసు)

సమ్యక్ సంకల్పమనఁగా పరమేశ్వరుని ఉద్దేశించియే పూజ చేయుచున్నానని సంకల్పించుట. (శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీరామచంద్ర పూజాం శ్రీకృష్ణపూజాం కరిష్యే)

యజనముకొఱకు లేక పూజనముకొఱకు సమస్థలముగా చతురస్రముగా తీర్పఁబడిన ప్రదేశము స్థండిలము.

సాలగ్రామాదులు, ఆలయములలోని విగ్రహములు శిలామయములైన ప్రతిమలు. సాలగ్రామాదులు నదులయందు లభించునే కాని, శిల్పులచే తయారు చేయఁబడవు. విగ్రహములు శిల్పులచే రూపొందింపఁబడును.

బంగారము, వెండి, పంచలోహములు మొదలగువానితో రూపొందింపఁబడునవి లోహప్రతిమలు.

మృత్తు చందనము పసుపు మొదలగువానితో ఏర్పఱుపఁబడునవి లేప్యప్రతిమలు.

వస్త్రములు, కాగితములు మొదలగువానిపై చిత్రింపఁబడునవి లేఖ్యప్రతిమలు.

ఈ ప్రతిమ లన్నియు భగవంతునకు మందిరములే ప్రతిష్ఠలే యగును. కళాన్యాసముచేత భగవంతుఁడు ప్రతిష్ఠింపఁబడుచున్నాఁడు కావున ఇవి భగవన్మందిరములు ప్రతిష్ఠలు అగుచున్నవి.

తాత్కాలికముగా వ్రతములు మొదలగువానికొఱకు మట్టి, పసుపు మొదలగు ద్రవ్యములతో దేవతారూపమును కల్పించి దానియందు దేవతను ఆవాహన మొనర్చినచో అది చలప్రతిమయగును. పూజనము పూర్తియైన తరువాత దానినుండి ఆదేవతను ఉద్వాసనము గావింతురు. పిదప ఆప్రతిమలను ఉత్సవముతోఁ గైకొనిపోయి జలాశయములందు విడిచిపెట్టుదురు ; ఇండ్లయందు ఉంచరు.

సాలగ్రామములు ఆలయములలోని ప్రతిమలు అచలములు. భగవంతుని విశేషమైన యనుగ్రహముచేత సాలగ్రామ బాణలింగాదులు సహజముగనే భగవంతునకు అధిష్ఠానములై యుండును. అవి నిత్యము పూజింపఁబడును. కావున వానియందు ఆవాహనముచేయుట, ఉద్వాసనము చేయుట యుండదు. దేవాలయములలో కూడ మహర్షులు స్థాపించిన ప్రతిమలయందు, యంత్రములపై

ప్రతిష్ఠింపఁబడిన విగ్రహములయందు దేవతలు నిత్యము అర్చింపఁబడుచునే యుందురు. వీనియందు కూడ ఆవాహనము ఉద్వాసనము ఉండవు.

చలములైన ప్రతిమలయందు నవరాత్రములు మొదలుగా అనేకదినములు జరుగు పూజావిధానములందు మొదటి దినమున ఆవాహనముఁ గావించి, ఆదినమున పూజ పూర్తియైనను వెంటనే ఉద్వాసనముఁ గావింపరు. సంకల్పింపఁబడిన సప్తాహము మొదలగు దీక్షలు పూర్తి యగునంతవఱకు ఆప్రతిమయందే అర్చించుచు దీక్షాంతముననే ఉద్వాసనముఁ గావింతురు.

మృత్తు చందనము మొదలుగా విలేపన ద్రవ్యములతో రూపొందింపఁబడిన విలేప్యప్రతిమలయందు అభిషేక మొనరింపరు. జలమధికముగా వానిపై పోసినచో ఆప్రతిమలు నిలువఁజాలవు. అందువలన వానికి మంత్రజలములను కుశలచేతనో ఆకులచేతనో మార్జనముఁ గావింతురు.

తత్త్వవిన్యాస మనఁగా ఆయాస్థానములందు ప్రధానదేవతలను అంగదేవతలను ఆయామంత్రములతో స్థాపించుట (శ్రీధరాచార్యః - తత్త్వవిన్యాసః - యథాస్థానమంగ ప్రధాన దేవతానాం తత్తన్మంత్రైః స్థాపనమ్) మంటపారాధనమునందు ఈ ప్రక్రియయే అవలంబింపఁబడుచున్నది.

అభ్యర్హణ మనఁగా సూర్యునకు అర్ఘ్యమొసంగి ఉపస్థానమంత్రములతో స్తుతించుట.

తనయందు న్యాసము గావించుకొనుట యనఁగా గురువులకు నమస్కరించి గురువు ఉపదేశించిన ప్రకారమున, మహాన్యాసమునందు వలె, తనయందు దేవతాన్యాసమును గావించుకొనుట.

పాద్యపాత్రయందు శ్యామాకము, దూర్వలు, పద్మములు విష్ణుక్రాంతము మొదలగువానిని, అర్ఘ్యపాత్రయందు గంధము, పుష్పములు, అక్షతలు, యవలు, కుశాగ్రములు, నువ్వులు, ఆవాలు, దూర్వలు, అను నెనిమిదింటిని, ఆచమనీయ పాత్రయందు జాజికాయ, లవంగములు తక్కోలములు ఉంచవలెను.

పిండమును శుద్ధమొనర్చుకొనుట అనఁగా కోష్ఠగతమైన వాయువుచేత శోషింపఁజేసి, ఆధారగతమైన యగ్ని చేత దగ్ధమొనరించి, లలాటమునందున్న చంద్రమండలము యొక్క అమృతప్లావముచేత అమృతమయ మొనరించుట అని శ్రీధరాచార్యులు-వివరించినాఁడు. పాతంజలమైన యోగమును అభ్యసించినవారు ఇట్లు చేయవచ్చును. సామాన్యులు ప్రాణాయామముచేత పిండమును అనఁగా అంతశ్శరీరమును, శుద్ధమొనరించుకొనవచ్చును.

ఈ పాత్రలను హృదయము శిరము శిఖ అనుమంత్రములచేత గాయత్రిచేతను అభిమంత్రింపవలయును. ఈ సందర్భమున ఈ మంత్రము లేవో శ్రీధరాచార్యుఁడు వివరింపలేదు. మా పితృవులు పూజ్యులు శ్రీ ఎ.వి. విశ్వనాథ శ్రౌతులవారు ఇట్లు వివరించిరి.

"శ్లో|| బ్రహ్మణో హృదయం ప్రోక్తం విష్ణవే శిర ఈరితమ్ |
శిఖా రుద్రాయ కవచం ఈశ్వరాయ సమీరితమ్ ||

"బ్రహ్మాదేవానా " మిత్యాదికము హృదయము ; "ఇదం విష్ణుః" ఇత్యాదికము శిరము ; "కద్రుద్రాయ" ఇత్యాదికము శిఖ అని చెప్పఁబడును.

ప్రణవమునందు అకారము ఉకారము మకారము బిందువు నాదము అనునైదు అంశములు కలవు. ప్రణవమును ఉపాసించు సిద్ధులు నాదముయొక్క అంతమునందు ఆత్మస్వరూపమును ధ్యానింతురు. దానినే హృదయపద్మమునందు అణురూపమున ఉన్న జీవకళను, జ్యోతీరూపమైన పరమాత్మనుగా ధ్యానింపవలె. ఈ సందర్భమున "సహస్రశీర్షందేవమ్" అని మొదలగు అనువాకమునందు అధోముఖమైన పద్మకోశముతో సమానమైన హృదయముయొక్క అగ్రమునందు సూక్ష్మమైన రంధ్రము ఉండునని, దాని మధ్య మహాగ్నియుండునని చెప్పఁబడియున్నది. "దాని మధ్యమున నుండు జ్వాల అణురూపమై ఊర్ధ్వముగ జ్వలించుచు, నల్లని మేఘమధ్యమున మెఱుపుతీగవలె భాస్వరమై నీవారశూకమువలె సన్ననిదియై పసుపురంగుతో వెలుఁగుచుండును. ఆ శిఖయొక్క మధ్యమున పరమాత్మ ఉన్నాఁడు. ఆయనయే బ్రహ్మము, ఆయనయే

శివుఁడు, ఆయనయే హరి, ఆయనయే యింద్రుఁడు, ఆయనయే అక్షరుఁడు పరముఁడైన స్వరాట్టు" అని పరమాత్మస్వరూపము ధ్యానముకొఱకు నిరూపింపఁబడినది. ఆపరమాత్మస్వరూపమునే ఇక్కడ గ్రహింపవలసియున్నది.

(శ్రీధరాచార్యః - హృత్పద్మస్థాం పరాం శ్రేష్ఠాం జీవకళాం శ్రీ నారాయణమూర్తిం ధ్యాయేత్ కథం భూతామ్ ? నాదాంతే సిద్ధభావితాం, ప్రణవస్య అకారోకార మకారబిందు నాదాః పంచాంశాః తత్ర నాదాంతే సిద్ధైర్ధ్యాతామ్, తథా చశ్రుతిః)

ఆసనస్వరూపమును శ్రీధరాచార్యుఁడు ఇట్లు వివరించినాఁడు. ధర్మము జ్ఞానము వైరాగ్యము ఐశ్వర్యము అను నాలుగు ఆగ్నేయము మొదలుగా నాలుగు కోణములయందు పర్యంక (మంచము) రూపమైన యాసనమునకు పాదములు. అధర్మము అజ్ఞానము, అవైరాగ్యము, అనైశ్వర్యము అను నాలుగు ఆ పర్యంకమునకు తూర్పు మొదలుగా నాలుగు దిక్కులయందు గాత్రములు. పర్యంకమధ్యమున మూఁడు గుణములు పట్టికలు. అచ్చట తూర్పు మొదలుగా దిక్కుల క్రమమున మధ్యమున విమల, ఉత్కర్షణ, జ్ఞాన, క్రియ, యోగము, ప్రజ్ఞ, సత్య, ఈశాన, అనుగ్రహ అను తొమ్మిది శక్తులుండును. ఈ విధముగా ఉపదేశము ననుసరించి ఎనిమిది ధర్మాదులతో, తొమ్మిది శక్తులతో, మూఁడుగుణములతో ఆసనమును కల్పింపవలె. కర్ణికయొక్క కేసరములచేత, గుణత్రయముయొక్క ఉపరిభాగమున స్థాపింపఁబడిన చంద్రసూర్యాగ్నిమండలములచేత ఉజ్జ్వలమైన పద్మమును కల్పింపవలయును.

శ్రీధరః - అయ మర్థః | ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యాణి ఆసనపర్యంకస్య చతుష్కోణేషు పాదాః | అధర్మాజ్ఞానా వైరాగ్యా నైశ్వర్యాణి పర్యంకస్య పూర్వాది దిక్షు గాత్రాణి | పర్యంకమధ్యే త్రయో గుణాః పట్టికాః | తత్ర పూర్వాదిక్రమేణ మధ్యే చ, శ్లో|| విమలోత్కర్షణీ జ్ఞానం క్రియాయోగా తథైవ చ ప్రజ్ఞా సత్యా తథేశా నానుగ్రహాచేతి శక్తయః || ఏవం యథోపదేశం ధర్మాదిభి రష్టభిః, నవభి శ్శక్తిభిః, గుణై శ్చాసనం కల్పయిత్వేతి కర్ణికాయాః కేసరైః గుణత్రయోపరి స్థాపితైః సోమసూర్యాగ్ని మండలై శ్చ ఉజ్జ్వల మిత్యర్థః ||

పాదము లనఁగా కోడు లని, గాత్రము లనఁగా నాలుగు వైపుల నిలువుగా అడ్డముగా నుండు పట్టెలని, మంచమునకు మధ్యలో కూర్పఁబడు మూఁడు అడ్డపట్టెలు పట్టికలని గ్రహింపవలసియున్నది. నాలుగు కోడులకు నాలుగు పట్టెలకు వరుసగా విమల మొదలుగా ఎనిమిది శక్తులు దేవతలని, కేంద్రభాగమునకు అనుగ్రహాశక్తి అధిష్ఠాన దేవతయని గ్రహింపవలె. పట్టికలైన సత్త్వము రజస్సు తమస్సు అను మూఁడుగుణములపై క్రమముగా చంద్రమండలము, సూర్యమండలము, అగ్నిమండలములు ఉండునని వానిపై అష్టదళములు గల పద్మము ఉండునని గ్రహింపవలయును.

సుదర్శనము మొదలుగా ముసలమువఱకు ఎనిమిది దిక్కులయందు, కౌస్తుభమును, వనమాలను, శ్రీవత్సమును విష్ణుదేవుని వక్షస్థలమునందును ఏర్పఱుపవలయును. నందుఁడు మొదలైన పార్షదులను (అనుచరులను) ఎనిమిది దిక్కులయందు, గరుఁడుని మాత్రము దేవునకు ఎదుట నుంచవలెను. దుర్గను, వినాయకుని, వ్యాసుని, విష్వక్సేనుని ఆగ్నేయము మొదలుగా నాలుగు కోణములయందు, గురువులను దేవునకు ఎడమవైపున, ఇంద్రాదిలోక పాలకులను తూర్పుమొదలుగా ఎనిమిది దిక్కులయందును కల్పింపవలె.

పత్రము లనఁగా చెక్కిళ్ళయందు వక్షస్స్థలమునందు అలంకారముకొఱకు లిఖింపఁబడు చిత్రములు.

సంయావము లనఁగా పాలతో ముద్దచేసిన గోధుమపిండితో నేతియందు వండునట్టి పిండివంట ; పూరీవంటిదని తలంపవచ్చును. **(A sort of cake of wheaten flour fried with ghee and milk - L.R. Vaidya - Sanskrit English Dictionary).** దీనియందు ఉప్పు, నీరు కలుపరాదు.

కటకము లనఁగా కడియములు. అంగదము లనఁగా ముంజేయికి పైని బాహువులందు ధరించు ఆభరణములు.

విధములుగా గోచరించుచున్న యీ జగత్తు నిర్మూలమని నిరూపింపఁబడినది. గుణమయమై త్రివిధముగా గోచరించుచున్న యీ ప్రపంచము మాయామయ మని ఎఱుంగుము. నాచే చెప్పఁబడిన యీ జ్ఞానవిజ్ఞానములయందలి నిష్ఠను తెలిసికొనువాఁడు, తన కాంతివలననే బహుముఖములుగా ఏర్పడుచున్న జనుల వ్యవహారమును ఏమియు పట్టించుకొనని సూర్యునివలె, ఎవ్వనిని ప్రశంసింపఁడు, ఎవ్వనిని నిదింపఁడు. ప్రత్యక్షముచేత, అనుమాన ప్రమాణముచేత, శాస్త్రముచేత, తనయనుభవముచేత, ఏది ఆది అంతము కలిగియుండునో అది సత్యము కాదని, అట్టి అసత్యమైన ప్రపంచమునందు అతఁడు ఆసక్తి నొందక చరించుచుండును".

## బాలప్రియ

విశ్వమును ఏకాత్మకముగా చూచుట అనఁగా, పంచదారతో చేసిన చిలుకలు సింహములు మొదలుగా సకల పదార్థములకు మూలమైన వస్తువు పంచదారయే యైనట్లు, ప్రపంచమున దానికి ఆధారమైన యాత్మ ఒక్కటియే వస్తువని, నామరూపములతో గోచరించు భేదములు వస్తువు కావని గ్రహించుచుండుట. లోకములో కొందఱు శాంతస్వభావముతో, మఱికొందఱు క్రూరస్వభావముతో కన్పించుచుందురు. అట్లే కొందఱు పరోపకారులై మంచిపనులను చేయుచుండగా మఱికొందరు కాంతాకాంచనపరాయణులై ఇతరులను వంచించుచు హింసించుచుందురు. మంచివారిని ప్రశంసింపవలయునని, చెడ్డవారిని దూషింపవలయునని తోఁచుచుండుట సహజము. కాని యీ ప్రపంచము స్వప్నమువలె మాయామాత్రమని గ్రహించినవాఁడు, స్వప్నములో కన్పించిన మంచివారిని, చెడ్డవారిని మేల్కొన్నతరువాత మెచ్చుకొనుట తిట్టుట ఎట్లు వ్యర్థముగా తలంచునో, అట్లే జాగ్రత్ప్రపంచములోని జనులనుగూర్చి ఏమి భావించినను వ్యర్థమే యని తలంచును. మఱియుట్టి జ్ఞానము కలవాఁడు ప్రశంసలతో నిందలతో కూడిన వ్యవహారమునందు ఎల ప్రవేశించును ? జ్ఞానులందఱు అవధూతలై సమాజమునకు దూరమై యుండరు. కొందఱు సన్న్యసింపక సమాజమునందు ఉందురు. అట్టివారికి ఒక్కొక్కప్పుడు సామాజికధర్మము ననుసరించి ధార్మికులను ప్రశంసించుట ధర్మభంజకులను నిందించుట ఆవశ్యకమగును. కర్తవ్యమాత్రముగా అట్లు వర్తించుచున్నప్పుడు కూడ

ఆ వ్యవహారమంతయు మిథ్యయే యని గ్రహించుచుండవలె. అవ్యక్తులయందు అనురాగమును గాని, ద్వేషమునుగాని ఒక్క క్షణమైనను పొందరాదు. బహుసంకులములైన వ్యవహారములను ప్రతిదినము ఎన్నింటిని జరుపుచున్నను శ్రీకృష్ణభగవానుఁడు, "నాకు ద్వేషింపవలసినవాఁడు, ప్రియుఁడు లేఁడు" (న మే ద్వేష్యోఽస్తి న ప్రియః) అని చెప్పినట్లుగా తత్త్వజ్ఞుఁడు వ్యవహారమున రాగద్వేషములను పొందకుండ వర్తింపవలె.

ద్వి అనగా రెండు. రెండింటియొక్క భావము లేక ఉనికి "ద్వితా". ద్వితకు సంబంధించిన నిశ్చయము ద్వైతము. తత్త్వగ్రహణమునందు ఆత్మ యొకవస్తువు, జగత్తు మఱియొక వస్తువు అని భావించుట ద్వైతము. ఆత్మతోపాటు జగత్తుకూడ సత్యమేయని గ్రహించువారు ద్వైతులు. జగత్తు సత్య మను తలంపు కలిగినచో వెంటనే మనస్సు వ్యవహారమున మునుఁగుట సహజము. దానివలన సుఖదుఃఖములు తప్పవు. వానియందలి పారవశ్యముచేత జ్ఞానియైనవాఁడు కూడ తనకు పరమప్రయోజనమైన జ్ఞాననిష్ఠనుండి భ్రంశము నొందును. కావున క్షణమాత్రమైనను జగత్తును సత్యముగా తలంపరాదు. నిద్రవచ్చువఱకు మృత్యువు కలుగువఱకు వేదాంతచింతనముతోనే కాలము గడుపవలయునని పెద్దలు ఇందులకే హెచ్చరించినారు (ఆసుప్తే రామృతేః కాలం నయేత్ వేదాంతచింతయా)

మనకు స్వప్నములో ఒకఁడు రాజ్యమును స్థాపించి నట్లు, దానిని పెంపొందించి పాలించినట్లు, కొంతకాలమునకు అతఁడే విరక్తుఁడై దానిని వదలి వెడలిపోయినట్లు గోచరింపవచ్చును. ఆరాజ్యమే మిథ్యయైనప్పుడు దానిని సృష్టించి, పాలించి పరిత్యజించిన ప్రభువు కూడ మిథ్యయే యగును. అట్లే సృష్టింపఁబడినట్లుగా, రక్షింపఁబడుచున్నట్లుగా, హరింపఁబడుచున్నట్లుగా తోఁచుచున్న యీజగత్తు మిథ్యయైనప్పుడు దీనిని సృష్టించుచున్నట్లు, పాలించుచున్నట్లు, ప్రళయమునందు హరించుచున్నట్లు తోఁచుచున్న యీశ్వరుఁడు కూడ మిథ్యయే యగును. స్వప్నమునందు మనస్సు ఒక్కటియే వస్తువైనట్లు, చైతన్యరూపమైన యాత్మయొక్కటియే వస్తువని దానియందు తోఁచుచున్న జీవత్వము, జగత్తు, ఈశ్వరత్వము మిథ్యలే యని గ్రహింపవలె.

మూల మనఁగా సత్యత్వము లేక ఉనికి (Existence). జగత్తు నిర్మూలమనఁగా, ఆత్మయొక్క సత్యత్వముకంటె దానికి మఱియొక సత్యత్వము లేక, మూలము లేదని యర్థము.

శాస్త్రము ననుసరించి ఆచార్యుఁడు ఉపదేశించు తత్త్వము జ్ఞానము. అది తనయనుభవమున చక్కఁగా తెలియుట విజ్ఞానము. "అప్పు చేసిన పప్పుకూడు తినరాదు" అని పెద్దలవలన విన్న సూక్తి జ్ఞానము. అప్పులు చేసి వానివలన కష్టములు కలిగినపుడు అది విశదముగా మనస్సున కెక్కుట విజ్ఞానము.

ప్రతిపదార్థమునకు ఆది, మధ్యము, అంతము అనునవి మూఁడుదశలు. ఆదియందు అంతమునందు రెండుదశలలో లేక, ఒక్కదశయందు మధ్యలో మాత్రమే కన్పించుచున్న పదార్థము అప్పుడు మాత్రము ఉన్నదని ఎట్లు గ్రహింపవలె ? నిద్రలో లేక, జాగ్రద్దశలోలేక మధ్యలో స్వప్నమునందుమాత్రమే కన్పించుచున్న ప్రపంచమును, ఉన్నట్లు గోచరించినను యథార్థముగ లేదనియే గ్రహించుచున్నాము. ఇది ప్రత్యక్షప్రమాణము. అట్లే పుట్టుకకు పూర్వము దేహములేదు ; మృత్యువునందు తగులఁబెట్టఁబడిన తరువాత కూడ దేహము లేదు. రెండు దశలలో లేక మధ్యలో ఒక్కదశలో కన్పించుచున్న దేహము కూడ, స్వప్నమువలె, అసత్యమనియే గ్రహించుట అనుమితి, లేక అనుమాన ప్రమాణముచేత నిశ్చయించుట. ప్రత్యక్షవిషయమును బట్టి, దానివలెనే యుండి సంశయాస్పదమైన విషయమున నిశ్చయమును పొందుట అనుమాన ప్రమాణము. "ఇచ్చట ఏమియు నానావిధమైనది లేదు" (నేహ నానాస్తి కించన) అను మొదలగువాక్యముల యందలి, విశ్వాసముతో నానావిధమైన జగత్తు దేహములు లేవని నిశ్చయించుకొనుట శాస్త్రప్రమాణముచేత గ్రహించుట అనుమాన ప్రమాణము. గాఢసమాధియందు ఆత్మ తప్ప అన్యము లేదని నిశ్చయించుకొనుట అనుభవప్రమాణమున గ్రహించుట. కావున సకల ప్రమాణములచేత జగత్తు, దానిలోనే భాగమైన తనదేహము కూడ మిథ్యయేయని రూఢిగా గ్రహించినవాఁడు జగత్తునందు దేహమునందు ఆసక్తినొందఁడు.

"ఆత్మకంటె అన్యముగా జగత్తు లేదు. అది మిథ్య. ఆత్మ ఒక్కటేయున్నది" అని చెప్పినప్పుడు ఈజగత్తు సత్యమనుభ్రాంతితో సంసారమెవ్వనికి కలుగుచున్నది?

చైతన్యమాత్రమైన ఆత్మకు భ్రాంతి కలుగుటకు వీలులేదు. నీడవలె కేవలము దృశ్యమైన దేహమునకు "నేను సుఖపడుచున్నాను ; దుఃఖపడుచున్నాను" అను సంసారభావన కలుగుటకు వీలు లేదు. ఇంక ఈ సంసారము ఎవ్వరికి ఎట్లు కలుగుచున్నది ? ఈ సందేహముతో ఉద్ధవుఁడు భగవానుని ఇట్లు ప్రశ్నించెను.

"భగవానుఁడా ! ఆత్మ ద్రష్ట ; జగత్తు దృశ్యము. ఆత్మ అవ్యయము గుణరహితము, శుద్ధము, స్వప్రకాశము, అనావృతము (అజ్ఞానముచేత ఆవరింపఁబడనిది). ఇట్టి ఆత్మకు సంసారమెట్లుండును ? ఇంక అచేతనమైన జగత్తునకు (జగత్తులోనిది, దృశ్యమును అయిన దేహమునకు) సంసారభావమెట్లు కలుగును ? ఈ సంసారము ఎవ్వరికి సంభవించుచున్నది?"

భగవానుఁడిట్లు చెప్పెను. "అవివేకమువలన ఎంతవఱకు దేహేంద్రియ ప్రాణములతో ఆత్మకు సన్నికర్షము ఉండునో అంతవఱకు అపార్థమైన సంసారము ఫలవంతమగుచున్నది. జగత్తు లేదు. అయినప్పటికి విషయములను ధ్యానించువానికి దానివలన సంసారము కలుగుచునే యుండును. స్వప్నములో యథార్థముగా పదార్థములు ఉండవు. అయినను వానివలన సుఖదుఃఖములు కలుగును. అట్లే ఈజగత్తువలన కూడ సంసారము కలుగుచున్నది. మేల్కొనకుండనున్న వానికి నిద్రవలన స్వప్నము ఎన్నో అనర్థములను కలిగించుచున్నది ; మేల్కొన్నవానికి ఆస్వప్నము మోహమును కలిగింపలేదు. శోకము హర్షము భయము క్రోధము లోభము మోహము మదము మొదలగునవి జననమరణములు కూడ అహంకారమునకే కన్పించుచున్నవి ; ఆత్మకు లేవు. దేహేంద్రియములయందు, మనఃప్రాణములయందు అభిమానముతో గుణములచేత కర్మలచేత మూర్తినొందిన (అహంకారము) యంతరాత్మ జీవుఁడై సూత్రము, మహత్తు అను మొదలగు నామములతో బహువిధముల కీర్తింపఁబడుచు కాలతంత్రమై సంసారమున అన్నివైపుల పరుగులు పెట్టుచున్నది. ఈ యహంకారము అమూలమైనను మనస్సు, వాక్కు, ప్రాణము, శరీరము అని వానియొక్క కర్మలచేత బహురూపములతో ప్రకాశించుచున్నది. వివేకము కలవాఁడు గురూపాసనచేత నిశితమైన జ్ఞానమను ఖడ్గముచేత ఈయహంకృతిని ఛేదించి ప్రపంచమున దేనియందును వాంఛలేనివాఁడై విహరించుచున్నాఁడు.

జ్ఞాన మనఁగా వివేకము. నిగమము, తపస్సు, ప్రత్యక్షము, ఐతిహ్యము, అనుమానప్రమాణము వివేకమును కలిగించుటకు సాధనములు. ఈ జగత్తునకు ఆదియందు అంతమునందు ఏది కారణముగా ఉండి దీనిని ప్రకాశింపఁజేయుచున్నదో ఆయాత్మయే మధ్యలో కూడ నున్నది. చక్కఁగా రూపొందింపఁబడిన బంగారు కుండలములు మొదలువానికి మొదట నున్నది బంగారమే, ఆ రూపములు పోయినతరువాత ఉండునది కూడ బంగారమే. మధ్యదశలో కుండలములు కంకణములు మొదలుగా అనేకనామ రూపములతో వ్యవహారము జరుగుచున్నప్పుడు కూడ వానియందున్నది బంగారమే. ఆవిధముగా ఈ జగత్తునకు సృష్టికి పూర్వమున, అంతమున ఉన్నట్లే మధ్యదశలో కూడ నేనే యున్నాను. ఈవిషయమును అన్వయముచేత వ్యతిరేకము చేత గ్రహింపవచ్చును. జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అను మూఁడు అవస్థలయందు ఏ విజ్ఞానము అనుగతమైయున్నదో, అదియే సత్త్వరజస్తమస్సులవలన కలుగు కారణకార్యకర్తలయందు కూడ అనుగతమగుచున్నది. అవి గడచిన పోయిన తరువాత ఆమూఁడింటికి అతీతమై అదియే మిగులుచున్నది. వానికి ఆధారమై మూఁడుకాలములయందు ఉన్నయా విజ్ఞానమే సత్యము. పుట్టుటకు పూర్వము వినాశమునకు తరువాత లేక మధ్యలో ఉన్నట్లుగా కన్పించుచున్న పదార్థము మధ్యలో కూడ లేనిదే అగును. దానినామరూపములు వికారమాత్రములే కాని సత్యములు కావు. వానికి దేనిచేత ఉనికి ప్రకాశము కలుగుచున్నదో అదియే వస్తువు. వికారమాత్రమై యథార్థముగా లేనిదే అయిన యీసృష్టి బ్రహ్మముచేత ప్రకాశము నొందుచున్నది. బ్రహ్మము స్వప్రకాశము. అదియే ఇంద్రియములు, మనస్సు, మహాభూతములు మొదలగువానితో రూపొందిన చిత్రముగా ప్రకాశించుచున్నది. ఈవిధముగా వివేకమును కలిగించు హేతువులచేత గురూపదేశముచేత దేహాదులు అసత్యములని ఆత్మయే సత్యమని నిస్సంశయముగా తెలిసికొని ఆత్మానందముచేత సంతుష్టుఁడై సకల కామములనుండి విముక్తుఁడు కావలయును.

పార్థివమైన యీశరీరము, ఇంద్రియములు, వానియధిష్ఠానదేవతలు, ప్రాణము, మనస్సు బుద్ధి అహంకారము, పంచభూతములు - ఇవి ఏవియును ఆత్మకాదు.

ఈ వివేకముతో నాస్వరూపమును చక్కఁగా ఎఱింగినవానికి ఇంద్రియములు ప్రశాంతముగా నున్నప్పుడు కలుగు గుణమేమున్నది ? లేక అవి విక్షేపము నొంది విజృంభించుచున్నప్పుడు కలుగు దోషమేమున్నది. మేఘములు దట్టముగా క్రమ్మినచో సూర్యునకు కలుగు దోషమేమి ? లేక అవి దూరమైపోయినచో కలుగు గుణమేమి? వచ్చుచు పోవుచునుండు అగ్నివాయుజల భూములయొక్క గుణములచేత ఆకాశమునకు సంబంధము ఎట్లు కలుగుట లేదో, అట్లే ఆత్మకూడ సంసారహేతువులైన సత్త్వరజస్తమో వికారములచేత సంబంధమును పొందుట లేదు.

అయినను నాయందలి దృఢమైన భక్తియోగము చేత మనస్సు నిర్మల మగువఱకు నాభక్తుఁడు మాయారచితములైన సాంసారికవ్యవహారములందు సంగమును పరివర్జింపవలసినదే. చక్కఁగా చికిత్స చేయఁబడని వ్యాధి మాటిమాటికి పైకి వచ్చుచు ఎట్లు బాధించుచుండునో, అట్లే వాసనలనుండి పూర్తిగా విముక్తి నొందని మనస్సు అసమర్థుఁడైన యోగిని సంగములలో దింపి సంకటముల పాలొనరించును. దేవతలచేత ప్రేరేపింపఁబడిన మనుష్యులు యోగులకు అంతరాయములను కలిగించుచుందురు. ఆవిధముగా యోగభ్రష్టులైనవారు జన్మాంతరమున పూర్వాభ్యాసబలమున యోగమునే కొనసాగింతురు, కాని కర్మతంత్రమును అవలంబింపరు.

జంతుప్రాయులైన జనులు కర్మసంస్కారవశమున మరణపర్యంతము కర్మలను ఆచరించుచు సుఖదుఃఖాది వికారములను పొందుచునేయుందురు. కాని విద్వాంసుఁడు దేహమునందుండియు ఆత్మానందమగ్నుఁడై ఆదేహము కూర్చుండినను నిలుచుండినను నడచుచుండినను పరుండినను భుజించినను, ఏపని చేయుచున్నను, గుర్తింపఁడు. నిద్రనుండి మేల్కొన్నవాఁడు స్వప్నములో కన్పించిన విషయములు మనస్సులో మెదలుచున్నను వానిని మనస్సుకంటె అన్యములైన యదార్థ వస్తువులనుగా తలంపఁడు. అట్లే ఇంద్రియములచేత అందింపఁబడుచున్న విషయములను చూచుచున్నను వివేకి వానిని ఆత్మకంటె అన్యముగా యథార్థములైన వస్తువులనుగా గ్రహింపఁడు.

ఆత్మ ఒకప్పుడు దూరమగుట లేదు ; మఱియొకప్పుడు గ్రహింపఁబడుటలేదు. అది నిత్యసిద్ధము దానియందు ఇంతకుపూర్వము అజ్ఞానముచేత గుణకర్మములచే చిత్రముగా గోచరించుచున్న సంసారము మాత్రమే, దాని స్వరూపమును పరీక్షించుటవలన, తొలఁగి పోవుచున్నది. ఉదయించుచున్న సూర్యుఁడు కన్నులనావరించిన చీఁకటిని మాత్రమే తొలఁగించుచున్నాఁడు, కాని అంతకుపూర్వమే యున్న పదార్థములను సృష్టించుట లేదు. అట్లే ఆత్మవిద్య కూడ అజ్ఞానమును తొలఁగించుచున్నదే కాని ఆత్మను క్రొత్తగా తెచ్చుటలేదు. ఏకమై అద్వితీయమై సకలానుభవగోచరమైన యాత్మ నిత్యసిద్ధము.

ఈ జగత్తు ఆత్మయందు దృశ్యమాత్రమే. ఆత్మవిశదముగా గోచరింపనంతవఱకు ఈ దృశ్యమును సత్యమునుగా గ్రహించుచున్న మనస్సుయొక్క సమ్మోహము తొలఁగదు. నామరూపములతో ప్రత్యక్షమగుచు వేదవిహితములైన కర్మలకు ఆధారమగుచున్న యీ జగత్తు సత్యమే అని, అది మిథ్యయే యని బోధించుచున్న యుపనిషత్తులు అర్థవాదమాత్రములే యని కొందఱు పండితమ్మన్యులు చెప్పుచుందురు. కాని వ్యవహారమునకు ఉపయోగపడునది యంతయు సత్యము కాదు.

యోగము నభ్యసించుచున్నప్పుడు శరీరమునకు ఉపద్రవములు సంభవించినచో ధారణతో కూడిన యాసనములతో కొన్నింటిని, తపోమంత్రౌషధములచేత కొన్నింటిని, నన్ను ధ్యానించుటవలన కొన్నింటిని, యోగేశ్వరుల వర్తనము ననుసరించి కొన్నింటిని నివారించుకోవలయును. కాని కొందఱు ఈ నివారణోపాయములచేత శరీరమును సుష్ఠుగా యౌవనమునందు నిల్చునట్లుగా చేసికొనుటకే యోగమును అవలంబించుచుందురు. దానిని ప్రాజ్ఞులు ఆదరింపరు. వృక్షముయొక్క ఫలమువలె శరీరము అధ్రువమగుటచే వారి శ్రమ నిరర్థకము. యోగము నభ్యసించువానికి శరీరము సౌష్ఠవముతో నుండుట యథార్థమే యైనను, వివేకి మత్పరమైన యోగమును వీడి దానిని ఆదరింపఁడు. స్వసుఖముచేత సంతుష్టుఁడై దేనిని అభిలషింపక నన్ను ఆశ్రయించుయోగికి విఘ్నములవలన అంతరాయము సంభవింపదు".

సన్నికర్ష మనఁగా సామీప్యము. ఇది ఒకప్పుడు రెండింటికి అభేదరూపమున భాసింపవచ్చును. త్రాడును చూచి సర్పమునుగా భ్రమించునప్పుడు సర్పము యొక్క లక్షణములతొ దానికి సన్నికర్షము ఏర్పడును. భ్రాంతియున్నంత వఱకు ఆ సన్నికర్షము తోఁచుచునే యుండును. అది తోఁచునంతవఱకు, పామును చూచుటవలన కలుగు భయశోకాదులు తప్పవు. అర్థము అనఁగా వస్తువు. అపార్థమనఁగా వస్తువు కానిది. త్రాటిపై కన్పించు సర్పము వస్తువు కాదు. అయినను అది యథార్థమైన పామువలెనే భయశోకాదులను కలిగించును. ఇట్లే ఆత్మస్వరూపము నెఱుంగక అజ్ఞానమువలన ఒకానొకఁడు చైతన్యమాత్రమైన యాత్మస్వరూపమును దేహేంద్రియాదిరూపమున చూచును. అ జ్ఞానమువలన ఆత్మభాసింపక దేహేంద్రియాదులే భాసించుచుండును. అజ్ఞానమున్నంతవరకు ఆత్మపై సన్నికర్షముతో, అనఁగా అభేదముతో, శరీరేంద్రియాదులు భాసించుచునే యుండును. యథార్థముగ వస్తువులు కాకపోయినను, అవి భాసించుచున్నంతవఱకు, పామువలన భయకంపాదులు కలుగునట్లు, సుఖదుఃఖాదులు తప్పవు.

సంసారమునకు అహంకారమే మూలమని భగవానుఁడు నిరూపించుచున్నాఁడు. "నేను, నాది" అను భావములవలన కర్మలు జరుగుచున్నవి. వానివలన సంస్కారరూపములైన వాసనలు ఏర్పడుచున్నవి. ఆ వాసనలతో సూక్ష్మశరీరము రూపొందుచున్నది. సూక్ష్మశరీరముతో కూడిన యహంకారమే జీవుఁడు. జనన మరణాదిరూపమైన సంసారము జీవునకే కాని ఆత్మకు లేదు. సకల జీవులయందున్న సూక్ష్మశరీరముల సమష్టియే సూత్రము. సూత్రాత్మ, మహత్తు అను నామములతో వ్యవహరింపఁబడుచున్నది.

సంసారమునకు మూలము అహంకారము. దానికి మూలము-అజ్ఞానమే. అది ఎట్లు కలుగుచున్నది, ఎవరికి కలుగుచున్నదని ఉద్ధవుఁడు ప్రశ్నించుచున్నాఁడు. భగవానుఁడు దీనికి ఏమి సమాధానము చెప్పినాఁడు? "ఆత్మయే వస్తువు. అద్వితీయముగా అది ఒక్కటియే యున్నది. దేహేంద్రియాదులు లేవు ; అయినను

ఆత్మయొక్క సన్నికర్షచే ఉన్నట్లు తోఁచుచున్నవి" అని ఆయన చెప్పుచున్నాఁడు. జగత్తు అంతయు మిథ్య అనఁగా జగత్తులోని సకల వ్యవహారము మిథ్యయే అగును. జరిగిపోయిన చరిత్రలు జరుగబోవు సంఘటనములు మిథ్యలైనట్లే జరుగుచున్న సన్నివేశములు కూడ మిథ్యలే అగును. ఈ పద్ధతియందు ఉద్ధవుఁడు ప్రశ్నించుట శ్రీకృష్ణుఁడు సమాధానము చెప్పుట కూడ మిథ్యయే యగును. కాని అధిష్ఠానము లేని మిథ్యాదృశ్య ముండదు. త్రాడు లేకుండ పాము, శుక్తి లేకుండ రజతము తోఁచవు. అట్లే ఉద్ధవశ్రీకృష్ణుల సన్నివేశమునకు వారియందు అధిష్ఠానముగా నున్న చైతన్యము యథార్థముగా వస్తువుగానున్నది. తక్కినదంతయు మిథ్యయైనప్పుడు జగత్తుతో పాటు, దానిని తోఁచునట్లు చేయుచు ఉద్ధవునియందున్న యజ్ఞానము కూడ మిథ్యయే యగును. అజ్ఞానమే లేనప్పుడు అది ఎవరియందు ఎట్లు కలుగుచున్నదను ప్రశ్నయే కుదురదు. సమాధియందు ఆత్మసాక్షాత్కారము నొందిన వానికి అజ్ఞానము లేదు. కావున, "అజ్ఞానమువలన జగత్తు తోఁచుచున్నది" అని తలంచువాఁడు, "జగత్తే లేదు ; అజ్ఞానము కూడ లేదు ; కేవలమైన యాత్మగా నేనే ఉన్నాను" అని గ్రహింపవలయునే కాని, "ఈ యజ్ఞానము ఆత్మకా దేహమునకా?" అని ప్రశ్నించుట నిరర్థకము.

నిగమ మనగా వేదము. స్వధర్మాచరణము తపస్సేయగును. ప్రత్యక్షమనఁగా స్వానుభవము. తత్త్వమును బోధించునప్పుడు గురువు దృష్టాంతముగా వివరించు పూర్వులవర్తనము ఐతిహ్యము.

వస్తువును అన్వయముచేత వ్యతిరేకముచేత గ్రహింపవచ్చును. అనేకపదార్థములలో ఏకరూపమున ఉన్నదానిని గుర్తించుట అన్వయము. కంచము, గిన్నె మొదలుగా అన్నింటియందును ఏకరూపముగనున్న వెండిని గుర్తించుట అన్వయము. వివిధములైన పదార్థముల రూపములను తొలఁగించి ముద్దగా చేయఁబడిన కేవలమైన వెండిని గుర్తించుట వ్యతిరేకము.

శరీరము ప్రాణము మొదలగునవి పృథివి, వాయువు మొదలగు వానియొక్క వివిధరూపములుగా **(different forms)** ఏర్పడి నశించుచుండుట చేత అవి రెండు కాలములలో ఉండక వర్తమానమునందు మాత్రమే గోచరించుటచేత, అప్పుడు కూడ దృశ్యమాత్రముగా గోచరించుచున్నవే కాని వస్తువులు కావని గ్రహింపవలె.

ఆకాశము సర్వపదార్థములయందు వ్యాపించియుండును. అది అగ్నిచేత దహింపఁబడదు ; వాయువుచేత ఎండిపోవుటగాని చలనమును గాని పొందదు ; నీటిచేత తడిసిపోదు ; భూమియొక్క దుమ్ముచేత మలినము కాదు. అట్లే ఆత్మకూడ దేహేంద్రియాదులవలన ఎట్టివికారమును పొందదు.

యోగులు, ముఖ్యముగా జ్ఞానయోగసాధకులు, మహాభక్తులు యజ్ఞయాగాదులను ఆదరింపరు. తమకు ఆహారమైన హవిస్సులను ఈయకుండ మనుష్యులు యోగముల నవలంబించి, తమకు కూడ అందని ముక్తి పదమును పొందుచుండుట దేవతలకు ఇష్టము కాదు. అందువలన వారు యోగాభ్యాసకులకు సన్నిహితులైన బంధువులను ప్రేరేపించి యోగాభ్యాసమునకు విఘ్నములను కలిగించుచుందురు. ఇంద్రుఁడు మహర్షుల తపస్సులను భంగము కావించుటకు ప్రయత్నించుచుండుట ప్రసిద్ధమే. అట్లు అంతరాయములు కలిగినప్పుడు వారు ఆకర్షణములకు లోనై రాగమును, విఘ్నకారులపై క్రోధమును పొంది మరల సంసారమగ్ను లగుచుందురు. అయినను వారు జన్మాంతరమున మరల యోగాభ్యాసమునే కొనసాగింతురు కాని కర్మలయందు మగ్నులు కారు.

తమ్ముగూర్చి తాము గొప్ప పండితులనుగా భావించువారు పండితమ్మన్యులు; అనఁగా యథార్థముగా పాండిత్యము లేనివారు. "జగత్తులోని పదార్థములు వ్యవహారములు సత్యములు కానిచో యజ్ఞయాగాది కర్మలను చేయుఁడని వేదము ఏల విధించును" అని వారు వాదించుచు జగత్తు సత్యమే అని సిద్ధాంతములు చేయుచుందురు. "మరి ఉపనిషద్వాక్యములు" బ్రహ్మము ఒక్కటియే అద్వితీయముగా నున్నది" (ఏక మేవాద్వితీయం బ్రహ్మ) "ఇచ్చట నానావిధమైనది ఏమియును లేదు. నేహ నానాస్తి కించన అను మొదలగునవి జగత్తు అసత్యమని బోధించుచున్నవి కదా" అని యన్నచో, వారు ఆవాక్యములను అర్థవాదములని త్రోసివేయుదురు. వాచ్యార్థమునందు తాత్పర్యము లేక వేఱొక విషయమును బోధించుటకు ఉపయోగపడు వాక్యములు అర్థవాదములు. "జగత్తు కంటె, దానికి పరిపాలకుఁడైన పరమేశ్వరుఁడు చాల గొప్పవాఁడు అని చెప్పుటయే ఆ వాక్యములకు తాత్పర్యము ; కాని జగత్తు అసత్యము అని చెప్పుట కాదు ; ఆవాక్యముల ద్వారమున పరమేశ్వరుని ఉపాసించు యజ్ఞకర్తకు విశేషఫలము కలుగును ; కావున ఉపనిషత్తులు కర్మకాండకు అంగములు మాత్రమే" అని వారు చెప్పుదురు. ఇట్లు చెప్పుట అసంగతము. వేదాంతవాక్యములు

కర్తృత్వము భోక్తృత్వము లేని వానిని జీవుని స్వరూపమును ప్రతిపాదించుచున్నవి. ఇవి కర్తృత్వ భోక్తృత్వ ప్రధానమైన కర్మకాండకు విరుద్ధములు. కావున ఇవి కర్మకాండకు సాధనములగుట అసంభవము. అందువలన జీవునకు బ్రహ్మముతో ఏకత్వమును ప్రతిపాదించుచు మోక్షమును కలిగించుచున్న వేదాంత వాక్యములు స్వతంత్రవాక్యములే కాని అర్థవాదములు కావు. కావున వానియందు ప్రతిపాదింపఁబడుచున్న జగత్తుయొక్క మిథ్యాత్వమును యథార్థముగనే గ్రహింపవలసియున్నది.

"కర్మకాండకు ఉపయోగపడుచున్నవి, కావున దేహేంద్రియాదులు మిథ్యకాదు" అను వాదము కూడ సహేతుకము కాదు. భయకంపాదులను కలిగించుచున్నంత మాత్రమున త్రాడుపై తోఁచుచున్న సర్పము యథార్థము కానేరదు.

యోగాభ్యాసము చేయునప్పుడు శరీరమునకు ఉపద్రవములు సంభవించినచో వానిని ఆయాసాధనముల చేత తొలఁగించుకొనవలసినదే. చంద్రధ్యానధారణముచేత తాపమును, సూర్యధారణచేత శైత్యమును, వాయుధారణముతో కూడిన వివిధములైన యాసనములచేత వాతరోగాదులను, తపస్సుచేత పాపమును, మంత్రములచేత గ్రహబాధలను, ఔషధములచేత సర్పాదుల వలని బాధలను, పరమేశ్వర ధ్యానముచేత కామ ప్రకోపాదులను, పూర్వయోగేశ్వరుల దృష్టాంతములవలన దంభమాన దర్పాదులను నిగ్రహింపవలె. కాని ఈ సాధనములను శరీరముయొక్క సౌష్ఠవముకొఱకు, యౌవనస్థిరత్వముకొఱకు వినియోగింపరాదు. వృక్షముయొక్క ఫలమువలె శరీరము అధ్రువము. సారహీనముగా అల్పకాలమున నశించునది ఫలము (ఫల్గుతయా లయం గచ్ఛతి ఇతి ఫలమ్). శరీరమును యోగసాధనములచేత ఎంతో దృఢముగ స్థిరయౌవనముతో కొంత కాలము నిలుపవచ్చును. కాని ప్రారబ్ధమును ఎవరును నిలుపలేరు. కావున ప్రారబ్ధవశమున శస్త్రఘాతాదులవలన ఎంత బలిష్ఠమైన శరీరమైనను నశింపక తప్పదు. యోగశక్తిసంపన్నులైన రావణాదులు కూడ ఒకప్పటికి నశింపక తప్పలేదు.

# (ii) చరమోపదేశ చమసము

యోగచర్యావిశేషములను విని ఉద్ధవుఁడు భగవానుని ఇట్లు ప్రార్థించెను. 'ప్రభూ ! మనోనిగ్రహము లేనివానికి నీవు చెప్పిన యోగచర్యావిధానము మిగుల దుర్ఘటము. నావంటి వానికి యోగము సులభముగా సిద్ధించుటకు ఉపాయమును చెప్పుము. మనస్సును నిగ్రహింపలేక యోగులనేకులు విషాదము నొందుచుందురు. స్వశక్తి చేతనే యోగమును అవలంబించి సిద్ధిని సాధింపఁగలమను దర్పమును వీడి కొందఱు మహాభక్తులు నీపాదాంబుజములను ఆశ్రయించి యోగసిద్ధిని నిర్విఘ్నముగా సుఖముగా పొందుచున్నారు. అనన్యభక్తితో నిన్ను ఆశ్రయించువారికి నీవు అఖిలార్థములను ప్రసాదించుచుందువు. నీభక్తులకు వెలుపల గురురూపమున అంతరంగమునందు చైతన్యరూపమున నీవే అశుభములను అణఁచి, శుభములను కలిగింతువు. ఇట్టి నిన్ను బుద్ధిమంతులు నిరంతరము ఆశ్రయించుటలో ఆశ్చర్య మేమున్నది?"

భగవానుఁడు ప్రేమతో మనోహరముగా మందహాసము గావించుచు ఇట్లనెను. "మంచిదే ! నీవు కోరినట్లు మంగళప్రదములైన నాధర్మములను వర్ణించెదను. వినుము. వీనిని శ్రద్ధతో అనుష్ఠించు మర్త్యుఁడు జయింపరాని మృత్యువును జయించుచున్నాఁడు. నాసేవాధర్మములయందు సంకల్పము సంతోషము కలవాఁడై నాకొఱకు సకలకర్మములను సంరంభము లేకుండ చేయుచుండవలయును. నాభక్తులకు నివాసములైన పుణ్యక్షేత్రములను, దేవాసురమనుష్యులలో నాభక్తులు అనుష్ఠించు పూజాసంకీర్తనాదులను ఆశ్రయింపవలె. మహారాజవైభవముతో నాకు వార్షికోత్సవములు యాత్రామహోత్సవములు గీతనృత్యాదికములతో ఒక్కొక్కరు గాని, లేక అనేకులు కలిసి కాని జరుపవలయును.

మోక్షమును పొందుటయే లక్ష్యముగా సకలభూతములయందు తనయందును, ఆకాశమువలె, వెలుపల లోపల అంతటను, స్వయంజ్యోతియై వ్యాపించియున్న యాత్మను ఈక్షించు చుండవలయును. ప్రాజ్ఞవరేణ్యా, ఈవిధముగా కేవలమైన జ్ఞానమును ఆశ్రయించి సకలభూతములను నాస్వరూపములనుగా భావించుచు పూజించుచు, బ్రాహ్మణునియందు దొంగయందు, అంత్యజాతివానియందు,

బ్రహ్మణ్యునియందు, సూర్యునియందు, స్ఫులింగమునందు, సౌమ్యునియందు, క్రూరునియందు సమదర్శనము కలవాఁడే పండితుఁడు. సకలమానవులను నాస్వరూపముగా భావించువానికి అల్పకాలముననే అహంకారముతో కూడ స్పర్థ, అసూయ, తిరస్కారము అనునవి నశించును. దేహదృష్టిని, లజ్జను వీడి, పరిహసించుచున్న స్వజనులను లెక్కపెట్టక, గుఱ్ఱమునకు చండాలునకు, గోవునకు, గాడిదకు నేలపైఁ బడి సాష్టాంగముగా ప్రణమిల్ల వలయును. సకల భూతములు నాస్వరూపమే యను భావము కలుగువఱకు ఈవిధముగా వాఙ్మనఃకాయములతో వర్తించుచుండవలయును. ఇట్టివానికి సర్వము బ్రహ్మాత్మకమే యగును. అంతటను ఆత్మయే గోచరించుట సిద్ధించిన తరువాత అహంకారాది సర్వబంధములనుండి విముక్తుఁడై ప్రణామాది వ్యవహారమును విరమింపవలయును. ముక్తి నొందుటకు ఎన్నియో ఉపాయములున్నను, అన్నింటిలో, సకలభూతములయందు నా స్వరూపమును మనోవాక్కాయకర్మలచేత పూజించుట అనునీయుపాయమే సమంజసమని నాయభిప్రాయము.

అయ్యా ! నన్ను ఆశ్రయించుట అను ధర్మమును ప్రారంభించిన తరువాత, దానిని చక్కఁగా నిర్వహించినను నిర్వహింపకున్నను, నిష్కాముఁడైన వానికి అణుమాత్రముగా కూడ ఆ ధర్మముయొక్క ఫలము నశింపదు. అధర్మాచరణము నిర్గుణమేయైనను అది ఎంత ఆచరింపఁబడినదో అంతఫలము తప్పక లభించును. ఈ విషయమును నేను దృఢముగా నిశ్చయించితిని. నిష్ఫలముగా పరిణమించిన తమ శ్రమనైనను నాకు అర్పణముఁ గావించినను ఆ యాయాసము కూడ సార్థకమే యగును. అసత్యము మర్త్యమును (Mortal Body) అయినదానిచేత సత్యము అమృతమును అయిన నాపదమును పొందుటయే బుద్ధిమంతులయొక్క బుద్ధికి, ప్రజ్ఞాశాలుల ప్రజ్ఞకు లక్షణము.

దేవతలకు సైతము దుర్గమమైన బ్రహ్మజ్ఞానముయొక్క సారమును సమాస వ్యాసవిధానమున నీకు చెప్పితిని. విస్పష్టములైన యుక్తులతో అనేక విధములుగా నీకు ఈ తత్త్వమును బోధించితిని. దీనిని తెలిసికొన్నవాఁడు సంశయరహితుఁడై ముక్తుఁడగును. నీ ప్రశ్నమును, నేను దానికి సహేతుకముగా నిశ్చయించి చెప్పిన

సమాధానమును ఎవఁడు శ్రద్ధతో గ్రహించునో వాఁడు సనాతనము రహస్యమును అయిన బ్రహ్మతత్త్వము నెఱింగి పరబ్రహ్మమును పొందును. నా భక్తులయందు ఈ జ్ఞానమును పుష్కలముగా ప్రతిపాదించునట్టి జ్ఞానదాతకు ఆత్మస్వరూపమైన నన్నే యొసంగుదును. జ్ఞానదీపముచేత నన్ను నాభక్తులకు చూపుచు ప్రతిదినము పరమపవిత్రమైన యీ సంవాదమును పఠించువాఁడు పవిత్రుఁ డగును. ప్రతిదినము దీనిని శ్రద్ధతో వినువాఁడు నాయందు పరమభక్తిని పొంది కర్మబంధమునుండి ముక్తుఁడగును.

ఉద్ధవా ! నేను చెప్పిన యీ బ్రహ్మతత్త్వమును చక్కఁగా గ్రహించితివా ? నీకు కలిగిన మోహము శోకము నశించినవా ? దాంభికునకు, నాస్తికునకు, శఠునకు, శుశ్రూషచేయని వానికి, భక్తుఁడు కానివానికి, దుర్వినీతునకు దీనిని ఉపదేశింపకుము. అమృతమును త్రావిన వానికి త్రావవలసినది మఱియొకటి ఎట్లుండదో అట్లే దీనిని తెలిసికొన్నవానికి ఇంక తెలిసికోవలసినది ఏదియు ఉండదు. జ్ఞానమునందు, కర్మమున, యోగముచేత, వార్తాదండధారణములవలనను సిద్ధించుచున్న చతుర్విధమైన పురుషార్థ మంతయు నీకు నేనే అగుచున్నాను. సమస్తకర్మలను పరిత్యజించి తన్ను నాకు అర్పించుకొను వాఁడు నాయనుగ్రహమునకు పాత్రుఁడై అమృతత్త్వమును పొంది నాలో నైక్యము నొందుటకు యోగ్యుఁ డగును".

## బాలప్రియ

"నీ భక్తులకు వెలుపల గురురూపమున, అంతరంగమునందు చైత్యరూపమున నీవే అశుభములను అణఁచి శుభములను కలిగింతువు" అని ఉద్ధవుఁడు భగవంతుని ప్రశంసించెను. భగవంతునకి అనుగ్రహము కలిగినచో ఆయనయే గురురూపమున తటస్థపడి తత్త్వమును బోధించును. అనఁగా తత్త్వమును బోధించు గురువును భగవంతునిగానే భావించి పూజింపవలయు నన్నమాట. ...మ చైతన్యరూపమున ఉన్న భగవంతుఁడే మనయందు శ్రద్ధను ...ంచి మనము గురూపదేశమును గ్రహించునట్లు చేయును. ...తికూలించు సాంసారికవ్యవహారములు అశుభములు ; దానికి ...రుశుశ్రూష మొదలగునవి శుభములు.

బ్రహ్మణ్యుఁడనఁగా బ్రాహ్మణులను ఆదరించువాఁడు.

స్ఫులింగమనఁగా నిప్పురవ్వ.

జాతులు గుణములు కర్మలు మొదలగువానిచేత అనేకభేదములతో కన్పించుచున్న జగత్తునందు సమానముగా నున్న బ్రహ్మమును చూచుట సమదర్శనము.

పరుల యౌన్నత్యమును సహింపలేకపోవుట అసూయ. వారి యౌన్నత్యమునకు మించిన యాధిక్యమును పొందవలయునను నాకాంక్ష స్పర్ధ.

సర్వభూతములయందు సమభావమును తమయందు దృఢమగునట్లు చేసికొన దలంచువాఁడు గోవునకు గాడిదకు నేలపైఁ బడి సాష్టాంగ నమస్కారము చేయవలయునని భగవానుఁడు చెప్పుచున్నాడు. ఇందు ఒక విషయమును గమనింపవలసి యున్నది. ఈ సాధనప్రక్రియ బ్రహ్మచర్యము, గార్హస్థ్యము వానప్రస్థము మొలగు నాశ్రమధర్మములను అవలంబించి సమాజమునందు వర్తించుచున్న వారికి సంబంధింప దని గ్రహింపవలసియున్నది. సన్న్యాసాశ్రమధర్మముల నవలంబించి గృహస్థులయిండ్లలో భిక్షలు గైకొనువారికి కూడ ఇది సంబంధింపదు. వసిష్ఠాదులైన మహర్షులు, వానప్రస్థులైన రాజర్షులు ఇట్లు వర్తింపలేదు. దుర్వాసుఁడు మొదలగు వారు సన్న్యసించిన తరువాత కూడ ఇట్లు వర్తింపలేదు. ఇట్టి వర్తనము కలవారు గృహస్థులయిండ్లలో భిక్షను గైకొన్నచో ఆగృహస్థులకు ఆచారభ్రంశము సంభవించును. కావున ఈ సాధనప్రక్రియ సన్న్యాసాశ్రమధర్మములను కూడ పరిత్యజించిన యవధూతలకు మాత్రమే విహిత మని గ్రహింపవలసియున్నది. సర్వభూతసమత్వమును సాధింపఁదలచుకొన్నవారు సమాజమునకు దూరముగా కొండలలో కోనలలో అడవులలో నివసించుచు ఈ సాధన ప్రక్రియను అవలంబింపవచ్చును. లేకున్నచో వీరిని చూచి లౌకికులు కొందఱు గుణవంతులను గుణహీనులను సమానముగా పూజించుట సంభవింపవచ్చును. వారు ధర్మభ్రష్టులై ఐహికాముష్మిక శ్రేయస్సులను కోల్పోవుదురు.

వీరు సమాజమునకు దూరులై వర్తించుచున్నచో, "దేహదృష్టిని లజ్జను వీడి, పరిహసించుచున్న స్వజనులను లెక్కపెట్టక" ఈ సాధనవిధానమును అవలంబింపవలయునని చెప్పుట ఎందులకు ? కొండలు కోనలు అడవులు మొదలగునవి సాధారణముగా నిర్జనప్రదేశములై యుండును. అట్టి యెడల, ఇతరులు చూతురేమో అను లజ్జకు అవకాశ మేమున్నది ? ఆప్రదేశములలో బంధువులు మిత్రులు మొదలుగా స్వజనులు ఉండుట గాని, వారు పరిహసించుట గాని ఎట్లు సంభవించును ? తమ సహనమును పరీక్షించుకొనుటకు సాధకులు సమాజమునందే యుండి ఇట్టి సాధనములను అవలంబింపవచ్చు నని కొందరు తలంపవచ్చును. కాని ఇచ్చట స్వజనులనఁగా కొండకోనలలో అడవులలో నుండు ఆశ్రమములలో నివసించుచు యోగసాధనలు చేయుచుండు వారని గ్రహింపవచ్చును. శ్రవణమననాదులు భక్తిసంకీర్తనాదులు మొదలుగా వివిధ యోగసాధనములను అవలంబించువారు వీరికి స్వజనులే యగుదురు. గోవులకు గాడిదలకు ప్రణమిల్లుచున్నప్పుడు, ఈ సాధన ప్రక్రియను ఎఱుంగనివారు పరిహసించుట సంభవింపవచ్చును. అట్లే యాదృచ్ఛికముగా సమీపమునందున్న పల్లెలలోని జనులు అచ్చటికి వచ్చుట సంభవింపవచ్చును. వారు చూచుచున్నారను లజ్జాభావమును కూడ వారు అతిక్రమింప వలసియుండును.

ఈ సాధనకు అవధిని కూడ భగవంతుఁడు నిర్దేశించియున్నాఁడు. "అంతటను ఆత్మయే గోచరించుట సిద్ధించిన తరువాత అహంకారాది సర్వబంధములనుండి విముక్తుఁడై ప్రణామాది వ్యవహారమును విరమింపవలయును." ఇది కూడ వ్యవహారమే. గోవులను మొదలగువానిని తనకంటె భిన్నముగా చూచుచున్నప్పుడే ఆ వ్యవహారము సంభవించును. సకల జీవులు తన స్వరూపమైన బ్రహ్మముగానే గోచరించుచున్నప్పుడు తాను ఎవరికి నమస్కరింపవలె ? కావున ఈ సాధనయందు కూడ సిద్ధి పొందిన యవధూతలు శుకుఁడు దత్తాత్రేయుఁడు ఇట్లు వర్తింప లేదు.

మోక్షమును కోరి నిష్కామముగా భగవంతుని శరణు పొందుట అనునీయోగాభ్యాసమునందు చేసిన సాధన అణుమాత్రము కూడ విఫలము కాదు. ఎవఁడు ఎంత సాధన చేయునో దానిఫలము అంతవఱకు తప్పక లభించును. ఈయోగమును ప్రారంభించినతరువాత, ఎవఁడైనను, ప్రారబ్ధవశమున సంసారవశుఁడై దీనిని వదలిపెట్టి నప్పటికిని అంతవఱకు చేసిన దానియొక్క ఫలము ఉండనేయుండును. లోకవ్యవహారమున యజ్ఞాదులను ఆరంభించి మధ్యలో వదలిపెట్టినచో, అప్పటివఱకు దానికొఱకు వెచ్చించినధనము, శ్రమ పూర్తిగా వ్యర్థమగుటయే కాక, ప్రత్యవాయదోషము కూడ కలుగును. యుద్ధమును ఆరంభించిన క్షత్రియుఁడు మధ్యలో దానిని విరమించినచో, శత్రువులవలన వినాశమేకాక, స్వధర్మ పరిత్యాగమువలన పాపమును కూడ పొందును. అట్టి విఫలత్వము కాని ప్రత్యవాయము కాని ఈయోగ సాధనయందు లేదు.

అట్లే ఇది నిర్గుణమే యైనను పూర్తిగా విఫలము కాదు. భగవంతుని శరణుపొంది తనయోగక్షేమములకొఱకు కూడ ఎవరిని ఆశ్రయింపకుండుట ఈయోగమున సగుణత్వము. ప్రారబ్ధమువలన కలుగుచున్న బాధలను తట్టుకొనలేక భగవంతుని ప్రార్థించుటతోపాటు సంపన్నులు మొదలైనవారిని ఆశ్రయించుట వాణిజ్యాదివృత్తుల నవలంబించుట మొదలగువానివలన ఈ యోగాభ్యాసము నిర్గుణమగును. అయినను భగవద్ధ్యానము ఎంతవఱకు సంభవించుచున్నదో అంతవఱకు ఫలము లభించును.

సర్వకర్మలను పరమేశ్వరునకు అర్పించుట ఎంత మహిమాన్వితమో ఒక దృష్టాంతమువలన గ్రహింపవచ్చును. ఫలప్రదాతయైన పరమేశ్వరుఁడు ఉన్నాఁడను తలంపు కూడ లేకుండ తన శక్తిసంపదను మాత్రమే నమ్మి ఒకానొకఁడు పెద్దవ్యాపారమును చేసి, దానియందు సర్వము నష్టమైన తరువాత, అప్పుడు భగవంతుని స్మరించి, "నష్టమైన శక్తి సంపద సర్వము ఈశ్వరార్పణము"

కావించుచున్నా నని దృఢముగా భావించినచో, లేశమైన యా సుకృతము కూడ ధర్మమై ఫలమునే యొసంగును. "గాలికి పోయిన పేలపిండి కృష్ణార్పణము" అని కొందరు తలంతురు. అది కూడ సత్కర్మయే యగును.

మూఁడుకాలములలో నిలిచి యుండనిది అసత్యము. మరణించుట అను లక్షణము కలది మర్త్యము. అసత్యము మర్త్యము అయిన శరీరముతో సత్యము అమర్త్యము లేక అమృతమును అయిన బ్రహ్మపదమును పొందుటకు తగిన సాధనమును గుర్తింపఁగలుగుటయే బుద్ధిశక్తికి, ప్రజ్ఞాబలమునకు సార్థకత్వము. గురూపదేశమును శాస్త్రవాక్యములను సరిగా గ్రహింపఁగలిగిన యంతఃకరణవృత్తి బుద్ధి. శాస్త్రాచార్యోపదేశముల ననుసరించి స్వానుభవమున బోధింపఁబడిన విషయములను గ్రహింపఁగలుగుట, ఇతరులకు బోధింపఁ గలుగుట ప్రజ్ఞ.

ఉత్తముఁడైన యాచార్యుఁడు బోధింపఁదలచుకొన్న విషయమున సమాసవ్యాస విధానమును అవలంబించును. విషయమును సంగ్రహముగా చెప్పుట సమాసవిధానము. దానినే అనేక వివరములతో వర్ణించి చెప్పుట వ్యాసవిధానము.

భక్తులయందు పుష్కలముగా జ్ఞానమును బోధించుచు నుండువానికి, వాని సుకృతిని మెచ్చి, తన్నే యొసంగును ; అనఁగా "నేను బ్రహ్మమును" అను భావమును వానియందు రూఢమొనర్చు నన్నమాట.

తనయందు లేని గుణములను ప్రకటించుకొనువాఁడు దాంభికుఁడు.

పరలోకములు జన్మాంతరములో ఉన్నవని విశ్వసింపనివాఁడు, వేదమును నిందించువాఁడు నాస్తికుఁడు.

స్వార్థమునకై ఇతరులను వంచించువాఁడు శఠుఁడు.

వినయము లేనివాఁడు దుర్వినీతుఁడు.

ధర్మము, అర్థము, కామము, మోక్షము అను పురుషుఁడు సాధింపఁదగిన ముఖ్యప్రయోజనములచేత పురుషార్థము చతుర్విధముగానున్నది. జ్ఞానమువలన మోక్షము కలుగును. శాస్త్రవిహితము స్వాభావికము అని కర్మ రెండు విధములు. మొదటిదానిచేత ధర్మము, రెండవదానిచేత కామము సిద్ధించును. యోగమువలన అణిమాదిసిద్ధులు కలుగును. వృత్తికి సంబంధించినది వార్త. కృషి, పశుపాలనము, వాణిజ్యము మొదలగు వృత్తులవలన సంపద సంభవించును. దండము ప్రభుత్వమునకు చిహ్నము (symbol). దండనీతి అనఁగా రాజనీతి. దీనిని చక్కఁగా నిర్వహించుటవలన ప్రాభవము లేక ఈశ్వరత్వము సిద్ధించును. అణిమాదిసిద్ధులు, ప్రాభవము కామమునందే చేరును. కోరఁబడుచున్న వన్నియు కామములే. అందువలన స్త్రీభోగాదులతో సిద్ధులు మొదలగునవి కూడ కామపురుషార్థమునందే చేరును. స్త్రీభోగాదులు సిద్ధించుటకు సంపద అవశ్యకము. కావున అర్థము పురుషార్థమగును. మొత్తము మీఁద పురుషార్థములు నాలుగు విధములే.

వీనిలో ఒక్కొక్కదానిని ఒక్కొక్కఁడు పెక్కు ఉపాయములతో సాధించుకొనుచుండును. భక్తుఁడు సకలపురుషార్థముల సంపాదనకు భగవంతుని ఒక్కనినే ఉపాయముగా గ్రహించి శరణుఁజొచ్చును.

ఇట్లు భగవంతుఁడు యోగమార్గమును చక్కఁగా బోధించిన తరువాత ఉద్ధవుఁడు ఆయన యందలి ప్రేమచేత కనులనీరు నిండుచుండగా గద్గదకంఠుఁడై కొంతసేపు ఏమియు మాటాడలేకపోయెను. క్రమముగా అతఁడు ఆ ప్రణయ పారవశ్యమును ధైర్యముచేత నిగ్రహించి శిరముచేత భగవంతుని పాదములకు ప్రణామముఁ గావించి లేచి కృతాంజలియై యిట్లనెను. "ప్రభూ ! నీ సన్నిధానముచేత నాయందుండిన మోహమయమైన యంధకారము పలాయనమొనర్చినది. ప్రజ్వలించుచున్న యగ్నిదేవుని సమీపమున చలిబాధ, చీఁకటి వలన భయము ఉండునా ? అయినను నాయందలి కరుణచేత నీవు విజ్ఞానమయమైన పెద్ద దీపము నొసంగితివి. కృతజ్ఞుఁడనైన నేను నీ పాదమూలమును గాక ఇంక దేనిని శరణముగా

పొందఁగలను ? దాశార్హులయందు, వృష్ణులయందు, అంధకులయందు. సాత్త్వతులయందు నాకు నీమాయచేతనే సృష్టింపఁబడిన దృఢమైన స్నేహపాశమును నీవే జ్ఞానబోధమను ఖడ్గముచేత ఖండించితివి. యోగీశ్వరా నీకు నమస్కారము. ప్రపన్నుఁడనైన నాకు ని పాదపద్మములందు భక్తి నిరంతరము గా నుండునట్లు అనుగ్రహింపుము."

భగవంతుఁ డిట్లనెను. "ఉద్ధవా ! బదరి అను పేరుగల నాయాశ్రమమునకు పొమ్ము. అలకనందయొక్క దర్శనముచేతనే పాపములన్నియు నశించును. అచ్చట నాపాదతీర్థములైన యుదకములయందు స్నానముచేత ఆచమనముచేత శుచివై సుఖమును కోరక వల్కలములను ధరించి, వనమున లభించు పదార్థములను భుజించుచు శీతోష్ణాదిద్వంద్వములను సహించుచు ఇంద్రియములను నిగ్రహించి జ్ఞానవిజ్ఞానములచేత సమాహితచిత్తుఁడవై శాంతుఁడవై సుశీలుఁడవై వర్తించుచుండుము. నేను బోధించిన తత్త్వమును చక్కఁగా విచారించుకొని, భావించుచు, వాక్కును చిత్తమును నాయందు నిలిపి నాధర్మముల ననుష్ఠించుచు త్రిగుణాత్మకములైన గతుల నన్నింటిని అతిక్రమించి పిదప నన్ను జేరఁగలవు".

## బాలప్రియ

సమాహితచిత్తుఁడనఁగా యోగముచేత సమాధినొంది అందు కదలకుండ చిత్తమును భగవంతునియందో ఆత్మయందో నిలిపినవాఁడు. యోగమును వీడినంతనే సమాధి తొలఁగిపోయి చిత్తము సంకల్పవికల్పాత్మక మగును. వ్యవహారదశయందు కూడ మనస్సునందు శాంతిని నిలుపుకొనువాఁడు శాంతుఁడు. మనస్సునందు కోరికలు క్రోధభావనలు కలుగుచున్నప్పుడు వానిని నణఁచివేయుట దాంతి. ఆ భావములే కలుగకుండుట శాంతి. ఇది ఏకాంతజీవనమున సులభమే. పశువులు పక్షులు మొదలగువానితో సంకటము సంభవించినప్పుడు వానియందు దయతో వర్తించుట సుశీలము.

"నా ధర్మములు" అనఁగా భగవంతునకు సంబంధించిన ఉపవాస పూజాసంకీర్తనాదికములు.

గతు లనఁగా మార్గములు, గమ్యములైన స్థానములు. బ్రహ్మలోక పర్యంతమైన స్వర్గాదిలోకము లన్నియు త్రిగుణాత్మకములు. వైకుంఠము కూడ సత్యలోకమున ఒక ప్రదేశవిశేషమే. "ఈ గతుల నన్నింటిని అతిక్రమించి పిదప నన్నుఁ జేరఁగలవు" అనఁగా వైకుంఠమున భగవంతునియొద్దకు చేరి "నేను బ్రహ్మమును" (అహం బ్రహ్మాస్మి) అను జ్ఞానముతో వాసుదేవాఖ్యమైన యాపరబ్రహ్మమునందు ఐక్యమును పొందుటయే.

భగవంతుని యాదేశము ననుసరించి బయలుదేరుచు ఉద్ధవుఁడు సుఖదుఃఖాది ద్వంద్వములకు అతీతుఁడయ్యెను, ఆయనకు మూఁడు పర్యాయములు ప్రదక్షిణము చేసి ఆయనపాదములయందు శిరస్సు నుంచి కన్నీళ్లతో వానిని అభిషేకించి లేచి వియోగముచేత విహ్వలుఁ డగుచు ఆయనను వదలిపెట్టలేక ఎట్లో మిగుల కష్టముతో, ఆయన పాదుకలను తలపై ధరించి, మాటిమాటికి వెనుదిరిగి నమస్కరించుచు ఆయన సన్నిధినుండి నిష్క్రమించెను.

ఆ మహాభాగవతుఁడు భగవంతుని హృదయమునందు ప్రతిష్ఠించుకొని బదరికాశ్రమమునకు చేరి అచ్చట ఆయన ఉపదేశించినట్లుగా తపస్సుచేసి భగవంతుని పరమపదమును పొందెను.

ఆనందసముద్రమునుండి భగవానుఁడు పైకి తెచ్చి ఉద్ధవునకు అందించిన యీ జ్ఞానామృతమును మంచి శ్రద్ధతో కొంచెము సేవించినను జగత్తులో ఎవఁడైనను ముక్తుఁ డగును.

పూర్వము క్షీరసాగరమునుండి అమృతమును ఉద్ధరించి భృత్యులైన దేవతలకు త్రావుటకు నొసంగినవాఁడు వేదప్రణేతయునైన యాపరమేశ్వరుఁడు ఇప్పుడు, భృంగము పుష్పములనుండి మధువును సమకూర్చునట్లు, సకల వేదములనుండి జ్ఞాన విజ్ఞానసారమైన యీ యమృతమును భక్తులకు సంసారభయమును తొలఁగించుటకై

అందించుచున్నాఁడు. విష్ణు వని కీర్తింపఁబడుచున్న యార్యుఁడైన యా పురుషోత్తమునకు ప్రణమిల్లుచున్నాను.

శ్లో|| య ఏత దానందసముద్రసంభృతం జ్ఞానామృతం భాగవతాయ భాషితమ్|
కృష్ణేన యోగేశ్వరసేవితాంఘ్రిణా సచ్ఛ్రద్ధయా సేవ్య జగ ద్విముచ్యతే || 48

శ్లో|| భవభయ మపహర్తుం జ్ఞానవిజ్ఞాన సారం
నిగమకృ దుపజహ్రే భృంగవ ద్వేదసారమ్ |
అమృత ముదధిత శ్చాపాయయ ద్భృత్యవర్గాన్
పురుషఋషభ మాద్యం విష్ణుసంజ్ఞం నతోఽస్మి || 49

శ్రీమద్భాగవతే - స్కంధ - 11, అధ్యాయ - 29

మంగళం మహత్

## గద్యము

నలచరిత్ర శ్రీమద్రామాయణాదిమహాకావ్య భువనవిజయాది నాటక
శ్రీ భగవద్గీతాసారాది బాలప్రియాఖ్యవ్యాఖ్యాది రచనప్రస్తుతిపాత్ర
ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర

పోలూరి వేంకట నరసాంబా నారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మ ప్రణీతంబైన
శ్రీ వాసుదేవ కథాసుధ
సాత్త్వతం బను ద్వాదశకాండంబుతో సర్వము సమాప్తము

|| య దక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ య ద్భవేత్ |
త త్సర్వం క్షమ్యతాం దేవ వాసుదేవ నమోఽస్తు తే ||

